# సౌందర్యలహరి

## (DELIGHTFUL FLOOD OF DIVINE BEAUTY)




వివరణ కర్త

**డా॥ జి. ఎల్. ఎన్. శాస్త్రి** M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు

టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు








జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust Guntur Branch)

**GUNTUR - 522 002.**

Phone : 233995

సౌందర్యలహరి

ప్రథమముద్రణ డిశెంబర్ 1999



ప్రాప్తి స్థానములు

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   H/o డా. జి.ఎల్.ఎన్. శాస్త్రి
   మైత్రేయ నిలయం
   5-10-4, 2/9, బ్రాడీపేట, గుంటూరు -2.
   ఫోన్ : 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   45-40-36/1
   అక్కయ్య పాలెం
   విశాఖపట్టణం - 530 016.
   ఫోన్ : 565291

**వెల : రూ. 120/-**

ముఖపత్ర ముద్రణ : **లక్ష్మీ ఆఫ్‌సెట్,** విజయవాడ - 2.

ముద్రణ : **విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,**
గుంటూరు.

# విషయసూచిక

# ముందుమాట

భారతీయ వాఙ్మయంలో వేద, పురాణ, ఇతిహాస, కావ్యాలతో పాటు స్తోత్రాలుకూడా చాలా ఉన్నాయి. ప్రతి దేవతపరంగాను స్తోత్రాలు ఉంటాయి. రాజులను ఉద్దేశించి, అధికారులను ఉద్దేశించి, గురువులను ఉద్దేశించి కూడా స్తోత్రాలు వ్రాస్తారు, చేస్తారు. స్తోత్రంచేయడమంటే స్తుతించడమే! అయితే - ఈ స్తుతులలో స్తుతింపబడే వారి సౌందర్య గుణగణ మహిమా పరాక్రమ సామర్థ్యాలలో- వారికి వర్తింప చెయ్యడానికి వీలులేని కొన్ని విషయాలను నప్పింపచేసే ప్రయత్నం కూడా ఉంటుంది. అసలు విషయాలకన్న పొగడ్తలే ఎక్కువగా ఉండే స్తోత్రాలు, దండకాలు కూడా ఉంటాయి.

**సౌందర్యలహరి**

స్తుతింపబడే వారిచరిత్ర ఎంత ఘనంగా ఉంటే స్తుతి అంత సహజత్వాన్నికలిగి బాగుంటుంది. త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, ఋషీశ్వర, మానవాదులందరి - జన్మకు, మనుగడకు, ముక్తికి, సమస్త సృష్టి నిర్వహణకు - కారణ భూతురాలైన జగజ్జనని, సౌందర్య సామర్థ్య సుగుణ సమ్మిశ్ర రాశి అయిన - అమ్మవారిని గురించిన స్తోత్రమై, అది కూడా - సర్వజ్ఞులు శంకర భగవత్పాదుల రచన అయితే - ఇంక ఎంత బాగుంటుందో వేరే చెప్పాలా! శంకరులు ఎన్నో స్తోత్రాలు రచించారు. ఆ స్తోత్రాలన్నిటిలోకి తలమానికమైంది 'సౌందర్య లహరి'. ఇది మంత్ర, తంత్ర, యంత్ర, సౌందర్య, యోగసమన్వితమైన స్తోత్రము. త్రిపుర సుందరి అయిన అమ్మవారి అందచందాలు, అనురాగ, అనుగ్రహాలు, నవరసోపేతమైన అమ్మవారి దినచర్య - ఈ స్తోత్రంలో వుంటాయి. వ్యాస మహర్షి రచించిన శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రంలోని అమ్మవారి నామాలన్నింటినీ శంకరుడు అందమైన శిఖరిణీ వృత్తాలలో కూర్పుచేసి, ఈ సౌందర్యలహరి వ్రాసినట్లు అనిపిస్తుంది. అయితే - ఉపమ, రూపక, ఉత్ప్రేక్ష, శబ్దాది అలంకారాలు, పవిత్ర శబ్ద రమ్యతలు, చిత్ర విచిత్ర కవితాశిల్ప సౌందర్యాలు (Poetic Beuaties) ఈ స్తోత్రం నిండా ఉంటాయి. పాఠకులకు అమ్మవారిని సాక్షాత్కరింప చేయాలనేవిధంగా శంకరుల రచన

ఉంటుంది. ఈ స్తోత్ర శీర్షికను ఆంగ్లంలో 'Delightful Flood of Divine Beauty' అని అనువదించడం జరిగింది. 'Flood' అంటే 'వరద' అని అర్థం. 'వరద' అనంగానే భయంవేస్తుంది. కానీ, ఇది ఆహ్లాదకరంగా ఉండే అందం యొక్క వరద కాబట్టి, 'Delightful Flood' అని, ఆ అందం దివ్యమంగళ స్వరూపిణి అయిన అమ్మవారిది కాబట్టి – 'Divine Beauty' అని అనువదించడం జరిగింది.

అమెరికాలోని ఫిలడల్ఫియా విశ్వవిద్యాలయంలో సౌందర్యలహరిలోని ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క తైలవర్ణ చిత్ర పటము (Oil painting) ఉన్నట్లుగా జగద్గురు బోధలు పుస్తకంలో కంచి పరమాచార్య తెలిపారు.

## పూర్వ వ్యాఖ్యలు

సౌందర్యలహరికి ఇంతకు పూర్వమే చాలామంది వ్యాఖ్యానాలు రచించారు. 1) సుధావిద్యోతిని 2) డిండిమవ్యాఖ్య 3) కామదేవ సూరిటీక 4) సహజానందీయ వ్యాఖ్య 5) సౌభాగ్యవర్ధిని 6) లక్ష్మీధర వ్యాఖ్య – అని సంస్కృతంలో ఆరు వ్యాఖ్యలున్నాయి. వీటిలో సౌభాగ్యవర్ధినీ వ్యాఖ్య రచించినది 'కైవల్యాశ్రమి'. శ్రీ భాస్కరరాయలు శ్రీ విద్యలో – ముఖ్యంగా, శ్రీ లలితా సహస్ర నామస్తోత్రానికి ప్రామాణికమైన వ్యాఖ్య రచించారు. సంస్కృత వ్యాఖ్యానాలను తెలుగులో అనువదించినవారుకూడా ఉన్నారు. సర్‌జాన్ ఉడ్రాఫ్ సౌందర్యలహరి లోని మొదటి భాగమైన ఆనందలహరికిచేసిన ఆంగ్ల వ్యాఖ్య కూడా ఒకటి ఉంది.

## ప్రస్తుత వ్యాఖ్య

పైన తెలిపిన వ్యాఖ్యానాలలోని లక్ష్మీధర వ్యాఖ్యను నేపథ్యంలో పెట్టుకుని – భౌతిక, భూగోళ, ఖగోళ, జ్యోతిషశాస్త్రాది ఆధునిక విజ్ఞాన శాస్త్ర విషయాలను ఆర్ష విజ్ఞానానికి జోడించి – ప్రస్తుత వ్యాఖ్యానం రచింపబడింది. అందువలన కొన్ని క్రొత్త క్రొత్త స్వతంత్ర భావాలు కూడా ఈ వ్యాఖ్యానంలో ఉంటాయి. మా గురువుగారు ఇతర ప్రసంగాల్లో సందర్భవశాన అప్పుడప్పుడుచెప్పిన కొన్ని విషయాలు కూడా ఈ వ్యాఖ్యానంలో ఉంటాయి.

జగన్మాతకు సంబంధించిన ఈ సౌందర్యలహరీ స్తోత్రంలో 100 శ్లోకాలు గంభీరంగా సాగే శిఖరిణీ వృత్తాల్లో ఉంటాయి. ప్రతి శ్లోక వివరణకు – 1) సంస్కృత శ్లోకం 2) అనువాద పద్యం 3) తాత్పర్యం 4) వివరణ 5) మళ్ళీ వివరణ ఉపశీర్షికలలో సందర్భోచితంగా వివిధ విషయాలు సరళమైన వచనంలో ఉంటాయి. ప్రక్షిప్త శ్లోకాలు వదలి వేయబడ్డాయి. ఈ సౌందర్యలహరి యొక్క పుట్టు పూర్వోత్తరాలు పీఠికలో తెలుపబడ్డాయి. 'సౌందర్యలహరి వివరణ' పుట్టు పూర్వోత్తరాలు ఈ ముందుమాటలోనే తెలుపబడ్డాయి.

**ప్రత్యేకతలు**

అన్నిశ్లోకాలకు మూసలోపోసినట్లు ఒకేరకమైనపద్ధతిలో వ్యాఖ్యానం తీరు ఉండదు. శ్లోక విషయాలనుబట్టి రకరకాలపద్ధతులలో వ్యాఖ్యానం ఉంటుంది. విషయసూచికలో శ్లోక సంఖ్య – దాని ఎదురుగా శ్లోకము, దానికి ఎదురుగా బ్రాకెట్లలో శ్లోక లక్ష్యము, దానికి ఎదురుగా ఆ శ్లోకవివరణ ప్రారంభమైన పుటసంఖ్యకూడా తెలుపబడింది. పుస్తకం చివర 'అకారాది శ్లోక సంఖ్యానుక్రమణిక పట్టిక' కూడా తెలుపబడింది. శ్లోక వివరణ ఏ పుటలో వుండేది పుస్తకం అంతా వెతుక్కోవలసినవని లేకుండా – శ్లోక ప్రథమఅక్షరాన్నిబట్టి వెంటనే – ఆ శ్లోక వివరణ ఏ పుటలో ఉండేది తేలిగ్గా తెలుసుకునేందుకు ఈ పట్టిక ఉపకరిస్తుంది.

**ప్రస్తుత వివరణ పుట్టుపూర్వోత్తరాలు**

మొట్టమొదటగా మాస్టరు EK గారు చిన్నవాల్తేరులోని వారి వసతి గృహంలో పూజ చేస్తున్నపుడు, ఆ పూజమధ్యలో 'అవిద్యానామంతః...' 'శరజ్జ్యోత్స్నా....' 'శివశ్శక్త్యాయుక్తో....' అనే శ్లోకాలు చదవడం విన్నాను. మాస్టరుగారి ఉచ్చారణలో ఆ మూడు శ్లోకాలు విన్నపుడు నాకెందుకో హృదయం స్పందించి, శరీరానికి రోమాంచంతో గగుర్పాటును కలిగించింది. ఆ శ్లోకాలలోని పదాల కూర్పు, వాటిని ఉచ్చరిస్తున్నపుడు వెలువడే ధ్వని ప్రకంపనలు అంతటి ప్రభావాన్ని కలుగ జేసాయి. అవి శంకర భగవత్పాదులు రచించిన 'సౌందర్యలహరి' లోనివని తరువాత తెలిసింది.

చిన్నప్పటినుండే కాస్తంత కవిత్వ ధోరణి ఉన్న నాకు ఆ శ్లోకాలను అనువదించాలనిపించింది. 1965 సంవత్సరములో విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్రంలో నేను పరిశోధన చేస్తున్నపుడు - మాస్టరు గారితో పరిచయం కలగడం, వారి ప్రసంగాలు వినడం జరిగింది. ఆ ప్రసంగాలలో అప్పుడప్పుడు సౌందర్యలహరిలోని శ్లోకాల ప్రస్తావన కూడా వచ్చేది. అప్పుడు సౌందర్యలహరి శ్లోకాలను అనువదించాలనే కోరిక మరింత బలపడింది.

1972 సంవత్సరంలో నా శ్రీమతి హైదరాబాదు పురిటికి వెళ్లింది. అప్పటికి నేను విశాఖపట్నం నుండి గుంటూరు వచ్చి టి.జె.పి.యస్. కళాశాలలో ఉద్యోగంచేస్తున్నాను. అమ్మవారిని ప్రార్థించి సౌందర్యలహరి శ్లోకాలను తెలుగులోకి అనువదించడానికి ఉద్యుక్తుడనయ్యాను. 20 శ్లోకాలదాకా అనువాదం జరిగింది. ఆ రోజుల్లో టి.జె.పి.యస్. కళాశాలలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయ పరమ పట్టభద్ర కేంద్రం (P.G. Centre) తెలుగు విభాగం కూడా ఉండేది. దానికి కీ.శే. ఆచార్య యశ్వీజోగారావు గారు విభాగాధిపతిగా ఉండేవారు. వారు మొట్టమొదట నా అనువాద పద్యాలను చూసి అభినందించారు. 1972లో అటుపైన మా అమ్మాయి 'శశికళ' బాలసారె ఉత్సవానికి మాస్టరు EK గారు బందరులోని మా ఇంటికి వచ్చారు. అప్పుడు ఆ అనువాదపద్యాలు విని 'చాలా బాగున్నాయి నువ్వు ఈ అనువాదం పూర్తి చెయ్యి' అని ఆదేశించి, ఆశీస్సులందించారు. మాస్టరు గారి ఆశీర్వాద బలం వలన అన్ని శ్లోకాలను అనువదించడం పూర్తి అయింది. వాటిలో కొన్ని టి.జె.పి.యస్. కళాశాల ప్రథమ వర్ష మేగజేన్‌లో కూడా ప్రచురింపబడ్డాయి.

1994 సంవత్సరంలో సౌందర్యలహరిలోని శ్లోకాలకు టీకా తాత్పర్య వివరణ, 'భారతీయ మార్గము' మాసపత్రిక ఆగస్టు సంచికలో ప్రారంభమైంది. శ్రీ మన్నవ గిరిధర రావు గారి సంపాదకత్వంలో వెలువడిన ఆ మాసపత్రికలో - 32 శ్లోకాల వఱకు మాసానికి ఒక శ్లోకం చొప్పున - 1998 జూలై సంచిక వఱకు వివరణ ప్రచురింపబడింది. ఆ వివరణలు చదివిన వివిధ పాఠకుల నుండి ప్రశంసాపూర్వక లేఖలు కూడా చాలా వచ్చేవి. ప్రస్తుతము ఈ సౌందర్యలహరికి -

విశాఖపట్టణం నుండి వచ్చు 'మిహిర' మాస పత్రికలో ప్రతి నెల ఒక్కొక్క శ్లోకమునకు వివరణ ప్రచురింప బడుచున్నది.

32వ శ్లోకం దాకా వ్రాసిన వివరణ ఎందుకనో ఆగిపోయింది. ఈ మధ్యలో శ్రీలలితా సహస్రనామ వివరణ 4 సంపుటాలుగా ముద్రితమైంది. ఆ లలితా సహస్ర నామ వివరణ గ్రంథాల్లో చాలా చోట్ల సౌందర్యలహరి లోని శ్లోక ప్రసక్తి వచ్చింది. దాన్ని చదివిన పాఠకులు సౌందర్యలహరి పుస్తకాలు ముద్రితమైపోయాయనుకుని పంపమని ఉత్తరాలు వ్రాసేవారు. చాలా రోజుల వఱకు 33వ శ్లోకం నుండి వివరణ వ్రాయటం కుదరలేదు. ఈ సంవత్సరం, అంటే – 1999 సంవత్సరం గణేశ చతుర్థి సెప్టెంబర్ 13వ తేదీనాడు పూజ చేసుకున్నాం. నాటి తెల్లవారుఝామున ఇంట్లో గజ్జెల చప్పుడు అతి రమ్యంగా నాకు వినబడింది. అది అమ్మవారి అందెల రవళేనని నాకు నిర్ధారణ అయింది. ఆనాటి నుండి అతి వేగంగా రోజుకు సగటున రెండు శ్లోకాల చొప్పున వివరణ వ్రాయడం జరిగింది. వివరణ వ్రాసిన వెంటనే నా శ్రీమతి మీనాక్షి శుద్ధప్రతిని ఎప్పటికప్పుడు తయారు చేసింది. ఈ వేగంతో అక్టోబరు 20వ తేదీ కల్లా అన్ని శ్లోకాలకు వివరణ పూర్తి అయింది. ఈ వివరణ వ్రాస్తున్న కాలంలో అమ్మవారి అనుగ్రహం వలన ఎన్నో వినూత్న విషయాలు స్ఫురించేవి, ఎన్నో అనుభూతులు కలిగేవి. తెల్లవారు ఝామున లేచి ఎప్పటికప్పుడు అలా స్ఫురించిన వాటిని కూడా గ్రంథస్థం చేయడం జరిగింది.

1999 అక్టోబరు 24న గుంటూరులో జరిగిన గురుపూజలకు హైదరాబాదు నుండి వచ్చిన శ్రీ శ్రీపతి రఘురామ్ కుమార్, శ్రీ పి.వి. రమణయ్య సోదరుల ప్రోత్సాహంతో సౌందర్యలహరి ముద్రణకు – ప్రచురణ పూర్వ మూల్యం రూ80/– అని గురుపూజల్లో సభాముఖంగా తెలియచేయటం జరిగింది. వారి ప్రోత్సాహబలంతో, ఈ సౌందర్యలహరి వివరణకు సంబంధించిన DTP పని కూడా నవంబరు 5వ తేదీన ప్రారంభమై, ఏ అడ్డంకులు రాకుండా డిశెంబర్ 6వ తేదీ కల్లా పూర్తి అయింది. ఈ సందర్భంలో మా హనుమాన్‌ప్రసాద్ గూడా వుంటే ఎంత ఆనందించేవాడో ననిపించింది.

పూర్తిగా గురుకృప, శంకరుల దివ్య ఆశీస్సులు, జగన్మాత అనుగ్రహం వలన పూర్తయిన ఈ సౌందర్యలహరి వివరణ – సాధక, సోదర పాఠకులకు అత్యంత ఉపయోగకరంగా ఉంటుందని నా దృఢమైన నమ్మకం. అందఱూ ఈ వివరణను చదివి, జగన్మాతను సాక్షాత్కరింప చేసుకొందురుఱ గాక !

ఈ వివరణలో ఏవైనా దోషాలుంటే పెద్దలు వాటిని తెలిపినచో – ముందు ముద్రణలో సవరించుకుంటానని సవినయంగా తెలియజేసుకుంటున్నాను.

గుంటూరు
19.12.99
(ప్రమాథి మార్గశీర్ష శుద్ధైకాదశి)

ఇట్లు
**జి.ఎల్.ఎన్.శాస్త్రి**
వివరణ కర్త.

# కృతజ్ఞతలు

సత్కార్య నిర్వహణకై నాకు దేహాన్నిచ్చిన జననీ జనకులకు, ఆ చేసే పనిని వివేకవంతంగాను, సార్థకంగాను చెయ్యడానికి కావలసిన జ్ఞానాన్ని ప్రసాదించిన గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి, చేసిన పనిని నలుగురికీ ఉపయోగ పడునట్లుగా ఎప్పుడూ ఆశీర్వదించే శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారికి – సభక్తి ప్రణామములు.

సంస్కృత శ్లోకాలకు నేను అనువదించిన తెలుగు పద్యాలను చదివి ప్రశంసిస్తూ, కొన్ని పద్యాలలో అవసరమైన మేరకు సవరించమని సలహానిచ్చి, ఈ గ్రంథ విషయాలనన్నిటినీ ఆ మూలాగ్రం చదివి, నా మీద గల అభిమానంతో సమగ్రంగా, సకాలంలో తమ అభిప్రాయాన్ని గూడా – 'సౌందర్యలహరీ నౌయానము' అనే శీర్షికతో వ్రాసి నన్ను ప్రోత్సహించిన ఆత్మీయులు డాక్టర్ మైలవరపు శ్రీనివాసరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదములు.

కీర్తిశేషులు శ్రీ నారాయణభట్ల శ్యామసుందర్, వారి శ్రీమతి సుశీల – ఈ పుణ్యదంపతి ప్రియపుత్రులైన చిరంజీవి సుభాష్‌చంద్ర, చిరంజీవి రవికిరణ్ ఇద్దరూ – తల్లిదండ్రుల ఉత్తమమైన పెంపకము ఫలితముగా ఇంజనీర్లుగా వృత్తిని నిర్వహించుచూ, జగద్గురు పీఠము – గుంటూరు శాఖ ప్రచురణలకు ఆర్థికముగా సహాయపడుచున్నారు. ప్రస్తుత 'సౌందర్యలహరి' పుస్తకము యొక్క టైటిల్ పేజీ ఈ విధంగా వుంటుందని అమ్మవారి బొమ్మను, నమూనాను చూపించిన వెంటనే – చి. సుభాష్ చాలా ఆనందపడి, ఆ టైటిల్ పేజీ ముద్రణ ఖర్చుకు విరాళాన్ని భక్తితో సమర్పించాడు. ఇతనికి, ఇతని భార్య శ్రీదేవి, వీరి కుమారులు చి. హరితేజ, చి. శివతేజలకు; ఇతని తమ్ముడు చి. రవికిరణ్, భార్య శ్రీలత, వీరి కుమారుడు చి. అనిరుద్ధులకు జగన్మాత అనుగ్రహము, పరమ గురువుల శుభాశీస్సులు నిరంతరము ఉండుగాక !

మా జగద్గురు పీఠం - గుంటూరు శాఖ వారు నిర్వహించే ప్రధానమైన కార్యక్రమాలన్నింటిలో - అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొంటూ, గురుపూజా మహోత్సవాల నిర్వహణ, పుస్తక ముద్రణలకు ఎప్పుడూ అత్యంత ఆదరభావంతో సహకరిస్తూ, తగిన విధంగా ఆదుకుంటూఉన్న - శ్రీదేశిరాజు పార్థసారధి - శ్రీలక్ష్మి దంపతికి, శ్రీ కె.వెంకుబాబు - లక్ష్మీకాంతం దంపతికి, సూరపరాజు సత్యనారాయణమూర్తి - సత్యవాణి దంపతికి, సూరపరాజు శ్రీనివాసమూర్తి - నాగశ్రీ దంపతికి, శ్రీ ఎమ్. రామమూర్తి - సుబ్బలక్ష్మి దంపతికి, - వారి వారి కుటుంబ, బంధు, మిత్రులకు, నా హృదయపూర్వక శుభాకాంక్షలు, కృతజ్ఞతలు. వీరి గృహములలో నిర్వహింపబడవలసిన శుభకార్యములుసత్వరమే శోభాయ మానముగా నిర్వహింపబడునట్లు శ్రీ బాలాత్రిపుర సుందరీ దేవి వీరిని అనుగ్రహించు గాక!

ఈ సౌందర్యలహరి పుస్తకం మా అమ్మకి అంకితం చేస్తున్న సందర్భాన్ని పురస్కరించుకుని - మా పెద్దన్నయ్య శ్రీ గొర్తి వెంకట శేషావతారం - శ్రీమతి లలితా కుమారి దంపతి, మా చిన్న అన్నయ్య శ్రీ గొర్తి రామమూర్తి - శ్రీమతి లక్ష్మీదేవి దంపతి తరఫున వారి ద్వితీయ కుమారుడు చి. ఫణిరాజకుమార్, చి.సౌ. భవాని దంపతి, మా చిన్న బావ, చిన్న అక్కయ్య లైన - శ్రీ జొన్న విత్తుల ఆనందరామశాస్త్రి - శ్రీమతి సీతామహాలక్ష్మి దంపతి, నా బావమఱది శ్రీ సర్వాపూర్ణానందశాస్త్రి - శ్రీమతి శారద దంపతి వెంటనే తమ వంతు విరాళాలను ఆనందంతో అందచేశారు. వీరికి, వీరి కుటుంబ సభ్యులందటికీ పరమ పావని పార్వతీ దేవి పరిపూర్ణ కటాక్షము ఉండాలని కోరుతూ, నా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖ కార్యక్రమాలను, ప్రచురణలను ఎంతో అభిమానించి, ఆదరించి, ఆర్థిక సహకారాన్ని అందిస్తున్న గుంటూరు వాస్తవ్యులు గురిజాల లక్ష్మీ నరసమ్మ గారికి, హైదరాబాదు వాస్తవ్యులు - శ్రీమతి పి.వరలక్ష్మి గారికి, శ్రీ కె.వి.ఎల్. నరసింహారావు గారికి - హైదరాబాదులోని

కనకదుర్గా సేవాసమితి వారికి, శ్రీ ఐనంపూడి వెంకట్రామయ్య గారికి, ఒంగోలు వాస్తవ్యులు శ్రీ ఎమ్. హృషీకేశరావు - శ్రీమతి సులోచన దంపతికి, గుంటూరులోని టి.జె.పి.యస్. కళాశాల తెలుగు రీడర్ డా.శ్రీమతి పి.నాగమణికి, ఆంగ్లోపన్యాసకురాలు శ్రీమతి వి. లలితా కుమారికి, పిడుగురాళ్ళ వాస్తవ్యులు శ్రీ కె.వి. సుబ్బారావుగారికి, శ్రీ పి.రామమోహన్‌రావుకు, శ్రీ వై. సుబ్బారావుకు, రావులపాలెం లోని ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆంగ్లోపన్యాసకురాలు చి.సౌ. ఎ. నాగమణికి, చిన ఓగిరాల వాస్తవ్యురాలు శ్రీమతి దుర్గామహాలక్ష్మికి, బెజవాడ వాస్తవ్యులు శ్రీ ఎస్.కె.పి. గోపాలాచార్యులు గారికి, శ్రీమతి బి. సీతకు, నకిరేకల్లు వాస్తవ్యులు చి.ఎమ్. ఆంజనేయులుకు, మైసూర్ వాస్తవ్యులు శ్రీ ఆర్.పి. జోషికి, విశాఖపట్నం వాస్తవ్యురాలు శ్రీమతి ఎన్.సీతాదేవికి, బెల్లంపల్లి వాస్తవ్యులు చి.పి.వి. సుబ్బారావుకు, విశాఖపట్నం వాస్తవ్యురాలు చి.సౌ.వెంకటరత్నంకు, రాజమండ్రి వాస్తవ్యులు చి. ఎ.కామేశ్వరరావుకు, చి.జె.రఘునాథశాయికి - నా హృదయపూర్వక కృతజ్ఞతలు. వీరిని, వీరి కుటుంబ సభ్యులందఱినీ శ్రీలలితాదేవి తన కృపావీక్షణముతో అనుగ్రహించు గాక!

ఈ పుస్తక ప్రచురణ పూర్వ మూల్యాలను డిసెంబరు 10వ తేదీలోపుగా ఇచ్చినవారికి, వాటిని స్వీకరించి నాపై ఎంతో అభిమానంతో అందచేసి, ప్రేమతో సహకరించిన సర్వశ్రీ శ్రీ పి.వి. రమణయ్య (హైదరాబాదు), జె.రఘునాథశాయి (రాజమండ్రి), ఆర్. కోటేశ్వరరావు (మచిలీపట్నం), జె.ఎమ్. రామచంద్రన్ (కర్నూలు), పి. మురళీకృష్ణ (హైదరాబాదు), జి.ఎస్.ఎన్.మూర్తి (ఖరగ్‌పూర్), శ్రీమతి బి. సీత (విజయవాడ), శ్రీ గోగినేని కనకయ్య (గుంటూరు) లకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. శుభాకాంక్షలు. శ్రీ రాజరాజేశ్వరీ దేవి వీరిఅందఱినీ సర్వదా కాపాడుచుండుగాక!

నేను శ్లోకానికి వివరణ వ్రాస్తుంటే - దానికి వెంటనే శుద్ధప్రతిని తయారు చేస్తూ, డి.టి.పి. ప్రూఫుల్ని దిద్దడంలో సహకరిస్తూ, 'సహధర్మచారిణి' అన్న పదాన్ని సార్థకం చేసుకుంటున్న నా శ్రీమతి. చి.సౌ.విష్ణుప్రియ(మీనాక్షి)కి, టైటిల్ పేజీ నమూనా తయారు చెయ్యడంలోనే గాక, దాని ముద్రణలోను, చక్కని జ్ఞాపికలను

ఎప్పటికప్పుడు తయారు చేసి ఇవ్వడంలోను, ముఖ్యంగా - మా అమ్మ ఫోటోను తయారు చేసి ఇవ్వడంలోనూ - లోగడ సూరపరాజు హనుమాన్ ప్రసాద్ సహకరించిన విధంగానే - తన వంతు బాధ్యతను నిర్వహిస్తున్న చి.ఎమ్.వి. రమణకుమార్‌కు, పుస్తక పంపిణీకి సహకరిస్తున్న పి. సూర్యప్రసాద్‌కు, సకాలంలో గ్రంథ ప్రతిని డి. టి.పి. చేసి ఇచ్చిన చి.సౌ. ఇందిరాదేవికి నా శుభాశీస్సులు. శుభాభినందనలు. జగజ్జనని కటాక్షముతో వీరు వర్ధిల్లుదురు గాక !

మా అమ్మ గురించిన కొన్ని వివరాలను నాకు తెలియజేసిన - మా పెద్దబావ, పెద్దక్కయ్య అయిన శ్రీ మంత్రాల సీతారామశర్మ గారు - శ్రీమతి సర్వమంగళాంబ; పెద్దన్నయ్య, పెద్దవదినలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక రచనకు ముందు చూచిన కొన్ని గ్రంథాలు.

| **పుస్తకము** | **ఆంధ్ర టీకాతాత్పర్య వివరణ కర్త** | **ప్రకాశకులు** |
|---|---|---|
| 1. సౌందరల్యహరి - | శ్రీ చదలువాడ జయరామశాస్త్రి | చదలువాడ జయరామ శాస్త్రి అండ్ సన్స్ ట్రంక్‌రోడ్, నెల్లూరు. |
| 2. శంకర గ్రంథ రత్నావళి (సౌందర్యలహరి) | శ్రీ శ్రియానందనాథుడు ఈశ్వర సత్యనారాయణ శర్మ | సాధన గ్రంథ మండలి, తెనాలి |
| 3. Saundaryalahari | Swamy Tapasyananda | Sri Rama Krishna Math 16, Rama Krishna Math Road Mylapore, Madras 4 |

ఆయా పుస్తకాల గ్రంథకర్తలకు, ప్రకాశకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

శ్లోకములకు టీక వ్రాయుటలో పైన తెలిపిన మొదటి పుస్తకమును ఎక్కువగా అనుసరించుట జరిగినది. కావున, వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

18.12.1999

- **వివరణకర్త**

# దివ్యాశీస్సులు

భగవాన్ శ్రీ విశ్వయోగి విశ్వంజీ
విశ్వమందిరం, కృష్ణనగర్
గుంటూరు - 6

అమ్మ ఆది అనాది. అమ్మ విశ్వజనని. అనంత విశ్వ అధినాయకి. ఆ ఆదిపరాశక్తి ఆదిలో బిందు స్వరూపమై, స్వీయ దివ్య సంకల్పముతో అనంతమైన యావత్ సృష్టిని నిర్మాణము చేసి, పరిపాలన చేస్తూ, జగన్నాటక సూత్రధారిగా అలరారుతున్నది. శక్తిలేనిచో శివుడు గూడా అశక్తుడే ! అట్టి శక్తి యొక్క మాహాత్మ్యమును అనుభవ పూర్వకముగా అనుభవించిన ఆదిశంకరులు – ఆ దివ్యశక్తి మహిమను ప్రస్తుతిస్తూ, ఆనందముతో, తన్మయత్వముతో ఆ దివ్య సౌందర్యానుభూతులలో దివ్యగానము చేసినాడు. ఒక దివ్యజలపాతములా, ఒక దివ్య జ్ఞాన తరంగ స్వరూపమై, జ్ఞానలహరి ఆయన హృదయమునుండి మనసుకు ప్రవహించి బహిర్గతమైనది. అట్టి ఆనందలహరియే ఈ 'సౌందర్యలహరి'. ప్రతి శ్లోకము అనంత ఆనందామృత మధురము. నర్మగర్భితమైన అర్థపరంపరతో ఆనందలాస్యము చేస్తూ ఉంటుంది. అట్టి సౌందర్యలహరిలోని శ్లోకములను అర్థము చేసుకోవటము ఎంతో కష్టము. అంతరార్థాన్ని, విశేషార్థాన్ని ఇంకా ఇంకా అర్థము చేసుకోవటము ఎంత కష్టమో ఊహించుట గూడా కష్టము. కవి హృదయాన్ని హృదయంతో అర్థము చేసుకొన్న వ్యక్తి మాత్రమే ఆ కవి రచనలలోని హృదయ స్పందనను అర్థము చేసుకొనగలడు.

అలా ఆదిశంకరుల హృదయ స్పందనతో తన హృదయ స్పందనను మేళవించి, సమగ్రంగా అర్థము చేసుకొని – యదార్థ భావ సౌందర్యాన్ని సమాజానికి అందించటానికి ప్రయత్నం చేసిన వివేక చూడామణి చి.G.L.N. శాస్త్రి. శ్రీ లలితాసహస్ర నామాలు గాని, మరి ఏ ఇతర ఆధ్యాత్మిక అంతరంగ భావాలనుగాని ఔపోసన పట్టినట్లుగా జీర్ణించుకొని అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్లుగా – సామాన్య మానవుడికి గూడా అందించగలిగిన దిట్ట చి.శాస్త్రి.

భౌతికశాస్త్రమే గాదు, ఆధ్యాత్మిక శాస్త్రమును, మంత్ర, తంత్ర శాస్త్రములను, ఖగోళ శాస్త్రములను రంగరించి, శాస్త్రముతో సశాస్త్రీయముగా మేళవించి - శాస్త్ర సమ్మతము చేయగల నేర్పరి, వివేకి - శాస్త్రి. భక్తి తత్పరుడు. వినమ్రశీలి, సంస్కారవంతుడు అయిన శాస్త్రి హృదయ స్పందనకి మనోభావనకు, ఆలోచనారీతికి, సమగ్ర పరిశోధనా తీరుకు, సశాస్త్రీయ దృక్పథమునకు - దర్పణము ఈ గ్రంథము. ఈ గ్రంథము ఆమూలాగ్రము సమగ్రముగా పఠించిన నేను ఆ వివరణ తీరునకు, రచనా నైపుణ్యమునకు ఆనందించితిని.

ఈ అమూల్యమైన గ్రంథరాజమును ఆంధ్ర భక్తజనావళి హృదయమునకు దగ్గఱగా తీసికొని, సమాదరించి జన్మచరితార్థము చేసికోగలదని ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తున్నాను. చి.శాస్త్రి లేఖిని నుండి ఇంకా ఇంకా ఎన్నో మహత్తర గ్రంథములు వెలువడాలని ఆకాంక్షిస్తూ, చి.శాస్త్రికి, వారి కుటుంబమునకు దివ్యాశీస్సులు అందిస్తున్నాను.

**శుభం భూయాత్**

**అవధూత చింతన శ్రీ గురుదేవదత్త.**

# సౌందర్యలహరీ సోపానము

'రామాయణ ప్రవచన సుధాకర'
'రామాయణ సుధానిధి'
భాషాప్రవీణ డా. మైలవరపు శ్రీనివాసరావు
ఎమ్మే (తెలుగు) ఎమ్మే (సంస్కృతము), పి.హెచ్.డి.

'అ' 'మ' అనే రెండక్షరాలతో ఏర్పడే పదం 'అమ్మ'. సంస్కృతంలో అయితే 'అ' 'బ' అనే రెంటితో ఏర్పడే పదం 'అంబ'.

'అ' అనేది అక్షరాల పుట్టుకకి ప్రారంభస్థలమైన కంఠం నించి పుట్టే కంఠ్యాక్షరమైతే (Glottal) – 'మ', లేదా – 'బ' అనే వర్ణాలు అక్షరాల పుట్టుకకి చివరి చోటైన ఓష్ఠాల (పెదవుల) నించి పుట్టే ఓష్ఠ్యాక్షరాలు (Bi-labials).

అంటే, 'అమ్మ' లేదా – 'అంబ' అనే పదాలు వర్ణోత్పత్తి స్థానాల ఆది – అంతాలని స్పృశిస్తూ పుట్టేవన్నమాట. దీన్ని బట్టి నోరార పిలుచుకునే పదాలు అమ్మ – అంబ అనేవి ఔతున్నాయి. ఆర్తిలో / ఆనందంలో అప్రయత్నంగా నోటి వెంట వచ్చే పదాలు ఇవే. ఇలాంటి అమ్మలకందరికీ అమ్మ, 'శ్రీమాత', లేదా – 'లలితాంబిక', లేదా – 'జగదంబ'.

అమ్మకీ ఆవుకీ పోలిక ఉంది. అందుకే గోవు 'గోమాత' అయింది. అమ్మా, గోవూ అనే ఇద్దరూ కూడ క్షీరాన్నిచ్చేవారే. గోవు తప్ప మరి ఏ చతుష్పాత్తూ (నాలుక్కాళ్ల జంతువు) 'అంబా' అని పిలవ(లే)దు. గోవు నోరు తెరిస్తే మానవునిలా 'అంబా' అంటుందంటే ఆశ్చర్యం కాదూ ! ఏది అడిగినా ఇచ్చే లక్షణం తల్లికే ఉంటుంది. అందుకే అమ్మకీ, ఆవుకీ 'కామధుక్' (కోరికలని పిండుకున్నంత ఈయగలది) అనే పేరుంది. అందుకే విద్యాప్రారంభంలో 'అమ్మ' పదం తర్వాత చెప్పేది 'ఆవు' అనే పదాన్నే.

భూమి సహనానికి మారుపేరైతే గోవుని 'భూమి'కి సంకేతమన్నారు పెద్దలు. (జగోప గోరూపధరామి వోర్వీమ్.) భూమి సహనానికే కాదు సర్వానికే ఆధారం కూడ. అందుకే 'అమ్మ' గోవుకీ, భూమికీ కూడ సంకేతం. సీతమ్మ భూమిలో పుట్టడమంటే ఈ రహస్యాన్ని చెప్పడానికే. (మహీం మూలాధారే .... శ్లోకానికి కుండలినీ పరమైన వ్యాఖ్యలో భావమిదే).

ఇదంతా ఎందుకంటే ఇలాంటి సర్వకామధుక్కైన అమ్మ, భూమి పాలకురాలైన అమ్మ ఎంతగొప్పదో ఆ విశేషాలనన్నింటినీ సౌందర్యలహరి ద్వారా ఆదిశంకరులు చెప్తే దాన్ని మనం ఈ వ్యాఖ్య ద్వారా చదివి చూచి ఆనందించబోతున్నామని తెల్పేందుకు.

సౌందర్యలహరి వంటి గ్రంథాలకి వ్యాఖ్య వ్రాయడమంటే దానికి కావలసింది పాండిత్యం కాదు. అనుష్ఠానం – తపోనుభవమున్నూ. లేని పక్షంలో శంకరులు దర్శించి రాసిన ఆ ఎత్తులో వ్యాఖ్యాకర్త బుద్ధి విహరించనూ లేదు – విశేషాలని వివరించనూ కాదు.

ఈ కావ్యం శిఖరిణి వృత్తంలో నడుస్తుంది. ఇది కూడ ఓ విశేషమే. కావ్యంలో నాయకుడుండడు. నాయిక మాత్రమే ఉంటుంది. ఇది మరో విశేషం. కావ్య ప్రారంభ పదం 'శివః' అయితే – చివరి పదం 'ఇయమ్' అనేది. శివః ఇయమ్ – 'ఈమె శివుడు' అని అర్థం ఈ వాక్యానికి. ఇది మహావిశేషం. ఈ విశేషాన్ని వివరించడానికే శంకరులవారి ఇన్ని శ్లోకాలున్నూ.

శ్లోకానికి ప్రతిపదార్థం, భావం రాసేసి స్వస్తి పలికి 'గైడు' తో సమానంగా ఉండే పుస్తకాల వల్ల అనుమాన బాహుళ్యమే ప్రయోజనం. అందుకే శ్రీ శాస్త్రిగారు ఏ పదాన్నీ విడవకుండా ఈ లహరిలో ఎక్కడెక్కడ ఎంతెంత లోతుందో వివరిస్తూ వచ్చారు. (హరిహర విరించాదిభిరపి.....). అభయవరద హస్తాల వివరణలో 'అభయహస్త వివరణం, గుణనికాపద వివరణం, వాంచితార్థ ప్రదాయినీ వివరణం, క్రొత్త పుంతలని తొక్కిందనేది వాస్తవం.

ధనుఃపౌష్పం మౌర్వీ (6) శ్లోకంలో మన్మథ సహాయకులూ వారి అశక్తతా, ఇంద్రియ లౌల్య వివరణపు తీరూ ప్రసిద్ధప్రస్థాన (క్షుణ్ణమార్గంలో సప్రమాణంగా సాగింది.

మహీం మూలాధారే (9) వ్యాఖ్య గ్రంథానికే ఒక అలంకారం. లలితాసహస్ర నామాలకి 4 భాగాల్లో విస్తృత వ్యాఖ్యని వీరు చేసి ఉన్నారు కాబట్టే ఆ పునాదితో సౌందర్యలహరిని తరించగలిగారు. నిత్యానుష్ఠానంతో పాటు నిత్య ప్రవచనం ఈ పునాదిలోని గట్టిదనానికి నిదర్శనం.

ఒక ప్రక్క విజ్ఞాన శాస్త్ర విశేషాన్నీ, మరోవంక జ్యోతిశ్శాస్త్ర రహస్యాన్నీ, ఇటు ప్రక్క ఆధ్యాత్మిక భావాన్నీ - ముప్పేటలుగా పేనుతూ చక్కని శైలితో సరలసుందరంగా రాయడమనేది వీరికి జన్మతః వచ్చిన ప్రజ్ఞావిశేషమే గాని బలవత్ సంపాదితం కాదు.

అమ్మవారి రసగుంఫిత దృష్టిని వర్ణించినప్పుడూ, అయోధ్యాది నగరాలని శ్లోకంతో సమన్వయిస్తూ వివరిస్తున్నప్పుడూ ఆలోచనల్లో శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి ముద్ర అలా కన్పిస్తూ ఆనందపరుస్తుంది.

ఒక 'సైన్సు మాస్టారు' తెలుగు పద్యాలని రాయడం - అందునా శాస్త్రాన్ని వివరించిన ఆదిశంకరుల శ్లోకాలని అనువదిస్తూ రాయడం - దోషాల్లేకుండా ప్రతిపదార్థాన్నీయడం - సమన్వయ సౌభాగ్యంతో వివృతిని ప్రదర్శించడం - పైకి అసభ్యంగా కన్పిస్తుండే కొన్ని కొన్ని శ్లోకాలలోని మర్మాన్ని విప్పి, సౌందర్యాన్ని విప్పి చెప్పి పునఃపునః పఠనాసక్తిని కల్గించడం - నాకు విశేషానందాన్ని కల్గించాయి. లేని పక్షంలో గ్రంథుల వివరణం అంత చక్కగా కుదరదని నా భావం - సిందూర రేఖా వివరణం అంత రమణీయంగా సాగదని నా నిర్ణయం. ఇలా ఎన్నని రాయగలం?

..... ఇదంతా 'త్వదీయాభిర్వాగ్భిః......' అన్నట్లు ఆ లలితాంబిక సర్వానుగ్రహమూ వారి మీద ఉందనడానికి సాక్ష్యప్రాయమే.

ఇతోఽధికానుగ్రహాన్ని వారికి ఆ పరాభట్టారిక ఈయాలని ప్రార్థిద్దాం - మరికొన్ని వ్యాఖ్యలు లభిస్తాయనే స్వార్థంతో.

**ఇతి శ్రీః**

**19-12-99** **(సం) మైలవరపు శ్రీనివాసరావు**

**ప్రమాథి మార్గశీర్ష శుద్ధైకాదశి.**



శ్రీ లలితా దేవి



గురుదేవులు - శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

గీ. స్థిరచిత్తుండును, బుద్ధిశాలి, ఘనసౌశీల్య స్వభావుండు, సా
దరహాసద్యుతి మంతుడున్, సకల విద్యాసార చిద్రూపుడున్,
నరరూపాచ్యుత పుణ్యమూర్తి, భవచింతల్ దీర్చు సౌజన్య సుం
దరుడౌ, శ్రీ గురువెక్కిరాలకుల కృష్ణస్వామినే గొల్చెదన్.

- వివరణ కర్త

# అంకితము





## మాతృమూర్తి - శేషారత్నం

గీ. శంకరాచార్యు మదిలోన జన్మనంది
సుందరమ్మైన సురభాష నందునున్న
మహిమగలదైన సౌందర్యలహరి నేను
అందమైనట్టి తెలుగులో ననువదించి.
విలువగలిగిన విషయాల వివరణమును
అంకితమ్మిచ్చు చుంటి శేషమ్మ తల్లి
నీదు పదసరోజములకు నిర్మలాత్మ !
భక్తి నిండిన ప్రేమ సంయుక్తుడగుచు

- వివరణ కర్త

# 'అమ్మ'

'అమ్మ' అనంగానే – 'జగదంబ' అని అనుకునేరు. ఇప్పుడు వ్రాయబోయేది మా 'అమ్మ' గురించి, నాకు జన్మనిచ్చిన 'తల్లి' గురించి. ఎవరైనా, ఎప్పుడైనా, ఏదైనా ఒక పని చేయగలిగామంటే – శరీరం ఉండబట్టే గదా ! ఆ పని మానసికమైనదైనా సరే – అంతే ! ఎందుకంటే – భౌతికమైన శరీరం లేకుండా మనస్సు ఒక్కటీ ఉండడం మనం ఎప్పుడూ చూడలేం గదా ? – అందుకు. ఎవరికైనా శరీరం ఇవ్వబడేది తల్లిదండ్రుల వల్లనే గదా! ముఖ్యంగా – తల్లి వల్లనే గదా ! అందుకని – నేను ఇంతవరకు చేసిన భౌతిక, మానసిక, ఆధ్యాత్మికమైన పనులన్నిటికీ నాకు శరీరాన్నిచ్చిన నా తల్లి ప్రథమ కారణం ఔతుంది. ఆ తర్వాతనే ఎవరైనా !

**బాల్యం**

మా అమ్మ తండ్రికి, అంటే – మా తాతయ్య లక్ష్మయ్యగారికి రెండుసార్లు పెళ్లి జరిగినా – ఆ ఇద్దరు భార్యలు పిల్లల్ని కనకుండానే పోయారు. తాతయ్యకు భీమవరం దగ్గర పెదమిరం గ్రామ ప్రాంతంలో బాగా ఆస్తిపాస్తులుండేవి. తన తదనంతరం ఆ ఆస్తిపాస్తులకు ఒక వారసుడు ఉండాలని మూడోసారి మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. ఈ మూడో భార్య వయస్సులో తాతయ్య కంటె చాలా చిన్నది. ఈవిడ పేరు 'సీతామహాలక్ష్మి'. మా అమ్మని ప్రసవించి బాలింతరాలుగా ఉన్నప్పుడు ఈవిడను వేరుశనగకాయలు పుష్కలంగా ఉండే ఒక గదిలో ఉంచారు. చిన్నతనంతో తెలియక ఆ కాయలెక్కువగా తినడం వలన, బాలింతరాలైన ఆవిడకు పైత్యప్రకోపం బాగా పెరిగి – మానసికమైన రుగ్మతలు, అప్పుడప్పుడు ప్రవర్తనలో తేడాలు గూడా కనబడేవి. పసిపిల్ల అయిన మా అమ్మకు ఒకసారి పచ్చిమిరపకాయలతో నలుగుపెట్టి నీళ్లు పోసింది. ముందు చూడకుండా బాగా వేడిగా ఉన్న నీరు గూడా పోసేసేది. ఇది తెలిసిన మా తాతయ్య తల్లి అప్పటి నుండి మా అమ్మను ఎంతో మమకారంతోను, ప్రేమతోను అల్లారు ముద్దుగా పెంచింది. అమ్మ బాల్యం కొంత కాలం గోపాలపుర అగ్రహారంలోని మద్దూరి వారి కుటుంబ వ్యక్తుల ప్రేమాభిమానాలతో గడిచింది.

పశ్చిమ గోదావరి జిల్లా ఉండీ అగ్రహారంలోని అమ్మ మేనమామలు శ్రీ సామవేదం సుబ్బయ్యగారి కుటుంబ వ్యక్తులు కూడా అమ్మని చాలా ప్రేమగా చూసుకున్నారు.

## వివాహకాండ

అమ్మ పెరిగి పెద్దదై పన్నెండేళ్ళు రాగానే - తాతయ్య అమ్మ పెళ్ళి చాలా ఘనంగా ఐదు రోజులు చేశాడు. అప్పటి రోజుల్లో పెళ్ళి ఊరేగింపుకు రాత్రివేళ కాగడాలే వాడేవారు. మొట్టమొదటి సారిగా మా తాతయ్య అమ్మ పెళ్ళి వూరేగింపులో - పెట్రోమాక్సు లైట్లు ఏర్పాటు చేశాడు. అందఱూ ఆ విషయాన్ని గొప్పగా చెప్పుకున్నారు. చాలా ఆడంబరంగాను, అట్టహాసంగాను జరిగిన తన మనుమరాలి పెళ్ళి వేడుకలను చూచి, ఆనందం పట్టలేక ఐదురోజుల పెళ్ళి కార్యక్రమాలు పూర్తిగా చూడకుండా మధ్యలోనే మా తాతయ్య తల్లి చని పోయింది.

## అత్తింటి కాపురం

కైకలూరు తాలూకా వెంకటాపురం గ్రామ వాస్తవ్యులైన - మా నాన్నగారు వాళ్లు బాగా ఖర్చు మనుష్యులు. దాన ధర్మాలకు, దైవకార్యాలకు, పేరు ప్రతిష్ఠలకు - ఉదారంగా, ఆడంబరంగా డబ్బు ఖర్చుపెట్టే తత్వం గలవారు. గ్రామానికి ఉపయోగపడే గుడి, బడి, బావి, మంచినీటి చెఱువు, కోనేరు, సత్రం, పిల్లనిచ్చి పౌరోహిత్యం అప్పజెప్పడం లాంటి సప్త సంతానాలు చేసిన వారు. బాగా కండపుష్టి, తిండి పుష్టి కలిగినవారు. మా నాన్న తండ్రి రామ్మూర్తి గారంటే ఊళ్లో వాళ్లందఱికీ హడల్ ! ఆయనది అంతా ఎదురెత్తు వ్యవహారం. అర్థం - పర్థం, వేళా-పాళా, సమయం - సందర్భం లేకుండా - అన్నిటికీ పోటీలు - పందాలు, కోపాలు - తాపాలు, చిరాకులు - చికాకులు. పన్నెండేళ్ల వయస్సు లోనే కాపరానికి వచ్చిన మా అమ్మ అలాంటి మామగారిని చూడంగానే హడలి పోయింది. మా నాన్న తల్లి మంగళాంబగారు మా నాన్నగారి చిన్నతనంలోనే పోవడం వల్ల మా అమ్మకు అత్తింటి కాపురం బదులు మామింటి కాపురం చెయ్యాల్సి వచ్చింది. చిన్న తనం వల్ల అమ్మ

ఏ పనైనా సరిగా చెయ్యకపోతే – 'మీ నాన్న నిన్ను ఇలాగే పెంచాడా ?' అని మామగారైన మా తాతయ్య హుంకరించేవాడు. అమ్మ భయపడి గదిలోకి వెళ్లి ఏడ్చేది.

## ఉమ్మడి కుటుంబం

నాన్నగారికి ఏ విధమైన దురలవాట్లు, దురభ్యాసాలు లేకపోయినా, ఎప్పుడూ ఆటపాటలతో గడిపేస్తూ ఇంటిపట్టున ఉండేవారు కాదు. మామగారి 25 ఎకరాల పొలానికి వారసుడు తనే గదా అని మా నాన్నకు, రామ్మూర్తి తాతయ్య వాళ్ళకూ కూడా వుండేది. ఆడంబరాలకు పోయి అన్నీ అమ్ముకుని తినడానికి అలవాటు పడిన మా నాన్న తాలూకు వాళ్లనుచూచి, మా అమ్మ తండ్రి లక్ష్మయ్య గారు తన తదనంతరంగాని, ఆస్తి అల్లుడికి దక్కనీకుండా జాగ్రత్తపడ్డారు. మా నాన్నగారి మేనత్తలు, బాబాయిలు అందఱూ కలసి ఉమ్మడి కుటుంబంగానే ఉండేవారు. ఇంటి ఖర్చులు విపరీతంగా వుండేవి. మా నాన్నగారి తల్లి మంగమ్మగారు నాన్న చిన్న తనంలోనే పోవడంతో – ఇంటి సంగతి చూసుకునే ఆడవాళ్లు లేక ఇంట్లో వున్న పాత్ర సామగ్రి తదితర సామాన్లు గూడా పోతూ ఇల్లు గుల్లయిపోతూ వుండేది. చిన్న పిల్ల అయిన అమ్మకు ఇదంతా ఏమీ తెలిసేది కాదు. అమ్మ వంటిపై దాదాపు 70 శౌరీల బంగారం రకరకాల నగల రూపంలో వుండేది. ఉమ్మడి కుటుంబ నిత్యావసరాలకు కావలసి వచ్చినప్పుడల్లా – ఒక్కొక్క నగ నాన్నగారు అమ్మని అడిగి తీసుకుని అమ్మేసేవారు. ఈ విషయంలో తండ్రికి భర్తకు మధ్య అమ్మ నలిగిపోయేది. ఒకసారి తాతయ్యకు తెలీకుండా ఒడ్డాణం నాన్నడగంగానే ఇచ్చింది. ఆ సంగతి తెలిసిన తాతయ్య మండిపడి, అమ్మని – ''నువ్వు అభిమానం పోయి ఇలా చేస్తే, ముందు ముందు నీ బ్రతుకు ఏమౌతుందో ఆలోచించుకో ! అష్టకష్టాలు పడతావు'', అని శపించినంతగా కోప్పడ్డాడు. అయినా మానాన్న మాటకు అమ్మ బదులు చెప్పలేదు!

## సంసార భారం

కొంతకాలం ఉమ్మడి కుటుంబంగా సాగినా – నాన్న తండ్రి రామ్మూర్తి

తాతయ్య రెండో పెళ్లి చేసుకుని వేరే చోట కాపురం పెట్టడంతో – నాన్న, అమ్మ వంటరి వాళ్లయ్యారు. లోకానుభవం లేని కూతురిని, అల్లుణ్ణీ ఆ సమయంలో లక్ష్మయ్య గారే దగ్గఱుండి కనిపెట్టుకుని, వంట గూడా చేసి పెట్టేవారు. అమ్మకు వరసగా కానుపులు వచ్చాయి. పెద్దన్నయ్య, పెద్దక్కయ్య పుట్టిన తరువాత, ఆ తర్వాత పుట్టిన చిన్నక్కయ్యకు మా అమ్మమ్మ పేరు పెట్టారు. ఆ తర్వాత లక్ష్మయ్య గారు చనిపోయారు. ఆయన పోయిన తరువాత పుట్టిన నాకు ఆయన పేరే పెట్టారు. నా తర్వాత ఒక చెల్లెలు, ఇద్దఱు తమ్ముళ్లు పుట్టారు. పిల్లల పోషణకు, చదువులకు మా నాన్నగారు రెండు చోట్ల కాపురాలు పెట్టాల్సి వచ్చింది. పిల్లల పెళ్లిళ్ల చేయాల్సి వచ్చింది. ప్రతి ఏటా ఏదో ఒక కారణంగా పంటలు సరిగా పండక పోవడం, పెట్టుబడి సొమ్ము వృథా అవడం, ఉన్న డబ్బును ఖర్చు పెట్టుకునే పద్ధతి తెలియక పోవడం – వీటన్నిటి వలన పుష్కలమైన పాడిపంటలతో వర్ధిల్లే 25 ఎకరాల వ్యవసాయం మూలపడింది. అప్పులు తీర్చడం కోసం ఒక్కొక్క ఎకరమే అమ్మడం, వీటితో పాటు స్వయంకృషితో పెంచి పోషించిన బంగారం లాంటి తోట, 1000 గజాల స్థలంలో ఇల్లు అన్నీ అమ్మేయాల్సి వచ్చింది. అమ్మాల్సి వచ్చినప్పుడల్లా దస్తావేజుల మీద ఎక్కడ సంతకం పెట్టమంటే అమ్మ బదులు చెప్పకుండా అక్కడ సంతకం పెట్టింది. ఇలా జరగడంతో అమ్మకు చివరకు తండ్రి ఇచ్చిన ఆస్తి, ఆభరణాలు అన్నీ పోయి – వంటిమీద పుస్తెలతాడు మిగిలింది. ఇంట్లో పిల్లలు మిగిలారు. ఏనాడూ ఇలా అయిందని గాని, ఇలా చేశారేం అని గాని అమ్మ నాన్నగార్ని పల్లెత్తు మాట అనలేదు. పిల్లలు పెద్దవాళ్లయారు. పెళ్లిళ్ల అయాయి. పిల్లలు కూడా చిన్న చిన్న ఉద్యోగాలు, చిన్న చిన్న జీతాలవాళ్లే ! వాళ్ల సంపాదన వాళ్ల కుటుంబాలకే సరిపోయేది. అందుకే ఆవిడ పిల్లల హయాంలో గూడా పెద్దగా సుఖపడింది లేదు, దేనినీ ఆశించిందీలేదు. పిల్లల జీతాలు పెరిగేటప్పటికి అనుభవించటానికి ఆవిడ లేనేలేదు.

## వ్యక్తిత్వం

మాస్టరుగారు (మాస్టర్ EK), అక్కయ్యగారు (మాస్టరు గారి భార్య),

WTT సోదర సోదరీమణులు గూడా మా అమ్మను చూశారు. 'ఎంతో నిదానం, ఓర్పు, వినయం, మంచితనం, మృదుస్వభావం గల వ్యక్తి' - అని అమ్మను గుఱించి అందఱిదీ ఒకే అభిప్రాయం. 'మీనాక్షీ! మీ అత్త గారిలాంటి అత్తగారు, నా లాంటి అల్లుడు ప్రపంచంలో ఎక్కడా ఉండరు' అని మాస్టరు గారే స్వయంగా నా భార్యతో అనేవారు. మా అమ్మ అధ్యాత్మ రామాయణ కీర్తనలు పాడేది. మా చిన్నక్కయ్యతో కలిసి పాడితే ఇంకా బాగుండేది. ఏ రోజూ సూర్యుణ్ణి చూడందే భోజనం చేసేది కాదు. ఒక వేళ సూర్యుడు కనబడకపోతే ఆరోజు వస్తే! వంటపని, ఇంటి పని చేస్తున్నంత సేపు మడిబట్ట కట్టుకుని భగవన్నామస్మరణ, ఏవేవో స్తోత్రాలు, భాస్కర దండకం మొదలైనవి చదువుతూనే ఉండేది. ఎక్కువగా 'శ్రీరామ జయరామ జయ జయ రామ' అనే త్రయోదశాక్షరీ మంత్రాన్ని 'శ్రీరామం జయరామం జయ్యేజయ్యేరామం' అని వినబడే బాణీలో స్మరించేది. ఇంటికి వచ్చిన వాళ్లకి కాదనకుండా ఏదో ఒకటి పెట్టేది. 'భవతీ భిక్షాందేహి' అని ఒక కుష్ఠువాడు రోజూ మా ఇంటికి వచ్చేవాడు. ఒక రోజు రాలేదు. అందఱం అన్నం తినేశాం. అమ్మని గూడా తినమన్నాం. 'వాడు రావాలిరా' అని ఆ కుష్టాడు వచ్చిన తర్వాతనే అన్నం తింది. కొడుకుల్నీ, అల్లుళ్ళనీ, కూతుళ్లనీ కోడళ్లనీ ఒకే రకంగా చూసేది. ఇంటికి భిక్షాన్నానికి వచ్చిన కుష్ఠువాడిలో గూడా తన పిల్లవాణ్ణి చూడగలగడం ఆమెకే చెల్లింది! నేను ఎప్పుడన్నా అల్లరి చేసి విసిగిస్తే ''ఏమి ఏడిపిస్తున్నావురా లక్షిన్నారాయణా! ఉండు, మీ నాన్నగారు రానీ చెప్తా' అనేది అంతే! కొట్టేది కాదు. అసలు మా యింట్లో మా నాన్నగారి చేత దెబ్బలు, తిట్లు తినకుండా పెరిగింది నేనొక్కణ్ణే!

**అవసానదశ**

తన తండ్రి పేరు పెట్టుకున్నందుకా అన్నట్లు - అవసానదశలో గుంటూరులో నా దగ్గఱే మా అమ్మవుంది. నేను నా భార్య మీనాక్షి ఇద్దఱం వృద్ధాప్య దశలో ఉన్న అమ్మను బాగా సేవించుకున్నాం. 1986 సంవత్సరంలో గుంటూరు లోని మా ఇంటి వద్దనే అమ్మకు చివరి క్షణాలు వచ్చాయి. అప్పుడే బెజవాడ నుండి మా చిన్నక్కయ్య గూడా అమ్మను చూడ్డానికి వచ్చింది. వెంటనే అమ్మను టాక్సీమీద

గుంటూరు నుండి బందరులోని మా ఇంటికి తీసుకువెళ్ళాం. కాలవ్యవధి ఏమీ లేకుండానే, స్వంత ఇంటిలో మా పెద్దన్నయ్య తులసి తీర్థం పోస్తూ 'నారాయణ నారాయణ' అని ఆవిడ చెవిలో అంటూండగా, పెద్ద కొడుకు చేతిలోనే చంద్రుడు లాంటి అమ్మ తుదిశ్వాస విడిచింది. లెక్కసరిపోయినట్లు ఆనాడు వైశాఖ అమావాస్య. తన ఆస్తిపాస్తుల్ని, ఆభరణాలను, వంట్లో శక్తినీ ఇలా అన్నిటినీ కుటుంబం కోసం త్యాగం చేసి, చివరకు కర్పూరంలాగా తన శరీరాన్ని గూడా విడిచి వెళ్లిపోయింది. మేము ఎంతటి దురదృష్టవంతులమంటే – అట్లాంటి అమ్మను పోగొట్టుకోవడమే కాదు, ఆవిడ ఫోటో గూడా సరియైనది ఒక్కటి గూడా జాగ్రత్త చేసుకోలేకపోయాం. అదే మా దురదృష్టం. ఈ రోజున మేము క్షేమంగా పిల్లా పాపలతో అందఱం చల్లగా ఉండటానికి కారణం ఆవిడ సౌజన్య, సౌశీల్య, సౌహార్ద్ర, సంస్కారాలే!

## అంకితం

జగన్మాతను గుఱించినదైన ఈ సౌందర్యలహరీ వ్యాఖ్యానం మా అమ్మకే అంకితం చేసుకుంటున్నాను. ఇలా చెయ్యడం ఇలా ఇదంతా ఇక్కడ వ్రాయడం మాతృ ఋణం తీర్చుకుని విముక్తుణ్ణి అయేందుకు కాదు. నిరంతరం సుస్థిరంగా మా కుటుంబ సభ్యులందఱి హృదయాల్లో అమ్మ గుర్తుండిపోయేందుకు. అంతే!

జగన్మాత అంశతో పుట్టిన అమ్మ 'శేషారత్నం' జగన్మాతలోకే లీనమైంది. అందుకే జగన్మాతను గుఱించిన ఈ స్తోత్ర వ్యాఖ్యానం ''అమ్మకే – అంకితం, మా అమ్మకే – సమర్పితం''.

**మ. నవమాసమ్ములు నన్ను మోసి, తన ప్రాణ స్పందనమ్మిచ్చి, యీ**
**నవరంధ్రమ్ముల కాయమున్ కనుచు నానందాబ్ధిలోముఞ్గి, నా**
**లవరూపమ్మును పెంచగా తన తనూ లావణ్యమర్పించి, న**
**న్నవనిన్ నిల్పిన మాతృమూర్తి యగు శేషమ్మన్ గొల్తునెల్లప్పుడున్.**

**- వివరణ కర్త**

# ప్రార్థన

**జగన్మాత**

శ్లో. శర్వాణి శారదారాధ్యే
శరచ్చంద్ర నిభాననే !
శరణ్యే త్ర్యంబకేదేవి
శాతోదరి నమోఽస్తుతే.

**ప్రణవ బ్రహ్మము**

మ. 'కణ' రూప 'ప్రథమంబు' నవ్య 'నవ' సంఖ్యల్ తెల్పు 'బ్రహ్మా'దులున్
'అణు' 'కేంద్రాం' తర 'సూక్ష్మమున్'– 'సుఘన' దివ్యంబైన 'బ్రహ్మాండము'న్
'క్షణ – కల్పా' న్వితి 'బీజవృక్ష' విధవిజ్ఞానమ్ము నిక్షిప్తమౌ,
'ప్ర–ణవ' బ్రహ్మమునుచ్చరింతు మొదటన్, ప్రజ్ఞావికాసమ్మునై.

**గణపతి**

కం. అక్షర గణపతి – వాక్స
ల్లక్షణ గుణ, సిద్ధి, బుద్ధి, లబ్ధికరుండున్,
అక్షరకుక్షి వినాయక,
నిక్షిప్తాధార చక్రనిలయుని గొల్తున్

**కులదైవము**

సీ. భౌతిక దేహ పార్వతికి నాత్మేశుకున్
సారమై పుట్టు కుమారుడెవరు ?
శుక్రధాతువు యొక్క సూక్ష్మ తేజమ్ముగా
నార్యుడెవరు సుషుమాగ్ని యందు ?
షట్చక్రకృత్తికా స్వచ్ఛసారసుధల
నందుచు పెరుగు షడాస్యుడెవరు ?
ఆధార చక్ర పదార్థతత్త్వమ్మును
సత్త్వమ్ముగా మార్చు శక్తుడెవరు ?

గీ. సర్పవాలమునుండి శీర్షమ్ముదాక
వ్యష్టికుండలినీవల్లి కధిప తెవరు ?
అట్టి స్కందుండు కులదైవమగును మాకు
ముందు ప్రార్థింతు వానినే ముక్తి కొఱకు

**గాయత్రి**

శా. ఆయుర్దాయ గుణాభివృద్ధికిని, ధన్యత్వమ్ము చేకూరగా
సాయంత్రోదయ మధ్యకాలములలో సంధ్యా జపమ్మందునన్.
ధ్యేయమ్మందున ప్రజ్ఞ గూర్చి, పెడబుద్ధిన్ తీరుగా దిద్దు, శ్రీ
గాయత్రీ పరదేవతన్ కొలిచెదన్ కైవల్య సంసిద్ధికై.

**తల్లి**

మ. నవమాసమ్ములు నన్ను మోసి, తన ప్రాణస్పందనమ్మిచ్చి, యీ
నవరంధ్రమ్ముల కాయమున్ కనుచు నానందాబ్ధిలో మున్గి, నా
లవరూపమ్మును పెంచగా తన తనూలావణ్యమర్పించి, న
న్నవనిన్ నిల్పిన మాతృమూర్తియగు – శేషమ్మన్ గొల్తు నెల్లప్పుడున్.

**తండ్రి**

మ. సిరులన్ గోరక, ధర్మ మార్గముననే జీవించి, సంతానమే
స్థిరమౌసంపద యంచునెంచి, తన యాస్తిన్ శక్తి నర్పించి, సు
స్థిర విద్యాసుగుణమ్ములున్ కలుగురీతిన్ పెంచి, పోషించి, ఈ
శ్వరునిన్ జేరిన తండ్రియైన – హనుమచ్ఛాస్త్రిన్ గొల్తు నెల్లప్పుడున్.

**గురువు**

మ. స్థిరచిత్తుండును, బుద్ధిశాలి, ఘనసౌశీల్య స్వభావుండు, సా
దర హాసద్యుతి మంతుడున్, సకల విద్యా సారచిద్రూపుడున్,
నరరూపాచ్యుత పుణ్యమూర్తి, భవచింతల్ దీర్చు సౌజన్య సుం
దరుడౌ, శ్రీగురు వెక్కిరాలకుల కృష్ణస్వామినే గొల్చెదన్.

**పరమ గురువు**

మ. భవరోగార్త జనాళిబాధలు హరింపన్ జేసి రక్షించగా,
నవమంత్రమ్ములు సృష్టి జేసి తన జ్ఞానమ్మున్ ప్రసాదించగా,
అవనిన్ తిండికి లోటు లేనటుల నెల్లన్ శిష్యులన్ సాకగా -
శివధాత్రచ్యుతతత్త్వమూర్తి యగు శ్రీ సీవివినే గొల్చెదన్.

**బ్రహ్మ**

మ. అన్నియు లీనమై, ప్రళయమందుననున్న విశాల విశ్వమున్
తిన్నగ పూర్వ రూపముగ తీరుగ తెచ్చెడి సృష్టిలోన, తా
నెన్నడు సృష్టికర్తనను నించుక భావము పొందకుండగా,
''తన్ను'' నన్ను గ్రహింపుమని - తండ్రిని కోరిన బ్రహ్మఁగొల్చెదన్.

**విష్ణువు**

శా. ఆరాధింతును చిత్తశుద్ధిగ ఘనశ్యామ ప్రభాదేహునిన్,
క్షీరాబ్ధిస్థిత శేషతల్పశయనున్, శ్రీ సేవితాంఘ్రిద్వయున్,
స్మేరాస్యద్యుతిమత్క పోలయుగళున్, శ్రీ భూపతిన్, స్వర్ణకే
యూరాలంకృత బాహునిన్, ప్రబలర మ్యోరో లసత్ కౌస్తుభున్.

**మహేశ్వరుడు**

మ. శశిరేఖామర వాహినీకలిత శీర్ష స్థానసంశోభితున్,
శశిసూర్యానలనేత్రునిన్, విమల భస్మ శ్రీ సుసంపన్నునిన్,
విశదప్రాభవ నీలకంఠపరితోవేల్లత్ సమీరాంధసున్,
దశకంఠార్చిత దివ్యమూర్తి, శివునిన్ - ధ్యానించి పూజించెదన్.

**సరస్వతీ దేవి**

గీ. పలుకు ''సంకల్ప'' మై ''పరా'' వాక్కుగాను,
చలిత ''భావము'' - వాక్కు 'పశ్యంతి'' గాను,
ప్రథమ ''సంకేత'' ''మధ్యమా'' వాక్కుగాను
వ్యక్తభా ''షోచ్చరణము'' గ ''వైఖ'' రగుచు,
నాల్కపైనాడు ''వాణికి'' నతులు శతము.

**లక్ష్మీదేవి**

కం. పద్మముఖి, పద్మగంధిని,
పద్మాక్షీ, పద్మధాత్రి, పద్మవికాసిన్,
పద్మిని, పద్మనివాసిని
పద్మప్రియ, పద్మనాభపత్నినిఁ గొలుతున్.

**పార్వతీదేవి**

కం. ''ఉ'' – అనిన నాపకుండగ,
''మా'' యనినను గూడ తపము మానక చేయన్,
ధ్యేయార్ధ దేహమందిన –
''మాయమ్మ'' ''నుమను'' గొలుతును, మానసమందున్

**శ్రీరాముడు**

మః నతులన్ జేయుచు మ్రొక్కెదన్ – శుభకరజ్ఞాన ప్రకాశాన్వయున్,
పితృవాక్పాలన ధీరునిన్, సదయగంభీరాస్య సంశోభితున్,
స్మితభాషిత్వ సువర్తనున్, క్షితి సుతారత్నైక పత్నీ వ్రతున్,
మిత భాషిత్వ ఋతవ్రతున్, సుగుణసమ్మిశ్రైక – శ్రీరామునిన్.
(సీతాపతిన్)

**శ్రీకృష్ణుడు**

గీ. బహుళ భార్యలు గల్గిన బ్రహ్మచారి,
భోగభాగ్యమ్ములందిన యోగవిభుడు,
బుల్లినోటను విశ్వమ్ము చెల్లువాడు,
నెమలి ఈకతో భ్రమపెట్టు నేర్పుగలిగి
గుల్లపుల్లతో గుండెలన్ కొల్లగొట్టు –
నల్లనయ్యకు నర్పింతు నతులు శతము.

**జగత్పిత**

కం. శుక, పశు, ఝుర, నిర్జర, నర,
పిక, గిరి, తరు, నిధులతోడ విరియును జగమున్,
శకలములుగ కనబడు నీ
సకలము నొక దేహమైన స్వామినిఁ గొల్తున్.

**- వివరణ కర్త**

# పీఠిక

సృష్టి స్థితిలయములకు – బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అధిపతులుగా వ్యాసునిచే పురాణములలో సంకేతించబడిరి. వీరి మహిమలే ప్రకృతి యందు త్రిగుణములుగా ప్రతిబింబించుచున్నవి. బ్రహ్మ – రజోగుణమునకు, సృష్టికి; విష్ణువు – సత్వగుణమునకు, స్థితికి; మహేశ్వరుడు – తమోగుణమునకు, లయమునకు అధిపతులుగా సమన్వయింపబడిరి. బ్రహ్మ మహిమను ప్రతిబింబించు ప్రకృతిని 'సరస్వతి' అని, విష్ణు మహిమను ప్రతిబింబించు ప్రకృతిని 'లక్ష్మి' అని, మహేశ్వరుని మహిమను ప్రతిబింబించు ప్రకృతిని 'గౌరి', లేదా 'పార్వతి' అని, ఇవి ప్రతి బింబించని ప్రకృతిని – 'పరా ప్రకృతి' లేదా 'పరాశక్తి' లేదా 'మహాదేవి' లేదా 'ఆదిశక్తి' అని చెప్పబడినది. ఈమె ఎవరి కధీనముగా నుండునో ఆయనను విష్ణు పురాణములో – 'మహావిష్ణు'వని, శివపురాణములో – 'మహాదేవుడు' లేదా 'సదాశివు'డని లేదా 'పరమేశ్వరు'డని, భగవద్గీతలో – 'పురుషోత్తముడ'ని, భాగవతములో – 'నారాయణు'డని, వేదాంతములో – 'పరబ్రహ్మ'మని, వేదములో – 'పురుషు'డని చెప్పబడినది.

## వివిధ ఆరాధనా పద్ధతులు

పూర్వకాలము భారతదేశములో – 1) సూర్యారాధనము (సౌరము), 2) గణపతి ఆరాధనము (గాణాపత్యము), 3) శక్తి ఆరాధనము (శాక్తేయము), 4) విష్ణువు ఆరాధనము (వైష్ణవము), 5) శివ ఆరాధనము (శైవము) అని ప్రధానముగా ఐదురకములైన ఆరాధనా పద్ధతులుండెడివి. శాక్తేయ విషయముల ప్రసక్తి ప్రస్తుత సౌందర్యలహరీ స్తోత్రములో కొంత ఉండును.

## శాక్తేయము

ఈ ఆరాధనా విధానములో పరాశక్తిని ప్రపంచమునకు మూలకారణముగా చెప్పుదురు. శక్తిని కలిగిన వానిని – 'శక్తుడు' అందురు. ఈ 'శక్తి' – 'శక్తులను'

'ప్రకృతీ - పురుషులు' గాను 'శక్తి - శివులు' గాను చెప్పుదురు. త్రిమూర్తుల ప్రకృతులకు ఈ పరాశక్తి అతీతముగా నేపథ్యములో నుండునది కాబట్టి, ఈ పరాప్రకృతి చెప్పు చేతలలోనే త్రిమూర్తులు, వారి వారి ప్రకృతులు గూడా వుందురు. ఈ పరాశక్తిని వివిధ ప్రదేశములలో - వివిధ నామములతో ఆరాధించుదురు. హిమాలయములలో 'ఉమ' గాను, కాశ్మీరములో - 'అంబ' గాను, వారణాశిలో - విశాలాక్షిగాను, కలకత్తాలో 'కాళీమాత' గాను, కన్యాకుబ్జలో - 'గౌరి' గాను, మహారాష్ట్రలో - 'భవాని' గాను, మధురలో 'మీనాక్షి' గాను, జంబుకేశ్వరములో - 'అఖిలాండేశ్వరి' గాను, కంచిలో - 'కామాక్షి' గాను లేదా 'మహా త్రిపుర సుందరి' గాను, శృంగేరిలో - 'శారద' గాను, మైసూరులో - 'చాముండేశ్వరి' గాను, కేరళలో 'భగవతి' గాను, ఆంధ్రదేశములో భ్రమరాంబ, కనకదుర్గ, రాజరాజేశ్వరి, శ్రీలలిత మొదలైన పేర్లతో ఆరాధించబడును. ఇంకను 'అంకాలమ్మ' 'గంగానమ్మ', 'పోలేరమ్మ, 'భద్రకాళి' మొదలైన పేర్లతో వివిధ గ్రామములలో గ్రామదేవతలు గాను, దసరా నవరాత్రములలో మహాలక్ష్మి, మహాకాళీ, మహాసరస్వతి గాను గూడా ఆరాధింప బడును.

### స్థూల, సూక్ష్మ, కారణ రూపములు

సాధారణముగా చేతులతో చేయు పూజ (కాయికపూజ) లో ఆరాధనా దేవత స్థూల రూపమును, వాక్కులతో చేయు పూజ (వాచిక పూజ) లో ఆరాధనా దేవత సూక్ష్మ రూపమును, ధ్యానముతో చేయు పూజ (మానసిక పూజ) లో ఆరాధనా దేవత కారణ శరీరమును ఆరాధించుదురు. శ్రీవిద్య అనెడి త్రిభుజమునకు 'మంత్రము', 'యంత్రము', 'తంత్రము' అను అంశములు మూడు శీర్షముల వలె వుండును. తంత్రమును - స్థూలమునకు, యంత్రమును - సూక్ష్మమునకు, మంత్రమును - కారణమునకు సమన్వయించు కొనవచ్చును.

## తంత్ర, యంత్ర, మంత్రములు

ఒక వైదిక కర్మకు సంబంధించిన ప్రక్రియకు గాని, ఒక విద్యకు సంబంధించిన వివరములను గాని – విధి విధాన సూత్రములతో సంకలనము చేసి వ్రాసినచో దానిని 'తంత్రము' అందురు. శ్రీవిద్యకు సంబంధించిన – కులార్ణవ, జ్ఞానార్ణవ, నిత్యోత్సవ, వామకేశ్వరాది తంత్రములు ఇట్టివే !

బిందు విస్తరణ ద్వారా జరుగు జగద్వ్యూహమును – కోణ, త్రికోణ, దళ, వృత్త రేఖా రూపములతో సంకేతించుదురు. తంత్రము యొక్క అట్టి రేఖా చిత్ర వ్యూహమును 'యంత్రము' అందురు. ఇది కట్టబోవు ఒక గృహమునకు సంబంధించిన 'ప్లాను బ్లూ ప్రింటు' (Blue Point) వంటిది. పిండాండ, బ్రహ్మాండ సమన్వయముతో జగద్వ్యూహమును కలిగిన ఇట్టి యంత్రరాజమునే శ్రీవిద్యలో 'శ్రీచక్రము' అందురు. సకల సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారికి, ఈ శ్రీచక్రమునకు చక్కని సమన్వయము వుండుట వలన శ్రీచక్రమును అమ్మవారి గానే భావించి, అర్చనముగావింతురు.

దేవతను ధ్యానించుటకు, జపించుటకు అవసరమైన సంకేత బీజాక్షర సముదాయమును, ఆ దేవతకు సంబంధించిన – 'మంత్రము' అందురు. ఈ మంత్రమును మననము చేసినప్పుడు మననము చేయువానిని ఆ మంత్రదేవత రక్షించును. మననము చేయబడు మంత్రదేవత సాన్నిధ్యమును చేకూర్చును.

## పంచదశీ, షోడశీ మంత్రములు

శ్రీవిద్యలో అమ్మవారికి సంబంధించిన మంత్రము కలదు. ఈ మంత్రము లక్ష్మీధర పండితుల ప్రకారము 'క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం, స క ల హ్రీం' అని మూడు కూటములతో పదునైదు బీజాక్షరములతో నుండును. అందులకే దీనిని 'పంచదశాక్షరీ మంత్రము', లేక 'పంచదశి' అందురు. దీనికి చివర అమ్మవారి

'సాదాఖ్యకళ'కు సంబంధించిన బీజాక్షరమైన 'శ్రీం' ను కూడా చేర్చినచో ఈ మంత్రము 'షోడశి' అగునని లక్ష్మీధరుల అభిప్రాయము. ఈ పదునాఱు అక్షరములు చంద్రుని పదునాఱు కళలను, పదునాఱు నిత్యాదేవతలను సూచించునని వీరి వ్యాఖ్య చెప్పును. పంచదాశాక్షరిలోని మొదటి కూటమును 'హ స క ల హ్రీం' గా మార్చి చెప్పినచో ఏర్పడు 'హ స క ల హ్రీం', 'హ స క హ ల హ్రీం', 'స క ల హ్రీం' మంత్రమును లోపాముద్రాదేవి ఉపాసించి, అర్చించిన అమ్మవారి పంచదశాక్షరీ మంత్రము అని పండితుల అభిప్రాయము. 'క' తో ప్రారంభమగుటచే మొదట చెప్పిన మంత్రమును 'కాదివిద్య' గాను, 'హ' తో ప్రారంభమగు రెండవ మంత్రము 'హాది విద్య' గాను చెప్పుదురు.

**ఆనందలహరి, సౌందర్య లహరి**

ఈ సౌందర్యలహరిలో మొత్తము వంద శ్లోకములుండును. ఈ వంద శ్లోకములలో మొదటి 41 శ్లోకములు ఒక భాగముగను, మిగిలిన 59 శ్లోకములను రెండవ భాగము గాను చెప్పుదురు. మొదటి భాగమును 'ఆనందలహరి' అనియు, రెండవ భాగమును 'సౌందర్యలహరి' అనియు చెప్పుట పరిపాటి. ఈ విధముగా రెండు భాగములుగా నుండుటకు, రెండు పేర్లతో వుండుటకు కూడ కారణము కలదు.

ఈశ్వరుని సన్నిధిని గల మంత్రశాస్త్రమును గొని వచ్చుటకు శ్రీ శంకర భవత్పాదులు కైలాసమునకు వెళ్ళిరి. ఆ మంత్రశాస్త్రమును గ్రహించి వచ్చుచుండగా మధ్యలో నందికేశ్వరుడు అడ్డుకొని లాగి కొనుటలో కొంతభాగము మాత్రమే శంకరులకు దక్కినది. ఆ విధముగా దక్కిన భాగములో 41 శ్లోకములు మాత్రమే వున్నవి. మిగిలిన 59 శ్లోకములను శంకరులు స్వయముగా రచించి 100 శ్లోకముల స్తోత్రమును పూర్తి చేసెను. (ఈ వృత్తాంతము జగద్గురు బోధలు 2వ భాగములోని 147 పేజీలో కలదు).

మొదటి భాగము నందలి 41 శ్లోకములలో కుండలినీ యోగమునకు సంబంధించిన షట్చక్ర, తంత్ర, యంత్ర, మంత్ర శాస్త్ర రహస్యములు ఎక్కువగా నుండును. దీనిని 'ఆనందలహరి' అని అందురు. 8వ శ్లోకము నందు వచ్చు 'చిదానందలహరీం', 21వ శ్లోకమునందు వచ్చు - 'పరమానందలహరీం' 34వ శ్లోకము నందు వచ్చు 'పరానంద పరయోః'' 35వ శ్లోకమునందు వచ్చు 'చిదానందాకారం' మొదలగు పదముల ప్రయోగము ఈ భాగమునకు 'ఆనందలహరి' అను పేరును ధ్రువీకరించును.

రెండవ భాగము నందు అమ్మవారి కిరీటాది పాదపర్యంతము వర్ణన ఉండును. అమ్మవారి సౌందర్య వర్ణన అను నెపముతో కొన్ని శ్రీ విద్యారహస్యములు, సాముద్రిక శాస్త్ర రహస్యములు కూడా వుండును. అందువలన ఈ రెండవ భాగమును 'సౌందర్యలహరి' అందురు. అయినను ఈ రెండు భాగములను కలిపి 'సౌందర్యలహరి' అనుటయే జరుగుచున్నది. డాక్టరు అనంతకృష్ణశాస్త్రి, శివానందస్వామి 'ఆర్థర్ అవలాన్' (Aurthor Avalon) అను కలము పేరు గల సర్‌జాన్ ఉడ్రాఫ్ అను ఆంగ్లేయుడు మొదలగు వారు ఆనందలహరికి మాత్రమే వ్యాఖ్య వ్రాసిరి గాని, సౌందర్యలహరికి వ్రాయలేదు. సౌందర్యలహరికి 36 వ్యాఖ్యానములున్నవి. వాటిలో 1) సుధావిద్యోతిని 2) డిండిమ వ్యాఖ్య 3) కామదేవ సూరిటీక 4) సహజానందీయవ్యాఖ్య 5) సౌభాగ్యవర్ధిని 6) లక్ష్మీధర వ్యాఖ్య - అను ఆరును ముఖ్యమైనవిగా చెప్పుకొనవచ్చును. వీటిలో సౌభాగ్యవర్ధినీ వ్యాఖ్యను శ్రీ కైవల్యాశ్రమి పండితులు రచించిరి.

ఈ 'సౌందర్యలహరి' స్తోత్రము నందలి శ్లోకములన్నియు చక్కని శిఖరిణీ వృత్తములలో నుండును. ప్రతి శ్లోకము నందలి పదముల అమరిక. ఆ పదములను ఉచ్చరించునపుడు జనించు ధ్వనితరంగములు - ఉచ్చరించిన వ్యక్తిని, పరిసరములను కూడా ప్రభావితము చేసి, ఒక విధమైన పవిత్రతను చేకూర్చును. కౌల, సమయాచార

పద్ధతులలో భిన్నాభిప్రాయములు గల తంత్రమునకు సంబంధించిన సాంకేతిక విషయముల కన్న – ఆత్మజ్ఞాన సంబంధమైన విషయములకు, కుండలినీ యోగ విషయములకు ప్రస్తుత వివరణలో ప్రాధాన్యమీయబడినది. దీనిని దృష్టిలో పెట్టుకొని ఇక ముందు రాబోవు వివరణమును చదివి ఆనందించవలసినదిగా కోరుచున్నాను.

ఇట్లు

**వివరణకర్త**

శ్రీరస్తు
శ్రీగణేశాయ నమః
శ్రీమత్త్రిపుర సుందర్యై నమః

# సౌందర్యలహరి

## సంస్కృత శ్లోకము

శ్లో. శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్
న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి
అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి.

## అనువాద పద్యము

శా. *నిన్నున్ శక్తిగ గూడినన్ - శివుడు నిండెన్ శక్తుడై ఈశ్వరీ !*
*నిన్నున్ పొందక యున్నచో - కదలలేనేలేడు తానెన్నడే*
*నన్నన్ నిక్కము ! బ్రహ్మవిష్ణు భవదేవాధీశులే గొల్వగా*
*నున్నానిన్ను భజింపగా - నకృతపుణ్యుండెట్లు నర్హుండగున్.*

## టీక

(తల్లీ, జగజ్జననీ !) శివః = శివుడు; శక్త్యా = శక్తితో, యుక్తః = కూడి యున్నపుడు; ప్రభవితుం = సృష్టించుటకు; శక్తః = సమర్థుడు; ఏవం = ఈ విధముగా; నచేత్ = కాదేని (అనగా శక్తితో కూడి ఉండనిచో), దేవః = ఆ శివుడు; స్పందితుం అపి = చలించుటకు కూడా; నకుశలః = నేర్పరికాడు, అతః = ఈ కారణము వలన, హరిహరవిరించాది భిరపి = విష్ణువు, శివుడు, బ్రహ్మ మొదలగు వారి చేత గూడా; ఆరాధ్యాం = పూజింపదగిన; త్వాం = నిన్ను గూర్చి, ప్రణంతుం = నమస్కరించుటకుగాని; స్తోతుంవా = స్తుతించుటకుగాని; అకృతపుణ్యః = పుణ్యము చేయనివాడు; కథం = ఏ విధముగా; ప్రభవతి = శక్తుడగును ?

## తాత్పర్యము

తల్లీ, భగవతీ ! శివుడంతటివాడు శక్తిస్వరూపిణివైన నీతో కూడి యున్నపుడు సమస్త సృష్టిని చేయుటకు సమర్థుడగుచున్నాడు. ఆ విధముగా నీతో కూడి యుండనిచో - అంతటి శివుడైనను చలించుటకు గూడ శక్తుడు కాదు. హరిహర బ్రహ్మాదుల చేతగూడా ఆరాధింపబడు నిన్ను గూర్చి నమస్కరించుటకు గాని, స్తుతించుటకు గాని పుణ్యము చేయనివాడు ఏ విధముగా సమర్థుడగును ? (సమర్థుడు కాదని భావము).

## వివరణము

**సృష్టిపరమైన అర్థము**

మాతా పూర్వ రూపమ్, పితోత్తర రూపమ్,
ప్రజాసంధిః, ప్రజననగ్ం సంధానమ్, ఇత్యధిప్రజమ్
(తైత్తిరీయోపనిషత్ - శిక్షావల్లి)

ప్రజా సంసర్గమునకు, అనగా - భౌతికమైన జగన్నిర్మాణమునకు తల్లి - పూర్వ రూపము, తండ్రి - ఉత్తర రూపము. ఈ ఇద్దరి కలయిక వల్లనే ప్రజా సంసర్గము సానుకూలమగును. ''శక్తి అయిన అమ్మవారు, లేదా తల్లి; శక్తుడు అయిన అయ్యవారు, లేదా తండ్రి - ఈ ఇద్దరి కలయిక వల్లనే జగన్నిర్మాణము జరుగుచున్నది. ఈ కలయిక లేనిచో జగన్నిర్మాణము జరుగదు'' - అను సృష్టిపరమైన ప్రధాన విషయము ఈ శ్లోకములో చెప్పబడినది. ('శివుడు - తండ్రి, శక్తి - తల్లి, జగత్తు - వారి దివ్యదాంపత్య ఫలము' అని గూడ అర్థము చేసుకొనవచ్చును.)

**మంత్ర శాస్త్ర పరమైన అర్థము**

జగత్పిత అయిన అయ్యవారిని సూచించు అక్షరము - 'అ' (అక్షరా ణామ్ 'అ' కారోఽస్మి - గీత) అట్లే - జగన్మాత అయిన అమ్మవారిని సూచించు అక్షరము 'ఇ'. అయ్యవారిని సూచించు 'శివ' పదము 'శ్ + ఇ + వ్ + అ' అను అక్షరముల కూర్పు వలన ఏర్పడుచున్నది. ఈ 'శివ' పదములో అమ్మవారిని సూచించు 'ఇ' కారము లేనిచో 'శివ' అను పదమునకు బదులు 'శవ' అను పదము ఏర్పడును.

''శవ'' మనగా నిర్జీవమైనది, కదలిక లేనిది కాబట్టి, శివుడు శక్తిని కూడి యుండక యున్నచో - చలించుటకు గూడా సమర్థుడు గాడని చెప్పబడినది.

**వ్యాకరణ శాస్త్రపరమైన అర్థము**

అయ్యవారైన శివుడు నిర్గుణుడు. అనగా - గుణము లేనివాడు. అయ్యవారిని సూచించు 'అ' కారమునకు, అమ్మవారిని సూచించు 'ఇ' కారము కలిసినపుడు 'అ + ఇ = ఏ' అను సంధి ఏర్పడును. అమ్మవారి - అనగా - 'ఇ' కారము కలయికతో, నిర్గుణుడైన అయ్యవారికి - అనగా 'అ' కారమునకు గుణమయమైన సృష్టి లక్షణము వచ్చును. కాబట్టి, ఈ - 'అ + ఇ = ఏ' - సంధిని సంస్కృతములో 'గుణసంధి' అని పేరు పెట్టిరేమో అను విషయము ఈ శ్లోకములో వ్యాకరణ శాస్త్రపరముగా సూచింపబడినది.

**శ్రీ చక్ర పరమైన అర్థము**

చతుర్భిశ్శివ చక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః,
శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీ చక్రం శివయోర్వపుః.

శ్రీచక్ర వివరణను పై శ్లోకము సూచించును. శ్రీ చక్ర వ్యూహము జగన్నిర్మాణ వ్యూహమును తెలియ జేయును. శ్రీ చక్రము నందు పైకి శీర్షములు గల త్రిభుజములు నాలుగు ఉండును. ఇవి శివ సంబంధమైనవి. క్రిందకి శర్షీములు గల త్రిభుజములు ఐదు ఉండును. ఇవి శక్తి సంబంధమైనవి. ఈ రెంటి కలయికతోనే 4 + 5 = 9 త్రికోణములు కలిగిన శ్రీ చక్రము - తొమ్మిది మూల ప్రకృతులు, లేదా నవ బ్రహ్మలను (ప్రజాపతులు) సూచించునని - శ్రీ చక్రపరమైన జగన్నిర్మాణ అర్థము గూడా ఈ శ్లోకము నందు చెప్పబడినది.

**శ్వాస ప్రక్రియపరమైన అర్థము**

శ్వాసించు ప్రతి వ్యక్తి - ఉచ్ఛ్వాసము చేయునపుడు - 'సో', అను అక్షరమును ఉచ్ఛరించునపుడు వచ్చు ధ్వని, నిశ్వాసము చేయునపుడు - 'హం' అను అక్షరమును ఉచ్ఛరించునపుడు పుట్టుధ్వని వినబడును. అందువలన ఉచ్ఛ్వాసమును 'సో' తోను, నిశ్వాసమును 'హం' తోను సమన్వయ పరచుదురు. ఉచ్ఛ్వాసము - బయట గాలిలోనికి లీనమగుటను, నిశ్వాసము - లోపలిగాలి బయటకు వ్యక్తమగుటను తెలియ జేయును. లీనమగునట్లు చేయు లక్షణము

పరమాత్మ అయిన అయ్యవారిది. వ్యక్తమగునట్లు చేయుట పరమేశ్వరి అయిన అమ్మవారిది. ఇందువలననే అయ్యవారి స్తోత్రమైన పురుష సూక్తము' సహస్ర శీర్షా పురుషః....' అని 'స' అను అక్షరముతో ప్రారంభించబడును. అమ్మవారి స్తోత్రమైన శ్రీ సూక్తము హిరణ్యవర్ణాం హరిణీం ....' అని 'హ' కారమునకు సంబంధించిన 'హి' అను అక్షరముతో ప్రారంభించబడును. ఈ 'స' 'హ' కారముల కలయికయే శ్వాసకు సహకారముగా పనిచేయును. ఈ శ్వాసను 'సో' అను ఒక రెక్క, 'హం' అను రెండవ రెక్క గలిగిన 'సోహం' అను పక్షితో గూడ పోల్చుదురు. ఇదియే 'హంస'. ''ఈ సోహం రెక్కలు కలిసి ఉన్నంత వరకు శ్వాస వుండి, బ్రతుకు వుండును. సోహంలు కలసి యుండక పోయినచో 'శ్వాస' ఆగి, జీవి దేహము శవప్రాయమై, చలనరహితమగును''. అని శ్వాసపరమైన అర్థము గూడా ఈ శ్లోకమునందు చెప్పబడినది. 'ఈ శివ శక్తుల కలయికయే ప్రాణమయ సృష్టికి మూలకారణము' అని భావము.

**వ్యక్తమంతయు అమ్మవారు అను అర్థము**

హరిహర విరించాదులు అనగా విష్ణువు, శివుడు, బ్రహ్మ మొదలైన ముఖ్యమైన వారందరు అమ్మవారినే ఆరాధించి, ఆమె శక్తిపైనే ఆధారపడి, వారివారికి కేటాయించ బడిన పనులను నిర్వర్తించుకొనుచున్నారు. అనగా వారి అవతరణ - 'శక్తి' అనుగ్రహముపై ఆధారపడి వున్నదని అర్థము. అమ్మవారికి సంబంధించిన అక్షరము 'హ' కారము అని పూర్వము చెప్పబడినది. లోపల లీనమై వున్నది రగుల్కొని బయటకు వెడలుటను వ్యక్త సృష్టి అందురు. లీనమై వున్న అమ్మవారిని సూచించు 'హ' కారమునకు రగిలెడు అగ్నిని సూచించు 'ర' కారముతోడై, 'శక్తి' ని సూచించు 'ఈం' కార సహకారముతో కలిసి 'హ్రీం' గా వ్యక్తమగును. అందులకే వ్యక్త శక్తిని సూచించు బీజాక్షరమును 'హ్రీం' అందురు. నిశ్వాసాత్మక సృష్టికి గాని, వాఙ్మయ సృష్టికి గాని ఈ 'హ్రీం' అనునది ఆధార భూతమైన శక్తిని సూచించు బీజాక్షరమగును. 'హరి', 'హర' మొదలైన పదములన్నియు ఈ 'హ్రీం' కార సహకారముతోనే వ్యక్తమగును. అనగా, బయటకు ఉచ్చరించబడును. అనగా, హరి హర విరించాదులందఱు - శక్తి స్వరూపిణి అయిన జగజ్జననిని ఆరాధించి, ఆమె అనుగ్రహముపై ఆధారపడి వ్యక్తమగుచున్నారని ఈ శ్లోకములో చెప్పబడినది.

**అమ్మవారి ద్వారా అయ్యవారి అనుగ్రహము**

అవ్యక్తమునకు, నిర్గుణమునకు.- అయ్యవారు ప్రతీక అనియు, వ్యక్తమునకు, గుణమునకు – అమ్మవారు ప్రతీక అనియు పూర్వము చెప్పబడినది. గుణమునకు అర్చనాదులుండును గాని, అవ్యక్తమునకు, నిర్గుణమునకు వుండవు గదా! ఒక భక్తుడు శివుని కొఱకై తపస్సు చేసి శివుని మెప్పించినపుడు, ఆ శివుడు భక్తుని భక్తికి మెచ్చి – ''భక్తా ! నీ భక్తికి మెచ్చితిని, వరము గైకొనుము'' అని తన చేతిని పైకి ఎత్తి నోటితో పలుకవలెనన్నచో ఆ చేయి, ఆ చేతిని పైకి ఎత్తుట, నోటితో పలుకుట, ఇవి అన్నియు భౌతికముగా వ్యక్తమైన స్థితిలోనున్నవారికే గాని అవ్యక్తులకు కుదరదు. అందుచే – ఇవి అన్నియు శివుని వ్యక్తస్వరూపమైన అమ్మవారికే చెల్లును. అందుకే అర్చనాదులన్నియు గూడ అమ్మవారికే ! కాబట్టి, 'హరి, హర, విరించాదులెవరైనను అర్చించవలసినచో అమ్మవారినే' – అనుభావములో ఈ శ్లోకము చెప్పబడినది.

ఈ విధముగా శంకర భగవత్పాదులు సౌందర్యలహరి లోని ఈ ప్రథమ శ్లోకములో వివిధ శాస్త్ర రహస్యములను ఎన్నిటినో నిక్షిప్తము చేసి వ్రాసిరి. అర్థము చేసుకొనగలిగిన వారికి అర్థము చేసికొని నంత దక్కును.



## సంస్కృత శ్లోకము - 2

**శ్లో. తనీయాంసం పాంసుం తవచరణ పంకేరుహ భవం**
**విరించి స్సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్,**
**వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం**
**హరః సంక్షుద్యైనం భజతి భసితో ద్ధూలనవిధిమ్.**

## అనువాద పద్యము

ఉ. *నీ పద పంకజాణువును - నీరజసూతిగ్రహించి చక్కగా*
*నీ పదునాల్గు లోకముల సృష్టిని జేయును, శౌరి వానినే*
*యావు సహస్ర శీర్షముల నద్దుచు కష్టము తోడ, రుద్రుడా*
*నీ పదరేణువున్ మెదిపి, నించు విభూతిగ దేహమంతయున్.*

## టీక

(తల్లీ జగజ్జననీ) ! తవ = నీ యొక్క, చరణ పంకేరు హభవం = పాద పద్మము నందు అంటి వున్న, పాంసుం = ధూళిని, తనీయాంసం = లేశమాత్రమును, సంచిన్వన్ = సంపాదించుచు, విరించిః = బ్రహ్మ, లోకాన్ = చతుర్దశ భువనములను, అవికలం = ఏ మాత్రము దెబ్బతినకుండా, విరచయతి = సృష్టించుచున్నాడు, ఏవం = ఈ లేశ మాత్ర ధూళినే, శౌరిః = విష్ణువు, సహస్రేణ శిరసాం = (ఆది శేషువుగా) తన వెయ్యి తలలతో, కథమపి = అతికష్టముతో, వహతి = భరించుచున్నాడు, ఏవం = ఈ లేశ మాత్ర ధూళినే, హరః = హరుడు (శివుడు), సంక్షుద్య = చక్కగా మెదిపి, భసితోద్ధూలన విధిం = విభూతిని పైపూతగా పూసుకొనునట్లు, భజతి = సేవించుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ! భగవతీ! నీ పాదపద్మము అడుగున అంటి వున్న లేశ మాత్ర ధూళిని సంపాదించి దానితో బ్రహ్మ ఈ చతుర్దశ భువనములను ఎట్టి వైకల్యములేక సృజించుచున్నాడు. ఈ లేశ మాత్ర ధూళి కణమునే విష్ణుమూర్తి ఆదిశేషువుగా తన వెయ్యి తలలతో అతి కష్టముగా మోయుచున్నాడు. ఈ లేశ మాత్ర ధూళినే శివుడు చక్కగా మెదిపి తన శరీరమంతటిని విభూతి వలె పూసుకొనుచున్నాడు.

## వివరణము

(ఈ శ్లోకము 'త' అను అక్షరముతో ప్రారంభింపబడి సృష్టి, స్థితి, లయములు గల ఈ ప్రపంచమంతయు అమ్మవారి 'తనీయాంస పాంసువు' మీదనే ఆధారపడినట్లు చెప్పబడినది. 'తనీయాంసం' అను పదమును 'త-నీయ-అంసము' గా విడదీసినచో 'త' కు సంబంధించిన విశిష్ట అంశముగ చెప్పుకొనవలసిన' అను అర్థము వచ్చును. తెలుగులో 'త' అక్షరమునకు ఒక విశిష్టత కలదు. 'త' అను అక్షరములో 'ల,లి,త' అను మూడు అక్షరములు గలవు. ఎట్లనగా ల-లి-త కాబట్టి, తెలుగువారికి 'త' అనగా 'లలిత' అని అర్థము చెల్లును. కాబట్టి - అంతా లలితకు సంబంధించినదే (అనగా - లలితా దేవికి), లలితపై ఆధారపడినదే - ఈ ప్రపంచమంతయు' అని ఒక క్రొత్త అర్థమును చెప్పుకొనవచ్చును. ఇది తెలుగువారికి మాత్రమే పరిమితమైన వివరణ భాగము).

అమ్మవారి అనుగ్రహముపై ఆధారపడిన త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వారి వారికి నిర్దేశింపబడిన విధ్యుక్త ధర్మములనెట్లు నిర్వర్తించుకొన గల్గుచున్నారో ఈ రెండవ శ్లోకము నందు చెప్పబడినది.

**సృష్టిపరమైన అర్థము**

బ్రహ్మ సృష్టికారుడు. అనగా చతుర్దశ భువనములను సృష్టించవలసిన బాధ్యత ఉన్నవాడు. నగలు తయారు చేయుటకు కంసాలికి – బంగారము వెండి మొదలగు లోహములు; కుండలు చేయుటకు కుమ్మరికి – బంకమట్టి; గుడ్డలు కుట్టుటకు దర్జీవానికి – బట్ట ఏ విధముగా అవసరమో భువనములందలి గ్రహ తారకాదులను తయారు చేయుటకు బ్రహ్మకు పెట్టుబడిగా కొంత ముడిసరకు అవసరమగును. అమ్మవారి పాదపద్మములకు అంటి వుండు లేశ మాత్ర ధూళి కణమును ముడిసరుకుగా తీసుకొని బ్రహ్మ పెద్ద పెద్ద గ్రహ గోళములను, తారకాదులను వాటి మధ్య ఏ మాత్రము సంఘర్షణ, వైకల్యము లేకుండా అతి జాగ్రత్తగా సృష్టించుచున్నాడట ! ఇది నిజమే మరి ! అంగారక, బృహస్పతి, శుక్ర, భూమ్యాది గ్రహ గోళముల మధ్య సంఘర్షణయే కనుక వున్నచో మొత్తము ఈ సూర్య కుటుంబము తునాతునకలై వుండెడిది. గ్రహములన్నియు నిరంతర భ్రమణ, పరిభ్రమణ గమనములలో ఉన్నప్పటికిని, పరస్పర సంఘర్షణకు లోను కాకుండా వుండునట్లు చేయుట సృష్టికర్తయైన బ్రహ్మ కౌశలమే గదా ! జగజ్జననీ పాద పంకేరుహ పరాగ అనుగ్రహమే బ్రహ్మకు ఇంతటి పేరు ప్రతిష్ఠలను చేకూర్చినది.

**స్థితిపరముగా**

విష్ణువు స్థితికారుడు. జగన్మాత అనుగ్రహముతో బ్రహ్మ సృష్టించిన చతుర్దశ భువనములను జాగ్రత్తగా కాపాడి సాకవలసిన బాధ్యత విష్ణువుది. అందుచేతనే బ్రహ్మ సృష్టించిన గ్రహ గోళములను తన తలపై పెట్టుకొని, సంరక్షణా బాధ్యతను వహించుచున్నాడు. ఇది ఒక తలకు మించిన భారమగుటచే – తాను ఆది శేషువుగా వెయ్యి తలలు కలవాడై మోయుచున్నాడట ! అప్పుడు గూడా ' ఆ భారమును మోయలేక, మోయలేక బెణికినట్లు తలలను ప్రక్కలకు త్రిప్పుకొనుచున్నాడేమోనని' అనిపించునట్లు కష్టపడుచున్నాడట ! భూమిని ఆదిశేషువు మోయుచున్నప్పుడు ఈ

స్థితిని ఊహించవచ్చును. భూమి సూర్యుని చుట్టూ తిరుగునపుడు నిలువుగా వుండి తిరుగదు. ఒకసారి ఒక ప్రక్కకు, మరొకసారి మరొక ప్రక్కకు జరగుచు తిరుగు చుండును. అప్పుడే సూర్యుడు ఒకసారి కర్కాటరేఖ మీదకు, వేరొక సారి మకర రేఖ మీదకు వచ్చినట్లగుపడును. ఈవిధముగా జరుగుటకు గల కారణమును ఆదిశంకరులు – 'భూమిని మోయు ఆదిశేషువు ఆభారమును భరించలేక తలలను అటు ఇటూ త్రిప్పుకొనుచు తిప్పలు పడుచున్నాడ' నుట వేదార్థ ప్రతిపాదనా లక్షితమైన సమన్వయము. నిజమునకు భూమి ఆ విధముగా తిరుగుట వల్లనే గదా! భూమిపై ఋతు ధర్మములు వర్ధిల్లి, జీవజాలమునకు కావలసినవన్నియు సమకూరుచు, పోషింపబడుచున్నవి. జగన్మాత పాద పద్మ పరాగమే గదా విష్ణుమూర్తికి ఇంతటి పేరు ప్రతిష్ఠలను తెచ్చి పెట్టినది.

**లయపరముగా**

హరుడు లయకారుడు. అమ్మవారి అనుగ్రహము వలన బ్రహ్మ లోకము లను సృష్టించగా, విష్ణువు వాటిని ధరించి, భరించి, పోషించి సాకగా, హరుడు ప్రళయ కాలములో ఇవి అన్నియు తన యందు లయము చెందునట్లు చేయుచున్నాడు. హరుడు లయకారుడు గాని వినాశకారుడు కాదు. లయమనగా లీనమగుట. నిద్రించుచున్నప్పుడు మనకు సంబంధించిన విషయములైన ఊరు, పేరు, డిగ్రీలు, భార్యాబిడ్డల పేర్లు మొదలైనవన్నియు మనలోనికి లీనమై పోవును. మరల మెలకువ వచ్చినపుడు అవి అన్నియు ఒక్కొక్కటి గుర్తుకు వచ్చును. కాబట్టి, ఆ విషయము లన్నియు నిద్రలో వినాశమవలేదు. నీటిలో పంచదార, ఉప్పు మొదలైనవి పూర్తిగా కరిగి వున్నపుడు పైకి లేనట్లు కనబడినను, వేడి చేసినపుడు మరల స్ఫటికీకరణము చెందినపుడు అవి అన్నియు వేరు వేరుగా బయటపడును. కాబట్టి, లయమగుట అనగా నాశము కాదు. అన్నియు ఒక చోట ఒదిగి తమ అస్తిత్వమును తాత్కాలికముగా కోల్పోయినట్లు ఉండుట. ప్రళయమనగా చక్కగా ఒదిగి వుండుట. ఈ ప్రక్రియకు అధిపతి హరుడు లేదా శివుడు. కావున, ఈ హరుడు లయకారుడు గాని వినాశ కారుడు గాదు. అందుచేతనే – హరుడు ప్రళయ కాల మందు అణువులతో నిర్మింపబడిన ఈ చతుర్దశ భువనములను విభూతి పండులోని

రేణువుల వలె చక్కగా ఒక చోటకు పండువలె చేర్చి, ఆ విభూతిని తన శరీరముపై పూతవలె పూసుకొనుచున్నాడని చెప్పుట గూడా వేదార్థ ప్రతిపాదనా లక్షితమైన సమన్వయమగును. అందుచేతనే, శివుడు యోగమూర్తి ( యోగమనగా కలయిక) శివుని కంతటి అవకాశమును కలుగ చేసినది జగజ్జనని పాదపద్మపరాగమే గదా !

పదార్థమయ ప్రపంచమునకు సంబంధించిన సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల విధులను, వారి కీలక లక్షణములను జాగ్రత్తగా పరిశీలించి నచో విజ్ఞాన శాస్త్ర సమన్వయము అవగతమగును.

**విజ్ఞాన శాస్త్రపరముగా**

అంతరిక్షములో నిక్షిప్తమై వున్న అణువులను పరమాణువులను బయటకు వెలువడునట్లు చేసి, వివిధ జీవ వస్తు జాలమును సృష్టించు ప్రక్రియను – 'విశ్లేషణ' (Analysis) అందురు. ఈవిశ్లేషణనే 'బృహ్మణము', లేదా 'విచ్చుకొనుట' అందురు. ఈ బృహ్మణశక్తి కలవాడు కాబట్టి – సృష్టి కర్తను 'బ్రహ్మ' అందురు. పదార్థ ప్రపంచములోని ప్రధాన మూలకణములలో (Fundamental Particles) ప్రోటాన్ (Proton) ఎటువంటిదో – బ్రహ్మ అటువంటి వానిగా సమన్వయ పరచుకొనవచ్చును.

ప్రపంచము నందలి అణువులను, పరమాణువులను తిరిగి ఒక చోట నిక్షిప్తము చేయు ప్రక్రియను 'సంశ్లేషణ' (Synthesis) అందురు. ఈ సంశ్లేషణనే 'లయత్వము' అందురు. లయత్వశక్తికలవాడు కాబట్టి – శివుని 'లయకారుడు' అందురు. పదార్థ ప్రపంచములోని ప్రధాన మూలకణములలో ఎలక్ట్రాన్ (Electron) ఎటువంటిదో శివుడు అటువంటి వానిగా సమన్వయ పరచుకొనవలెను.

అణువుల, పరమాణువుల 'సృష్టి – లయముల' మధ్యకాలము నందు అవి స్థిరముగా, ఆకార పరిమాణాదులను గలిగివున్నట్లుగా భాసింప జేయు ప్రక్రియను – 'స్థితికారకత్వము' (Equilibrium or Poise) అందురు. స్థితిని కల్పించువాడు కాబట్టి విష్ణువును – 'స్థితికారుడు' అందురు. పదార్థ ప్రపంచములోని ప్రధాన మూలకణములలో న్యూట్రాన్ (Neutron) ఎటువంటిదో విష్ణువు అటువంటి వానిగా సమన్వయ పరచుకొనవలెను. ఈసృష్టి, స్థితి లయాత్మక గుణములను వరుసగా రజోగుణము, సత్త్వగుణము, తమోగుణములుగా సమన్వయ పరచుకొనవచ్చును. ఇంతవరకు తెలిపిన విషయములు ఈ క్రింది పట్టికలో పొందు పరచబడినవి.

| ప్రక్రియ | అధిపతి | గుణము | గుణతత్త్వము | ప్రధాన మూలకణము |
|---|---|---|---|---|
| 1. సృష్టి (Creation Or Evolution) | బ్రహ్మ (Emerger) | రజోగుణము (Activity) | విశ్లేషణ (Analysis) | ప్రోటాన్ (Proton) |
| 2. స్థితి Equilibrium or Poise) | విష్ణువు (Sustainer) | సత్త్వగుణము (Harmony) | సమతాస్థితి (Balance) | న్యూట్రాన్ (Neutron) |
| 3. లయ (Involution) | శివుడు (Merger) | తమోగుణము (Inertia or Passive) | సంశ్లేషణ (Synthesis) | ఎలక్ట్రాన్ (Electron) |

**సారాంశము**

అతి కనిష్ఠస్థాయిలో (Small scale) పదార్థమయ ప్రపంచమునకు ప్రధాన మూలకణములైన - ప్రోటాన్, న్యూట్రాన్, ఎలక్ట్రాన్‌లు ఏ విధముగా ఉపకరణములో - అతి గరిష్ఠ స్థాయిలో - బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అదే విధముగా జగత్తును కొలుచు 'జగన్మాత' కు ఉపకరణములుగా ఉండి, ఆమె అనుగ్రహ, ఆదేశ బద్ధులని ఈ శ్లోక తాత్పర్యము.



## సంస్కృత శ్లోకము - 3

**శ్లో. అవిద్యానా మంతస్తిమిర మిహిరద్వీపనగరీ,**
**జడానాం చైతన్యస్తబక మకరంద స్రుతి ఝరీ,**
**దరిద్రాణాం చింతామణిగుణనికా, జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి.**

## అనువాద పద్యము

శా. అజ్ఞానార్తులలోని చీకటికి - సూర్య ద్వీప గేహమ్మవున్,
ప్రజ్ఞాహీనుల పట్ల - చేతన సుమప్రస్యందమౌతేనెవున్,
ప్రజ్ఞన్ కోరికలిచ్చు రత్నము - దరిద్రస్విన్న జీవాళికిన్,
ప్రజ్ఞోపేంద్ర వరాహ దంష్ట్రవు - భవాపస్సింధు మగ్నాళికిన్.

## టీక

(తల్లీ జగజ్జననీ ! నీ పద పద్మ పరాగము) అవిద్యానాం = అజ్ఞానులకు, అంతస్తిమిర = లోపల వున్న (అజ్ఞానమను) చీకటికి, మిహిర ద్వీపనగరీ = సూర్యుడు ఉదయించు ప్రదేశమునకు చెందిన పట్టణము, జడానాం = అలసులకు, మంద బుద్ధిగలవారికి, చైతన్యస్తబక = జ్ఞానమను పుష్ప గుచ్ఛమునుండి వెలువడు, మకరంద స్రుతి ఝురీ = నిరంతరచైతన్యధారగా వెలువడు తేనె ధారల ప్రవాహము, దరిద్రాణాం = దరిద్రుల పట్ల, చింతామణి గుణనికా = చింతామణుల వరుస (పేరు), జన్మజలధౌ = సంసార సముద్రము నందు, నిమగ్నానాం = మునిగి సతమతమగు వారి పట్ల, మురరిపు వరాహస్య = విష్ణుమూర్తి ఎత్తిన ఆది వరాహ అవతార మూర్తి యొక్క, దంష్ట్రా భవతి = కోరవంటిది అగుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ పాద పద్మ పరాగము - అజ్ఞానుల పట్ల - సూర్యుడుదయించు పట్టణము వంటిది. మంద బుద్ధి గల జడుల పట్ల – జ్ఞానమను తేనెను జాలువార్చు ప్రవాహము వంటిది. దరిద్రుల పట్ల – చింతామణుల వరుస వంటిది. సంసార సాగరమున మునిగి సతమతమగు వారికి విష్ణుమూర్తి అవతారమైన ఆది వరాహవు కోరవంటిది. (వరాహమూర్తి ఈ కోరతోనే సముద్రమున దిగబడి వున్న భూమిని పైకి ఉద్ధరించి సంరంక్షించెను).

## వివరణము

జగజ్జనని పాద పద్మ వరాగ మహిమ ఎంతటిదో క్రిందటి రెండవ శ్లోకము నందు చెప్పబడినది. ఆ మహిమ ఇంకనూ ఎంతటిదో జగన్మాత ప్రతిభా పాటవములు, శక్తిసామర్థ్యములు, అనురాగానుగ్రహములు ఎంతటివో ఈ ప్రస్తుత శ్లోకమునందు చెప్పబడుచున్నవి.

'అవిద్యానాం' అనుపదమును 'విద్యలేనివారికి' అను అర్థములో ప్రయోగించరు. 'విద్యలేనివారు' అని చెప్పుటకు 'విద్యావిహీనులు' అని చెప్పుదురు. 'అవిద్య' అనుపదము సాధారణముగా 'అజ్ఞానము' అను అర్థములోనే ఉపయోగించుదురు. దట్టమైన చీకటి వంటిది అజ్ఞానము. చీకట్లు పటాపంచలై పోవలెనన్నచో వెలుగుల సూర్యుడు ఉదయించవలెను. అట్లే, అజ్ఞానమను చీకటిచే ఆవరింపబడిన వారి హృదయాంతర్గత అజ్ఞానాంధకారమును పటాపంచలు చేసి, ప్రజ్ఞాన ప్రకాశ వంతులను చేయుటకు అమ్మవారి పాదపద్మ పరాగము లేశమాత్రమైనను చాలునట! అట్టివారి అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయు అమ్మవారి పాద పద్మ పరాగ లేశము – సూర్యుడుదయించు ప్రదేశమునకు చెందిన పట్టణము వంటిదట ! భూమి నుండి చూచువారలకు ప్రతిదినము సూర్యోదయ సమయుము నందు దిక్చక్రము (Horizon) వద్ద – సముద్రములో నుండి (వాస్తవమునకు సముద్రములో నుండి కాదు. మనకట్లు కనబడును). పైకి సూర్యుడు వచ్చుచున్నట్లు కనబడును. కాబట్టి, సముద్రములో ఇమిడి వున్నట్లు కనబడు ఒక ప్రదేశము సూర్యుడు పుట్టు స్థలముగా తోచును. వెలుగుల ముద్దఅయిన సూర్యుని పుట్టింపగల ఆ ప్రదేశము ఇంకనూ ఎంత వెలుగులకు గని అయి వుండవలెనో ఊహించి సూర్యుని అట్టి మూల జన్మస్థానము సముద్రములో భాసించుటచే దానిని 'మిహిర ద్వీపనగరము' అని శంకర భగవత్పాదులు సమన్వయ పరచిరి. (ఈ శ్లోక ప్రథమ పాదములో – 'మిహిర ద్వీపనగరీ' అనుటకు బదులు 'మిహిరోద్దీపనగరీ' అని పాఠాంతరము గలదు. అప్పుడైనను ఇదే అర్థము సరిపోవును).

'జడు' లనగా – సోమరులు, అలసులు, మందబుద్ధులు, కార్యోన్ముఖులు కాలేనివారు, చురుకుతనము లేనివారు అని అర్థము.

ఇటువంటి వారి నిస్తబ్ధత్వమునకు స్వస్తి చెప్పి, చైతన్యవంతులుగా చేయుటకు అమ్మవారి పాద పద్మ పరాగము – పుష్పగుచ్ఛము నుండి నిరంతర చైతన్యధారగా వెలువడు తేనె ప్రవాహము వంటిదట ! అనగా అమ్మవారి అనుగ్రహమున్నచో జడులు గూడ చైతన్య వంతులై సకల కార్య నిర్వహణసమర్థులు, సర్వవిద్యా పారంగతులు, సర్వదా ఉత్సాహవంతులుగా కాగలరని భావము.

దరిద్రుల పట్ల జగజ్జనని పాద పద్మ పరాగలేశము చింతామణుల వరుసవంటిది యట ! ఈ వరుసలో ఎన్ని చింతామణులు వుండునో గూడా 'గుణనికా' పదములో సూచింపబడినది. అక్షరముల ద్వారా అంకెలను వ్యక్త పరచు ఒక చిత్రమైన పద్ధతిని వరరుచి చెప్పెను. అక్షరములు వాటిపైన అవి సూచించు అంకెలు ఈ క్రింద తెలుపబడినవి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| 1 | 2 | 3 | 4 | 5 | | | | | |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | | |

'గుణనికా' పదములో 'గు' –'గ' కారమునకు సంబంధించిన 3 అంకెను, 'ణ' – 'ణ' కారమునకు సంబంధించిన 5 అంకెను, 'ని' – 'న' కారమునకు సంబంధించిన 0 అంకెను, 'కా' – 'క' కారమునకు సంబంధించిన 1 అంకెను సూచించును. కాబట్టి – 'గుణనికా' అనుపదము 3501 సంఖ్యను తెలియజేయును. సంస్కృతమునందు అంకెలను ఎడమ వైపుగా చెప్పుదురు. (అంకానాం వామతోగతిః) (ఉదా: 1. అష్టాదశ అనగా 8 + 10 అయిననూ 10 + 8 = 18 అనియు, ఉదా: 2. చతుర్దశి అనగా 4 + 10 అయిననూ 10 + 4 = 14 అని చెప్పవలెనని అర్థము). కాబట్టి, గుణనికా పదము తెలియ జేయు 3501 సంఖ్యను ఎడమ వైపుగా చదివినచో– 1053 వచ్చును. అనగా చింతామణుల వరుసలో 1053 చింతామణులున్నవన్నమాట !

లలితా సహస్ర నామ స్తోత్రము నందలి అమ్మవారి నామములను 1053గా విడదీసి చెప్పు పద్ధతి గూడ గలదు. ఇట్టి వ్యాఖ్యానము 'గుణనికా' అను పేరుతో వుండును. శ్రీ కళ్యాణానంద భారతీ మాంతాచార్య మహాస్వామి వారు 'శ్రీకల' అను పేరుతో ఈ గుణనికా వ్యాఖ్య వ్రాసినారు. అనగా – అమ్మవారి ఒక్కొక్క

నామము ఒక్కొక్క చింతామణి వంటిదన్నమాట! కోర్కెలు దీర్చుటకు వాస్తవమునకు ఒక్క చింతామణి చాలును. అమ్మవారు 1053 చింతామణుల వంటిది అయినపుడు ఆమె ఎంతమందికైనను, ఎన్ని కోర్కెలనైనను, అవి ఎటువంటివైనను వాటిని తీర్చగల సామర్థ్య మహిమ గలది అని అర్థము.

'జన్మ' పదము 'సంసారము' ను సూచించును. జలధి అనగా సముద్రము. 'జన్మజలధి' అనగా 'సంసార సముద్రము' అని అర్థము. సంసారమును సాగరముతో పోల్చుట జగద్విదితమే! (సంసారం సాగరం దుఃఖం) సంసార జీవనములో - సుఖ దుఃఖములుండును, లాభ నష్టములుండును, శోకములుండును. ఇవి ముందుకు వెనుకకు, పైకి క్రిందకు చలించు ఆటుపోట్లు, అలలవంటివి. అందువలన సంసారమును సాగరముతో పోల్చుదురు. ఈ సంసార సాగరములో దిగబడినవారు అంత తేలికగా దాని నుండి బయటపడలేరు. ఇట్లు సంసార సముద్రములో దిగబడినవారి పట్ల అమ్మవారి పాదపద్మ పరాగలేశము - విష్ణుమూర్తి ఎత్తిన ఆదివరాహావతార మూర్తి యొక్క కోరవంటిదట! ప్రళయకాలములో భూమి సముద్రములో దిగబడి వుండగా - విష్ణుమూర్తి ఆదివరాహరూపుడై, తన కోరతో ఆ భూమిని సముద్రములో నుండి పెళ్ళగించి, మరల పైకి వచ్చునట్లుగా ఉద్ధరించెను. (అనగా - పునః సృష్టికి నాంది పలికెనని అర్థము). ఆది వరాహమూర్తి కోర - సముద్రమున దిగబడిన పృథివిని పైకి ఉద్ధరించగా, అమ్మవారి పాద పద్మ పరాగ లేశము - సంసార సముద్రమున దిగబడిన పార్థివ జీవులను పైకి ఉద్ధరించును. అనగా, తాపత్రయాది లంపటములకు అతీతులనుగా జీవులను అనుగ్రహించి, ఉద్ధరించునని భావము.

లలితా సహస్ర నామస్తోత్రములోని అమ్మవారి నామములనే ఆదిశంకరులు చక్కని శిఖరిణీ వృత్త శ్లోకములో ఈ 'సౌందర్యలహరి' యందు నిబద్ధము చేసిరి.

ఉదాహరణకు 'శివశ్శక్త్యాయుక్తో....' అను మొదటి శ్లోకము నందలి 'శివశ్శక్త్యాయుక్తో' పదములు - లలితా సహస్ర నామ స్తోత్రము నందలి 'శివశ్శక్త్యైక్యరూపిణీ' నామమును, 'ఆరాధ్యాం హరిహర విరించాదిభిరపి' అను పదములు - లలితా స్తోత్రము నందలి 'హరి బ్రహ్మేంద్ర సేవితా,' 'బ్రహ్మోపేంద్ర

మహేంద్రాది దేవ సంస్తుత వైభవా' అను నామములను, 'కథమ కృత పుణ్యః ప్రభవతి' అను పదములు లలితా స్తోత్రము నందలి 'పుణ్యలభ్యా' నామమును తప్పక స్ఫురింప జేయును.

అట్లే – రెండవ శ్లోకమైన 'తనీయాంసం పాంసుం...' శ్లోకము నందలి 'తనీయాంసుం పాంసుం తవచరణ పంకేరుహభవం' అను పదములు లలితా స్త్రోత్రము నందలి 'శ్రుతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా' నామమును, 'విరించిః సంచిన్వన్ విరచయతిలోకానవికలం' అను పదములు – లలితా స్తోత్రము నందలి 'సృష్టికర్త్రీ' 'బ్రహ్మరూపా!' నామములను, 'వహత్యేనంశౌరిః కథమపి సహస్రేణ శిరసా' అను పదములు లలితా స్తోత్రము నందలి 'గోప్త్రీ', 'గోవిందరూపిణీ' నామములను, 'హరః సంక్షుద్యైనం భజతి భసితో ద్ధూలన విధిమ్' అను పదములు లలితా స్తోత్రమందలి 'సంహారిణీ', 'రుద్రరూపా' అను నామములను స్ఫురింప జేయును.

ప్రస్తుత శ్లోకమైన 'అవిద్యానామంతస్తిమిర.....' అను మూడవ శ్లోకమునందలి 'తిమిర మిహిర ద్వీప నగరీ' అను పదములు లలితా స్తోత్రము నందలి 'ఉద్యద్భానుసహస్రాభా' అను నామమును, 'మకరంద స్రుతి ఝురీ' అను పదములు లలితా స్తోత్రమందలి 'సుధాస్రుతిః' అను నామమును 'చింతామణి గుణనికా' అనుపదములు లలితా స్తోత్రము నందలి 'చింతామణి గృహాంతస్థా' అను నామమును, 'జన్మజలధౌ నిమగ్నానాం....' అను పదములు లలితా స్తోత్రము నందలి 'సంసార పంక నిర్మగ్న సముద్ధరణ పండితా' అను నామమును స్ఫురింప జేయును. కావున, లలితా సహస్ర నామ స్తోత్రమునకు – సౌందర్యలహరికి గల అభేదమును పాఠకులు గ్రహింతురు గాక !

ప్రస్తుత శ్లోకమైన 'అవిద్యానా మంతస్తిమిర మిహిర ద్వీప నగరీ' అను శ్లోకమును భక్తి శ్రద్ధలతో ప్రతిదినము పూజా సమయములో పఠించి, అమ్మవారిని ధ్యానించినచో భక్తునికి అజ్ఞానము నశించును. జడత్వము రూపు మాయును, దారిద్ర్య బాధలేక సకల సౌభాగ్యములు వర్ధిల్లును, సంసార లంపటములు అంటక మోక్షస్థితి గూడ ప్రసాదింపబడును. ఇన్ని ప్రతిఫలములు గలదగుటచే ఈ శ్లోక పఠనము భక్తులకు అత్యంతాచరణీయము.



## సంస్కృత శ్లోకము - 4

శ్లో. త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణః
త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛా సమధికమ్
శరణ్యే లోకానాం తవహి చరణా వేవ నిపుణౌ

## అనువాద పద్యము

ఉ. *అందరు దేవతల్ కరములందు వరాభయముద్ర దాల్చి సాం*
*పొందగ - నీవు మాత్రము వరాభయముద్రలు వెల్లడింప నీ*
*వందులకేమొ, భీతి లయమందగ వాంఛల మించి కొల్లలై*
*చిందు వరమ్ములీగలవి శ్రీ జగదంబ! భవత్పదాబ్జముల్.*

## టీక

లోకానాం = అన్నిలోకముల వారికి, శరణ్యే = శరణము పొందుటకు అర్హత గలిగిన ఓ జగజ్జననీ! త్వత్ అన్యః = నీ కంటే ఇతరులైన, దైవతగణః = దేవతలందరూ, పాణిభ్యాం = (తమ) రెండు హస్తములచే, అభయవరదః = అభయ ముద్ర, వరదముద్రలను దాల్చుచున్నారు, త్వం = నీవు, ఏకా = ఒక్కదానివి (వారి వలెనే హస్తములచే) ప్రకటిత = తెలుపబడిన, వర = వరద ముద్రను, అభీతి = అభయ ముద్రను, నఏవ = ఏ మాత్రము, అభినయా = అభినయించని విధముగా, అనగా - తాల్చని విధముగా, అసి = వున్నావు, (కారణమేమనగా), భయాత్ = భయము వలన, త్రాతుం = రక్షించుటకు, వాంఛా సమధికం = కోరిన దాని కన్న ఎక్కువ, ఫలం + అపిచ = ఫలమపిచ = ఫలమును గూడా; దాతుం చ = ఇచ్చుటకును కూడ, తవ = నీ యొక్క చరణౌ ఏవ = పాదములే, నిపుణౌ హి = సమర్థములగుట చేసి గదా!

## తాత్పర్యము

సర్వలోకముల వారికిని దిక్కైన ఓ జగజ్జననీ! ఇంద్రాది ఇతర దేవతలందరును తమ రెండు హస్తములందు వరద, అభయ ముద్రలను దాల్చుచుండగా నీవు ఒక్కదానివి నీ హస్తములతో వాటిని అభినయించ కున్నావు. భయము

నుండి రక్షించుటకు, కోరిన వాటిని మించి వరములను ప్రసాదించుటకు – నీ రెండు పాదములే సమర్థములై ఉన్నవి గదా ! ( మరి ఇంక అట్టి అవసరము నీకేల యుండును అని భావము).

## వివరణము

అమ్మవారి పాదమహిమను గూర్చి ఇంకనూ ఈ శ్లోకమునందు చెప్పబడుచున్నది. ఇతర దేవతలకును అమ్మవారికిని కనబడు ప్రధానమైన భేదము వారి వారి హస్తములందు దాల్చిన ముద్రలను చూచినచో తెలియునట ! ఒక్క అమ్మవారు తప్ప ఇతర ఇంద్రాది దేవతలందఱును తమ హస్తములయందు వరద ముద్ర, అభయముద్రలను దాల్చుదురు. అమ్మవారు మాత్రము రెండు హస్తముల యందు ఏ విధమైన ముద్రను దాల్చదు. ఇట్లు జగన్మాత హస్తములందు ప్రత్యేకముగా ముద్రలను ధరింపకుండుటకు గల కారణమును శంకరుల వారు ఈ శ్లోకములో చెప్పుచున్నారు. ముందు ముద్రలను గూర్చి తెలుసుకొనుట యుక్తము గదా !

**ముద్ర**

అనురాగము, ఆవేశము, ఆగ్రహము, కరుణ మొదలైన భావములకు సంబంధించిన అనుభూతి మనలో కలిగినపుడు – అప్రయత్నముగా మన దేహ భాగములందు ఏర్పడు భంగిమను (Posture or gesture) 'ముద్ర' అనవచ్చును. ఉదా: 1) గౌరవనీయులైన వ్యక్తి ఎదురుగా తారసపడినపుడు అప్రయత్నముగా మన రెండు హస్తములు దగ్గఱకు జోడింపబడుటను 'నమస్కార ముద్ర' అందురు. ఉదా : 2) ఐకమత్యమును గాని, పట్టుదలను గాని సూచించుటకు ప్రసంగించు వ్యక్తి అప్రయత్నముగా చేతి ఐదువ్రేళ్ళను పిడికిలిగా బిగించుటను 'ఐకమత్యముద్ర' అందురు. ప్రస్తుత శ్లోకములో అభయముద్ర, వరదముద్రల గూర్చి చెప్పబడినది.

**అభయ ముద్ర**

భయము నుండి కాపాడుటను సూచించు ముద్రను 'అభయముద్ర' అందురు. ఎదురుగా నున్నవారు భయపడుచున్నట్లు కనబడినపుడు అప్రయత్నముగా కనురెప్పలు నెమ్మదిగా ఒక్కసారి మూసి తెరచి, తలను ఒక్కసారి క్రిందుగా వంకించి, వ్రేళ్లపైకి ఉండునట్లు ఒక హస్తమును (హస్తమనగా చెయ్యి కాదు – అరచెయ్యి (Palm) ఎత్తిపట్టుటను 'అభయముద్ర' అనియు, ఆ హస్తమును 'అభయహస్తము'

అనియు అందురు. అనగా, ఇది 'భయము వలన రక్షణ గలదు' అని సూచించు ముద్ర అన్నమాట !

**వరదముద్ర**

ఎదుటివారికి ఏదైనా ఇచ్చు ప్రయత్నములో వ్రేళ్ళ క్రిందకు ఉండునట్లు ఒక హస్తమును ఉంచుటను 'వరదముద్ర' అని అందురు. 'వరద' 'అభయ' ముద్రలు ఏఏ చేతులతో ధరించవలెను, అన్నదానికి కూడా పద్ధతి వున్నది. పోషించుటకు సంబంధించినది 'వరదముద్ర' కాగా, రక్షించుటకు సంబంధించినది 'అభయముద్ర' అగును. అనగా ఇవి రెండునూ వరుసగా 'పోషణ', 'రక్షణ' లను సూచించు జగన్మాతా పితరులకు సంబంధించిన వన్నమాట ! జగన్మాతా పితరులను సూచించు అర్ధనారీశ్వరునిలో ఎడమ భాగము అమ్మవారు ( ప్రకృతి), కుడి భాగము అయ్యావారు (పురుషుడు లేక పరమేశ్వరుడు) కాబట్టి 'పోషణ' కు సంబంధించిన వరదముద్రను వామ హస్తము తోనే సూచించవలెను, అట్లే రక్షణకు సంబంధించిన అభయముద్రను దక్షిణ హస్తముతోనే సూచించవలెను.

**జ్యోతిశ్శాస్త్ర సమన్వయము**

పైన చెప్పిన విషయమునకు జ్యోతి శ్శాస్త్రముతో గూడా సమన్వయము గలదు. జ్యోతిశ్శాస్త్రములో శుక్ర, కుజ గ్రహములు పూర్తిగా పరిపూరక (Complimentary) గ్రహములు. ఈ శాస్త్రరీత్యా శుక్రుడు (Venus) స్త్రీతత్త్వ గ్రహము (Female planet) , కుజుడు (Mars) పురుషతత్త్వ గ్రహము. ఈ రెండు గ్రహములను సూచించు అంతర్జాతీయ సంకేతములు వరుసగా ♀, ♂ . శుక్రుని సూచించు సంకేతములో – పైన వృత్తము (Circle) క్రింద క్రాసు (Cross) ఉన్నవి. వృత్తము – అరచేతి ఆకృతిని, క్రింద నున్న క్రాసు – వ్రేళ్లను సూచించును. అట్లే కుజుని సూచించు సంకేతములో పైన క్రాసు, క్రింద వృత్తము వున్నవి. పైన క్రాసు – పైకి సూచించు వ్రేళ్ళను, క్రింది వృత్తము – అరచేతి ఆకృతిని తెలియజేయును.

జన్యు శాస్త్రములో (Genetics) గూడా స్త్రీ, పురుష కణములను ♀, ♂ సంకేతముతోనే సూచించుదురు. ఇన్ని విధములైన వివరణలను తెలుపు ఈ గ్రహముల గుర్తులను కేవలము సంకేతములనుట కన్న యంత్రములు (Glyphs) అనుట యుక్తము.

సంఖ్యా శాస్త్ర ప్రకారము శుక్రుని అంకె '6', కుజుని అంకె '9'. ఈ రెండును ఒక దాని కొకటి పరిపూరకములని ఆ అంకెల ఆకృతులే తెల్పుచున్నవి గదా! రాశి చక్రములో గూడ శుక్ర గ్రహ స్వస్థానము లైన – వృషభ, తులారాశులు – కుజగ్రహ స్వస్థానములైన – వృశ్చిక, మేషరాశులకు వరుసగా ఎదురెదురుగా నుండు నన్న విషయము గూడా ఈ పరిపూరకత్వమును ధ్రువపరచును – (శుక్రుడు సంపదను, కుజుడు సత్త్వమును (Physical Strength) తెలియు జేయు గ్రహములు).

**ఇక ప్రస్తుత విషయము**

'ఇక్కడ అభయము ఇవ్వడును' 'ఇక్కడ వరములు ప్రసాదింపబడును' అని అందరికిని తెలియునట్లు, అందరిని రప్పించుకొనుటకు, కొట్టవచ్చినట్లు కనబడుటకు హస్తములందు ఈ రెండు ముద్రలను దాల్చవలసిన అవసరము ఇతర దేవతలకేమైన ఉన్నదేమోగాని జగన్మాతకు అట్టి అవసరము లేదు. 'శరణార్థులను భయము నుండి రక్షించుటకు గాని, కోరిన వాటిని ప్రసాదించుటకు గాని – అమ్మవారి రెండు పాదములే అతి సమర్థములై యుండగా మరల హస్తములతో ముద్రలను ధరించి ప్రకటించు కొనవలసిన అవసరమేమి ?' అని శంకరుల నిర్ధారణ. అందులకే అందరి దేవతలకు పూజ చేసిన వచ్చు ఫలితము ఒక్క అమ్మవారికి పాద పూజ చేసినచో దక్కునని, కావలసిన వన్నియు ఆమె చరణములే ప్రసాదించునని ఈ శ్లోక తాత్పర్యము.

ఇక్కడ ఈ 'అభయ', 'వరద' ముద్రలకు సంబంధించిన ఒక ముఖ్య విషయమును చెప్పుకొనవలసిన అవసరమున్నది. ''అమ్మవారిని ఆరాధించినచో అభయము నిచ్చును.'' అనగానే వెంటనే – 'చేయకూడని పనులను చేసి, అమ్మవారిని ఆరాధించి, ఇక మనకు అభయమును ఇచ్చు బాధ్యత అమ్మవారిది, మనకేమియు ఇబ్బంది లేదు' అని అనుకొనుట పొరపాటు. ఆ విధముగా అనుకొనినచో – అట్టి వారినందరిని అమ్మవారు వరుసగా రక్షించుచు, అటువంటి కూడని పనులను చేయుటకు వారిని ప్రోత్సహించునని అభయ ముద్రకు అర్థము చెప్పుకొనవలసి వచ్చును. ఇది తప్పుగదా! అందువలన 'భయము కలుగ కుండా రక్షించును' అని చెప్పినపుడు – 'భయము కలిగెడు పనులను మనలోని ఏ ప్రవృత్తి వలన మనము చేయుదుమో – ఆ ప్రవృత్తిని మనలో లేకుండా చేయునది' అని అర్థము

చెప్పుకొనవలెను. అనగా - చేయకూడని పని చేసినపుడు గదా మనలో భయము ఉత్పన్నమగునది. అటువంటి భయము కలుగుటకు దారితీయు పనులను మనము చేయకుండా ఉండునట్లు బాధ్యతపడి, అటువంటి మన మనః ప్రవృత్తిని మార్చి రక్షించునని - ''అభయము'' నకు సరియైన అర్థముగా చెప్పుకొనవలెను.

అట్లే 'అమ్మవారిని ఆరాధించిన వారికి - వారు కోరిన వన్నియు ప్రసాదించునది' అని 'వరద'కు అర్థము చెప్పుకొనరాదు. అదియే నిజమైనచో ప్రతివారును అమ్మవారిని అర్చించి, తాను ప్రధానమంత్రి కావలెనని, అమెరికా అధ్యక్షుడు కావలెనని కూడా కోరుటకు వెనుకాడరు. అప్పుడు అమ్మవారు ఇంటికొక ప్రధానమంత్రిని, వీధికొక అమెరికా అధ్యక్షుని చేయవలసి వచ్చును. ఇది జరుగుపని కాదు గదా! మన అర్హతను బట్టి ఎప్పుడు ఏమి మనకు అవసరమో (మనము కోరినవి కాదు) వాటిని ఏర్పాటు చేయునది అని 'వరద'కు అర్థము చెప్పుకొనవలెను. ఈ విషయమును సూచించుటకే లలితా సహస్రనామములలో చిట్టచివరకు ''వాంచితార్థ ప్రదాయినీ'' అను ఒక చిత్రమైన నామము గలదు. ''వాంఛితార్థ = కోరిన వాటిని; ప్రదాయినీ = ఇచ్చునది'' అని పైకి మనకు అనుకూలముగా అనిపించు అర్థము చెప్పుకొన్నను ''వాంఛిత = కోరిన వాటిలో, అర్థ = అర్థవంతమైన వాటిని (అనగా 'అర్థము పర్థము లేని గొంతెమ్మ కోరికలు కాని వాటిని' - అని అర్థము), ప్రదాయినీ = ఇచ్చునది'' అని అసలైన అర్థమును జాగ్రత్తగా గ్రహించవలెను. ఏ మాత్రము అర్హతలేనివాడు అమెరికా అధ్యక్షుడుగా కావలెనని కోరిననూ అవడు. అమ్మవారిని అర్థించినంత మాత్రమున వాడు అర్హతలేని వాడైనచో కనీసము ప్రధానమంత్రిగా కూడా కాడని తెలుసుకొనవలెను. అర్హత గలవాడైనచో అర్చించక పోయినను కాగలడు.

లలితా సహస్ర నామము లందలి 'భయాపహా', 'వరదా', 'నిరపాయా', ''వాంఛితార్థ ప్రదాయినీ'' మొదలైన నామములతో ఈ శ్లోక భావములను సమన్వయించు కొనవచ్చును.



## సంస్కృత శ్లోకము - 5

శ్లో. హరి స్త్వా మారాధ్య ప్రణత జన సౌభాగ్య జననీం
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్
స్మరోఽపి త్వాం నత్వా రతినయన లేహ్యేన వపుషా
మునీనా మప్యంతః ప్రభవతి హి మోహాయ మహతామ్.

## అనువాద పద్యము

శా. మున్నా విష్ణువు నిన్ను గొల్చి భవునిన్ మోహాంబుధిన్ తేల్పడే,
నిన్నే కన్నుల నిల్పి మారుడువిదన్ మెప్పింపగా నామెకున్
కన్నుల్ గ్రోలెడు రూపమెత్తి మునులన్ కామార్తులన్ చేయనౌ
నౌన్నత్యంబును పొందెగా ప్రణత జీవానంద భాగ్యప్రదా.

## టీక

హరిః = విష్ణువు, ప్రణతజన = నమస్కరించు జనులకు, సౌభాగ్య జననీం = సౌభాగ్యమును (సుభగత్వము అనగా - సౌజన్య, ప్రకాశ చైతన్య రూపమును) ప్రసాదించు తల్లివైన, త్వాం = నిన్ను, ఆరాధ్య = ఆరాధించి, పురా = పూర్వము ఒకప్పుడు, నారీ భూత్వా = స్త్రీ రూపమును ధరించి, పురరిపుం + అపి = త్రిపుర హరుడైన శివుని సైతము, క్షోభం అనయత్ = చిత్తక్షోభమును కలుగ జేసెను, స్మరః + అపి = స్మరోఽపి = మన్మథుడు గూడా, త్వాం = నిన్ను; (గూర్చి) నత్వా = నమస్కరించి, (అనగా - పూజించి); రతినయన లేహ్యేన = రతీదేవి కన్నులకు ఆనందా స్వదకరమైన, వపుషా = చక్కని దేహముతో మహతాం = గొప్పవాడైన, మునీనాం + అపి = (వైరాగ్య భావముతో) మౌనముగా తపస్సు గావించు ఋషులను సైతము, అంతః = (వారి) మనస్సు లోపల; మోహాయ = మోహపరవశులను చేయుటకు, ప్రభవతి = సమర్థుడగు చున్నాడు, హి = గదా !

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నమస్కరించు భక్తులకు సౌభాగ్యమును ప్రసాదించు - నిన్ను ఆరాధించి, విష్ణుమూర్తి పూర్వమొకసారి జగన్మోహినీ రూపమును పొంది, త్రిపురహరుడైన శివుని సైతము మోహ పరవశుని చేసి - చిత్తక్షోభమును కలుగ

జేసెను. అట్లే, మన్మథుడు గూడ నిన్ను పూజించి, నీ అనుగ్రహమును పొంది, తన సతి – రతీదేవికి కన్నుల పండుగను గొలుపు సుందర శరీరాకృతిని పొంది – జితేంద్రియుడై, మౌనముగా తపస్సు చేసుకొను ఋషులను సైతము – మోహ వివశులను చేయు సమర్థుడయ్యెను గదా !

## వివరణము

అమ్మవారిని ఆరాధించి, ఆమె అనుగ్రహమును పొంది – అసామాన్యులైన వారిని ఆటలు పట్టించిన ఇరువురి పూర్వగాథల గూర్చి ఈ శ్లోకము నందు ప్రస్తావించబడినది.

**రతీ - మన్మథుల అంతరార్థము**

'స్మరుడు' అనగా 'మన్మథుడు'. మన్మథుని భార్య – 'రతీదేవి. అందమునకు ఆనందమునకు వీరిది చాల అనుకూల దాంపత్యము. 'రతి' అనగా 'ఆసక్తి', 'మన్మథము' అనగా మానసిక మథనము అనగా 'అనుభూతి'. కాబట్టి, ప్రతి వ్యక్తిలోను ఆసక్తిని రేకెత్తించునది – రతికాగా, అనుభూతిని ప్రసాదించునది మన్మథుడు. అందుచేతనే 'రతీ – మన్మథు' లిరువురూ ప్రతి వ్యక్తిలోని 'ఆసక్తి – అనుభూతు' లకు ప్రతీకలు – అనగా – సంకేతములు. వీరికి సంబంధించినదే ఒక కథ కలదు.

ఇంద్రుని ఆజ్ఞపై మన్మథుడు రతీదేవితో కలసి శివునికి పార్వతిపై మోహమును కలుగ జేయుటకు ప్రయత్నించెను. ఆ ప్రయత్నములో శివుని ఫాలనేత్రాగ్నికి ఆహుతి అయి, మన్మథుడు శరీరమును కోల్పోయెను. రతీదేవి విలపించి పార్వతిని పతి భిక్ష కోరగా ఆ తల్లి కరుణించి ఇతరులకు కనబడక పోయిననూ రతీదేవికి మాత్రము మన్మథుడు సశరీరముగా కనబడునట్లు వర మొసంగెను. ఆనాటి నుండి మన్మథుడు అనంగుడైనను రతీదేవికి మాత్రము వైధవ్యము తప్పెను. ఈ కథలో చిత్రమైన అంతరార్థము కలదు.

ప్రతి వ్యక్తిలోను ఉండు 'ఆసక్తి,' అనగా – 'కోరిక' లేదా 'కుతూహలము' – రతీదేవి' అని, పొందు అనుభూతి – 'మన్మథుడు' అనీ పైన చెప్పుకొంటిమి. కదా! దీని వివరణయే పై కథ అంతరార్థము. ఆసక్తి కలిగిన వాడు – ఆ ఆసక్తి దేనిపై కలిగినదో, దానిని పొంది అనుభవించినపుడు – ఆనందము కలుగును. అనగా

'అనుభూతి' అను మన్మథుడు – 'ఆసక్తి' అను రతీదేవికీ తెలియును గాని ఇతరులకు తెలియదు. ఇది నిజమే గదా' ఒకరి అనుభూతి మరియొకరికి ఎట్లు తెలియును ? అనుభూతి కేవలము వ్యక్తిగతము (Purely personal and subjective) అని చెప్పుట కొఱకే 'అనుభూతి' అను మన్మథుడు – 'ఆసక్తి' అను రతీదేవికి తప్ప ఇతరులకు కనబడడు అని కథలో చెప్పుట. కలలో అయినను, ఇలలో అయినను ఇది సత్యము. ఉదా: 1) ఒకే మంచములో కలసి నిద్రించు ఇద్దరిలో – ఒకరు కలలో తుపాకీ పేలిన ధ్వని విన్ననూ, ప్రక్కనే నిద్రించు రెండవ వానికి ఏ మాత్రము వినిపించదు. ఉదా: 2) ఒకడు ఒక పండు తిని ఆనందాను భూతిని పొందినపుడు, ఆ అనుభూతి పండు తినువానికే తెలియును గాని ఎదుటి వానికి తెలియదు గదా !

**అమ్మవారి అనుగ్రహముతో అజేయుడైన అనంగుడు**

మన్మథునికి కావలసిన రీతులలో రతీదేవి చరించి, నటించి నర్తించి, తరింప జేయును. రతీదేవికి నేత్ర పర్వముగా నుండి ఉద్దీపన భావనలు కలుగునట్లు మన్మథుడు చేయును. ఇందులకై మన్మథుడు అమ్మవారిని అర్చించి, ఆరాధించి, అర్థించినాడు. అమ్మవారు తన అనుగ్రహ వర్షమును అనంగునిపై కురిపించినది. తత్ఫలితముగా అనంగుడు అతిలోక సౌందర్యవంతుడైనాడు. అన్నిరకముల అందములు గల శరీరాకృతులను పొందగలుగు హంగులన్నిటినీ వరముగా పొంది, తన ప్రియురాలైన రతీదేవిని ఆనందపరచ గలిగెను. తన ఈ ప్రయత్నమును తన పతికి మాత్రమే పరిమితము చేయలేదు. వివిధ జీవుల ఇంద్రియ లౌల్యములను ఆసరాగా తీసికొని, తమ శృంగార చేష్టలతో, భంగిమలతో, నర్తనలతో, సుమబాణ స్పర్శలతో, కామోద్దీపిత భావనలతో ముల్లోకవాసులను మోహ పరవశులను చేసి, ముప్ప తిప్పులు పెట్టి, వారిపై విజయమును సాధించెను. వైరాగ్య భావముతో ముక్కుమూసుకుని తమ దారిని తాము తపస్సు చేసుకొను మహనీయులైన మునిపుంగవులు సైతము మన్మథుని బాధకు గురికాక తప్పలేదు. అమ్మవారి అనుగ్రహము అనంగుని అంతవానిని చేయగలిగినది.

**శ్రీమాతను అర్చించిన శ్రీహరి**

మన్మథుని తండ్రి విష్ణుమూర్తి. మన్మథుడు మానవ, ముని గణములను మాత్రమే మోహపెట్టెను. తండ్రి అయిన విష్ణుమూర్తి ఈ మానవ, ముని

పుంగవులందరును హృదయములో ధ్యానించు - యోగమూర్తి, నిర్వికారుడు, త్రిపుర హరుడు - అయిన మహేశ్వరునే తన లక్ష్యముగా పెట్టుకొనెను. పెద్దవారితో చెలగాటము, తేడా వచ్చినచో తాను భస్మము కాగలడను భయము వుండుటచే - అమ్మవారి అండ దండలను, అనుగ్రహమును పొందదలచెను. ఇందులకై అమ్మవారికి సంబంధించిన 'ఈం' అను బీజాక్షరమును అత్యంత శ్రద్ధాభక్తులతో జపించెను. త్రికరణ శుద్ధిగా, తాదాత్మ్యభావనతో చేసిన ఆ జప ఫలితముగా తాను అమ్మవారై పోయినాడు. ఎవరి కోసము తాను జపించెనో ఆమెగా తాను అయిపోవుట జపసిద్ధికి పరాకాష్ఠయే గదా ! ఈ విషయము ఈ శ్లోకము నందు చాలా గుప్తముగా చెప్పబడినది.

'హరిస్త్వామారాధ్య' అనుపదముల బాహ్యార్థమేమనగా 'హరి నిన్ను ఆరాధించి' - అని. దీనికి గూడార్థము గలదు. 'హరిః + త్వాం + ఆరాధ్య' అనునపుడు 'త్వాం' అనగా 'నిన్ను' అని సూచించు పదము, మరియు జపించిన బీజాక్షరము - ఈ రెండునూ - శ్రీ సూక్తము నందలి - 'తాం' పద్మినీం - 'ఈం' - అను పదముల వరుసలో మొదట, చివర కలవు. ఈ బీజాక్షరమును సూచించు విషయము ''ప్రణత జన సౌభాగ్య జననీం'' అను పదములలో చివర వున్న జననీం = జనని + ''ఈం'' అను చోట మరింత ధ్రువ పరచబడినది. హరి - అమ్మవారి బీజాక్షరమైన 'ఈం' ను జపించి, అమ్మవారి అనుగ్రహము వలన 'సౌభాగ్యత్వమును' పొందెను. - అను విషయము గూడా సూచన ప్రాయముగా 'ప్రణత జన సౌభాగ్య జననీం' లో గలదు. అనగా 'విష్ణుమూర్తి అమ్మవారిని ఆరాధించి అమ్మవారై పోవు సౌభాగ్యమును పొందెను' అని తాత్పర్యము.

విష్ణుమూర్తి అమ్మవారుగా అయిన రూపమునే మోహినీ రూపము అందురు. ఈ మోహినీ వేషముతోనే దానవులను మోహ పరవశులను చేసి, అమృతమును దేవతలకు పంచిపెట్టెను. ఈ మోహినీ రూప సౌందర్యము 'నభూతోనభవిష్యతి'.

**హరి విలాసము**

మోహినీ రూప ధారణావశ్యకత అయిపోయినను ఆ రూపమును గురించి మాత్రము అందరునూ చెప్పుకొనుట ఆగలేదు. ఈ రూపము గురించి ఆ నోటను,

ఆనోటను చివరకు కైలాసము వరకును ప్రాకెను. శివునకు గూడా తెలిసి, నంది నెక్కి వైకుంఠమునకు తరలి వెళ్ళెను. పెద్దవాడైన శివుడు తనంత తానుగా తన ఇంటికి వచ్చినందులకు విష్ణుమూర్తి ఆనందపరవశుడయ్యెను. ఉభయుల కుశల ప్రశ్నల అనంతరము మాటల మధ్య శివుడు తాను విన్న మోహినీ రూపమును గూర్చి అడిగి, ఒకసారి చూపించవలసినదిగా కోరెను. 'అది ఏదో చిన్నపిల్లలను ఆనంద పరచుటకు ఎత్తిన రూపము గాని, పెద్దవాడివైన నీకెందుకు ? అని విష్ణుమూర్తి మిన్నకుండెను. కాని, శివునకు నచ్చలేదు. చూపించవలసినదిగా నిర్బంధ పెట్టెను. విష్ణుమూర్తి మంచి తీర్థముకై లోని కేగెను.

ఇంతలోనే వీధివాకిట ఉద్యానవనమందలి తులసి మొక్క వద్ద గాజుల చప్పుడు వినిపించెను. శివుడు అటువైపుగా చూసెను. పదునారు సంవత్సరముల నూతన యవ్వనములో తప్త కాంచన వర్ణముతో, పరమర రమణీయ శృంగార భావ సుధాలహరి వలె, హేలా మధుర కుల్యవలె, అస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరివలె నున్న – ఒక కన్య దేదీప్యమానముగా వెలుగులు విరజిమ్ముతూ నిలబడి వుండెను. శివుడు అటువైపుగా వెళ్ళి ఆమెను పట్టుకొనబోగా ఆమె చెట్టు చుట్టును తిరిగి, ఉద్యానవనము చుట్టును త్రిప్పి, చివరకు అక్కడ నుండి కైలాసమునకు దారి తీసి, కైలాసము నందలి అంతఃపురము గుమ్మము వద్ద ఆగి అలసిపోయి నిలబడెను. శివుడు ఆ అవకాశమును జాఱవిడువక ఆమె చెయ్యి పట్టుకొనెను. అదే సమయములో లోపల నుండి పార్వతి వచ్చి నివ్వెరపడి, ఒక్కసారి వారిద్దరినీ చూసి – ''ఏమి ఈ వ్యవహారము?'' ''ఏళ్ళు వచ్చినవి, ఏమి లాభము ?'' అనుభావములు పొడసూపు నట్లు ముఖమును అభినయించి నిలబడెను. శివుడు అవాక్కై నిలబడెను. ఇంక శివుని ఇబ్బంది పెట్టుట మంచిది కాదని కన్య – విష్ణుమూర్తిగా మారెను. ''ఓహో! ఇది అంతయు బావ బావమరుదుల మధ్య సరస విలాసమా ?'' అని పార్వతి సమాధాన పడి నవ్వుకొనెను. (తన కొడుకైన కాముని (మన్మథుని) కంటితో కాల్చినందుకు గాను – అమ్మవారి అనుగ్రహము తోనే శివునకు కామ ప్రభావ మెట్లుండునో రుచి చూపించి హరి శివునకు చిత్తక్షోభమును కలుగ జేయు సమర్థుడయ్యెను).

**మంత్ర మర్మము**

అమ్మవారి బీజాక్షరమైన ''ఈం''ను జపించి, జపించి ''హరి'' అమ్మవారై పోయినాడను విషయమును ''హరి + ఈం – హ్రీం'' అను విధముగా సమన్వయ పరచుకొనవచ్చును. ('హ్రీం' అనునది గూడా అమ్మవారి బీజాక్షరమే గదా!).

లలితా సహస్ర నామ స్తోత్రము నందలి – 'వైష్ణవీ', 'విష్ణురూపిణీ, 'విష్ణుమాయా,' 'విలాసినీ' మొదలగు నామములకును, లలితా అష్టోత్తర శతనామావళి యందలి 'అనంగజనకాపాంగ వీక్షణాయై నమో నమః' అను నామమునకును, సౌందర్యలహరి యందలి ప్రస్తుత శ్లోకమునకును చక్కని సమన్వయమును గుర్తించవచ్చును.



## సంస్కృత శ్లోకము - 6

**శ్లో. ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః**
**వసంత స్సామంతో మలయమరు దాయోధన రథః**
**తథాఽప్యేక స్సర్వం హిమగిరిసుతే కామపి కృపామ్**
**అపాంగాత్తే లబ్ధ్వా జగదిద మనంగో విజయతే.**

## అనువాద పద్యము

***చం. నలిగెడు పూవు వింటికిని, నారిగ తేంట్లు, శరంబులైదుపూల్,***
***నిలువని గాలి తేరు, తన నెయ్యపు కాడు వసంతమూర్తి, యీ***
***పలుచని సాధనాళి గొని - భావ శరీరుడు మారు డొక్కడున్-***
***గెలుచును లోకముల్ - కరుణ నిండిన నీ కొనచూపు పుష్టితో.***

## టీక

హిమగిరిసుతే = హిమవత్పర్వత రాజపుత్రికా, ధనుః = విల్లు, పౌష్పం = పుష్పమయమైనది, మౌర్వీ = అల్లెత్రాడు, మధుకరమయీ = తుమ్మెదల వరస కూర్పు, విశిఖాః = బాణములు, పంచ = ఐదుమాత్రమే, సామంతః = చెలికాడు, వసంతః = (రెండు నెలల ఆయుష్షు కలిగిన) వసంత ఋతువు, ఆయోధన రథః = యుద్ధమునకు ఉపయోగించు రథము, మలయమరుత్ = మలయ మారుతము,

తథాపి = ఆ విధమైన పనికి సమర్థములు కాని సాధ్య సంపత్తి గలవాడైనను, అనంగః = శరీరమే లేని మన్మథుడు, ఏకః = ఒక్కడే (అయినను), తే = నీ యొక్క, అపాంగాత్ = కడగంటి చూపువలన, కాం + అపి = అనిర్వచనీయమైన, కృపాం = దయను, లబ్ధ్వా = పొంది, ఇదం = ఈ, సర్వం జగత్ = సమస్త జగత్తును, విజయతే = జయించుచున్నాడు.

## తాత్పర్యము

ఓ హిమవత్పర్వత రాజపుత్రీ! 'పుష్పమయమైన విల్లు, తుమ్మెదల వరుసతో కూర్చిన అల్లెత్రాడు, లెక్కకు ఐదు మాత్రమే బాణములు, అల్పాయుష్కుడు - జడుడు అయిన వసంతుడు చెలికాడు, మలయ మారుతమే రథము' - ఏ మాత్రమును సమర్థములు కానవియగు ఇట్టి సాధన సామగ్రులతో కనీసము శరీరము గూడా లేని వాడయ్యును మన్మథుడు నిన్ను ఆరాధించి, అనిర్వచనీయమైన నీ కరుణా కటాక్షమును పొంది ఈ సమస్త జగత్తును జయించుచున్నాడు కదా !

## వివరణము

కనీసావసరములగు శక్తి, సామర్థ్య, సాధన, సామగ్రి సంపత్తి గూడా లేని వారైనను అమ్మవారి కరుణా కటాక్ష వీక్షణములకు నోచుకొనినచో సమస్త జగత్తును జయించగల సామర్థ్య అర్హతను పొందగలరను సత్యమును ఈ శ్లోకమునందు శంకరులు నిరూపించుచున్నారు.

అమ్మవారిని ఆరాధించి, ఆ తల్లి పరిపూర్ణ అనుగ్రహమును పొందిన వారిలో మన్మథుడు ఒకడు. ఏ విధముగా చూచినను ఈ మన్మథుడు ఏ ఒక్కరినీ ఏమియు చేయగలిగిన శక్తి సామర్థ్యములు లేనివాడే ! మన్మథునికి ఉన్నవన్నియు అనర్హతలే గాని అర్హత ఒక్కటి గూడ లేదు. వ్యక్తిగానే కాక తనుకున్న ఇతర సాధన సంపత్తి, మిత్ర సహాయ సహకారములు గూడా అంతంత మాత్రమే ! అయిననూ జగత్తు నందలి సర్వులను ముప్ప తిప్పలు పెట్టగలుగుచున్నాడు.

ఇతరులను గెలుచుటకు తనతో పాటు ఒక ఆయుధము గూడా వుండవలెను గదా! మన్మథుడు ఉపయోగించు ఆయుధము ధనుస్సు. ఈ ధనుస్సు అతి సుకుమారమైనది. సూర్యోదయముతో వికసించి మరునాటి సూర్యో

దయమునకు ముందే ముకుళించు కొని పోయి, నేలవ్రాలు పుష్ప సుకుమారము కలిగినది. అనగా – దాని బ్రతుకు సుమారు ఒక రోజు. అనగా పట్టుమని ఒకనాడు ఉపయోగించినచో మరు నాటికి అది పనికి రాదు. పైగా అవతలి వారిని దెబ్బతీయగల ధృడత్వము గూడా లేనిది.

ధనుస్సు పుష్ప సౌకుమార్యము గలది గదా మరి దాని అల్లెత్రాడైనను గట్టిగా, బలముగా నుండునా అన్నచో అదియునూ లేదు. మత్తుగా తేనెను త్రాగిన తుమ్మెదల వరుస కూర్పు ఆ ధనుస్సుకు వింటినారి. ఆ తుమ్మెదల వరుసకు ధృఢత్వమెట్లుండును ! తన్యత (Tension) ఎట్లుండును ? తన్యత, లేదా – బిగువు లేనిదే ఆ వింటినారితో ధనుస్సును ఎక్కు పెట్టుట మన్మథునికి కుదరని పని గదా!

ఇక బాణములు ఒక్కొక్కరిని జయించుటకు కనీసము ఒక్కొక్క బాణము చొప్పునైనను అవసరమగును గదా! మరి దీని ప్రకారము జగత్తు నందలి సర్వులను జయించుటకు లెక్కలేనన్ని బాణములు కావలసి యుండును. కాని, మన్మథుని దగ్గర ఉన్నవి కేవలము ఐదు బాణములే ! ఈ ఐదు బాణములతో అందరినీ జయించుట అతనికి సాధ్యపడని విషయము గదా!

ఈ మన్మథునికి సలహా నిచ్చి సహాయపడు స్నేహితులు గాని, సచివులు గాని ఎవ్వరైననుఉండిరా అన్నచో లెక్కకు ఒక్కడే ఒక్కడున్నాడు. అతడే 'వసంతుడు' అనగా (వసంత ఋతువు). ఈ వసంతుని ఆయుష్షు గట్టిగా రెండు మాసముల కన్న మించి వుండదు. తనతో జీవితాంతము కలిసి ఉండని ఇట్టి అల్పాయుష్కుని సలహా, సహాయ సహకారములు మన్మథునికి ఎంత వరకు ఉపకరించును?

ఎక్కడికైనను పోగలుగుటకు వాహనము ఒకటి వుండవలెను గదా ! మన్మథుడు ప్రయాణమునకై ఉపయోగించు రథము మలయమారుతము. ఆ మలయ మారుతము ఎప్పుడు ఎంత వేగముతో వీచునో అన్నియు సందిగ్ధములే ! అది పోవు మార్గములో తను పోవలెను గాని తను ఎంచుకున్న మార్గములో ఆ మలయ మారుతము పోదు గదా ! ఇట్టి రథముపై పోవుచు మన్మథుడు తన లక్ష్యము నెట్లు సాధించగలడు ?

వసంతుడు లేని కాలములో మన్మథుడు ఒంటరి పోరాటమే సలుపవలెను గదా! తను మాత్రమేమైన పెద్ద మొనగాడా ? యుద్ధము చేయుటకు తగిన ధృఢమైన శరీరమైన ఉండవలెను గదా ! ధృఢత్వము మాట దేవుడెఱుగు అసలు శరీరమే లేని

అనంగుడు ఈ మన్మథుడు. సంప్రదించుకొనుటకు, వినుటకు, కూర్చొనుటకు, నిలబడి యుద్ధము చేయుటకు శరీరావయము లేని ఈ మన్మథుడు ఏమి చేయగలడు?

యుద్ధమునకేమాత్రము పనికిరాని పై సాధన సామగ్రితో శరీరమే లేని ఒక పిల్లవాడైన మన్మథుడు తనకన్న అన్ని విధములా ఎక్కువ స్థితిలో నుండు జగత్తులోని సర్వులను ఎట్లు గెలవగలుగు చున్నాడు ? దీనికి కేవలము అతనిపై మంచు కొండ కూతురైన అమ్మవారి అనుగ్రహపు అండ దండలే ( కొండంత అండ) కారణము గాని ఇతరము లేమియు కావని ఆదిశంకరుల నిర్ధారణ. తనను ఆరాధించి, అర్చించిన వారిని అమ్మవారు ఆ విధముగా ఆదుకొనునని తాత్పర్యము.

ఈ శ్లోకము నందలి పదములకు బాహ్యార్థములు, నిఘంటువు లోని అర్థములు గాక – అంతరార్థములు, సంకేతార్థములను తెలుసుకొన్ననే తప్ప అసలు విషయము అర్థము కాదు.

**ధనుస్సు**

మన్మథుడు ఉపయోగించు ధనుస్సు మన మనస్సే ('మనో రూపేక్షు కోదండా' – అని లలితా సహస్ర నామములలో కలదు కదా!) 'ధనుః పౌష్పం' – అనిగదా శ్లోకము నందు చెప్పినది. ఐదు రేకుల పుష్పము – పంచ జ్ఞానేంద్రియములతో కూడిన మనస్సును సూచించును. ( అందువలననే పూజలో చివరకు మంత్రపూతమైన మనస్సును మంత్రపుష్పముగా సమర్పించుదుము). ఈ మనస్సును ఆసరాగా చేసుకుని మన్మథుడు మనలను ఆటలు పట్టించుచు జయించుచున్నాడని అర్థము. ( మనస్సును ఇక్షు కోదండముగా, అనగా – చెఱకు గడ విల్లుగా పోల్చుటలోని ఔచిత్యము తెలియవలెనన్నచో నేను నాలుగు భాగములుగా వ్రాసిన 'లలితా సహస్రనామ వివరణ ప్రథమ భాగము చదువుకొనవలెను).

**మౌర్వీ (వింటినారి)**

'మౌర్వీ' అనగా వింటినారి, లేదా – అల్లెత్రాడు. విల్లుకు బాణమునకు మధ్య వున్న సంధానమే వింటినారి. మన్మథుని ధనుస్సు మన మనస్సు అయినచో, బాణము – మన ఇంద్రియ సంబంధిత తన్మాత్ర అని గుర్తించుకొనవలెను. ఇంద్రియము గ్రహించిన విషయము తత్సంబంధ నాడి ద్వారా మనస్సునకు అందును. ఉదా: రూపము చక్షుర్నాడి ద్వారాను, శబ్దము – శ్రోత్రనాడి ద్వారాను, గంధము

– ఘ్రాణ నాడి ద్వారాను. ... ఈ విధముగా ఆయా నాడుల ద్వారా ఇంద్రియము – మనస్సులు సంధానింపబడును. (లలితా సహస్ర నామము నందలి 'పంచతన్మాత్ర సాయకా' అను నామమును ఇక్కడ గుర్తు చేసుకొనవచ్చును.) కాబట్టి, వింటినారి అనగా – ఈ నాడులన్నమాట! మనస్సు మధురమైన అనుభూతిని పొందుటకు నాడులు ఉపకరించుచున్నవి. కాబట్టి, ఈ నాడులను సూచించు వింటినారిని - మధువును త్రాగు మధుకరములతో పోల్చిరి.

**పంచవిశిఖాః (ఐదు బాణములు)**

మన్మథుడు ఉపయోగించు బాణము మన 'జ్ఞానేంద్రియ సంబంధిత తన్మాత్ర' అని గదా చెప్పినది. జ్ఞానేంద్రియములు ఐదు ఉండును. కాబట్టి, మన్మథుడు ఉపయోగించు బాణములు కూడా అయిదే వుండును. ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్క విధమైన లౌల్యము ఉండును. ఈ లెక్కను బట్టి ఐదు జ్ఞానేంద్రియములకు ఐదు విధములైన లౌల్యము లుండును. నచ్చిన శబ్దము - శ్రోత్రేంద్రియమును, నచ్చిన స్పర్శ – చర్మేంద్రియమును, నచ్చిన రూపము - నేత్రేంద్రియమును, నచ్చిన రుచి – రసనేంద్రియమును, నచ్చిన వాసన - ఘ్రాణేంద్రియమును ప్రేరేపించి మనస్సు ద్వారా మనిషిని పతనము చెందించును. ఒక్కొక్క జంతువునకు ఒక్కొక్క ఇంద్రియము వలన మాత్రమే ఈ పతనము ఉండును.

వేటగాడు శృంగముతో (కొమ్ముతో) చేయు మధురమైన నాదమునకు ఆకర్షితురాలై 'కురంగము' అనగా, లేడి పతనము చెందును. లేడికి – ఈ శ్రోత్రేంద్రియమునకు చెందిన లౌల్యము వల్లనే పతనము, మిగిలిన ఇంద్రియముల వలన పతనము లేదు.

ఆడ ఏనుగు స్పర్శకు అలవాటు పడునట్లు చేసి 'మతంగము' ను అనగా, మగ ఏనుగును మభ్యపెట్టి, పెద్ద గుంటలోనికి పడునట్లు చేసి, ఆపైన మచ్చిక చేసుకొందురు. అనగా – ఏనుగునకు చర్మేంద్రియమునకు చెందిన లౌల్యము వలన పతనము, మిగిలిన ఇంద్రియముల వలన పతనము లేదు.

ఎఱ్ఱటి పండువలె ఉన్నదనుకొని, దీపకళికను సమీపించి 'పతంగము' అనగా, మిడత భస్మమైపోవును. అనగా మిడతకు ఒక్క చక్షురింద్రియమునకు చెందిన లౌల్యము వలన పతనము ఉండును, మిగిలిన ఇంద్రియముల వలన లేదు.

పద్మములోని మధువును (తేనెను) త్రాగుచు, వళ్ళు తెలియక – చీకటి సమయములో ముడుచుకొని పోవు పద్మము లోనే వుండి చనిపోవు ఆ 'భృంగము' నకు అనగా, తుమ్మెదకు జిహ్వేంద్రియమునకు చెందిన లౌల్యము వలన పతనము ఉండును గాని మిగిలిన ఇంద్రియముల వలన లేదు.

గాలము కొక్కెమునకు అమర్చిన వానపామునకు, దాని నుండి వచ్చు వాసనకు – ఆకర్షితురాలై చేప దానిని తినబోయి కొక్కెమునకు చిక్కుకొని చివరకు చేపలు పట్టువానికి దక్కును. అనగా, ఈ చేపకు ఘ్రాణేంద్రియము వలన పతనము ఉండునుగాని – మిగిలిన వాని వలన లేదు.

ఈ విధముగా ఒక్కొక్క జంతువునకు, లేదా – కీటకమునకు ఒక్కొక్క ఇంద్రియ లౌల్యము వలన పతనము ఉండగా – మనిషికి మాత్రము ఐదు ఇంద్రియముల వలన గూడా పతనము చెందు అవకాశము కలదు. అందువలన జంతువుల కన్న మనిషి ఐదురెట్లు జాగరూకతతో మసలు కొనవలెనని ఈ క్రింది శ్లోకము చెప్పును.

**శ్లో. కురంగ మాతంగ పతంగ భృంగ మీనాః హతాః పంచభిరేవపంచ**
**ఏకః ప్రమాదీ సకథం వహన్యతే య స్సేవతే పంచభిరేవ పంచ.**

అందువలననే మన్మథునికి మనలనందఱినీ జయించుటకు సూక్ష్మమైన ఈ తన్మాత్రల ఐదు బాణములు చాలును. పైగా ఇవి భౌతికము కాదు కాబట్టి, తరిగి పోవుట, విరిగిపోవుట, కరిగిపోవుట ఉండదు. అనగా ఈ ఐదు బాణములు అక్షయముగా పని చేయును.

**వసంత స్సామంతః**

వసంతుడు – చెట్లను చిగురింప జేసి, పుష్పింప జేసి అటు ప్రకృతి శోభను పెంచుటలోను, ఇటు మానవులకు మొట్టమొదటగా ఆశలను చిగురింప జేయుటలోను మన్మథునికి సహకరించును. వసంతుని పని అంత మాత్రమే !

అటుపైన పరాగ సంపర్క ప్రేరణాదులతో అటు చెట్లను, పరస్పరాకర్షణ మనోవికారాదులతో ఇటు మనుష్యులను - మభ్యపెట్టి ప్రకృతిలోని శోభన కార్యమును ఫలవంతము చేయుట మన్మథుని పనియే! ఈ విధముగా వసంతుడు =ప్రాథమిక దశలో స్వల్పకాలము మాత్రమే సహకరించి, మన్మథుని కామ యజ్ఞ కార్యసాధనకు అంకురారోపణకునిగా, ప్రారంభసచివునిగా వ్యవహరించును.

**మలయమరుదాయోధనరథః**

మలయమారుతము మనస్సులను మత్తెక్కించుటలోను, మధుర స్పర్శానుభూతులను రేకెత్తించి, పులకింప చేయుటలోను మన్మథునికి సహకరించును. అందులకే మన్మథుడు ఈ మలయమారుతమును తన రథముగా చేసకొని మనుష్యుల మనోరథములను రెచ్చగొట్టి వారిపై విజయమును సాధించును.

కాబట్టి, స్థూలముగా పైకి పనికి రాని వానిగా కనబడిననూ, సూక్ష్మముగా ఉండు మనుష్యుల మనో దౌర్బల్యములను, లౌల్యములను మధించి, వారి మనస్సులను తన వైపు మళ్లింప జేసుకుని మన్మథుడు కృతకృత్యుడగు చున్నాడని ఈ శ్లోక తాత్పర్యము.



## సంస్కృత శ్లోకము - 7

శ్లో. క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా
పరీక్షీణామధ్యే పరిణతశరచ్చంద్రవదనా
ధనుర్బాణాన్ పాశం సృణి మపి దధానా కరతలైః
పురస్తా దాస్తాం నః పురమథితు రాహోపురుషికా.

## అనువాద పద్యము

చం. స్వర భరమైన కాంచి, మదవారణ కుంభకుచోరు భారమున్,
పురిగొన వంగు కౌను, పరిపూర్ణ శరద్విధుబింబ మాస్యమున్,
కరసర సీరు హమ్ములను కార్ముక పాశ శరాంకుశమ్ములున్,
పురహర గర్వమూర్తి! కనుముందట మాకు ప్రసన్న మయ్యెడున్.

## టీక

క్వణత్ = చిరుసవ్వడి చేయు, కాంచీదామా = (గజ్జెల) మొలనూలు గలదియు, కరికలభ = గున్నఏనుగుల, కుంభ = కుంభస్థలములతో పోల్చదగిన, స్తన = స్తనములచేత, నతా = ఇంచుకవంగినట్లుగా కనబడునదియు, పరిక్షీణా = కృశించిన, మధ్యే = నడుము గలదియు, పరిణత = పరిపూర్ణమైన, శరత్ = చంద్రవదనా = శరదృతువు నందలి పూర్ణిమా చంద్రుని వంటి వదనము గలదియు, కరతలైః = నాలుగు చేతులయందు, ధనుః = విల్లును, బాణాన్ = పుష్పమయమైన బాణములను, పాశం = పాశమును, అపి = మరియు, సృణి = అంకుశమును, దధానా = ధరించునదియు, పురమధితుః = త్రిపురహరుడైన శివుని యొక్క, ఆహోపురుషికా = అహంకార స్వరూపిణియగు జగన్మాత, నః = మాయొక్క, పురస్తాత్ = ఎట్టెదుట, ఆస్తాం = (సుఖాసీనయై) సాక్షాత్కరించు గాక !

## తాత్పర్యము

చిరుసవ్వడి చేయు గజ్జెల మొల నూలు గలదియు, గున్న ఏనుగు కుంభములను పోలు స్తనములు కలిగి కొద్దిగా వంగినట్లు కనబడునదియు, సన్నని నడుము గలదియు, శరదృతువు నందలి పరిపూర్ణమైన పూర్ణిమా చంద్రుని పోలెడు ముఖము గలదియు, నాలుగు చేతుల యందు వరుసగా ధనుస్సు, బాణములు, పాశము, అంకుశములను ధరించి యుండునదియ, త్రిపురహరుడైన శివుని యొక్క అహంకార స్వరూపిణియునగు జగన్మాత మాకు ఎదురుగా (సుఖాసీనురాలై) సాక్షాత్కరించు గాక !

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి స్థూల విగ్రహ వర్ణన చేయబడినది. 'సగుణ' ఉపాసనకు ఈ శ్లోకములో చెప్పిన రూపమును భక్తితో ఉపాసించవలెను. విగ్రహ వర్ణన తాత్పర్యములో చెప్పబడినది. శ్లోకము నందు ఉపయోగించిన ఉపమానములు వాటి ఔచిత్యములు తెలుసుకొన్ననే తప్ప ఈ శ్లోక ప్రాశస్త్యము అవగతము కాదు.

**క్వణత్ కాంచీదామా**

'క్వణత్ కాంచీదామా' అనగా ధ్వనించుచున్న 'మొలనూలు' అని అర్థము. మొలనూలు వడ్డాణము వంటిదే ! వీటికి చిఱుగజ్జెలు ఉండును. అమ్మవారు

'వర్ణస్వరూపిణి' అనగా అక్షర స్వరూపిణి. (భావము - అయ్యవారు, భాష - అమ్మవారు) ('మాతృకావర్ణరూపిణీ' అనునది లలితా సహస్ర నామములలో ఒక నామము.) అనగా - అమ్మవారు అక్షర నిధి అన్నమాట. ఆమె పొట్ట నిండా అక్షరములే! అక్షరములు ధ్వనితో కూడినవి గదా ! ఈ విషయమును స్ఫురింప జేయుటకు అమ్మవారిది ధ్వనించుచుండు మొలనూలు అని సూచించిరి. ఇది సంకేతార్థము. బాహ్యార్థము చెప్పు కొనవలెనన్నచో 'క్వణత్ కాంచీదామా' అనగా మణిమయమేఖల, లేదా - గజ్జెల మొలనూలు. ఇట్టి ఆభరణమును ధరించి నడుచుచున్నపుడు కలుగు నడుము కదలికలకు ఈ గజ్జెల సవ్వడి అత్యంత రమణీయముగా, శ్రవణా నందకరముగా నుండును. అందుచే స్త్రీలకు ఇట్టి ఆభరణము నందు ఆసక్తి ఉండుట సహజము.

**కరికలభకుంభస్తననతా**

గున్నఏనుగుల కుంభస్థలములను పోలు స్తనముల భారముచే ఇంచుక వంగినట్లుగా అమ్మవారు కనబడునట ! ఏనుగు కుంభములకు అమ్మవారి వక్షమునకు పోలిక అన్నమాట ! స్త్రీలను వర్ణించునపుడు దాదాపుగా కవులందరూ వక్షములను తప్పక వర్ణింతురు. ఆ స్త్రీ అమ్మవారైనను వర్ణించుట మానరు. స్త్రీల అవయవములలో స్తనములకు ఒక ప్రత్యేకత కలదు. అవి మాతృకా చిహ్నములు. పుట్టిన ప్రతి మనిషి సాధారణముగా తల్లి స్తన్యమును గ్రోలి బ్రతికి బట్టకట్టును. ఇవి సృష్టిలో పోషణకు సంబంధించిన ఏర్పాటు. ప్రతి మనిషి తను పెరిగి పెద్దవాడగుటకు ప్రారంభకారణమైన ఆ స్తనములను గూర్చి ముందు తెలుపుటలో ఒక కృతజ్ఞతా భావము కలదు. కావున, కవులు స్తనములను తప్పక వర్ణించుదురు. అవి మాతృకా చిహ్నములు కావున - అమ్మవారి స్తనములు సమస్త జగత్పోషణకు సంబంధించినవిగా అర్థము చేసుకొని, అట్టి వక్షములను వర్ణించుట అనౌచిత్యము కాదని గ్రహించవలెను.

స్తనములను ఎన్నో ఉపమానములతో పోల్చుదురు. ఇక్కడ అమ్మవారి స్తనములను కరికలభకుంభములతో పోల్చుటలో ఒక ప్రత్యేకత గలదు. కరికలభ కుంభములనగానే - గున్నఏనుగుతల, గున్నఏనుగు తల అనగానే వినాయకుడు గుర్తుకు వచ్చును గదా ! 'అమ్మవారికి - గజముఖునికి' - 'తల్లీ - కొడుకుల' సంబంధము. 'కరికలభ కుంభస్తననతా' - అను ప్రయోగము - 'తన పిల్లవాడైన

గజముఖునికి పాలిచ్చుటలో కొద్దిగా వంగిన అమ్మవారి రూప భంగిమను' స్ఫురింప జేయును. ఈ స్ఫురణము పూర్తిగా జగజ్జనని మాతృవాత్సల్యమునే సూచించును గదా !

**పరిక్షీణామధ్యే**

అమ్మవారి నడుము, లేదా – కటిస్థలము కృశించినట్లు, అనగా – సన్నగా ఉండును. సన్నని నడుము శరీరాకృతికి చక్కని అందమును చేకూర్చును. 'లక్ష్య రోమలతాధారతా సమున్నేయ మధ్యమా' – అని లలితా సహస్ర నామములలో అమ్మవారికి ఒక నామము గలదు. "పైకి ఎగ బ్రాకెడు లతవలె కనబడు నూగారు (రోమరాజి) అగ్రము నందు ఫలముల వలె స్తనములు కనబడును. కాబట్టి, ఇట్టి 'నూగారు' అను లతకు వెనుక సన్నముగానైనను ఒక ఆధారము ఉండి తీరవలెను. ఆ ఆధారమునే నడుముగా అనుకొనవలసి వచ్చును'' – అన్నంత సన్నముగా అమ్మవారి నడుము ఉండునట !

నాభికి దిగువన ఉండు అధోలోకములను, ఎగువన వుండు ఊర్ధ్వ లోకములను ఈ కటి ప్రదేశము సంధాన పరచును. ఈ రెండు లోకములకు మధ్య సంతులనత నడుముదగ్గఱ చక్కగా సూచితమగును. ఈ సంతులనతను సూచించు భాగము కనుకనే జ్యోతిశ్శాస్త్రము నందు ఈ కటి ప్రదేశము తులారాశికి సంబంధించినదిగా చెప్పుదురు. (Sign of Balance) అందమును (Beauty), అనుపాతమును (Proportion), సౌష్ఠవమును (Symmetry), పొందికను (Harmony) తెలియజేయునను విషయమును ఇక్కడ సమన్వయ పరచుకొనవలెను. పైన ఉండు స్తనములకు – క్రింద ఉండు పిరుదులకు మధ్య ఉండు ఈ సన్నని కటి భాగము చక్కని పొందికను సౌష్ఠవ అమరికను సూచించును. అందుచేతనే సన్నని నడుము సాముద్రిక శాస్త్రము నందు మంచి లక్షణముగా చెప్పబడినది. ఆరోగ్య శాస్త్ర రీత్యా గూడా సన్నని నడుము ఉన్నవారికి గర్భిణిగా నున్న కాలములో (Child bearing time) సుకరముగా ఉండును. ఆడువారికి బాన పొట్ట లక్షణము – ఎద్దె తనమును, చాకిరీ చేయవలసిన మరియు / లేదా చాకిరీ చేయించు కొనవలసిన పరిస్థితులను గూడ సూచించునని సాముద్రిక శాస్త్రము చెప్పును.

**పరిణత శరచ్చంద్రవదనా**

అమ్మవారి ముఖమును పరిపూర్ణ పరిమాణములో నుండు చంద్రునితో పోల్చిరి. ఇతర ఋతువులలో కన్న శరదృతువులో చంద్రుడు శుక్ల పక్షమునందు త్వర త్వరగా ఉదయించును. అందువలన వెన్నెల ముందు ముందుగా ప్రారంభమై వెన్నెల కాలవ్యవధి ఎక్కువగా నుండును. (ఈ విధముగా నుండుట ఉత్తర అక్షాంశ ప్రాంతముల వారికే! దక్షిణ అక్షాంశ ప్రాంతముల వారికి వసంత ఋతువు నందు ఇట్లుండును). – అందువలననే ఈ శరదృతువు నందలి పూర్ణిమా చంద్రుని 'Harvest Moon' అనగా – పంటకు వచ్చిన వెన్నెల చంద్రుడు లేదా ''పరిణత శరచ్చంద్రుడు'' అందురు. శరదృతువు ఆరంభముతో అంతకు పూర్వమున్నదట్టమైన అజ్ఞానపు కారు మేఘములు పటాపంచలై దహరాకాశము నిర్మలముగా, స్వచ్ఛముగా అగుట జరుగును. ఈ కారణము వలననే ఈ ఋతువును శరత్ లేదా శారద (సరస్వతి = సర్వశుక్లా సరస్వతీ) ఋతువుగా పేరు పెట్టిరి.

సూర్యుని వేడి కిరణములు చంద్రునిపై పడి, వెన్నెల కిరణములుగా మారి భూమికి చేరును. సూర్యుడు – మన ఆత్మను, చంద్రుడు – మన మనస్సును, భూమి – మన దేహమును సూచించును. 'ఆత్మ' అను సూర్యుని నుండి వెలువడు 'భావములు' అను కిరణములు – 'మనస్సు' అను చంద్రుని ద్వారా వ్యక్తమగును. మనస్సు ద్వారా వచ్చు భావములు ముఖము నందు వ్యక్తమగును. అందువలననే Face is the index of mind అని ఆంగ్లమున చెప్పుదురు. అనగా – సూర్యునకు చంద్రుడు ఎటువంటివాడో – మనకు మన ముఖము అటువంటిదన్నమాట ! అందువలన ముఖమును చంద్రునితో పోల్చుదురు. చంద్రునికి కళలు మారుచున్నట్లే మన ముఖము నందు గూడా కళలు (కళాకళలు) మారుచుండును. అన్నిరోజులు అన్నివేళలా మనము ఒకే విధముగా నుండము. ముఖమును చూచి మనస్సు స్థితిని ఊహించవచ్చును. ముఖము, చంద్రుడు – ఈ రెండును ఆహ్లాదమును సూచించ గలవి. అందులకే ముఖమును చంద్రునితో పోల్చుట (రెండును గుండ్రముగా నుండుట ఒక్క లక్షణమే పోల్చుటకు కారణము కాదు.) అమ్మవారి ముఖము పరిపూర్ణ కళ గల చంద్రుని పోలి ఉండునుగాని ఇతర కళల చంద్రునితో కాదు. అందుకే ఆమె షోడశీ. (షోడశ కళాప్రపూర్ణ). అనగా, పూర్తిగా 16 కళలు నిండిన పరిపూర్ణ స్వరూపము.

**ధనుర్బాణాన్ పాశం సృణి**

అమ్మవారి నాలుగు చేతులలోను నాలుగు ఆయుధములను ధరించినది. అవి వరుసగా – ధనుస్సు, బాణములు, పాశము, అంకుశము. ఈ నాల్గింటిలో ధనుస్సు మన మనస్సే ! బాణముగా మన పంచేంద్రియ సంబంధిత తన్మాత్రలే ! (ఈ రెంటిని గుఱించి గత ''ధనుః పౌష్పం...'' శ్లోకము నందు వివరింపబడినది). ఇక పాశము, అంకుశము, ఇవి వరుసగా 'రాగము' 'క్రోధము' లను తెలియ జేయును. (రాగ స్వరూప పాశాఢ్యా, క్రోధా కారాంకుశోజ్జ్వలా – అని లలితాదేవి నామములు.)

**రాగపాశము**

అరిషడ్వర్గములలో మొదటిది 'కామము'. ఈ కామము యొక్క వేరొక రూపమే రాగము. అందరి మనుష్యులకు అందరి మనుష్యులతోను బంధము, సంబంధము ఉండదు. కొంతమంది తోనే వుండును. తమకు ఇష్టమున్నవారి పట్ల ఈ బంధము ఉండును. ఇట్టి బంధమును 'మమతా బంధము' అందురు. ఈ మమతగూడా వాత్సల్యము, స్నేహము మొదలగు వాని వంటిదే ! వాస్తవమునకు ఇవి అన్నియు ప్రేమ యొక్క రూపాంతరములే ! మనకంటె తక్కువ వయస్సు వారిపై ఉండు ప్రేమను వాత్సల్యము అనీ, మనకు సమ వయస్సు గల వారిపై ఉండు ప్రేమను స్నేహమని, మన కన్న ఎక్కువ వయస్సు గల వారిపై ఉండు ప్రేమను భక్తి అనియు అందురు.

మనము ఇష్టపడువారితో శారీరక, లైంగిక సంబంధమును గూడా పొందవలెనని ఉన్నచో ఆ ప్రేమ కామమునకు దారితీయును. ఒకరి నొకరు ఇష్టపడు వ్యక్తులను 'రాగపాశము' కట్టి ఉంచును. సాధారణముగా అమ్మవారికి – జగత్తు నందలి సమస్త జీవ జాలమునకు మధ్య ఉండు ఈ రాగబంధము 'అనురాగబంధము' గానే ఉండును. కాని, మనుష్యుల మధ్య స్వార్థము పెరిగి వెఱ్ఱి తలలు వేసి, సమాజమునకు, ప్రపంచమునకు ఇబ్బందిని కలుగ జేసినపుడు ఇదే పాశముతో వారిని కట్టిపడవేసి, మట్టి కరిపించును.

**సృణి**

సృణి అనగా 'అంకుశము' అని అర్థము. ఈ అంకుశము క్రోధమునకు ప్రతీక. లలితా సహస్ర నామములలో 'క్రోధాకారంకుశోజ్జ్వలా' అను నామము కలదు. అమ్మవారు ధరించిన అంకుశము క్రోధమునకు సంబంధించినది. కోపము యొక్క పరాకాష్ఠస్థితియే క్రోధము. నిలువ వున్న కోపమును క్రోధము అనవచ్చును.

అనగా కోపము Acute స్థితిని, క్రోధము Chronic స్థితిని తెలియ జేయునన్న మాట! క్రోధము ఉన్నవారికి శక్తి అనవసరముగా (వృథాగా) ఖర్చుగుచుండును. ఆ విధముగా ఖర్చుగుశక్తిని సద్వినియోగ పరిచినచో ఆ 'శక్తి' అంతయు 'సాధన'కు ఉపయోగ పడును. క్రోధమును సాధనకు ఉపయోగించు కొనవలెనన్నచో – నిదానము, ఓర్పు, నిష్ఠ, నియమపాలన మొదలగు లక్షణములను అభ్యాసము చేయవలెను. ఈ లక్షణములను తెలియ జేయు గ్రహమే 'శనిగ్రహము'. అందువలననే క్రోధమును సూచించు అంకుశము ఏ ఆకారములో ఉండునో ఈ శనిగ్రహమును తెలియజేయు అంతర్జాతీయ సంకేతము (♄) గూడ అదే ఆకారములో ఉండును. అందుచేత అమ్మవారు ధరించిన అంకుశము – తిన్ననైన ప్రవర్తన గల సాత్వికులకు వారి సాధనను పెంపొందించుటకును, క్రోధావేశపూరితులకు వారి పొగరు అణచుటకును పనిచేసి, వారిని అదుపులో పెట్టును. జ్యోతిశ్శాస్త్రమునందు శని గ్రహ ప్రభావమును గూడ సరిగా ఇదే విధముగా అర్థము చేసుకొనవలెను.

**ఆయుధములు - బీజాక్షరములు**

దేవతా విగ్రహముల హస్తములందు ధరించు ఆయుధములకును బీజాక్షరములకును కొంత సంబంధము కలదు. ఆయుధమును బట్టి బీజాక్షరమును, బీజాక్షరమును బట్టి ఆయుధమును తెలుసుకొనుటకు ఈ క్రింద తెలిపిన పట్టిక ఉపకరించును. ఆయుధ సద్వినియోగము వలన కలుగు సల్లక్షణము, దుర్విని యోగము వలన కలుగు దుర్లక్షణము కూడ ఈ పట్టిక యందు తెలుపబడినవి.

| ఆయుధము పేరు | బీజాక్షరము | దుర్లక్షణము | సల్లక్షణము |
|---|---|---|---|
| పాశము | ఆం | రాగము (కామము) | దమము ఇంద్రియనిగ్రహము |
| అంకుశము | క్రోం | క్రోధము | సాధన |
| ధనుస్సు | ఓం | మనశ్చాంచల్యము | సంకల్పసిద్ధి |
| బాణము | శ్లీం | ఇంద్రియలౌల్యము | లక్ష్యసిద్ధి |
| శక్తి | హ్రీం | మదము | ధైర్యము |
| శూలము | క్రీం | మాత్సర్యము | పరాక్రమము |
| శంఖము | శం | లోభము | వర్ధనము |
| చక్రము | హ్సాం | మోహము | ఆకర్షణ |

ఇంతవఱకు అమ్మవారి రూపరేఖలు, పట్టిన ఆయుధములు తెలుపబడినవి. ఈ విధమైన అమ్మవారి భౌతిక రూపము శివునికి చాల ఇష్టము ! ఇష్టమే కాదు గర్వకారణము కూడా ! ఈ గర్వము అహంకారమును సూచించును కాబట్టి – ఈ అమ్మవారి రూపము శివుని 'అహంకార స్వరూపము' అని శంకరులు అనుచున్నారు. శివుడు – ఒక ఆకారము, రూపము మొదలైన గుణములు లేని నిర్గుణుడు. అమ్మవారితో కూడినప్పుడే ఇవి ఏర్పడి సగుణుడగుచున్నాడు. అనగా – అమ్మవారు – 'నేను' స్థితిని సూచించు శివునికి ఏర్పడిన 'మేను' స్వరూపము అన్నమాట ! ఈ 'అహం' కు ఏర్పడిన ఆకారము కాబట్టి శివుని యొక్క 'ఆహోపురుషిక' లేదా 'అహంకార స్వరూపము' అయినది. తొలి అచ్చు అయిన 'అ' మొదలు తుది హల్లు అయిన 'హ' వరకు ఉన్న (అక్షరముల) వర్ణ స్వరూపిణి కాబట్టి – 'అ–హం కార స్వరూపము'. అహంకారమును విడదీసినచో – 'అ + హ్ + అంక్ + ఆర + (స్వరూపము)' అగును. అనగా – 'అ' నుండి 'హ' వరకు గల చిహ్నముల గుఱించి తెలుపు స్వరూపము – అని అర్థము గూడా చెప్పుకొనవచ్చును.

**పురస్తాదాస్తాం నః**

పైన చెప్పబడిన స్వరూప విశేషములు గల అమ్మవారు మాకు ఎదురుగా సాక్షాత్కరించు గాక – అని శంకరులు కోరుకొనుచున్నారు. అనగా, అమ్మవారిని ప్రత్యక్షము చేసుకొనుటకు ఈ రూపమును ధ్యానము చెయ్యవలెనని అర్థము. ఈ రూపము – సమయాచార సాధకుని మణిపూర చక్రమున అమ్మవారి భౌతిక వేషధారణకు అనగా Dress కు సంబంధించినది. ఈ శ్లోకము తరువాత శ్లోకమైన 'సుధాసింధోర్మధ్యే.....' శ్లోకము నందు అమ్మవారి చిరునామా (Address) కు సంబంధించిన వివరములు ఇవ్వబడును.

లలితా సహస్ర నామములలోని – 'రణత్ కింకిణి మేఖలా', 'క్రోధాకారాం కుశోజ్జ్వలా', 'మనోరూపేక్షుకోదండా', 'లక్ష్యరోమలతాధారతాసమున్నేయ మధ్యమా', 'శివమూర్తిః', 'మాతృకావర్ణరూపిణీ', 'శాతోదరీ', 'వర్ణరూపిణీ', 'తలోదరీ', 'శరచ్చంద్ర నిభాననా' – మొదలైన నామములకు ఈ శ్లోకమునకు సమన్వయమును గుర్తించ వచ్చును.



## సంస్కృత శ్లోకము - 8

శ్లో. సుధా సింధోర్మధ్యే, సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే
శివాకారే మంచే పరమశివపర్యంక నిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్.

## అనువాద పద్యము

చం. *అమృతాబ్ధిన్ గల కల్పవృక్ష పరివృత్తాంతర్మణిద్వీపమ*
*ధ్యమునన్, నీపవనమ్మునన్, వెలుగు చింతారత్న సౌధమ్మునం,*
*దమలంబౌ శివఖట్వమందు, పరశైవాంకోరు తల్పమ్మునన్,*
*తమ చిత్తంబున నిన్ను గొల్తురు చిదానందాబ్ధిగా కొందఱున్.*

## టీక

(తల్లీ ! జగజ్జననీ !), సుధాసింధోః = అమృత లేదా క్షీర సముద్రము యొక్క, మధ్యే = మధ్య ప్రదేశ మందు, సురవిటపి = కల్పవృక్షముల యొక్క, వాటీ పరివృతే = వరుసలచే చుట్టబడిన, మణిద్వీపే = మణిమయమైన దీవియందు, నీప + ఉపవనవతి = కడిమి చెట్ల ఉద్యానవనము నందు, చింతామణి గృహే = చింతామణులచే నిర్మింపబడిన గృహము నందు, శివాకారే = శివాత్మకమైన, మంచే = మంచము నందు, పరమశివ పర్యంక = సదాశివుడను తల్పము, లేదా – సదాశివుని తొడను, నిలయాం = నెలవుగా గలిగిన, చిత్ + ఆనంద + లహరీం = జ్ఞానానందతరంగ రూపముగా నుండు, త్వాం = నిన్ను, కతిచిన = కొందరు, ధన్యాః = ధన్యులు (మాత్రమే), భజంతి = సేవించి తరించుచున్నారు.

## తాత్పర్యము

జగజ్జననీ ! సుధాసముద్రము నందలి మధ్య ప్రదేశము నందు, కల్పవృక్షముల వరుసచే చుట్టబడిన మణిమయ ద్వీపమునందు, కడిమి చెట్ల తోట యందు, చింతామణులచే కట్టబడిన గృహమునందు శివాకార మంచము నందు – సదాశివుని తొడను నిలయముగా కలిగి, జ్ఞానానంద తరంగ రూపముగా నున్న నిన్ను – కృతార్థులైన ఎవరో కొందఱు మాత్రమే సేవించి తరించుచున్నారు.

## వివరణము

ఇంతకు మునుపు శ్లోకమైన ''క్వణత్ కాంచీదామా...:'' శ్లోకమునందు అమ్మవారి బాహ్య వేషధారణకు (Dress) సంబంధించిన వివరములు తెలుపబడినవి. ప్రస్తుత శ్లోకమునందు అమ్మవారిని అంతర్ముఖముగా ధ్యానించుటకు అవసరమైన చిరునామా వివరములను (Address) తెలుపుచున్నారు. ఈ శ్లోకమునందలి పదములు పూర్తిగా ఆత్మ విద్యాపరముగా (Esoteric) నుండును.

**సుధాసింధువు**

'సుధాసింధువు' అనగా 'అమృత సముద్రము', లేదా – 'క్షీర సముద్రము' అని గూడా చెప్పుకొనవచ్చును. అసంఖ్యాకమైన బిందువుల (Drops) చేరిక అనంతమైన సింధువును (Ocean) రూపొందించును. 'సముద్రము' అనగా ముద్రలను తన యందు కలది. 'ముద్ర' లనగా 'అచ్చులు' (Moulds) అని అర్థము. ప్రతి సృష్టికి అవసరమగువాటియొక్క మౌళికమైన అచ్చులను (Original moulds) అన్నిటిని మృతము (వినాశము) కాకుండా ఉంచగలుగు'సముద్రము' కాబట్టి – దీనిని 'అమృత సముద్రము' అందురు. ('చక్కగా ధారణ చేసి వినాశము కాకుండా ఉంచునది' అను అర్థము వలన 'సుధా' అను పదమునకు 'అమృతము' అను అర్థము వచ్చినది). అనగా, ఈ సముద్రము నుండియే అన్నియు ఆకార విశేషాదులతో బయటకు వ్యక్తమగును. ''తతః సముద్రో అర్ణవః, సముద్రాదర్ణవాదధి, సంవత్సరో అజాయత, సూర్యాచంద్రమసౌధాతా, యథాపూర్వమకల్పయత్'' – మహా నారాయణమ్).

మనలో గూడా ఒక 'సుధాబిందువు' ఉన్నది. మనము గుర్తు పెట్టుకొనవలసిన సన్నివేశములు, సంఘటనలు, వ్యక్తులు, వస్తువులు మొదలగునవి అన్నియు మన మెదడులో బిందు రూపముద్రలలో ఉండును. ఈ బిందు రూప ముద్రలకు ఉత్పత్తి స్థానమును 'యోని' (place of birth or source or origin) అందురు. ఈ యోని గురించి తైత్తిరీయోపనిషత్తు –

'సేంద్రయోనిః, యత్రాసౌకేశాంతో వ్యపోహ్యాశీర్షకపాలే'' అని చెప్పును. మెదడులో ఈ యోని ఉండు ప్రదేశమునే 'సుధా సముద్రము' అనవచ్చును. 'సుధా' అనగా 'చక్కగాధారణ చేయుట' లేక – 'ధరించుట' అని అర్థము. ధారణ

చేయువలసిన విషయములు, సన్నివేశములు, సంఘటనలు మొదలగు వాని వివరణాదులు అత్యంత సూక్ష్మ పరిమాణములో ఈ 'యోని' యందు వుండును. Micro Film నందువలె అన్నమాట ! విత్తనముల వలె మనస్సులో సూక్ష్మ స్థితిలో ఉండునవి - తరువాత స్థూలస్థితిలో బయటకు వ్యక్తమగును. (The potential spots of information within the mind will manifest outward physically afterwords) విషయవిజ్ఞాన వ్యూహమంతయు బుద్ధిలో యిమిడి వుండును. కాబట్టి, 'సుధాసింధుస్థానము' మనలో మానసిక, లేదా - బుద్ధి స్థానము అనుకొనవలసి యుండును. కల్పలోకము నందు భౌతికముగా జరుగు వానికి ఇక్కడ నుండియే వాటి సంకల్పములకు ప్రేరణ జరుగును. కుండలినీయోగ మందు ఆజ్ఞా చక్ర స్థానమును మనస్తత్వ స్థానముగా (మనోఽపి భ్రూమధ్యే.....) (సౌందర్యలహరి - 9వ శ్లోకం) చెప్పుట ఇందులకే !

అమ్మవారు - సహస్రారమునందునుండు అయ్యవారి (శివుని) పర్యంకముపై ఆసీనురాలగుటకు ముందు, ఆసీనురాలైనపుడు గూడా ఈ ఆజ్ఞాచక్ర స్థానము అను పీఠము పైననే పాదము మోపును. ఈ ఆజ్ఞాచక్రము వద్ద వుండు అమ్మవారి పాదమును ఆశ్రయించి, ఆజ్ఞాబద్ధులై, కార్యనిర్వహణా ప్రేరితులై, త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వరుసగా - తమ సృష్టి, స్థితి, లయ కార్యములను నిర్వర్తించుచున్నారు. ఈ విషయము గూడా 'తనీయాంసం పాంసుం తవ చరణ పంకేరుహ భవం....' అన్న రెండవ శ్లోకము నందు లోగడ వివరింపబడినది.

చర్మ చక్షువులను మూసి ఆజ్ఞా చక్రస్థానమును (భ్రూమధ్య ప్రదేశమును) ధ్యానించినచో - అమ్మవారి పాదమును ధ్యానించినట్లే అగును. తత్ఫలితముగా జ్ఞప్తికి రావలసిన, అర్థము కావలసిన విషయములకు అవగాహన కలుగును. ఈ మనస్తత్వ స్థానమునే 'బిందుసరము', 'మానస సరోవరము' అని గూడా అందురు. అమ్మవారు ఆసీనురాలైన శివపర్యంకము అమ్మవారి మెట్టినిల్లు. దీనిని శ్రీ చక్రమందు కేంద్ర బిందువుగా సంకేతించుదురు. లలితా సహస్ర నామములలో 'బైందవాసనా,' 'సుమేరు శృంగమధ్యస్థా' అను నామములు ఈ బిందుస్థానమునే సూచించును. పలకవలె నుండునది గాక - మేరువుతో గూడిన దృఢమైన (Three dimensional) శ్రీ చక్రము - చూచుటకు ఒక గోపురము వలె నుండును. (దీనినే 'శ్రీ చక్ర

ఉద్ధారము' అందురు.) అట్టి గోపురమునడినెత్తిన కేంద్రము వద్ద ఒక బిందువుండును. శ్రీ చక్రములో ఇదియే అమ్మవారి ఆసనము. ఇది మనలో సహస్రార చక్రము నందు వుండును. (బ్రహ్మరంధ్ర ప్రాంతమే సహస్రార చక్ర స్థానము) అమ్మవారు పాదము వుంచు పీఠస్థానము మనలో ఆజ్ఞా చక్రము వద్ద వుండును.

**మేరువు**

మన వెన్నెముకను – 'బ్రహ్మదండము', లేదా 'మేరుదండము' అని గూడా అందురు. ఈ వెన్నెముకపైకొన మనకు మేరు శృంగము అగును. భూగోళము యొక్క – దక్షిణ, ఉత్తర ధ్రువములను కలుపు ధ్రువాక్షము (Polar axis) భూగోళమునకు మేరు దండమగును. ఇది భూమి మీద జీవుల సామూహిక మేరువును సూచించును. అట్లే, భూమి వంటి ఇతర గ్రహములకు గూడా వాటి వాటి మేరు దండములు వాటి వాటికి వుండును. ఈ గ్రహములన్నిటి సామూహిక మేరు దండమును ఊహించినచో అది మన సూర్యకుటుంబమునకు మేరు దండ మగును. ఇట్లే, బ్రహ్మాండములోని వివిధ సూర్యకుటుంబముల మేరు దండములకు ఒక సామూహిక మేరు దండమును ఊహించినచో అది మొత్తము బ్రహ్మాండమునకు మేరు దండవుగును. ఈ మేరు దండపు ఉత్తరపు కొన కేంద్రమును – బ్రహ్మాండములో అమ్మవారు ఉండు స్థానముగా సమన్వయ పరచుకొనవలెను. ఈ బ్రహ్మాండము యొక్కఅక్షము (Axis)ను చీకటి గల రాత్రి పూట ఆకాశములో మనము చూచు పాలపుంత (Milkway)గా అర్థము చేసుకొనవలెను. మన వెన్నెముక వలెనే ఇది గూడా ఆకాశములో ఉత్తర దక్షిణ దిశలవైపుగా విస్తరించి వుండును. దీని ఉత్తర దిశవైపు కొన బ్రహ్మాండ మేరువునకు 'శిఖరము' లేదా 'శృంగము' అగును. వెన్నెముకను ఆధారముగా చేసుకొని జీవి దేహము ఏర్పాటైనట్లు – ఈ పాలపుంతను ఆధారముగా చేసుకొని బ్రహ్మాండము ఏర్పడునని ఊహించు కొనవలెను. (బ్రహ్మాండము లోని ఈ పాలపుంతనే పురాణ కావ్యాదులలో క్షీరసముద్రముగా సంకేతించిరి.)

**సురవిటపివాటీపరివృతము**

'సుర' లనగా దేవతలు. 'విటపి' అనగా వృక్షము. కాబట్టి, 'సురవిటపి' అనగా – దేవతలు ఉండు లోకము నందలి వృక్షము. అనగా 'కల్పవృక్షము'.

కల్పవృక్షమనగా 'కల్పనము' చేయగల వృక్షము. అనగా, మనస్సు కోరిన వాటిని కల్పించి మనకు దర్శింప చేయగల శక్తి - సంకల్ప కేంద్రము వద్ద అమ్మవారుండగా - కోరిన వాటిని కల్పించ గల ఇట్టి కల్ప వృక్షములన్నియు ఆమె చుట్టును పరివేష్ఠించి యుండును. శ్రీ చక్రములో కేంద్ర బిందువు - సంకల్పలోక కేంద్రమైన (Administration centre) అమ్మవారిని సూచించగా - శ్రీ చక్రములోని వృత్త పరిధులపై వుండు బిందువులు కల్ప వృక్ష సమూహమును సూచించును. ఇవి అమ్మవారి సంకల్పములను కార్య రూపములో (Establishment (or) Implementing staff) నిర్వహించునవి.

**మణిద్వీపము**

'మణి' అనగా రత్నము (Gem). రత్నమనగా స్వయంప్రకాశ, ప్రసార, ప్రచోదన లక్షణములు (Self or auto radiating communcating and stimulating characteristics) కలది. 'ద్వీప' మనగా చుట్టును నీరు లేదా జలము గల ప్రదేశము. ఆపస్సు, లేదా - జలము - సృష్టి ప్రక్రియకు అత్యవసరమైనది. (ఆపోవా ఇదగ్ సర్వం, విశ్వాభూతా న్యాపః.... భూర్భువస్సువరాప ఓం) అనగా, సృష్టికర్త్రి అయిన జగజ్జనని సృష్టి ప్రక్రియకు అత్యవసరమైన ఆపస్సులచే పరివేష్ఠింపబడి, స్వయం ప్రకాశ, ప్రసార, ప్రచోదన లక్షణములు గల మణిమయ ద్వీపము నందు ఉండును. మణుల ఈ లక్షణములు మనలోని అంతః స్ఫురణమును, మేధాశక్తిని, తేజస్సును సూచించును.

**నీపోపవనవతి**

'నీప + ఉపవనవతి' - అనగా, కడిమి చెట్ల ఉద్యానవనము నందుండునది. వర్షముతోను, మబ్బులతోను ప్రత్యేక సంబంధమును కలిగిన వాటిలో కడిమి చెట్లు ప్రధానమైనవి. దివిని భువిని వర్షధారలు కలుపును. ఈ వర్షధారలలోని ఆపస్సులు సృష్టికి దోహదపడును. ఈ సత్సంధానమును నిరంతరము కోరునవి కడిమి చెట్లు. అందుచేత అమ్మవారికి ఈ చెట్లు, ఈ చెట్లు గల ఉద్యానవనము ఇష్టము. మనలో జలధాతువుల ఉనికిని, ఉత్పత్తిని ఈ కడిమి చెట్లు సూచించును.

**చింతామణి గృహము**

అమ్మవారుండు ఇంటి గోడలు చింతామణులే! కోరినవి ఇచ్చు గుణము

కలవి చింతామణులు. ఇంటి ఇటుకలకు గూడా దాన గుణము. (అనగా కోరికలు తీర్చు గుణము). అంతగానున్నపుడు ఆ యింటి ఇల్లాలైన అమ్మవారు ఎటువంటి అనుగ్రహము కలదై యుండునో ఊహించుకొన వచ్చును. చింతామణులకు ఆ దాన గుణము - అమ్మవారు తమ మధ్య ఉండుట వలననే వచ్చి వుండవలెను. అనగా, ఆమె దాతృత్వ గుణము ఆమె యింటి గోడలకు గూడా అబ్బినదన్నమాట! ప్రతి వ్యక్తిలోని దాతృత్వ గుణమును ఈ చింతామణులు సూచించును.

**శివాకార మంచము**

'శివాకారే మంచే' అనగా పరమ నిర్మలానంద కారకమైన మంచము. శ్రీ చక్రము నందు కేంద్రము వద్ద గల ప్రదేశమే శివాకార మంచము. ఇది శివ శక్తుల సమాగ, సంయోగ స్థానము. ఇది - మనలో సహస్రార స్థానమును సూచించును. ('సహస్రారే పద్మే (రవ్యే) సహరహసిపత్యా విహరసే' - 9వ శ్లోకం - సౌందర్యలహరి). అందుచే, ఈ స్థానము పరమ పవిత్రమైనది, పరమోన్నతమైనది. పరమానంద కారకమైనది. మోక్ష ప్రద మైనది. ఉపాసనా సిద్ధిని, యోగ లక్ష్యమును చేకూర్చునది. ఈ మంచమునకు ఉండు నాలుగు కోళ్ళను - బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరులు గాను, మంచముపై తల్పమును పరమ శివుని గాను (సదాశివుని గాను) సంకేతించి చెప్పుట శ్రీ విద్యా సంప్రదాయము.

**మంచము - అంతరార్థము**

నాలుగు కోళ్ళ మంచము అనగానే మనము ఎఱుగున్న మంచము (Cot) వలె నుండునను కొనుట సహజము. ఇది సరికాదు. ఇది సంకేత భాష. కుండలినీ శక్తి - వెన్నెముక లోని సుషుమ్న ద్వారా ఊర్ధ్వగతిని పొందుచున్నపుడు - మూలాధార, స్వాధిష్ఠానములకు సంబంధించిన బ్రహ్మగ్రంథి (Brain of Instincts and Desires), మణిపూర, అనాహతములకు సంబంధించిన విష్ణుగ్రంథి (Brain of Emotions or Affections), విశుద్ధి, ఆజ్ఞాచక్రములకు సంబంధించిన రుద్రగ్రంథి (Brain of intellect or wisdom), లలాటమునకు శిరోమధ్య భాగమునకు సంబంధించిన ఈశ్వర స్థానమును - అధిగమించును. అనగా, సుషుమ్నా మార్గములో ఇవి మైలు రాళ్ళు వంటివి (Cardinal points). (రైల్వే పరిభాషలో చెప్పుకొనవలెనన్నచో ఇవి ముఖ్యమైన స్టేషన్ల వంటివి, ఈ నాల్గింటిని నాలుగు మంచపు

కోళ్ళతో సూచించిరి. ఇక మనలోని సహస్రారకమల స్థానము నందుండు సదాశివుని – మంచముపై ఉండు తల్పముగ (పరుపు, లేదా – దుప్పటి) సూచించిరి. (ఈ విషయము రాబోవు 9వ శ్లోకములో మరింత వివరింపబడును). దీనినే సుమేరు శృంగ మధ్యస్థానముగా సంకేతించిరి. 'మేరు' అను పదములో 'మ్ + అ + ఇ + ర్ + ఉ' అను ఐదు అక్షరములు అనగా వర్ణములున్నవి. 'సుమేరు' అనగా – 'సువర్ణములు' అగును. వీటిలో 'మ్, అ, ర్, ఉ'–లు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులను, మధ్య నున్న 'ఇ' అమ్మవారి నివాసమును – సూచించును. (పంచ భూతములు, పంచ కోశములే ఈ నాలుగు కోళ్ళు, తల్పము గల మంచముగా సంకేతించినట్లు గూడా చెప్పుకొనవచ్చును.)

**పరమశివ పర్యంకము**

పరమశివుడు ప్రపంచమునకే ప్రథముడు. (Absolute origin) ఆయన నుండియే అమ్మవారు అను భౌతిక ప్రపంచము వ్యక్తమైనది. సంఖ్యాత్మకముగాను, ప్రాదేశాత్మకముగాను గూడా అమ్మవారు ఈ పరమ శివుని నుండి విశ్వముగా విస్తరిల్లినదను విషయము ఈ 'పరమశివ పర్యంక నిలయాం' అను పదములలో నిగూఢముగా గలదు.

**సంఖ్యాత్మకముగా...**

ప్రపంచమునకే ప్రథముడు కాబట్టి – పరమశివుడు అంకెలలో మొదటి దైన 1 (ఒకటి) ని సూచించును. 'అంక' మనగా 'అంకె'. పర్యంకమనగా = పరి + అంకము = పరిపూర్ణమైన అంకె. అంకెలలో పరిపూర్ణమైనది 9 (తొమ్మిది). (అంకె అనగా Digit, సంఖ్య అనగా Number. సంఖ్యలు తొమ్మిది కన్నా పెద్దవి ఉండవచ్చును కాని, అంకెలలో పెద్దది 9 మాత్రమే అగును). కాబట్టి, 'పరమశివ పర్యంక నిలయాం' అను పదములకు – 'సృష్టిగా విచ్చు కొనుటలో ఒకటి నుండి తొమ్మిది వఱకు గల నవబ్రహ్మలను (నవ ప్రజాపతులను) అంకెల లోకమున తన నిలయముగా గలిగినది' అని అర్థము. ''సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి...?'' అని తైత్తిరీయోపనిషత్తు చెప్పును. దీని అర్థమేమనగా – ఒంటి గింటి రామలింగము వలె నున్న శివునకు ఎక్కువ మందిగా అవవలెనని కోరిక గలిగనదట – ఈ కోరిక కలగని శివుని '0' (Zero) తోను, కోరిక గలిగిన క్షణము నందున్న శివుని '1' తోను

సంకేతించుదురు. అన్నిరకముల జీవులతో పూర్తి ప్రపంచముగా విచ్చుకొనబోవుస్థితిలోని శివుని – కోరిక పూర్తిగా నిండిన లేదా – 'కామము పూర్తిగా నిండిన ఈశ్వరుడు' లేదా 'కామేశ్వరుడు' అని సంకేతించుదురు. (కామేశ్వరుడనగా – 9 నెలలునిండి సృష్టిని ప్రసవింపబోవు పూర్ణగర్భిణిగా వూహించుకొవనవలెను). అందువలననే అట్టి కామేశ్వరుడు '9' అంకెను సూచించును. అనగా, 1 నుండి 9 వఱకు జరుగు విస్తరణ వ్యక్త సృష్టికి సంబంధించినది గాను, '0' అవ్యక్త స్థితికి సంబంధించినదిగాను సమన్వయము చేసుకొనవలెను. (నేను వ్రాసిన లలితా సహస్రనామ వివరణలోని 'శివకామేశ్వరాంకస్థా' అను నామమును ఇక్కడ సమన్వయము చేసుకొనవలెను.)

**ప్రాదేశాత్మకముగా ....**

విశ్వములో మొట్టమొదటిగా ఒంటరిగా నున్న పరమశివుడు ఒక 'బిందువు ను (Point) సూచించును. 'అంక' మనగా ఉనికి, మచ్చ, చోటు అను అర్థములు గూడ గలవు. పర్యంకమనగా = పరి + అంకము = పరిపూర్ణమైన చోటు, లేదా – బ్రహ్మాండము అనగా ఈ విశాల విశ్వమంతయు తన నిలయముగా గలది'. అని అర్థము. మన చిత్తము నందు కూడా అత్యంత సూక్ష్మమైన బిందువు నుండి ఊహించలేనంత విశ్వము గూడా ఇమడగలదు. ఈ విధముగా అతి స్వల్పము నుండి అత్యధికము వరకు మన చిత్తములో నున్నది ఆ చిన్మయి (చిత్ + మయి) అయిన అమ్మవారే !

**చిదానందలహరి**

పైన తెలిపిన అమ్మవారు 'చిదానందలహరి' ట! అనగా 'జ్ఞానానందలహరి', 'లహరి' అనగా 'తరంగము' (అల). అమ్మవారిని ఒక్కసారి తలంచుట అనగా – మన మానస సరోవరము నందు 'ఆనంద బిందువు' వద్ద 'అల' జడిని కలుగ జేయుటయే! ఈ బిందు పరిమాణములోని అలజడి క్రమ క్రమముగా వృద్ధి చెందు తరంగములుగా మన మానస సరోవరమున విస్తరిల్లి, మనస్సంతయు జ్ఞానా నందముతో నిండిపోవును. నిరంతరము (అనగా – వ్యవధి లేకుండా) ఇట్టి స్థితిలో ఉండుటను యోగసిద్ధిని, శుద్ధిని సూచించును. (ఇట్టి స్థితిలో – మన 'శ్వాస' అను 'హంస' – మన మానస సరోవరము నందు నిలకడ స్థితిలో ఉండును.)

**భజంతి త్వాం ధన్యాః కతిచన**

పైన తెలిపిన విధముగా అమ్మవారిని అంతర్ముఖముగా ధ్యానించి సేవించి తరించువారు బహు స్వల్ప సంఖ్యలో మాత్రమే ఉందురని శంకరులు చెప్పుచున్నారు. ఆత్మానందము నందుటకు - తామ్ర, రజత, స్వర్ణ, శ్రీ చక్రయంత్రాదులతో ఆడంబరములైన ఆరాధన, అర్చనాదులు అక్కరలేదనియు, స్థిర చిత్తముతో అంతర్ముఖులై అమ్మవారిని ధ్యానించి గూడా సులువుగా పొందవచ్చుననియు, అయినను ఎక్కువ మంది ఆడంబరములు, ఆటోపములు లేనిదే సంతృప్తిని పొందలేరనియు ఈ శ్లోక సూచన.

లలితా సహస్ర నామమునందలి - 'శివకామేశ్వరాంకస్థా', 'సుమేరు శృంగమధ్యస్థా', 'బైందవాసనా,' 'సుధాసాగర మధ్యస్థా', 'శివశక్త్యైక్యరూపిణీ', పంచబ్రహ్మాసన స్థితా' మొదలగు నామములకు - ఈ శ్లోకమునకు చక్కని సమన్వయము కలదు. 55వ నామమైన 'సుమేరు శృంగ మధ్యస్థా' నుండి 61వ నామమైన 'సుధాసాగర మధ్యస్థా' వరకు గల 7 నామములు ఈ శ్లోకమునకు సరిపోవును.



## సంస్కృత శ్లోకము - 9

**శ్లో. మహీం మూలాధారే, కమపి మణిపూరే, హుతవహం**
**స్థితం స్వాధిష్ఠానే, హృది మరుత, మాకాశ ముపరి,**
**మనోఽపి భ్రూమధ్యే, సకలమపి భిత్వా కులపథం,**
**సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే.**

## అనువాద పద్యము

**చం. మూలాధారమునందు భూమి, నుదకమ్మున్ రత్నపూరమ్మునన్,**
**జ్వాలాధీశునధిష్ఠ మం, దెడదలో శ్వాసన్, విశుద్ధమ్మునన్**
**నీలాకాశము, నాజ్ఞలోన మనసున్, భేదించి యీ మార్గపున్**
**పై లోకమ్మున నీవు సేరుదువుగా భర్తన్ సహస్రారలోన్.**

## టీక

(జగజ్జననీ!) మూలాధారే = మూలాధారచక్రమునందు, మహీం = పృథివీ తత్త్వమును, మణిపూరే = మణిపూర చక్రము నందు, కం = ఆపస్తత్త్వము, అనగా-జలతత్త్వమను, స్వాధిష్ఠానే = స్వాధిష్ఠాన చక్రము నందు, హుతవహం = అగ్నితత్త్వమును, హృది = హృదయమందలి అనాహత చక్రము వద్ద, మరుతమ్ = వాయు తత్త్వమున, ఉపరి = పైన ఉన్న విశుద్ధి చక్రము నందు, ఆకాశం = ఆకాశతత్త్వమును, భ్రూమధ్యే = కనుబొమల నడుమవద్ద గల ఆజ్ఞా చక్రము నందు, మనోఽపి = మనస్తత్వమును గూడా (కలుపుకొని), కులపథం = కులమార్గము, అనగా - సుషుమ్నామార్గమును, సకలం + అపి = సకలమపి = అంతను కూడ, భిత్త్వా = ఛేదించుకొని (చివరకు), సహస్రారే - పద్మే = సహస్రార కమలమందు, రహసి = ఏకాంతముగా నున్న, పత్యాసహ = భర్తయగు సదాశివునితో గూడి, విహర = క్రీడించుచున్నావు.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! మూలాధార చక్రమందు పృథివీ తత్త్వ మును, మణిపూరమందు జలతత్త్వమును, స్వాధిష్ఠానమందు అగ్నితత్త్వమును, హృదయ మందలి అనాహత మందు వాయు తత్త్వమును, విశుద్ధి యందు ఆకాశ తత్త్వమును, భ్రూమధ్యమందుండు ఆజ్ఞా చక్రమందు మనస్తత్వమును – ఈ విధముగా సుషుమ్నా మార్గము నంతను ఛేదించుకొనుచు పోయి, చిట్టి చివరకు సహస్రార కమలమందు ఒంటరిగానున్న నీ పతియైన సదాశివునితో కలసి రహస్యముగా విహరించుచున్నావు (గదా!)

## వివరణము

గత రెండు శ్లోకములలోను అమ్మవారి రూపరేఖ. వేషధారణ, చిరు నామముల గుఱించి చెప్పబడినది. ప్రస్తుత శ్లోకము శ్రీవిద్యకు, కుండలినీ యోగమునకు అత్యంత ప్రాధాన్యమైనది. ప్రతి వ్యక్తిలోను కుండలినీ శక్తి రూపములో నుండు అమ్మవారు యోగసాధనా క్రమములో ఏ విధముగా చలించి, సాధకుని తరింప చేయునది – సంక్షిప్తముగా, బీజప్రాయముగా ఈ ప్రస్తుత శ్లోకమునందు

తెలుపబడినది. సౌందర్యలహరిలోని మిగిలిన శ్లోకములన్నియు ఒక ఎత్తు - ఈ శ్లోకము ఒక్కటీ ఒక ఎత్తు. కుండలినీ యోగ రహస్యమును వివరించుటకు ఈ ఒక్క శ్లోకము చాలును. ఈ శ్లోకము నందు ముఖ్యముగా మూలాధారాది చక్రములగుఱించి, వాటి తత్త్వముల గుఱించి తెలుపబడినది. ఈ వివరములకు ముందుగా మరికొన్ని ప్రాథమిక విషయములు చెప్పవలసిన అవసరమున్నది.

**ఊర్ధ్వ జీవులు (Vertical beings) కుండలినీ యోగము**

మానవ జాతిలోనికి అడుగు పెట్టక పూర్వము ప్రతి జీవికి వెన్నెముక ఉండవచ్చును, ఉండకపోవచ్చును. వెన్నెముక ఉన్న జీవులలో రెండు రకములు. వెన్నెముక అడ్డముగా నున్న జీవులు. ఇవి జంతువులు. వీటి వెన్నెముక సూర్యోదయ సూర్యాస్తమయ బిందువును కలుపు రేఖవలె అడ్డముగా (Horizontal) ఉండును. కాబట్టి, వీటిని తిర్యక్ జీవులు అందురు. (జిరాఫీ వంటి ఎత్తయిన మెడగల జంతువులకు గూడా వెన్నెముక అడ్డముగానే ఉండును.)

మిట్ట మధ్యాహ్నపు సూర్యుని, అర్ధరాత్రి సూర్యుని కలుపు రేఖవలె నిట్ట నిలువుగా (Vertical) వెన్నెముక ఉండు జీవులు మానవులు. ఈ ఊర్ధ్వ జీవులకు సంబంధించినదే కుండలినీ యోగము. మిగిలిన జీవులకు కుండలినీ యోగమును సమన్వయింప ప్రయత్నించరాదు.

**సృష్టి - మానవుడు**

"ఏమియు లేనట్లు కనబడు (Seeming nothingness) చోటు (Space) నుండి అన్నియు ఉన్నట్లు కనబడు (Apparent something) ఈ భౌతిక ప్రపంచము (Material World) మరియు అందలి జీవులు ఏ విధముగా ఏర్పడుచున్నారు?" అను ప్రశ్నకు సమాధానముగా తైత్తరీయోపనిషత్తు నందు -

"ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోన్నమ్! అన్నాత్పురుషః।" అను ఒక చక్కని మంత్రము గలదు. దీని అర్థమేమనగా ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథివి, పృథివి నుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, అన్నము నుండి పురుషుడు ('పురుషుడ'నగా భౌతిక దేహము

యొక్క యజమాని అయిన జీవుడు. జీవునకు లింగభేదము లేదు కాబట్టి - 'పురుష' పదము స్త్రీ, పురుషులిద్దరికినీ వర్తించును.)

పైన చెప్పిన దంతయూ సూక్ష్మము నుండి స్థూలమునకు జరుగు సృష్టి క్రమము. దీనికి వ్యతిరేక (Riverse) మార్గమే స్థూలము నుండి సూక్ష్మమునకు జరుగు ప్రళయ మార్గము. ప్రళయమనగా - చక్కగా లీనమగుట. అనగా, తను ఎక్కడ నుండి వ్యక్తమైనదో అట్టి చోటు లోనికి లీనమగుట (చోటు లోనికి ఈ భౌతిక సృష్టి అంతయులీనమగుట) అని అర్థము. అంతేగాని, నశించిపోవుట అని అర్థము కాదు. (పంచదార ద్రావణములో, పంచదార వినాశము కాకుండా, కరిగి ఈ నీటిలో లీనమై ఉన్నట్లన్నమాట !) ఈవిధమైన సృష్టి ప్రళయములు ఒక దాని తరువాత ఒకటి తారు మారగుచు (Alternate) నిరంతరము (Never ending) (Never ending) ఆదినుండి ఇప్పటివరకు జరుగుచూనే వున్నవి. ఇకముందు కూడా అట్లే జరుగును. బ్రహ్మాండ పరిధి (Macroscopic scale) యందును, పిండాండ పరిధి యందును (Microscopic scale) గూడా ఇట్లే జరుగును.

**పిండాండ పరిధిలో**

మానవుడు తాను బ్రతకుటకు అవసరమైన గాలి, అన్న పానీయాదులను గ్రహించి - రస, రక్త, మాంస మేదో ఉస్థిమజ్జా శుక్రములనెడి సప్త ధాతువులను (Seven tissues) ఏర్పరచుకొని, చివరకు అన్నిటి సారాంశముగా సూక్ష్మ స్థితిలో నుండు చివరి ధాతువైన శుక్రము నందు బీజస్థితిలో నిక్షిప్తుడగును. భౌతిక దేహ స్థూల స్థితి నుండి ఈ శుక్ర బీజ సూక్ష్మ స్థితి వఱకు మారు మార్గము మానవునకు సంబంధించిన ప్రళయ మార్గమును సూచించును. కాని, ఇది ఆ ప్రళయ మార్గములో మొదటి భాగము మాత్రమే! శుక్రస్థితి నుండి ఇంకనూ సూక్ష్మతరమైన స్థితులలోనికి మారి బాహ్య ప్రపంచమునకు, భౌతిక దేహమునకు అతీతముగా ఉంటూ మోక్షానందస్థితిని చేరుట మిగిలిన రెండవ భాగములో జరుగవలెను. ఈ రెండవభాగ లక్ష్యమును సంధ్యావందనము, భక్తియోగము, జ్ఞాన యోగము, కుండలినీ యోగము మొదలగు రాజయోగములవంటి ఉపాసన, సాధన మార్గములలో సిద్ధింప జేసుకొనవలెను.

**శుక్రము యొక్క త్రివిధ వినియోగములు**

శుక్రమును మూడు విధములుగా వినియోగించ వచ్చును.

1. కేవలము కామ పరితృప్తి కొఱకై శుక్రమును అధో మార్గమును పట్టించుట. ఇట్టి స్థితిలోని శుక్రమును దక్షిణాగ్నితోను, 'భోగవతీ' అను పేరుతో పిలువబడు గంగానది తోను పురాణాదులలో సంకేతించుదురు.
2. సత్సంతానము కొఱకై శుక్రమును అధోమార్గము పట్టించి గర్భమునందు పిండోత్పత్తి ద్వారా తిరిగి దేహమును పొందుట. ఇట్టి స్థితిలోని శుక్రమును 'గార్హపత్యాగ్ని' తోను 'మందాకినీ' అనుపేరుతో పిలువబడు గంగానదితోను పురాణాదులలో సంకేతించుదురు. ఈ రెండు విధములైన అధోమార్గములు గూడా 'పితృయాన మార్గము'ను తెలియజేయును. ఇక
3. శుక్రమును అధోమార్గము పట్టించకుండా – ఓజస్సు, సహస్సు, భ్రాజస్సు మొదలైన అత్యంత సూక్ష్మతరమైన ధాతువుల రూపములలో వెన్నెముక వెంబడి ఊర్ధ్వమార్గమును పట్టించుట. ఈ స్థితిలోని శుక్రమును 'ఆహవ నీయాగ్ని'తోను, 'వియద్గంగా' అను పేరుతో పిలువబడు గంగానదితోను పురాణాదులలో సంకేతించుదురు. ఈ ఊర్ధ్వగమన మార్గమునే 'దేవయాన మార్గము' అని అందురు. (భోగవతిని – 'పాతాళగంగ' అనియు, మందాకినిని 'భూతల గంగ'యనియు, వియద్గంగను 'ఆకాశగంగ' అనియు అందురు.) ఈ చిట్ట చివరకు చెప్పబడిన శుక్ర వినియోగమునకు కుండలినీ యోగమునకు సంబంధము గలదు.

**ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు**

నాడులనగా నరములు కాదు. నరములు భౌతికమైనవి. వీటిని కంటితో చూడగలము. నాడులు భౌతికమైనవి కావు. ఇవి X - కిరణములు, అయస్కాంత బలరేఖలు వంటివి. వీటిని మనము కళ్ళతో చూడలేకపోయినను వాటి ప్రభావమును గుర్తించగలము గదా ! (ఈ నాడుల గూర్చి పూర్తి అవగాహన కలుగుటకు నేను వ్రాసిన శ్రీ లలితా సహస్ర నామ వివరణ – ప్రథమ భాగ అనుబంధమును చదువు కొనవలెను.) వెన్నెముక మధ్యలో నిలువు వరుసలో మూడు నాడులుండును. 1 ) ఇడానాడి, 2) పింగళానాడి, 3) సుషుమ్నానాడి

**I. ఇడానాడి**

ఇది సూక్ష్మము నుండి స్థూలము వైపుగా, అనగా – పై నుండి క్రిందకు

పని చేయును. ఇది పంచ భూతాత్మక పదార్థమును పుట్టించుటకు (To precipitate or manifest) ఉపకరించును. ఇది చంద్రాత్మకము. ఇది 'పితృయానము' నకు సంబంధించినది. దీనిని పురాణాదులలో 'గంగానది' తో సంకేతించుదురు. మరియు ఇది బాహ్య భౌతిక లోకమునకు – మనకు మధ్య సంధాన కర్తగా పనిచేయును.

**2. పింగళానాడి**

ఇది స్థూలమును సూక్ష్మముగా మార్చుటకు ఉపయోగపడును. పంచభూతాత్మక పదార్థమును సూక్ష్మతమ మార్గమువైపుగా (sublimation) పట్టించుటకు ఈనాడి ఉపకరించును. ఇది సూర్యాత్మకము. ఇది మనకు – మనలోని సూక్ష్మమైన అంతర్లోకములకు మధ్య సంధానకర్తగా వ్యవహరించును. ఈ నాడి 'దేవయానము' నకు సంబంధించినది. దీనిని పురాణాదులలో 'యమునా' నదితో సంకేతించుదురు.

ఈ రెండు నాడుల గురించి ఈక్రింద తెలిపిన శ్లోకములను ఇక్కడ గుర్తు చేసుకొనుట సముచితము.

**శ్లో. దక్షిణే 'పింగళానాడీ' 'వహ్నిమండల' గోచరా**
**'దేవయాన' మితిజ్ఞేయం పుణ్యకర్మానుసారిణే.**

**శ్లో. 'ఇడా' చ వామనిశ్వాసా 'సోమమండల' గోచరా**
**'పితృయాన' మితిజ్ఞేయం నామ మాశ్రిత్య తిష్ఠతి.**

('వహ్నిమండల' – సూర్యుని, 'సోమమండల' – చంద్రుని సూచించునని అర్థము).

**3. సుషుమ్నానాడి**

పైన తెలిపిన రెండు నాడుల మధ్య అత్యంత సూక్ష్మమైన ప్రదేశము వేరొక నాడిగా వర్తించును. దీనినే 'సుషుమ్నా' నాడి అందురు. ఇది అగ్నితత్త్వము. దీనిని పురాణాదులలో అంతర్వాహిని అయిన 'సరస్వతీనది' తో సంకేతించుదురు. శుక్రము తరువాత తేజోమయ ధాతువుల రూపములో ఉండు జీవశక్తినే – ఈ సుషుమ్నానాడి యందలి కుండలినీ శక్తి అనియు, సుషుమ్నాగ్ని అనియు అందురు. విశ్వములోని సమస్త జీవుల సామూహిక లేదా సమష్టి కుండలినీ శక్తిని (cosmic kundalini) 'త్రిపుర సుందరి' పేరుతో సంకేతించుదురు. ఈమెయే 'శివశక్తి' అనియు,

'వ్యక్తిగత కుండలిని, లేదా – వ్యష్టి కుండలినిని 'జీవశక్తి' అనియు అందురు. దీనినే లలితా సహస్ర నామ స్తోత్రములో 'బిసతంతు తనీయసీ' అనునామముతోను, మంత్రపుష్పములో 'పీతా భాస్వత్యణూపమా ! ... సోఽక్షరః పరమస్స్వరాట్' వరకు చెప్పిన మంత్రములలోను, సంధ్యావందనము నందు ''ఆయాతు వరదా దేవి అక్షరం, బ్రహ్మ సమ్మితమ్... ఓజోసి, భ్రాజోసి, దేవానాంధామ నామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసి సర్వాయుః, అభిభూః ఓం'' అను మంత్రములలో ప్రతిపాదించిరి. దీనిని ఆంగ్లమున (The Intelligent electricity or Mental electricity) అని కొందఱు అనువదించిరి.

(Cerebral menengites వంటి మెదడుకు సంబంధించిన వ్యాధులు వచ్చినప్పుడు వెన్నెముక నుండి Spinal fluid ను తీయుచుందురు. వెన్నెముకలో ఇది తేజో రూపములో నున్నను, సిరంజిలోనికి ఎక్కినపుడు అది fluidవలె వచ్చును. అత్యవసర పరిస్థితులలో తప్ప అనవసరముగా చీటికి మాటికి ఈ fluid ను తీయించరాదు. ఎన్నిసార్లు తీయించినచో అన్నిసార్లు ఆ వ్యక్తిలోని 'ధీశక్తి గుణకము' 'Intelligent quotient అనగా 'I.Q.' తగ్గును). వెన్నెముకలోని ఈ సుషుమ్నా మార్గమునే కులపథము అని కూడా అందురు.

ఉపాసకుని సాధనలో – సుషుమ్నానాడి ద్వారా ఈ కుండలినీ శక్తి అను అమ్మవారు – వెన్నెముక క్రిందకొన నుండి బ్రహ్మరంధ్రము వరకు ఆరోహణము చెందును. ఇట్లు ఆరోహణము జరుగుచున్నప్పుడు సాధకునిలో జరుగు మార్పులే ఈ ప్రస్తుత శ్లోకము నందు తెలుపబడినవి. సుషుమ్నా మార్గము నందలి కొన్ని నిర్దేశిక బిందువుల (Cardinal points) వద్ద పంచభూతములను, మనస్సును నియంత్రణ (control) చేయు శక్తి కేంద్రములు (Vital centres) వుండును. వీటినే 'షట్చక్రములు' అందురు. వీటికి – వైద్య శాస్త్రమునందు సూచించు Brain, spinal cord, Autonomic plexusesకు చక్కని సమన్వయము గలదు.

**షట్చక్రములు**

1. **మూలాధారము** : దీనినే 'ఆధార చక్రము' అని గూడా అందురు. ఇది వెన్నెముక క్రింది కొనవద్ద ( గుద స్థానము వద్ద) ఉండును. తల దగ్గర నుండి పాదముల వరకు గల మానవ శరీరమును వరుసగా అశ్విని నుండి రేవతి వరకు గల 27 నక్షత్రములతో న్యాసము చేసినచో వెన్నెముక క్రింది కొన వద్దకు

'మూలా' నక్షత్రము వచ్చును. ఇది ధనూరాశిలో ఉండును. మూలా నక్షత్ర ప్రాంతము వద్ద ఉండు చక్రము గాబట్టి దీనిని 'మూలాధార చక్రము' అనిరి. మనము కూర్చున్నప్పుడు మన శరీరము లోని భారమంతయు ఈ బిందువు వద్దనే ఆధారపడి పని చేయును. ఈ 'ఆధార బిందువు' వద్ద ఉండు చక్రము గాబట్టి దీనిని 'ఆధార చక్రము'' అనిరి. ఆంగ్లమున దీనిని 'Base centre' అందురు. ఇది మన శరీరములోని పృథివీ తత్త్వమును (solid matter) నియంత్రణ చేయును. ఈ చక్రమునందు తేడా వచ్చినచో శరీరము నందు గట్టిగా నుండు పదార్థములకు మార్పు వచ్చును.

2. **స్వాధిష్ఠానము :** ఇది ప్లీహము ఉండు ప్రాంతములో ఉండును. మన శరీరములోని శీతోష్ణాగ్నులను నియంత్రణ చేయును. దీనిని ఆంగ్లమున 'spleen centre' అందురు. దీని తేడా వలన అజీర్తి, మందము, జ్వరములు మొదలగు వ్యాధులు వచ్చును.

3. **మణిపూరము :** ఇది నాభివద్ద ఉండును. దీనిని ఆంగ్లమున 'Solar plexus' అందురు. శరీరము నందలి ద్రవ పదార్థములను, అనగా – పంచభూతములలో ఒకటైన ఆపస్తత్వమును నియంత్రణ చేయును. ఈ చక్రము నందు తేడా వచ్చిసరిగా పనిచేయనిచో జలధాతు సంబంధమైన జలోదర, వరిబీజాది వ్యాధులు సంక్రమించును.

(**ముఖ్య గమనిక :** ఈ మణిపూర చక్రము అగ్నితత్త్వమునకు సంబంధించి నదిగా కొందరు చెప్పుదురు. కాని, అట్లు చెప్పుట అంత సమంజసము కాదేమోనని ఈ క్రిందొ తెలిపిన కారణముల వలన అనిపించును.

i) మణి పూర పదము నందు 'పూరణ' పదము వున్నది. పూరణము వాయువునకు జలమునకు చెల్లును గాని, అగ్నికి చెల్లదు.

ii) నారాయణునికి నాభి నుండి పద్మము పుట్టినది. పద్మము జలము నందు పుట్టును గాని అగ్నియందు కాదు. కాబట్టి నాభివద్ద ఉండు ఈ మణి పూర చక్రము జలతత్త్వమునకు సంబంధించినది అనుటయే సమంజసము.

iii) శంకరాచార్యుల వారు గూడా 'కమపిమణిపూరే' అని ఈ ప్రస్తుత శ్లోకము నందు తెలిపిరి. అనగా మణిపూరము వద్ద 'జలతత్త్వము' అని అర్థము.

పైన తెలిపిన మూడు కారణముల వలన మణిపూర చక్రము జలతత్త్వ సంబంధ

మైనది అని గ్రహించుట యుక్తము. కాని, ఒక్క సంగతి ! శరీరము నందు వెన్నెముక వెంబడి వుండు వరుస మార్గములో మాత్రము మూలాధార చక్రము తరువాత స్వాధిష్ఠానము, ఆపైన మణిపూరము ఉండును).

4. **అనాహతము :** ఇది గుండెకాయలోని హృదయము నందు వుండును. అందులకే దీనిని ఆంగ్లమున 'Heart centre' అని అందురు. మన శరీరము నందలి వాయు పదార్థములను, అనగా – పంచ భూతములలో ఒకటి అయిన వాయుతత్త్వమును ఈ చక్రము నియంత్రణ చేయును. వినాళ గ్రంథులలోని 'Thymus gland' కు దీనికి సంబంధము గలదు. ఈ చక్రము నందు తేడా వచ్చినచో శ్వాససంబంధ మైన, వాత సంబంధమైన, హృదయ సంబంధమైన వ్యాధులు వచ్చును.

5. **విశుద్ధి :** ఇది గొంతులో 'Vocal cords' వద్ద ఉండును. అందులకే దీనిని ఆంగ్లమున 'Throat centre; అందురు. ఇది మనశరీరము నందలి చోటును అనగా – ఆకాశ తత్త్వమును నియంత్రణ చేయును. ఆకాశము శబ్ద గుణకము కావున, ఈ చక్రములో తేడా వచ్చినచో వాక్కునందు, ఉచ్ఛారణ యందు తేడాలు వచ్చును. చెవిటితనము, మూగతనము గూడా రావచ్చును. వినాళ గ్రంథుల లోని థైరాయిడ్ గ్రంథికి (Thyroid gland) దీనికి సంబంధము గలదు.

6. **ఆజ్ఞా చక్రము :** ఇది రెండు కనుబొమ్మల మధ్య ఉండు ప్రాంతములో ఉండును. అందువలన దీనిని ఆంగ్లములో 'Eye brow centre' అని అందురు. ఇది మన మనస్సును నియంత్రణ చేయును. పంచ భూతములకు అతీతముగా ఉండి, వాటన్నిటినీ నియంత్రణ చేయగల సామర్థ్యము ఈ చక్రమునకు ఉండును. ఈ చక్రములో తేడా వచ్చినపుడు అపస్మారము, మూర్ఛ, పిచ్చి మొదలైన మానసిక వ్యాధులు రావచ్చును.

పైన తెలిపిన ఆరు చక్రములే కాక మన శిరస్సులోపల పైభాగము నందు ఉండు బ్రహ్మరంధ్ర ప్రాంతములో మానవ ప్రజ్ఞకు లోబడి ఉండని ఏడవ చక్రము గూడా ఒకటి ఉండును. దీనిని 'సహస్రారము' అందురు. ఆంగ్లమున దీనిన Head centre అందురు. దీనికి వినాళ గ్రంథులలో ఒకటైన penialgland నకు సంబంధము గలదు. ఇది కులపథమునకు గమ్యస్థానముగా ఉండును.

(వెన్నెముక వెంబడి ఉండు ఆధార చక్రము నుండి సహస్రారము వరకు ఉన్న సమస్త జ్ఞానమును తెలిసిన వానిని 'ఆసాంతము' ( అనగా ఆ - ఆధార చక్రము నుండి, స - సహస్రారము వరకు) లేదా 'అమూలాగ్రము' ఆమూల - అనగా మూలాధారము నుండి, అగ్రము - అనగా పై కొన వద్ద ఉన్న సహస్రారము వరకు) తెలిసిన వాడందురు. ఈ విధముగా ఈ 'ఆసాంతము', 'ఆమూలాగ్రము' పదములు పుట్టినవి. మరియు ఏ విషయమునైనను పూర్తిగా తెలిసినచో 'ఆసాంతము' లేదా 'ఆమూలాగ్రము' తెలుసుననుట పరిపాటి అయినది.)

**ప్రస్తుత విషయము**

ఈ శ్లోకము నందు సాధనలో జరుగు దేహము నందలి మార్పులు చెప్పబడును. కుండలినీ యోగసాధనా మార్గములో గాని, ప్రాణాపానముల మధ్య సమన్వయమును సాధించుట ద్వారా చేయు రాజయోగాది ఇతర మార్గములలో గాని - థర్మామీటరు నందలి పాదరసము వలె సాధకుని తేజోమయ జీవశక్తి సుషుమ్నా మార్గము వెంబడి పైకి ఎక్కును. అనగా ఆరోహణ చేయును. ఈ ఆరోహణలో మొట్టమొదటగా ఆ కుండలినీ శక్తి అను అమ్మవారు మూలాధార చక్రము వద్దకు వచ్చినపుడు అక్కడ ఉన్న ఆ చక్రము నియంత్రణ చేయు భూతత్త్వమును ఛేదించును. అటుపైన స్వాధిష్ఠానము వద్ద అగ్నితత్త్వమును, ఆపైన మణిపూరము వద్ద జలతత్త్వమును, అనాహతమువద్ద వాయుతత్త్వమును, విశుద్ధి వద్ద ఆకాశ తత్త్వమును, అజ్ఞాచక్రము వద్ద మనస్తత్వమును ఛేదించి, చిట్టచివరకు అన్నిటి కన్నా పైన మేడమీద గదిలోవలె నున్న బ్రహ్మరంధ్రము వద్ద గల సహస్రార పద్మములో - పూర్తిగా నిండి ఒంటరిగా ఉన్న శివుని జేరి ఐక్యమగును. ఇది జీవేశ్వర సర్వేశ్వర ఐక్యమును, శివశక్తుల సమాగమమును, పిండాండ ప్రళయ మార్గపరాకాష్ఠ స్థితిని, సాధకుల సాధన గమ్య స్థితి అయిన మోక్షానంద స్థితిని - తెలియ జేయును. ఈ స్థితిలో సాధకుడు మనస్సునకు దేహమునకు గూడా అతీతునిగా ఉండును. బంధము తొలగి జీవన్ముక్తుడగును. సూర్యకిరణ స్పర్శ పద్మములను వికసింప జేసినట్లు - కుండలినీ శక్తి స్పృశించినపుడు ఈ చక్రములు ఉత్తేజిత మగును. కాబట్టి, ఈ చక్రములను పద్మములని గూడా వ్యవహరింతురు.

**శివశక్త్యైక్య స్థితి**

శివశక్తులను – 'పురుషుడు, ప్రకృతి' అని గూడా అందురు. సృష్టిని ఒక వృత్తముతో పోల్చినచో, కేంద్రము – పురుషుడు, పరిధి – ప్రకృతి అగుదురు. వీరి జంట విడదీయలేనిది. వీరిలో ఎవరు ముందు, ఎవరు వెనుక అని గూడా ఉండదు. గణితాత్మకమైన మెదడు కలిగిన (Mathematical brains) వారికి, సాంఖ్యక మనస్సు కలిగిన వారికి(Statistical Minds), చరిత్రకారులకు (Historians) ముందు వెనుకలు లేకుండా ప్రకృతి – పురుషులు ఏ విధముగా కలిసి ఉందురను అనుమానము, అభ్యంతరము ఉండవచ్చునేమో కాని – కలిసియే వుందురు. చెట్టు తాలూకు వ్యూహము విత్తనములోను, విత్తనము తాలూకు అంకురము చెట్టు తాలూకు పండులోను ఏవిధముగా ఏకకాలములో ఇమిడి ఉండునో – అదే విధముగా ఈ ప్రకృతీ పురుషుల జంట గూడా ఎప్పుడునూ కలిసియే ఉండును. అందులకే భగవద్గీతలో –

'ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి' (13అ – 20శ్లో) అన్నాడు గీతాచార్యుడైన శ్రీ కృష్ణపరమాత్మ. ఈ ప్రకృతీ – పురుషులు ఒక నాణెము (coin) యొక్క బొమ్మ (Head) బొరుసు (Tail) లవంటివారని అవగాహన చేసుకొనవలెను.

**చీకటి వెలుగుల ఉదాహరణ**

'సహస్రారము' అను గదిలో ఏ మాత్రము ఖాళీ లేకుండా శివుడు పూర్తిగా నిండి ఉన్నపుడు – 'అమ్మవారు' అను కుండలినీ శక్తి ''షట్చక్ర భేదనము చేసుకుంటూ చిట్ట చివరకు వెన్నెముక పైన సహస్రార కమలములో ఉన్న శివునితో ఒంటరిగా, రహస్యముగా కలిసి విహరించును'' అని చెప్పబడినది. ''శివుడు గది నిండా వున్నపుడు ఆ గదిలో ఖాళీలేదు గదా, మరి అమ్మవారు ఆగదిలోనికి ఎట్లు వెళ్ళి ప్రవేశించగలిగినది?'' అను విషయము అర్థమగుటకు ఈ క్రింది ఉదాహరణ చెప్పుకొనవచ్చును.

''శివుడు చీకటి వంటివాడు, అమ్మవారు వెలుగు వంటిది'' అని అనుకొన్నచో – గదినిండా చీకటి నిండి ఉన్నపుడు గదిలోని బల్బు వెలుగు నట్లు స్విచ్ వేయబడినపుడు–

1) గదిలో పూర్వము ఉన్న చీకటి అంతయు మాయమై వెలుగు వచ్చినదా?

2) గదిలో ఉన్న చీకటి, క్రొత్తగా వచ్చిన వెలుగు రెండునూ కలసియే యున్నవా?

3) అయినచో గదిలో ఎంత మేరకు చీకటి – ఎంత మేరకు వెలుగు ఉన్నవి?

4) గదిలో ఉన్న చీకటియే వెలుగుగా మారినదా ?

5) అసలు చీకటియే వెలుగా ? వెలుగే చీకటియా ?

పై ప్రశ్నలకు సమాధానము చెప్పకలరా ? చెప్పుట కష్టము. ఈ 'వెలుగు – చీకటి' అను భార్య భర్తలు ఒకరి నొకరు కౌగలించుకొనుటలో బాగుగా నైపుణ్యము కలవారు. వారిద్దరును కలసి ఉన్న ఆస్థితిలో ఎవరి శరీర భాగము ఎవరిలో ఎంతవరకు ఇమిడి పోయి ఉండునో చెప్పుట గూడా కష్టము. అదియే అర్ధనారీశ్వర తత్త్వము.

అసలు 'వెలుగు – వేరు, చీకటి – వేరు' అని అనుకొనుటయే మన అజ్ఞానము. కంటిలో దేనిని మనము చూడలేమో దానిని 'చీకటి' అనీ – చూడగలుగు దానిని 'వెలుగు' అనీ చెప్పునవి కేవలము సాపేక్షకమే ! ఎప్పుడును ఈ చీకటి వెలుగులు కలిసియే ఉండును. అవి ఏ నిష్పత్తిలో, ఏయే పాళ్లలో కలిసి ఉండునో, ఉండవలెనో ఆయా సందర్భాలను బట్టి అవియే ఒక అవగాహనకు వచ్చును. అటువంటి చీకటి వెలుగులకు ప్రతీకలే శివశక్తులు. వీరిద్దరి మధ్య నుండు పరమ ఉత్కృష్టమైన అవగాహన, సర్దుబాటు తత్వమే – వారిది 'దివ్య దాంపత్యము' అని అనుటకు కారణము. ఈ విధమైన దాంపత్యము సృష్టిలో మరి ఇతరులెవ్వరికిని లేదు.



## సంస్కృత శ్లోకము - 10

శ్లో. **సుధాధారా సారైః చరణయుగళాంతర్విగళితైః**
**ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయ మహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్ఠవలయమ్**
**స్వ మాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి.**

## అనువాద పద్యము

చం. చరణాబ్జమ్ములనుండి యొల్కెడు సుధాసార ప్రవాహమ్ముతో
స్వరయుక్తంబుగ సర్వనాడులను ప్రక్షాళించి, యాపై సుధా
కర మార్గమ్మును వీడి, స్వస్థలము వెన్కన్ మూలరంధ్రమ్మునం
దురగంబుండెడి రీతి చుట్టుకొని నీవే నిద్రగావింతుగా!

## టీక

(జగజ్జననీ!) చరణ + యుగళ + అంతర్వ్యగళితైః = చరణాంబుజముల జంట మధ్య నుండి స్రవించుచున్న, సుధాధార + ఆసారైః = అమృత ధారా పాతముచేత, ప్రపంచం = పంచతత్త్వదేహమును ప్రేరేపించు నాడీమండల వ్యూహమును, సించంతీ = తడుపుచున్నదానవై, రస + ఆమ్నాయమహసః = అమృతము యొక్క గుణాతిశయ రూపకాంతులు గల చంద్రుని నుండి, స్వాంభూమిం = స్వకీయమైన భూతత్త్వమునకు సంబంధించిన ఆధార చక్రమును, పునః అపి = మరల, అవాప్య = పొంది, భుజగనిభం = సర్పమువలె, అధ్యుష్టవలయం = అధిష్ఠింపబడిన కుండలాకారమైన దానినిగా, స్వం + ఆత్మానాం = తనదగు నిజ స్వరూపమును, కృత్వా = చేసి (అనగా – ధరించి, లేదా – పొంది), కుహరిణి = తామర పూవు బొడ్డు వద్దనుండు సన్నని రంధ్రము వంటిదైన, కుల (కు = పృథివీ తత్త్వము, ల = లయము నొందు) సుషుమ్నా మూల మందలి, కుండే = కమల కందరూపమైన చక్రము నందు, స్వపిషి = నిద్రింతువు.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! నీ పాదముల జంట నడుమ నుండి జాలు వాఱు అమృతపు ధారాపాతముచే శరీరము నందలి 72,000 నాడీ మండల మార్గమునంతను తడిపి, అమృత రూపకాంతులు గల చంద్రుని వీడి, స్వస్థానమైన ఆధార చక్రము జేరి, అక్కడ నీ స్వరూపమును కుండలాకారముగానుండు సర్పము వలెగావించి, తామర పూవు బొడ్డు వద్ద సన్నని రంధ్రము వలె నుండు మిక్కిలి సూక్ష్మమైన సుషుమ్నా మార్గపు క్రింది కొన వద్ద గల ఆధార చక్రము-క్రింద కుండలినీ శక్తివై నిద్రింతువు.

## వివరణము

క్రిందటి శ్లోకము నందు - కుండలినీ శక్తి అను అమ్మవారు సుషుమ్నా మార్గము గుండా ఆరోహణము చేయుచూ సహస్రార కమలమందలి శక్తుడైన శివునితో సాయుజ్యము చెందుట చెప్పబడినది. ఇది యోగ సాధకుడు జీవన్ముక్తుడగుటకు చేయవలసిన అభ్యాసప్రక్రియను తెలుపును. ప్రస్తుత శ్లోకము నందు సహస్రారకమలము నందలి శివునితో సాయుజ్యము పొందిన అమ్మవారు అను కుండలినీ శక్తి సుషుమ్న వెంబడి అవరోహణ మార్గములో తిరిగి తన స్వస్థానమైన కులకుండమును చేరుటలో జరుగు విషయములు చెప్పబడుచున్నవి.,

సహస్రార చక్రము - మనలో చంద్రమండల స్థానమును సూచించును. 'శివుని' శిరస్సుపై చంద్రుడు ఉండును. అను విషయము - 'జీవుని మెదడులో మనస్సు ఉండుట' ను సూచించును. (The principle of mind in our brain is being denoted by Moon on the head of Lord Shiva as Lord Shiva represents Jeeva and Moon mind. Sahasrara Chakra denotes Chandra mandala as per the tantriktexts) చైతన్య రహితముగా నిశ్చల, నిర్వికార స్థితిలో నున్న శివునికి అమ్మవారి సంస్పర్శతో చైతన్యము కలిగి సృష్టికి ఉన్ముఖుడగును. వారిద్దరి సాయుజ్య స్థితి నుండి సృష్టిగా అమ్మవారు వేరై అవరోహణము చెందునని చెప్పుటయే ప్రస్తుత శ్లోక వృత్తాంతము. మానవ శరీరము నందు సహస్రార కమలచంద్ర మండలము నుండి జరుగు ఈ అవరోహణమునకు ప్రారంభంలో అమ్మవారి రెండు పాదములనుండి సుధాధార పాతము జరిగి, శరీరము నందలి సమస్త నాడీ మండలము తడుప బడి ఉద్దీపనము చెందును. నాడీమండలము గుఱించి మరికొంత వివరణ ఇక్కడ అవసరము.

**శరీరం గృహమేవచ**

గృహమునకు శరీరమునకు చాల పోలికలు గలవు. గృహము నిర్మింపబడక పూర్వము గూడ గృహస్థువుండును. అట్లే, శరీరము నిర్మింపబడక పూర్వము, అనగా - దేహము నిర్మాణము కాక పూర్వము గూడా జీవుడు వుండును. గృహము కట్టబడుటకు ముందు గృహమునకు సంబంధించిన వ్యూహము - బ్లూప్రింట్ (Blue Print)గా - గృహస్థు బుద్ధిలో వుండును. అట్లే - దేహ నిర్మాణమునకు

సంబంధించిన వ్యూహము జీవునిలో ఇమిడి వుండును. జీవుని అంతర జీవన వ్యాపార నిర్వహణా వ్యూహమునే నాడీ మండలముగా అర్థము చేసుకొనవచ్చును. అనగా, ఇంటి బ్లూ ప్రింట్ ఎటువంటిదో - శరీరమునందు నాడీమండలము అటువంటిదన్నమాట! బ్లూ ప్రింట్ ఎట్లు భౌతికమైన ఇల్లుకాదో - నాడీమండలము గూడా భౌతికమైనది కాదు. కాని, ఈ రెంటిని బట్టియే అటు గృహము గాని, ఇటు దేహము గాని - నిర్మాణ మగును. నాడీమండలము ఉద్దీపనమైన తరువాత గాని 'గ్రీన్ సిగ్నల్' ఇవ్వబడి భౌతికత్వము చేకూరదు. ఇందు నిమిత్తమై ముందుగా ఆ కుండలినీశక్తి అను అమ్మవారి అనుగ్రహ వర్షముచే సమస్త నాడీమండలమును తడుపబడి, ఉద్దీపన చెంది ప్రేరణ జరుగునని చెప్పబడినది. (ఈ నాడీ మండలమును మన శరీరము నందలి వార్తా ప్రసార వ్యూహముగా (communicative network in our body) అర్థము చేసుకొనవలెను. అట్లే, రామాయణము నందలి కిష్కింధా కాండలో వచ్చు వానరులందఱూ భౌతిక మైన శరీరము గలవారు కాదు. ఈ వానరులందరూ మన శరీరములోని నాడులను సూచించుదురు. ఉదా: వాలి - అపాననాడి, సుగ్రీవుడు - ప్రాణనాడి, ఆంజనేయుడు - బ్రహ్మనాడి. కుండలినీయోగ శాస్త్రములో ఈ మూడును వరుసగా ఇడా, పింగళా, సుషుమ్నా నాడులచే సూచింపబడును. వీటి పూర్తి వివరములతో రామాయణము నందలి షట్కాండలకు కుండలినీ యోగ మందలి షట్చక్రములకు సమన్వయము తెలియవలెనన్నచో - నేను వ్రాసిన 'శ్రీమద్రామాయణము కిష్కింధాకాండము' అను గ్రంథమును చదువవలెను). అనగా, ముందుగా అమ్మవారి సుధాధారాపాతము చేత, సమస్త నాడీమండలము తడుపబడి ఉద్దీపనము కావింపబడును అని అర్థము.

**మూడున్నర చుట్లు ?**

ప్రతి వ్యక్తి - మానవ కక్ష్యలోనికి రాకపూర్వము మూడు కక్ష్యలను దాటును. అవి 1) ఖనిజ లవణ కక్ష్య (Mineral plane) 2) వృక్ష కక్ష్య (plant plane) 3) జంతు కక్ష్య (Animal plane). ఈ మూడు కక్ష్యలను పూర్తిగా దాటి మానవ కక్ష్యలోనికి అడుగు పెట్టినపుడు ఈ మానవ కక్ష్యలో సాధించవలసిన, పొందవలసిన పరిపూర్ణతను పొందనంత వరకు కుండలినీ శక్తి మూడుచుట్లను దాటి వుండును గాని, నాలుగు చుట్లు పూర్తిగా వుండవు. ఈ విషయమును చెప్పుటకు

కుండలినీ శక్తి $3\frac{1}{2}$ చుట్లు చుట్టుకొని మూలాధారము వద్ద గల కులకుండము నందు నిద్రించుచుండునని చెప్పబడినది. 'ముడుచుకుని మూల కూర్చుండుట' అను ప్రయోగము కూడ దీనిని బట్టియే వచ్చి వుండవచ్చును. మిగిలిన $\frac{1}{2}$ చుట్టు మేరకు పొందవలసిన పరిపూర్ణతను యోగసాధన ద్వారా పొందినపుడే మానవుడు జీవన్ముక్తుడై, మానవ జన్మకు సార్థకతను చేకూర్చుకొనును.

### ప్రాణాయామ ప్రమేయము

సాధారణముగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు – ఇడా పింగళానాడుల సహకారముతో జరుగుచుండును. ఉచ్ఛ్వాసము ద్వారా పీల్చబడిన వాయువు దేహమునందలి క్రింది భాగము వరకు పోయి నిశ్వసించునపుడు ఊర్ధ్వమార్గముగా బయటకు పోవుచూ వృధా అగును. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసములకు, ప్రాణాపానములకు, ఇడా – పింగళానాడులకు మధ్య చక్కని సమన్వయము, సంబంధము గలదు. మనస్సును శ్వాసతో జోడించి ప్రాణాపానముల మధ్య సమన్వయ సమతా స్థితిని సాధించు ప్రక్రియను 'ప్రాణాయామము' అందురు. ఈ నిరంతర ప్రాణాయామ అభ్యాసమువలన రాను రాను వాటి మధ్య వ్యవధి పెరుగును. అనగా, ఉచ్ఛ్వాస – నిశ్వాసములకు పట్టు కాలవ్యవధి పెరుగును. ఈ రెండును ఒకదాని కొకటి హోమ హవిస్సులుగా మారును. (అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే, ప్రాణాపానగతీ రుధ్వా ప్రాణాయామ పరాయణాః, – భగవద్గీత) ఇట్టి సమన్వయ సమతా స్థితిలోనే –

1) ఒక వైపు నుండి, ప్రాణనాడిద్వారా పీల్చబడినగాలి ఇడానాడి సహకారముతో అధోమార్గముగా ప్రయాణించి, సుషుమ్నానాడిని సూచించు కులపథము యొక్క క్రింది కొసకు చేరును. 2) ఇంకొక వైపు నుండి – అధో మార్గము పట్టిన శుక్రసారము 'ఓజస్సు'గా మారుస్థితిలో ఆ కొనవద్దకే చేరును. ఈ రెండును కలిసి కులమార్గపు అడుగు కొనవద్ద ఒత్తిడి తెచ్చి, సుషుమ్నా మార్గపు సన్నని రంధ్రములోనికి ప్రవేశించి ఆరోహణము చేయును. స్వాధిష్ఠాగ్ని వలన ఈ జీవ శక్తి తేజస్వంతమై, కులమార్గములో పైపైకి ఆరోహణము చెందుచు – 'సహస్సు,' 'భ్రాజస్సు' మొదలగు సూక్ష్మ ధాతువులుగా మారి, అనాహత, విశుద్ధి, ఆజ్ఞాన

చక్రముల వైపుగా ఆరోహణము చెందును. జీవశక్తి యొక్క ఈ ఆరోహణా మార్గమును గూర్చి క్రిందటి శ్లోకములో చెప్పబడినది. మాటలలో ఇట్లు తేలికగా చెప్పగలిగినను – సాధనలో ఈ స్థితిని సాధించుట అంత సులువైన విషయము కాదు. ఎంతయో సాధనానుభవ, అభ్యాస పాటవమున్ననే తప్ప ఈ స్థితిని సాధించుట కష్టము.

(ఈ చివరి పేరాలో ప్రాణాయామ సమన్వయ విషయమును గూర్చి - నాకు తెలిసినంత వఱకు శాస్త్రసమన్వయముగా చెప్పితిని. ఇతర విశేషములను అనుభవమును గడించిన పెద్దలనడిగి తెలుసుకొనవలెను).

'మహీంమూలాధారే....', 'సుధాధారాసారైః...' ఈ రెండు శ్లోకములలో చెప్పిన కుండలినీశక్తి ఆరోహణ, అవరోహణా మార్గములు ఒక దాని కొకటి వ్యతిరేకములు కాదు. ఈ రెంటి కూర్పు – ఉన్మేష నిమేషముల జంటవలె, చక్కని పరిపూర్ణతను సిద్ధింప జేయును. లలితా సహస్ర నామములోని 'సుధాసారాభివర్షిణీ', 'సుధాస్రుతిః' నామములను ఇక్కడ సమన్వయము చేసుకొనవలెను.



## సంస్కృత శ్లోకము - 11

**శ్లో. చతుర్భిః శ్రీ కంఠైః శివయువతిభిః పంచభిరపి**
**ప్రభిన్నాభి శ్శంభో ర్నవ భిరపి మూలప్రకృతి భిః**
**చతుశ్చత్వారింశ ద్వసుదళ - కలాశ్ర - త్రివలయ-**
**త్రిరేఖాభి స్సార్థం తవ శరణ కోణాః పరిణతాః.**

## అనువాద పద్యము

**చం. నలువురు శంభు, లైదు శివనారులతో నవ మూలకారణ**
**మ్ములను ధరించి, యష్టదళ పుష్కర షోడశ పత్ర సాంస**
**మ్ములు, మరి మూడు మేఖలలు, భూపుర రేఖలు మూడు చుట్లతో**
**నలుబది నాలుగౌను పరిణామము బొందుచు నీదు కోణముల్.**

## టీక

(తల్లీ! జగజ్జననీ!) చతుర్భిః = నలుగురైన, శ్రీ కంఠైః = శివులచేతను, శంభోఃప్రభిన్నాభిః = శివుని కంటె వేరైన, పంచభిరపి = ఐదుగురైన, శివయువతిభిః=

శివశక్తులతోడను, నవభిః = తొమ్మిదియైన, మూల ప్రకృతిభిః అపి = మూలకారణములచేతను, తవ = నీయొక్క, శరణ = నిలయమగు శ్రీ చక్రము యొక్క, కోణాః = కోణములు, వసుదళ = అష్ట(ఎనిమిది) దళములచేతను, కలాశ్ర = షోడశ (పదునాఱు) దళముల చేతను, త్రివలయ = మూడు మేఖలల (వర్తుల రేఖల) చేతను, తవ = నీ యొక్క, శరణ = నిలయమగు, శ్రీ చక్రము యొక్క, కోణాః = కోణములు, వసుదళ = అష్ట (ఎనిమిది) దళములచేతను, కలాశ్ర = షోడశ (పదునాఱు) దళముల చేతను, త్రివలయ = మూడు మేఖలల (వర్తుల రేఖల) చేతను, త్రిరేఖాభిఃసార్థం = మూడు భూపురరేఖలతోడను, పరిణతాః = పరిణామమును పొందినవై, చతుశ్చత్వారింశత్ = నలుబది నాలుగు (అగుచున్నవి).

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నలుగురు శివుల చేతను, శివుని కంటె వేరైన ఐదుగురు శివశక్తుల చేతను, తొమ్మిది మూల ప్రకృతులతో, అష్టదళ, షోడశదళ, త్రివలయ త్రిరేఖల చేతను నీకు నిలయమైన శ్రీచక్రము నలుబది నాలుగు అంచులు గలది అగుచున్నది. (నలుగురు శివులనగా నాలుగు శివసంబంధ చక్రములని, ఐదు శివశక్తులనగా ఐదు శక్తి సంబంధ చక్రములని ఈ నాలుగు ఐదు కలిసి మొత్తము మీద తొమ్మిది చక్రములతో (నవచక్రాత్మకమై) అలరారుచున్నదని తాత్పర్యము).

## వివరణము

అమ్మవారికి నిలయము, అమ్మవారితో అభేదము అయిన శ్రీ చక్రము యొక్క వర్ణనము సంకేత పదములతో ఈ శ్లోకము నందు సంపూర్ణముగా గలదు. శ్రీ చక్రమునే 'శ్రీ యంత్రము' అని గూడా అందురు.

నాలుగు శివ చక్రములు - ఐదు శక్తి చక్రములతోను, అష్టదళ, షోడశ దళములతోను, త్రివల త్రిరేఖలతోను అత్యంత శోభాయమానముగా, అత్యంత సౌష్ఠవరీతిలో, బ్రహ్మాండ - పిండాండ, సృష్టి- ప్రళయ విజ్ఞాన సమస్త రహస్యములను

సంకేత పూర్వకముగా పొందుపరచబడిన యంత్ర రాజమే శ్రీ చక్రము. సమస్త విజ్ఞానము ఇందే ఇమిడి యున్నందున దీనిని మించిన యంత్రము లేదు. అన్ని తంత్రములకు, అన్ని యంత్రములకు, అన్ని మంత్రములకు దీని యందు సమన్వయము దొరకును. అందుచేతనే దీనిని 'యంత్రరాజము', 'శ్రీ చక్రరాజము' అని అందురు.

### రెండు విధములైన చక్రములు

శ్రీ చక్రార్చనలో రెండు విధములైన పద్ధతులు గలవు. ఒకటి సమయాచార పద్ధతి, రెండు కౌలాచార పద్ధతి. ఈ రెండు పద్ధతుల వలన స్వల్ప భేదము గల రెండు రకముల శ్రీ చక్రములు అర్చింపబడుచున్నది. పైకి శీర్షములు (Verticies or apexes) కలిగిన త్రిభుజములు ఐదు, క్రిందికి శీర్షములు కలిగిన త్రిభుజములు నాలుగు కలిగిన రీతిలో వుండు శ్రీ చక్రము ఒకటి. దీనిని కౌలాచారులు అర్చించుదురు. ఈ విధముగా కాక, క్రిందకు శీర్షములు కలిగిన ఐదు త్రిభుజములు, పైకి శీర్షములు కలిగిన నాలుగు త్రిభుజములతో నుండు శ్రీ చక్రము రెండవది. దీనిని సమయాచారులు అర్చించుదురు. సమయాచారులు అర్చించు శ్రీ చక్రమును సృష్టి క్రమ చక్రముగను, కౌలాచారులు అర్చించు శ్రీ చక్రమును సంహారక చక్రముగను సమన్వయ పరచుట గూడ గలదు. ఈ రెండు విధములైన శ్రీచక్రములు చిత్రపటములు 1, 2 లలో సూచించిన విధముగా నుండును. కౌలచార మార్గములో ప్రస్తుత కలియుగమునకు నిర్దేశింపబడని, కొన్ని ప్రతి బంధకములైన అనుష్ఠాన ఉపచార విధానము లుండుటచే ఆ మార్గమును మాంత్రికులు, కాపాలికులు, తామసరజోగుణ లక్షణములు గల వారు మాత్రమే ఆరాధించుట కిష్టపడుదురు. సత్త్వగుణ సంపన్నులైన వారు – సమయాచారులు అర్చించు సృష్టి క్రమ సమన్వితమైన శ్రీ చక్రమునే అర్చించుటకు ఇష్టపడుదురు. ప్రస్తుతము ఈ సమయాచార సృష్టిక్రమ సమన్వితమైన శ్రీ చక్రమునకే వివరణ తెలుపబడును.

చిత్రపటము 1



సమయమతానుసారము శ్రీచక్రము

సృష్టిక్రమము

చిత్రపటము 2



కౌళమతానుసారము శ్రీచక్రము

సంహార క్రమము

**ప్రకృతీ పురుషుల దివ్యదాంపత్యము**

ప్రకృతీ పురుషులు లేనిదే ప్రపంచమే లేదు. (ప్రకృతిం పురుషంచైవ విద్ధి అనాది ఉభౌ అపి - గీత) ఈ ఇద్దరిలో ఏ ఒకరి వలన ప్రపంచము కొనసాగదు. పండువలె ప్రకృతి ఉన్నప్పుడు - అందు విత్తనము వలె పురుషుడు ఇమిడి వుండును. పురుషుని వలె విత్తనము ఉన్నపుడు - ఆ విత్తనము లోపల సృష్టిగా చిగురింపబోవు ప్రకృతి భాగము ఇమిడి వుండును. శ్రీ చక్రము నందు గూడా ఇదే విషయము సంకేత పూర్వకముగా చెప్పబడినది. 'పురుష, ప్రకృతు' లను శ్రీ చక్రములో 'శివ-శక్తు' లుగా సంకేతించుదురు. చక్రమునకు గరిమనాభి (centre of gravity) వలె కేంద్రము వద్ద వుండు బిందు స్థానము ఈ జంటకు నిలయము. ఈ శివ-శక్తుల జంటనే 'అయ్యవారు - అమ్మవారు' అని గూడ అందురు. వీరిది దివ్యదాంపత్యము. అందుకే

**శ్లో. చతుర్భిః శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః**
**శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీ చక్రం శివయోర్వపుః**

- అని శ్రీ చక్రమును వర్ణించిరి.

**ప్రకృతీ పురుషులు తల్లిదండ్రులవంటి వారే !**

సంసార నిర్వహణమునకు తల్లిదండ్రులు ఎటువంటివారో ఈ జగత్ సంసారమును నిర్వహించుటకు 'అమ్మవారు - అయ్యవారు' అటువంటి వారు. అజమాయిషీ, నిర్వహణ (Administration) తండ్రిదే అయిననూ, సంసారములో ఆచరణాత్మక, నిర్మాణాత్మక (Establishment) విభాగము తల్లిదే ! అయ్యవారు సూర్యుని వంటివారు. అమ్మవారు చంద్రుని వంటిది. అందులకే అయ్యవారు వెచ్చదనమును ప్రసరించగా, అమ్మవారు చల్లదనమును ప్రసరించును. గోళములను సూర్యుడు - తన వైపునకు ఆకర్షించును. అనగా - సూర్యునిది 'ఊర్ధ్వమార్గము' (Sublimation). చంద్రుడు - భూమి చేత ఆకర్షింపబడును. అనగా - చంద్రునిది అధోమార్గము (Precipitation). అందువలననే ఈ శ్లోకములో సమయాచార శ్రీ చక్రము నందు 'అధోముఖముగా' శీర్షములుండు త్రిభుజములచే ఏర్పడు చక్రములు ఐదును అమ్మవారికి సంబధించినవి గాను 'ఊర్ధ్వముఖముగా' శీర్షములుండు త్రిభుజములతో ఏర్పడు 4 శివచక్రములను అయ్యవారికి సంబంధించినవి గాను

సమన్వయయపరచ బడినవి. ఈ విధమైన కూర్పుగల శ్రీ చక్రము చిన్న పరిధిలో (Microscopic లేదా Small scale) ఇటు పిండాండమునకు, పెద్ద పరిధిలో (Macroscopic లేదా Big scale)అటు బ్రహ్మాండమునకు గూడ సమన్వయమును కలిగి యుండును.

**పిండాండ పరిధిలో**

చర్మము, రక్తము, మాంసము, మెదడు, అస్థి (ఎముక) ఈ ఐదు ధాతువులు – శక్తికి సంబంధించిన కోణములచే సూచింపబడును. మజ్జ, శుక్ర, ప్రాణ, జీవ – ఈ నాలుగు శివునకు సంబంధించిన కోణములచే సూచింపబడును.

**బ్రహ్మండ పరిధిలో**

పంచభూతములు, పంచన్మాత్రలు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములు, మనస్సు – ఇవి శక్తికి సంబంధించిన కోణములచే సూచింపబడును.

మాయ, శుద్ధవిద్య, మహేశ్వర, సదాశివులు – ఇవి శివునకు సంబంధించిన కోణములచే సూచింపబడును.

**తొమ్మిది మూల ప్రకృతులు**

శ్రీ చక్ర మధ్యమున ఉండు త్రికోణము–, ఈ త్రికోణమునకు చుట్టును బాహ్యముగా ఎనిమిది అంచులతో వుండు అష్టకోణము – 1, ఈ అష్టకోణమునకు వెలుపల వుండు పది అంచులు గల దశకోణములు – 2, వీనికి వెలుపలగా పదునాలుగు అంచులు గల చతుర్దశ కోణము – 1 – ఈ మొత్తము ఐదు కోణములను శక్తి చక్రములందురు. అష్టదళము, షోడశదళము, మేఖలాత్రయము, భూపుర త్రయము – ఈ నాల్గింటిని శివచక్రము లందురు. శక్తి కోణములు 5, శివ కోణబులు 4 కలిపి తొమ్మిది కోణములగును. ఈ తొమ్మిది కోణములే – తొమ్మిది మూల ప్రకృతులు, నవయోనులు, పిండాండ బ్రహ్మాండ నిర్మాణ హేతువులు. శ్రీ చక్రమధ్యమున కేంద్రము వద్ద వుండు 'బిందువు' పదవ యోనిని సూచించును. ఈ పదవ యోని – పిండాండ బ్రహ్మాండములకు ఈశ్వరిగా, పరాశక్తిగా– సూచింపబడును.

**నలుబది నాలుగు కోణములు**

శ్రీ చక్రము నందు బిందువు (1), త్రికోణము (3), అష్టకోణము (8), దశారయుగ్మము (10 × 2), చతుర్దశాకోణము (14) – ఇవి మొత్తము 46

కోణములు లెక్కకు తేలును. శ్రీ చక్రమును జాగ్రత్తగా పరిశీలించినచో త్రికోణమునకు క్రిందుగా నుండు రెండు కోణములు అష్టకోణమునందు అంతర్గత మగుచున్నట్లుండును. కావున, ఈ రెండును లెక్కలోనికి రావు. అప్పుడు 46-2 44 కోణములు వచ్చును. బిందువును కోణముగా లెక్కించనిచో ఇవి 43 అగును. బిందువును కోణముగా లెక్కించినచో ఇవి 44 అగును. శ్లోకమునందు 'తవశరణ కోణాః' అనుచోట శరణ కోణములు కలసి అని అర్థము చెప్పుకొన్నచో (శరణము = నెలవు లేదా గృహము కాబట్టి, ఇది బిందువుచే సూచితము) బిందువుతో కూడి కోణములు 44 - అని అర్థము సరిపోవును.

**శ్రీ చక్రోద్ధారము**

గోపురము వలె మేరువు కలిగిన శ్రీ చక్రమును (Three Dimensional Sri Chakra) పరిశీలించినచో దానిని మూడు ప్రస్తారములుగా విభజించవచ్చును. 1. అట్టడుగున భూప్రస్తారము, 2. మధ్యన కైలాస ప్రస్తారము 3. పైన మేరు ప్రస్తారము (ఈ మేరు ప్రస్తారమే - సుమేరు శృంగమధ్య స్థానము.) భూప్రస్తారము వశిన్యాది దేవతలకు నిలయము, కైలాస ప్రస్తారము మాతృకలకు నిలయము, మేరు ప్రస్తారము షోడశనిత్యలకు నిలయము.

**సోమ సూర్యానలాత్మక విభాగము**

శ్రీ చక్రమును - చంద్ర, సూర్య, అగ్ని ఖండములుగా విభజించవచ్చును. బిందువు, త్రికోణము, అష్టకోణము - ఈ మూడును చంద్ర ఖండముగను; దశ కోణ యుగ్మము, చతుర్దశ కోణములు కలసి - అగ్నిఖండముగను; మిగిలిన అష్ట దళ, షోడశ దళ, మేఖలాత్రయ, భూపుర త్రయములు - సూర్య ఖండముగను తెలుసుకొనవచ్చును. సర్వదేవతలకు నిలయమైన ఇట్టి శ్రీచక్రమును అర్చించినచో సర్వదేవతలను అర్చించినట్లే అగును. ఇది శ్రీచక్రమునకు సంక్షిప్త వ్యాఖ్యానము మాత్రమే! ఈ చక్రరాజమును గురించి పూర్తి అవగాహన పొందుటకు ప్రత్యేకముగా త్రిదిశాత్మక జ్యామితీయ (Three Dimensional Geometry) దృష్టి కావలెను. ఆ దృష్టి, విజ్ఞానము సంపూర్ణముగా కలవారు ఈ శ్రీ చక్రమునకు మరింత వివరణ తెలుపగలరు.

❁ ❁ ❁

## సంస్కృత శ్లోకము - 12

శ్లో. త్వదీయం సౌందర్యం తుహిన గిరికన్యే తులయితుం
కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః
యదాలోకౌత్సుక్యా దమర లలనా యాంతి మనసా
తపోభి ర్దుష్ప్రాపామపి గిరిశ సాయుజ్య పదవీమ్.

## అనువాద పద్యము

మ. *దివిషద్భామిను లందఱున్ మదిని నీ దివ్య ప్రభన్ గాంచగా -*
*శివసాయుజ్యము పొందరే తపములన్ జేయంగ లేకైన, నా*
*భవదీయంబగు రామణీయమునకున్ భావంబుతేగోరు నా*
*కవివర్యుల్ కమలాసనాదులకు వాక్సంపత్తి చేకూరునే.*

## టీక

తుహిన గిరికన్యే = ఓ హిమవత్పర్వత రాజపుత్రీ ! త్వదీయం = నీ యొక్క (దేహ), సౌందర్యం = అవయవముల అందచందములను, తులయితుం = ఉపమానములతో సరిపోల్చి చెప్పుటకు, విరించి ప్రభృతయః = బ్రహ్మ, విష్ణు ఇంద్రాదుల వంటి,క వీంద్రాః = కవిశ్రేష్ఠులు (సైతము), కథమపి = ఎట్లును సమర్థులుగాకున్నారు. (అనగా 'నీ సౌందర్యమును వర్ణించి చెప్పలేకున్నారు' అని అనుట). యదాలోకౌత్సుక్యాత్= యత్ + ఆలోక + ఔత్సుక్యాత్ = ఏ కారణము వలన (అనగా నీ సౌందర్యమును చూచుట యందలి కుతూహలము వలన) అమరలలనాః = దేవతా స్త్రీలు (అనగా రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలైన అప్సరసలు), తపోభిః = నియమ నిష్ఠలతో తపస్సు చేసి గూడ, దుష్ప్రాపాం అపి = పొంద శక్యము కానిదైనను, గిరిశ సాయుజ్యపదవీం = శివునితోడి కలయికను (అనగా, శివసాయుజ్యానందమును). మనసా = మనస్సుచేత, యాంతి = పొందుచున్నారు.

## తాత్పర్యము

ఓ హిమవత్పర్వత రాజపుత్రీ! నీ దేహ సౌందర్యమును ఉపమానములతో సరిపోల్చి వర్ణించి చెప్పుటకు బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది కవిశ్రేష్ఠులు సైతము ఎంత

ప్రయత్నించినను సమర్థులుగాకున్నారు. దేవతా స్త్రీలైన రంభ, ఊర్వశి, తిలోత్తమాది అతి సౌందర్యవతులగు అప్సరసలు నీ సౌందర్యమును చూచుటకు అమితముగా కుతూహలము గలవారై, నీ అందముతో తాము సాటి రానివారై, కఠిన తపస్సులచే గూడా పొందలేని శివసాయుజ్య స్థానమును మనస్సుచే పొందుచున్నారు.

## వివరణము

అమ్మవారు అతిలోక సౌందర్యవంతురాలు, అపురూప లావణ్యవతి. దేవలోక కవిశ్రేష్ఠులైన హరి బ్రహ్మేంద్రాదులు సైతము చక్కని ఉపమానములతో అమ్మవారి అందచందములను వర్ణించి చెప్పలేకపోవుచున్నారట! చెప్పలేక పోవుటకు వీరేమైన సామాన్య కవులా ? ఉదాహరణకు – బ్రహ్మ విషయమే ఆలోచించినచో - జగజ్జనని ఆదేశానుసారము సమస్త సృష్టిని చేయువాడు బ్రహ్మ. సృష్టిలో సౌందర్యవైవిధ్యమును, సౌందర్య పరిపక్వతను కూర్చగల సామర్థ్యమునకు మూల పురుషుడు బ్రహ్మగదా! మరి అట్టి బ్రహ్మకు మించి ఇటువంటి సామర్థ్యము ఎవరికి ఉండును? పైగా, ఈ బ్రహ్మ – వేదమూర్తి. వేదములందు చిత్ర, విచిత్ర ఉపమానాది అలంకార రమ్యతలు కొల్లలు. అటువంటి కవిశ్రేష్ఠుడు, కవిజ్యేష్ఠుడు అయిన బ్రహ్మకే అమ్మవారి సౌందర్యమును వర్ణించుటకు సామర్థ్యము లేకపోవుటను బట్టి – అమ్మవారి సౌందర్య మెటువంటిదో ఊహించుకొనవచ్చును.

**అసలైన సౌందర్య లక్షణము**

అమ్మవారి సౌందర్య విషయములో ఒక రహస్యము గలదు. దర్శనము జరిగిన తరువాత – దర్శించు వారు ఇంకను తాము వేరుగాను, దర్శింపబడునది వేరుగాను, దర్శించు ప్రక్రియ వేరుగాను ఉన్నపుడు ఈ దర్శనానుభూతి సామాన్యమైనదే అగును. దృశ్యము, ద్రష్ట, దృష్టి – ఈ మూడును ఏకమైనపుడు కేవలము అనుభూతి (experience) మాత్రమే మిగులును గాని అనుభవించువాడు, అనుభవింపబడునది, అనుభవించు ప్రక్రియ – ఈ మూడును విడివిడిగా అస్తిత్వమును కలిగి యుండవు. ఈ విషయము అర్థము కావలెనన్నచో – 'నిద్ర' ఉదాహరణమును చెప్పుకొనవచ్చును. గాఢముగా నిద్రపోవు చున్నపుడు పొందు సుఖానుభూతిని ఎట్లు వర్ణించగలము ? ఒకవేళ 'ఆ అనుభూతి ఇట్లున్నది' అని చెప్పగలిగినచో – ఆ స్థితిలో మెలకువగానుండి అనుభూతిని పొందినపుడే గదా ఇట్లు

చెప్పగలుగుట. మెలకువగా నున్నచో అది నిద్ర ఎట్లగును ? నిద్రకు సంబంధించిన సుఖానుభూతి ఎట్లగును ? అది మెలకువ స్థితియే అగును. దర్శింపబడునదిగాని, అనుభవింపబడునదిగాని పరాకాష్ఠస్థితిలో నున్నపుడు మాత్రమే ఇట్లు చెప్పలేకపోవుట జరుగును. అమ్మవారి సౌందర్యము అట్టిది. ఆ సౌందర్యమును ఆనందించుచున్నంత కాలము చూచువాడు ఉండడు. చూచువాడు లేనపుడు చూచిన దానిని ఎట్లు వర్ణించగలడు ? ఇట్టి స్థితి దేవలోక కవిశ్రేష్ఠులైన హరి బ్రహ్మేంద్రులకే తప్పనపుడు సామాన్యుల పరిస్థితి ఎట్లుండునో ఆలోచించు కొనవచ్చును.

ఈ హరి బ్రహ్మేంద్రాదులతో సహా ఎవ్వరైనను ఆ జగజ్జననిలో నుండి పుట్టి, ఆమెలో పెరిగి, ఆమెలోనికి లీనమగువారగుటయే ఇందులకు కారణముగా చెప్పుకొనవలెను. మంచుగడ్డ నీటి సాన్నిధ్యములో ఎట్లు కరిగి, నీటి యందు లీనమగునో; పంచదార నీటి సాన్నిధ్యములో ఎట్లు తన వ్యక్తిత్వమును కోల్పోయి లీనమగునో – అట్లే ''సౌందర్య సకలము'' అయిన జగజ్జనని యందు ''సౌందర్యశకలము''ల వంటి సృష్టిలోని సమస్త ప్రాణులు, దేవతలు నిజ వ్యక్తిత్వమును కోల్పోయి లీన మవవలసినదే! ఆ జగన్మాత సౌందర్యమంతటిదని గ్రహించవలెను.

**వర్ణనాతీత సౌందర్యము**

బ్రహ్మ అమ్మవారి సౌందర్యమును వర్ణించలేడు సరే! ఇక బ్రహ్మసృష్టి లోని నిరుపమాన సౌందర్యవతులు ఎవరు ? రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలగు అప్సరస స్త్రీలు. సృష్టిలోని సౌందర్యమునకు బ్రహ్మకర్త అవవచ్చునేమోగాని, వ్యక్తిగతముగా బ్రహ్మ అంతటి సౌందర్యము గలవాడై తీరవలెనని లేదు గదా! అదే నిజమైనచో అందమును వర్ణించు కవులందరు అందమైన వారై తీరవలెను. ఇట్లనుట సమంజసము కాదు. కాబట్టి, సౌందర్యమును గురించి నిర్ణయించుటకు బ్రహ్మకు అవకాశము లేనప్పుడు, బ్రహ్మచే సృష్టింపబడిన అతిలోక సౌందర్యవతులైన రంభ, ఊర్వశి మొదలైన అప్సరసలు అర్హులు అని నిర్ణయించినచో వారి విషయము గూడా అంతంత మాత్రముగనే ఉన్నదని శ్లోకద్వితీయార్థములో శంకరులు చెప్పుచున్నారు.

అందములో అందటి కన్న మిన్నయైన అప్సరసల సౌందర్యము గూడా అమ్మవారి సౌందర్యమునకు ఆమడ దూరములో నుండవలసినదేనట! అతిలోక

సౌందర్య వతులై గూడ - అప్సరసలు అమ్మవారి సౌందర్య సామీప్య దర్శనాను భవానందమును పొందవలెనని కుతూహలపడుటయే ఇందులకు కారణము. తమ ఇట్టి కుతూహలమును తీర్చుకొనుటకు ఒక విశిష్టమైన ఆలోచన చేసిరట. అమ్మవారి సంపూర్ణ సౌందర్యము అవగతమగునది అయ్యవారైన ఒక్క శివునకే తప్ప ఇతరులకు సాధ్యపడదు గాబట్టి, మనస్సులలో వారు శివుని వలె తామైనచో అట్టి అవకాశములభించుననుకొని తపించిరట! తత్ఫలితముగా కఠోర నియమ నిష్ఠలతో తపస్సు చేసెడి వారలకు గూడా సాధ్యపడని 'శివసాయుజ్యము' మనసా ఆ అప్సరసలు పొందిరట ! అప్సరసలచే శివసాయుజ్యానందానుభూతికి దారితీయుటకు ప్రేరణయైన అమ్మవారి సౌందర్యము ఎంతటిదో ఊహించుకొనవలెనే తప్ప వర్ణింప శక్యము కాదని తాత్పర్యము.

లలితా సహస్ర నామ స్తోత్రములో చెప్పినట్లు అమ్మవారి అవయవములన్నియు నిరుపమానమైనవి. 'అనాకలిత సాదృశ్య చుబుక శ్రీ విరాజితా' 'నవ విద్రుమ బింబ శ్రీన్యక్కారిరదనచ్ఛదా!' 'పద్మరాగశిలాదర్శపరిభావి కపోలభూః'' మొదలైనవి ఇందులకు ఉదాహరణలుగా సమన్వయ పరచుకొనవలెను.



## సంస్కృత శ్లోకము - 13

శ్లో. నరం వర్షీయాంసం నయన విరసం నర్మసు జడం
తవా పాంగాలోకే పతిత మను ధావంతి శతశః
గలద్వేణీబంధాః కుచకలశ విస్రస్తసిచయాః
హఠాత్త్రుట్య త్కాంచ్యో విగళితదుకూలా యువతయః

## అనువాద పద్యము

చం. జడుడు, కురూపి, వృద్ధు, స్మర శక్తివిదూరుడు నైన నేమి ? నీ
యెడ కడగంటి చూపు కృప నిచ్చిన జాలును, వాని వెంబడిన్ -
జడముడి వీడ, కుంభకుచసంచలనమ్మున గంచు కమ్ము తా
నెడమయి, నూలుజాఱ పరుగెత్తుతు రంగన లెట్టివారలున్.

## టీక

(తల్లీ జగజ్జననీ !) వర్షీయాంసం = మిక్కిలి ముసలివాడైనను, నయన విరసం = వికారమును గొలుపు కన్నులు గలవాడైనను, నర్మసుజడం = ప్రణయకామకేళీ విలాసాదుల యందు మోటువాడైనను, తవ = నీ యొక్క, అపాంగాలోకే = క్రీగంటి అనుగ్రహ వీక్షణమునకు పాత్రమైన, నరం = మనుష్యుని (అతడు మన్మథుని వలె కనబడి) చూచి, గళద్వేణీ బంధాః = జాఱుచున్న, లేదా – విడివడుచున్న జడల యొక్క ముడులు కలవారై; కుచకలశ = కడవల వంటి స్తనములపై నుండి, విస్రస్త = జాఱిపోయిన, సిచయాః = పైట కొంగులు గల వారై, హఠాత్ = ఆకస్మికముగా, త్రుట్యత్కాంచ్యః = తెగివిడిపోయిన మొలనూళ్ళు గలవారై, విగళిత దుకూలాః = వీడిపోయిన పోకముడులు కలవారై; శతశః = వందలకొలది, యువతయః = యౌవన దశలో నున్న ముద్దరాండ్రు, అనుధావంతి = అనుసరించి వెంట పరుగెత్తుచున్నారు.

## తాత్పర్యము

అమ్మా, జగజ్జననీ ! మిక్కిలి ముసలివాడైనను, వికారమును గొలుపు కన్నులు గలవాడైనను, ప్రణయ, కామకేళీ విలాసాదుల యందు మూఢుడైనను, నీ యొక్క కృపావీక్షణమునకు పాత్రుడైనచో – అట్టివానిని చూచి – విడివడి జాఱివడు జడముడులు కలవారై, కడవల వంటి స్తనములపై నుండి జాఱిపోయెడు పైటకొంగులు కలవారై, అప్పటికప్పుడే విడిపోయిన మొలనూళ్ళు, పోకముడులు కలవారై – వందల కొలది ప్రాయములో నున్న తరుణీ మణులు – వాని వెంట పరుగెత్తుదురు గదా! అనగా, అమ్మవారి అనుగ్రహము అట్టి కురూపిని గూడా మన్మథుని వంటి అందగాని వలె చేయునని భావము.

## వివరణము

**''మూకంకరోతి వాచాలమ్ పంగుం లంఘయతే గిరిమ్,**
**యత్కృపా త మహం వందే పరమానంద మాధవమ్''.**

మూగవానిని గూడా ముమ్మరముగా ప్రసంగములు చేయు వానిని గాను, కుంటి వానిని గూడా కొండలను దూకగలవానిని గాను చేయు అనుగ్రహము గల

ఆనంద మాధవునికి అంజలి ఘటించుచున్నాను'' అని – పై శ్లోకమునకు అర్థము. ఇవి అతిశయోక్తులవలె అనిపించవచ్చును. కాని, కృష్ణుని విషయములో ఇంతకన్న ఆశ్చర్యకరము లైనవి గూడ గలవు. మరణించిన వానిని గూడా బ్రతికించుట, బ్రహ్మ శిరోనామ కాస్త్ర పీడితయైన ఉత్తర గర్భమును కాపాడుట, కురూపి అయిన 'కుబ్జ'ను అందాల సుందరిగా మార్చుట – మొదలగు దృష్టాంతము లెన్నియో గలవు. అట్లే, జగజ్జనని అయిన అమ్మవారి అనుగ్రహమునకు పాత్రులైన వారుసాధించలేనిది, పొందలేనిది ఉండదు. 'మూకుడు' అను పుట్టు మూగవానిని పంచశతి (ఐదువందలు) శ్లోకములను ఆశువుగా చెప్పగలుగునట్లు చేసినది అమ్మవారి అనుగ్రహమే గదా! (ఈ పంచశతి శ్లోకములే ''మూక పంచశతి'' అని ప్రసిద్ధి పొందినది).

ప్రస్తుత శ్లోకములో ఒక కురూపిని అమ్మ అనుగ్రహము ఎటువంటి రూపవంతునిగా మార్చగలదో మనకు బాగుగా అర్థమగుటకు విడమరచి ఆదిశంకరులు వివరించు చున్నారు. శ్లోకములో ఉదహరించిన కురూపికి అన్ని విధములా అవలక్షణములే! ఏ ఒక్క లక్షణము గూడ యోగ్యమైనది గాదు. అయినను, అట్టి వికార లక్షణములన్నియు తొలగి, సుకుమారులైన తరుణీ మణులెందరో అతని వెంటపడునట్లు చేయు ఆకర్షణీయ సౌందర్యవంతునిగా మార్చుట అమ్మవారి అనుగ్రహ విశేషమునకు ఒక నిదర్శనము. ఆ విధముగా తరుణీమణులు వెంటబడుటలో శంకరులు ఈ శ్లోకములో ఉపయోగించిన విశేషణములు అత్యంత శృంగార సంబంధముగా నున్నవి. వాస్తవము చెప్పవలెనన్నచో ఇది పచ్చి శృంగార కవిత్వము అనిపించును. ' ఆ విధముగా చెప్పవలసిన అవసరము ఉన్నదా?' అని ఆలోచన వచ్చినపుడు 'ఈ విశేషణముల వెనుక ఏమైన అంతరార్థము దాగి యుండునేమో' అని అనుమానము కలుగును. ఈ అనుమానములకు పరిష్కారము ఎవరి సంస్కారమును బట్టి వారికి కలుగుచుండును.

**1. ''నరం వర్షీయాంసం ..... గళ ద్వేణీ బంధాః''**

బుద్ధిలోని కోరికలను బుర్రపైని మొలుచు కేశములతో పోల్చుట ఒక కవిసమయము. కోరికలవలెనే కేశములు గూడా పెరుగుచుండును. ఈ రెండును బుర్ర నుండి ఉద్భవించునవియే గదా ! కోరికలు లేకుండుట – మోక్షమునకు

దారితీయు సంన్యాసమునకు ప్రథమ అర్హత. దీనిని సూచించుటకే సంన్యాసులకు శిరోముండనము. (ముండనమునకు గల ఈ అర్థములో 'ముండకోపనిషత్తు' వచ్చినది).

కోరికలు – కర్మలకు, ఆ కర్మలలోని మంచి చెడులు – పుణ్యపాపములకు, ఆ పుణ్య పాపములు – కర్మబంధమునకు దారితీయును. ఈ కర్మబంధ విమోచనము ఈ శ్లోకము నందు 'కేశ బంధము విడివడుట' అను అర్థమును తెలుపు 'గళద్వేణీ బంధాః' అనుపదములచే సూచితము. ''ఏళ్ల తరబడి నిలువ వున్న ముసలి వాని కర్మబంధములకు గూడా అమ్మవారి అనుగ్రహము వలన ''ముక్తి'' కలిగి 'ముక్తికాంత' అతని వెంట పడును'' – అను విషయము ''నరం వర్షీయాంసం ... గళద్వేణీ బంధాః ... అనుధావంతి యువతయః'' అను పద ప్రయోగము ద్వారా సూచితము.

**2. ''నయన విరసం.... కుచకలశ విస్రస్త సిచయా''**

అంతర్గతముగా మలినత్వమున్నచో అది ఇంద్రియముల ద్వారా (ప్రస్తుత శ్లోకములోక న్నుల ద్వారా అని సమన్వయ పరచుకొనవలెను) వ్యక్తమగును. హృదయము – నిర్మలత్వ, స్వచ్ఛతలకు నిలయము. సాధారణముగా అజ్ఞానముకు సంబంధించిన 'అహంకార – మమకారములు' – అను పొరలచే ఈ హృదయము కప్పబడి వుండును. అమ్మవారి అనుగ్రహము వలన ఇవి తొలగినపుడు– హృదయములోని అహంకార మమకారా తీతమైన ప్రేమామృత కలశము దర్శనమిచ్చును. ఇది 'ముక్తి కాంతను దగ్గఱకు జేర్చును – ఈ విషయము ''నయన విరసం... కుచకలశ విస్రస్తసిచయా – అనుధావంతి యువతయః'' అనుపద ప్రయోగము ద్వారా శ్లోకము నందు సూచితము.

**3. ''నర్మసుజడం... హఠాత్త్రుట్యత్కాంచ్యో విగళితదుకూలా''**

'అమ్మవారి అనుగ్రహము కలిగిన వెంటనే మోక్షానంద రహస్యము తెలియని జడునకు గూడా మోక్షా వరోధ రహస్యము బట్ట బయలగుచ్చు ముక్తి కాంత వెంటబడును' – అనువిషయము ''నర్మసుజడం... హఠాత్త్రుట్యత్కాంచ్యోవిగళిత దుకూలా.... అనుధావంతి యువతయః'' అను పద ప్రయోగము ద్వారా సూచితములు. అమ్మవారి అనుగ్రహము వలన 'ఈ విధముగా – కర్మ క్షయ,

మలినక్షయ, మోహక్షయములు సిద్ధించి - భక్తుడు మోక్షమును పొందును అని గ్రహించవచ్చును.

పైన సూచింపబడిన విషయములు కేవలము నాకు తోచినవి మాత్రమే సుమండీ! 'విషయపరిపూర్ణు'లకు తదితర నిగూఢరహస్యములు గూడా తోచవచ్చును.



## సంస్కృత శ్లోకము - 14

**శ్లో. క్షితౌ షట్పంచాశ ద్ద్విసమధిక పంచాశదుదకే
హుతాశే ద్వాషష్టి శ్చతురధిక పంచాశ దనిలే
దివి ద్విష్షట్త్రింశ న్మనసిచ చతుష్షష్టి రితి యే
మయూఖాస్తేషా మప్యుపరి తవపాదాంబుజ యుగమ్.**

## అనువాద పద్యము

***చం. వరుసగ నెన్మిదేడులిల, వారిని - నేబది రెండు, వహ్నియం
దరువది రెండుతో, యనిలమందున - నేబది నాలుగున్, మరిన్
అరువది రెండుపైన పది - యాగగనంబున, మానసమ్మునం -
దరువది నాలుగంశువులు నాపయి నీ పదాబ్జయుగ్మమున్.***

## టీక

తల్లీ, జగజ్జననీ ! క్షితౌ = పృథివీ తత్త్వమునకు చెందిన మూలాధార చక్రమునందు, షట్పంచాశత్ = ఏబది యారు సంఖ్యగలవియు, ఉదకే = జలతత్త్వమునకు చెందిన మణిపూర చక్రమునందు, ద్విసమధిక పంచాశత్ = ఏబది రెండు సంఖ్య గలవియు, హుతాశే = అగ్నితత్త్వమునకు చెందిన స్వాధిష్ఠాన చక్రమునందు, ద్వాషష్టిః = అరువది రెండు సంఖ్యగలవియు, అనిలే = వాయు తత్త్వమునకు చెందిన అనాహత చక్రమునందు, చతురధిక పంచాశత్ = ఏబది నాలుగు సంఖ్యగలవియు, దివి = అకాశతత్త్వమునకు చెందిన విశుద్ధి చక్రమునందు, ద్విఃషట్ త్రింశత్ = రెండు ముప్పది యారులు, లేక - డెబ్బది రెండు సంఖ్యగలవియు, మనసిచ = మనస్తత్వమునకు చెందిన ఆజ్ఞా చక్రము నందు, చతుఃషష్టిః = అఱువది

నాలుగు సంఖ్యగలవియున్నై, ఇతి = ఈ విధముగా, యేమయూఖాః = ఏ కిరణములున్నవో, తేషాం = వాటి అన్నిటికిని గూడ, ఉపరి = పైభాగమున, తవ = నీ యొక్క, పాదాంబుజయుగమ్ = చరణ కమలముల జంట (వర్తించుచున్నది).

## తాత్పర్యము

అమ్మా జగజ్జననీ! పృథివీ తత్త్వముతో కూడిన మూలాధార చక్రమునందు ఏబది ఆరు, జలతత్త్వమునకు చెందిన మణిపూరమునందు ఏబది రెండు, అగ్నితత్త్వమునకు చెందిన స్వాధిష్ఠానమునందు అరువది రెండు, వాయుతత్త్వమునకు చెందిన అనాహతమునందు ఏబది నాలుగు, ఆకాశ తత్త్వమునకు చెందిన విశుద్ధి యందు డెబ్బది రెండు, మనస్తత్వమునకు చెందిన ఆజ్ఞాచక్రము నందు అఱువది నాలుగు సంఖ్యలుగాగల వెలుగు కిరణములన్నిటిని అధిగమించి, వాటిపైన నీ చరణకమలములు ప్రకాశించు చున్నవి గదా!

## వివరణము

మానవులలో వెన్నెముక వెంబడి ఉండు షట్చక్ర స్థానములు, వాటి తత్త్వములు లోగడ "మహీంమూలాధారే..." అన్న 9వ శ్లోకమునందు వివరింపబడినవి. ప్రస్తుత శ్లోకమునందు ఆ శక్తిమయ కేంద్రముల వద్ద అమ్మవారి తేజస్సు తాలూకు కిరణములు ఎన్నెన్ని చొప్పున ప్రకాశవంతమగునో వివరింపబడుచున్నది.

"క్షితౌ, అనగా భూమికి సంబంధించిన చక్రమైన 'మూలాధార చక్రము నందు – షట్పంచాశత్' – అనగా 56 కిరణములు, ఇదే విధముగా ఉదక సంబంధమైన స్వాధిష్ఠాన చక్రము నందు 62 కిరణములు, వాయుసంబంధమైన అనాహత చక్రమునందు 54 కిరణములు, ఆకాశ సంబంధమైన విశుద్ధి చక్రము నందు 2 X 36 = 72 కిరణములు, మనస్తత్వమైన ఆజ్ఞాచక్రము నందు 64 కిరణములు ప్రకాశింప జేయుచు, వీటన్నిటికి పైన ఈ కాంతి కిరణములు ఆ విధముగా ప్రకాశించుటకు కారణభూతమైన అమ్మవారి చరణ యుగళము ఉండును" అని శ్లోకార్థము. మొత్తము మీద ఆఱు చక్రముల వద్ద 360 కిరణములగును. ఒక వృత్త కేంద్రము వద్ద 360 డిగ్రీలు, లేదా – భాగలు ఉండును. 'భాగ' లనగా వెలుగుతో గమనించునవి, అనగా – 'వెలుగు కిరణములు' గా గూడ అర్థము చెప్పుకొనవచ్చును.

అనగా, కేంద్రమును అమ్మవారి చరణ యుగళముగాను, దాని నుండి ప్రసరింపబడు 360 డిగ్రీలు, లేదా - భాగలను షట్చక్రముల వద్ద గల మొత్తము కిరణములుగాను సమన్వయ పరచుకొనవచ్చును.

**చంద్ర విద్యాపరమైన సమన్వయము**

అమ్మవారికి సంబంధించిన లెక్కలు చంద్ర సంబంధముగా నుండును. రోజుకు ఒక్కొక్క కళ చొప్పున ఒక మాసములో శుక్లపక్షము నందు 15 కళలు, కృష్ణపక్షము నందు 15 కళలు కలిసి మొత్తము 30 కళలుండును. ఇటువంటి కళలు 1 సంవత్సరములో 12 X 30 = 360 వుండును. ఈ 360 చంద్రకళల వెలుగులకు ఉత్పత్తి స్థానము అమ్మవారి చరణ యుగళమే ! ఈ వెలుగులకు నిధి అమ్మవారి పాదములు. సంవత్సరములో చంద్రకళల కాంతులు పెరుగుచూ, సంపూర్ణమగుచూ, తరుగుచూ, మాయమగుచూ ఉండును గాని, వీటికి మూలస్థానమైన అమ్మవారి చరణ యుగళము ఎప్పుడునూ నాశము కాని వెలుగుల ముద్దయే !

మన శరీరములోని సహస్రార స్థానము, శ్రీ చక్ర కేంద్రము వద్ద బైందవ స్థానము అమ్మవారి నిలయము. మన శరీరములోని మొత్తము 72,000 నాడులు అమ్మవారి పాదముల నుండి స్రవింపబడు అమృత కిరణములచే తడపబడునని ఇంతకు పూర్వము ''సుధాధారాసారైః.... ప్రపంచం సించన్తీ పునరపి రసామ్నాయ మహసః'' - అను 10వ శ్లోక పాదములో చెప్పబడినది. అనగా, మనలో నాడీ ప్రేరణకు, నిత్యచైతన్యమునకు అమ్మవారి పాదముల నుండి స్రవింపబడు ఈ అమృత కిరణములే కారణము.

**అగ్ని సూర్య చంద్ర ఖండములు**

మూలాధారాది షట్చక్రముల వరుసను మూడు ఖండములుగా చెప్పుట గూడ గలదు. ఇందు ప్రతి రెండు చక్రములు కలిసి ఒక ఖండమగును. మొదటి రెండు చక్రముల ఖండమును అగ్ని ఖండమందురు. దీనినే బ్రహ్మ గ్రంధి (Brain of instincts and desires) అందురు. ఈ బ్రహ్మగ్రంధికి సంబంధించిన అగ్ని జ్వాలలు 56 + 52 = 108 అగును. ఇక తరువాత ఉండు రెండు చక్రముల ఖండమును సూర్య ఖండము అందురు. దీనినే విష్ణుగ్రంధి (Brain of emotions and

affections) అందురు. ఈ విష్ణుగ్రంధికి సంబంధించిన సూర్య కిరణములు 62 + 54 = 116 అగును. ఇక తరువాత ఉండు రెండు చక్రముల ఖండమును చంద్రఖండము అందురు. దీనినే రుద్ర గ్రంథి (Brain of intellect of wisdom) అందురు. ఈ రుద్రగ్రంథికి సంబంధించిన చంద్రకళలు 72 + 64 = 136 కళలు అగును. ఈ విధముగా షట్చక్ర స్వరూపమైన శ్రీ చక్రము – అవరోహణ క్రమములో సోమ సూర్య అనలాత్మకమై వుండును. ఈ సోమ సూర్యాగ్నులు ముగ్గురు – వెలుగులకు నిలయము, వెలుగులకు ఉత్పత్తి స్థానము అయిన – అమ్మవారి పాద యుగళము నుండి వెలువడు అనంత కిరణ పుంజము నుండి కొన్నిటిని మాత్రమే పొంది, పగటిని – సూర్యుడు, రాత్రిని – చంద్రుడు, సంధ్యా సమయములను అగ్ని వెలుగొందింప చేయుచున్నారు.

**కిరణ సంఖ్యల ప్రత్యేకత**

ఆయా చక్రముల వద్ద గల కిరణముల సంఖ్యకు గూడా కొంత ప్రత్యేకత గలదు. ఉదాహరణకు విశుద్ధి చక్రము వద్ద 72 కిరణముల ప్రాముఖ్యము మాత్రము ఇక్కడ చెప్పబడును.

మన దేహమునందు తలకు మొండెమునకు మధ్య నున్న కంఠము ఆ రెంటిని సంధించును. అనగా, ఇది వాటి మధ్య వారధి (Bridge) గా వర్తించును. పైన ఉండు వెలుగుల లోకమును, లేదా – ద్యులోకమును (Plane of light or consciousness) – తల, క్రింద నుండు భౌతిక లోకమును (Plane of matter) – మొండెము సూచించును. ఈ రెంటిని సంధించునదైన ఆకాశమును మన దేహములో కంఠము సూచించును. అందువలననే ఈ ఆకాశ తత్త్వమునకు సంబంధించిన చక్రమైన విశుద్ధి – కంఠము వద్ద ఉండును. కంఠమునకు క్రింది భాగము నుండి ఈ కంఠము ద్వారా తలలోని మెదడును జేరు నాడుల సంఖ్య 72000. ఈ సంఖ్యను సూచించుటకు ఆకాశ తత్త్వమైన విశుద్ధి చక్రము వద్ద 72 కిరణములని చెప్పబడినది. (రామాయణములో ఈ నాడులు వానరులచే (వార్తాహరులు, లేదా Communicative facultieis) సూచితము. రామాయణము నందలి షట్కాండలకు కుండలినీ యోగమందలి షట్చక్రములకు మధ్య సంబంధము నేను వ్రాసిన అరణ్యకాండ, కిష్కింధాకాండలలో పూర్తిగా వివరింపబడినది.)



## సంస్కృత శ్లోకము - 15

శ్లో. శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం
వర|త్రాస|త్రాణ స్ఫటిక ఘుటికా పుస్తక కరామ్
సకృన్నత్వా నత్వా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీర |ద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః.

## అనువాద పద్యము

చం. *శరదమలేందు చం|ద్రికల ఛాయయు, చం|ద్రవిభూష శీర్షమున్,*
*తరళకరమ్ములన్ స్ఫటిక దామ వరాభయ పుస్తకమ్ములున్,*
*దలిసెన మిచ్చునట్లు నిను ధ్యానము చేసి నమస్కరించినన్*
*నిరతము గల్గదే మధువునిండిన |ద్రాక్షల క్షీరవాక్కులున్.*

## టీక

తల్లీ ! జగజ్జననీ ! శరత్ + జ్యోత్స్నా = శరత్కాలపు వెన్నెలవలె, శుద్ధాం = శుద్ధమైన, స్వచ్ఛమైన తెల్లని కాంతులు విరజిమ్మునదియు, శశియుత = నెలవంకరేఖను కూడిన, జటాజూట = జుట్టు ముడి అనెడి, మకుటాం = కిరీటము గలదియు, వర = వరద ము|ద్రను, |త్రాస|త్రాణ = అభయము|ద్రయు, స్ఫటిక ఘుటికా = స్ఫటికములతో కూర్చబడిన అక్షమాలయు, పుస్తక = పుస్తకమును, కరాం = హస్తములందు గలిగినదానిగా, త్వా = నిన్ను, సకృత్ = ఒక్కమారు, నత్వా = నమస్కరించిన, సతాం = బుద్ధిమంతులకు, మధు = తేనె, క్షీర = పాలు, |ద్రాక్షా = |ద్రాక్షా ఫలముల, మధురిమ = తీయదనమును, ధురీణాః = వహించి యున్న మధురాతిమధురమైన, ఫణితయః = వాగ్విలాస వైఖరులు, కథమివ = ఎట్లు, సన్నిదధతే = |ప్రాప్తించకుండును ?

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! శరత్కాలపు వెన్నెలను పోలెడు తెల్లని దేహచ్ఛాయ గల దానివి గాను, నెలపొడుపు చం|ద్రరేఖను కూడిన జుట్టు ముడి అనెడి కిరీటము గల దానివి గాను, వరద, అభయ, స్ఫటికాక్షమాల, పుస్తకములను - నాలుగు హస్తములందు గల దానివిగాను - నిన్ను ధ్యానించి, ఒక్కసారి నమస్కరించునట్టి

సత్పురుషులకు - పూదేనె, పాలు, ద్రాక్షా ఫలరసముతో సాటి వచ్చు) మాధుర్యము గల వాగ్విలాస వైఖరులు ఎట్లు ప్రాప్తించకుండును? అనగా, తప్పక అట్టి వాక్కులు వారికి ప్రాప్తించునని భావము.

## వివరణము

ఈ శ్లోకము నందు సారస్వత ప్రయోగమునకు సంబంధించిన ఉపదేశము గలదు. ఈ ఉపదేశమును పొందునపుడు, పొందిన తరువాత - ధ్యానించుటకు అవసరమగు అమ్మవారి రూపవర్ణనము, ఇందువలనపొందు ధ్యానఫలము వివరింపబడినవి. వాస్తవమునకు ఈ 15వ శ్లోకముతో పాటు దీని తరువాత రాబోవు "కవీంద్రాణాం చేతః ...... సతాంరంజనమమీ" అను 16వ శ్లోకమును 'సవిత్రీభిర్వాచాం... కమలామోదమధురైః" అను 17వ శ్లోకమును గూడా జతచేసినచో - సారస్వత ప్రయోగమును పరిపూర్ణమగును. ఈ 16, 17 శ్లోకములకు సంబంధించిన వివరణలు దీని తరువాత తెలుపబడును.

ఈ శ్లోకమునందలి సారస్వత ప్రయోగములో ధ్యాన రూపవర్ణన - శ్లోక పాదములందలి పదముల బాహ్యార్థములను బట్టి తేలికగానే గ్రహించ గలిగినను ఉపదేశమునకు సంబంధించిన బీజాక్షరమును మాత్రము పదముల వెనుక గల సంకేతార్థములను బట్టియే రాబట్టుకొనవలయును. ముందు ధ్యానించుటకు చెప్పబడిన రూపవర్ణన వివరింపబడిన తరువాత బీజాక్షర విషయము వివరింపబడును.

**ధ్యానరూపము**

జగజ్జనని అయిన అమ్మవారి స్థూల విగ్రహ వర్ణనము 7వ శ్లోకమైన "క్వణత్కాంచీదామా... ఆహోపురుషికా" అను శ్లోకమునందు వివరింపబడినది. ఆ శ్లోకమునందలి వర్ణనమును బట్టి అమ్మవారి నాలుగు చేతులందు - ధనుస్సు, బాణము, పాశము, అంకుశము కలవని మాత్రమే చెప్పబడినది గాని - వరద, అభయముద్రలను గూర్చి చెప్పబడలేదు. ఆ వరద, అభయ ముద్రల వలన భక్తునికి ఏవేవి ప్రసాదింపబడునో వాటిని అమ్మవారి చరణయుగళమే భక్తునకు అనుగ్రహింప గల సామర్థ్యమును కలిగి యుండగా - మరల వేరుగా హస్తములందు వరద, అభయ ముద్రలు ఉండవలసిన అవసరము లేదని 4వ శ్లోకమైన "త్వదన్యఃపాణిభ్యాం... తవహిచరణా వేవనిపుణౌ" నందు తెలుపబడినది.

ఈ 4వ, 7వ శ్లోకములందు చెప్పబడిన వర్ణనను బట్టి అమ్మవారి సహజ రూపమునకు – వరద, అభయ, ముద్రలు ఉండవని తెలియుచున్నది. కాని, ప్రస్తుత శ్లోకమునందు ఒక ప్రత్యేక ప్రయోజనము కొఱకై అమ్మవారిని ధ్యానించుటకు ఒక ప్రత్యేక రూపము – ధ్యానమునకు తెలుపబడినదని గ్రహించవలెను. ఈ ధ్యానరూపము ఈ క్రింద తెలిపిన విధముగా చెప్పబడినది.

అమ్మవారు శరత్కాలపు వెన్నెల వంటి తెల్లని కాంతి పుంజములను వెదజల్లు శరీరఛాయతో ఉండి, నెలవంక రేఖతో కూడిన జుట్టు ముడినే కిరీటముగా గలిగి, నాలుగు చేతులందు – వరదముద్ర, అభయముద్ర, స్ఫటికాక్షమాల, పుస్తకములను – కలిగియున్నట్లు ఊహించి, ధ్యానించవలెనని చెప్పబడినది. అన్ని ఋతువులలోనికి ఆహ్లాదకరముగా నుండు ఋతువులు రెండు. అవి – వసంత ఋతువు, శరదృతువు. వసంత ఋతువులో – 'సుమ' వికాసము, శరదృతువులో – 'సోమ' వికాసము నిండుగా నుండును. అనగా, ఈ వికాసములు రెండు 'సౌమ్యము' లన్నమాట! వసంత ఋతువులో చక్కదనము ఉండును. శరదృతువులో చక్కదనముతో పాటు చల్లదనము వెచ్చదనము సమతౌల్యముగా నుండును. ఇట్టి ఋతువును సరస్వతీ దేవికి సంబంధించిన ఋతువని తెలియ జేయుటకు శారద ఋతువు లేదా 'శరదృతువు' అనిరి. ఇట్టి శరదృతువులోని చంద్రుని వెన్నెల చక్కదనమును, చల్లదనమును, స్వచ్ఛమును, తెల్లదనమును గలిగిన కాంతుల జిగి అమ్మవారి మేనికి ఉన్నట్లు ధ్యానించమనుటలో గల ఔచిత్యమిదియే!

**సారస్వత పరమైన సమన్వయము**

'నెలవంకరేఖ' – మనోజ్ఞమైన భావరేఖలకు సూచితము. అనగా, నెలవంక ఎంత అందముగా, సుకుమారముగా నుండునో భావములు అంత సుకుమారముగా, అందముగా నుండునని సూచితము.

'జటాజూట' మనగా జట్టుముడి. కవితా పదబంధములు – ఈ కేశబంధముతో సూచితము. కవితా భావ సంపదకు కారణమైన మనస్సునకు, కేశ సంపదకును గూడ పుట్టిల్లు మస్తకమే గదా!

'వరదముద్ర' – కవిత్వమును చెప్పుటలో కావలసిన ధీశక్తి, ఊహాశక్తి మొదలగు వాటిని ప్రసాదించునని సూచించును. సభలలో వాగ్వివాదములలో

నిర్భీతిగా చెప్పగల గుణమును 'అభయముద్ర' సూచించును. కవిత్వమునకు, రచనలకు కావలసిన అక్షర జ్ఞానమును 'స్ఫటికాక్షమాల' ('అ' కారాది 'క్ష' కారాంత అక్షరమాలే ఈ 'అక్ష' మాల) సూచించును. కేవలము వాగ్వివాదములు, చర్చలు, ఉపన్యాసములే కాక, గ్రంథరచనా సామర్థ్యము కూడా అనుగ్రహింపబడునని 'పుస్తకము' సూచించును.

పైన తెలిపిన సంకేతముల ద్వారా సూచింపబడిన అమ్మవారి రూపమును ధ్యానించి, ఒక్కసారి అయినను చక్కగా నమస్కరించినంత మాత్రమున - అట్టివారికి 'మధు, క్షీర, ద్రాక్షా మధురిమలను మరిపించు వాగ్వైఖరీ మధురిమ' లు అబ్బునట! మరల ఈ మూడింటిలో 'మధువు' - పదముల పొందికను (coining of words), 'క్షీరము' - పదముల స్వచ్ఛతను, పవిత్రతను (Purity and sanctity of words) 'ద్రాక్ష' - పదముల పటుత్వమును (Vitality of words) సూచించును. మంచి రచనలకు కవిత్వమునకు కావలసినవి ఇవియే గదా!

**బీజాక్షరము**

సారస్వత ప్రయోగమునకు సంబంధించిన ఉపదేశమంత్రముల లోని బీజాక్షరములు గూడ ఈ శ్లోకమునందు సంకేత పూర్వకముగా చెప్పబడినవి. శ్రీ విద్యకు సంబంధించిన ప్రధాన, మూల బీజాక్షరము; ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులను తన యందు ఇముడ్చుకొనిన బీజాక్షరము అయిన - ''శ్రీం'' ఈ శ్లోకమునందలి ప్రథమ పాదములోనే సంకేత పూర్వకముగా గలదు.

'శరత్' - అనుపదములోని అక్షరములు - 'శ' కార 'ర' కారములను సూచించును. 'జటాజూట'' మనగా 'జుట్టు ముడి'. ఈ జుట్టుముడి 'ఇ' కారమును (వర్ణ క్రమములో 'గుడి' (ి) సూచించును. 'మకుటాం' - అను పదము ఈ 'గుడి'కి దీర్ఘమును (ీ) సూచించును. అనగా, ''ఈ'' కారమును సూచించును. 'శశియుత జటాజూట' మను పదములకు 'చంద్రుని కూడిన జుట్టుముడి' అని అర్థము. ఇక్కడ చంద్రుడు మంత్రశాస్త్ర ప్రకారము సున్న (O) ను సూచించును. కాబట్టి, 'శశియుత జటా జూటమకుటాం' అనుపదములు సున్నతో గూడిన గుడిదీర్ఘము (ీ) అనగా, 'ఈం' అను అక్షరమును సూచించును. ఇప్పుడు మొదటి పాదములో మొట్టమొదటగా నున్న 'శరత్' సూచించు 'శ' కార 'ర'

కారములతో ఈ 'ఈం' అక్షరమును కలిపినచో శ + ర + ఈం = 'శ్రీం' అను బీజాక్షరము వచ్చును. ఈ బీజాక్షరము సమస్త శ్రీవిద్యకు మూలము.

ఇట్లే – వాగ్భవ బీజమైన 'ఐం' ముందు రాబోవు శ్లోకపాదములందు నిక్షిప్తము. దాని వివరణ ప్రస్తుతము తెలియపరచుట లేదు. ఆ శ్లోక వివరణలో తెలుపబడును.

**ముఖ్యగమనిక**

ఈ శ్లోకమును సుస్పష్టముగా, ఉచ్చారణ దోషము లేకుండా, రాకుండా చదువవలెను. లేనిచో – అనర్థములకు, పెడర్థములకు దారితీయు పరిస్థితులు గూడా రావచ్చును.

'సకృత్' అనుపదమును 'శకృత్' అను విధముగా ఉచ్చరించినచో, అనగా దంతముల సహకారముతో ఉచ్చరించవలసిన 'స' కారమును, దవడల సహకారముతో ఉచ్చరించు 'శ' కారముగా ఉచ్చరించినచో – 'ఒక్కసారి' అను అర్థమునకు బదులు 'విసర్జనము' అని అర్థము వచ్చును. దీనికి తోడు 'సకృత్' అను పదము ప్రక్కన 'నత్వా' పదము గలదు. ఈ పదమునకు 'వంగుట' లేదా 'నమస్కరించుట' అను అర్థములు గలవు. 'వంగుట' అను అర్థము విసర్జన ప్రక్రియకు దోహదపడునదిగా వర్తించి – 'ఒక్కసారి విసర్జనము చేసినచో' – అను పెడర్థము వచ్చి, అనర్థమునకు దారితీయును. కాబట్టి, ఈ శ్లోకమును జాగ్రత్తగా సుస్పష్టముగా ఉచ్చారణ దోషము లేకుండా పఠించుట అవసరము. ఈ శ్లోకమునందలి భావము అర్థము కాకపోయినను, చదివినపుడు ఒక విధమైన వాతావరణము ఏర్పడును. అది శ్లోకము నందలి పదముల అమరిక చేతను, ఆ పదములను ఉచ్చరించునపుడు వచ్చు ధ్వనుల చేతను సమకూరును. ఇది ఉత్తమ కవుల రచనలకు నిదర్శనము.

ఉపన్యాసకులు, అధ్యాపకులు, రచయితలు, కవులు, పండితులు – ఈ శ్లోకమును సుస్పష్టోచ్చారణతో ప్రతిరోజూ పూజా సమయము అందు చదువుకొనుచున్న యెడల వారల వృత్తి ప్రవృత్తులకు ఆనుకూల్యము సిద్ధించును.



## సంస్కృత శ్లోకము - 16

శ్లో. కవీంద్రాణాం చేతః కమలవన బాలాతప రుచిం
భజంతే యేసంతః కతిచి దరుణామేవ భవతీమ్
విరించి ప్రేయస్యా స్తరుణ తర శృంగారలహరీ
గభీరాభిర్వాగ్భి ర్విదధతి సతాం రంజనమమీ.

## అనువాద పద్యము

*చం. వరకవి మానసమ్ములను పద్మవనమ్ముల పట్ల బాలభా*
*స్కర కర కాంతివౌ యరుణగా నినుగొల్చెడి సజ్జనుల్ సదా*
*సరసిజ సూతి కాంతయగు శారద దివ్యగభీర మాధురీ*
*తరుణతరార్థవాక్కుల బుధప్రజరంజనమీయరే యిలన్.*

## టీక

కవీంద్రాణాం = కవిశ్రేష్ఠుల యొక్క, చేతః కమలవన = చిత్తములు అనెడి పద్మవనములకు, బాలాతపరుచిం = ఉదయసూర్యుని లేతఅరుణకాంతియై, అరుణాం + ఏవ = అరుణ వర్ణము గల, భవతీం = నిన్ను, కతిచిత్ = కొందఱు, యే సంతః = ఏ విబుధ జనులు, భజంతే = సేవించుదురో, (అట్టి) అమీ = వీరు, విరించి ప్రేయస్యాః = సరస్వతీ దేవి యొక్క, తరుణతర = ఉప్పొంగు పరువపు (ఉప్పొంగు యవ్వనపు), శృంగార = శృంగార రసము యొక్క, లహరీ = పొంగి ప్రవహించు ప్రవాహము వలె, గభీరాభిః = గంభీరములైన, వాగ్భిః = వాగ్విలాసము చేత, సతాం = సత్పురుషులకు, రంజనం = హృదయానందమును, విదధతి = చేయుచున్నారు.

## తాత్పర్యము

ఉత్తమ కవుల చిత్తములనెడు కమలముల ఉద్యానవనమునకు ఉదయసూర్యుని లేయెండ ఛాయతో అరుణ వర్ణముతో నుండు నిన్ను (లేదా 'అరుణ' అను పేరు గల నిన్ను) సేవించు విబుధులు – సరస్వతీ దేవి యొక్క పరిఢవించిన పరువపు శృంగార రస ప్రవాహముల వలె నుండు గంభీరమైన వాగ్విలాస సంపద చేత సత్పురుషుల హృదయములను రంజింప చేయుదురు గదా !

## వివరణము

ఈ శ్లోకము నందు గూఢ సారస్వత ప్రయోగమునకు సంబంధించిన ధ్యానరూప వర్ణన గలదు. క్రిందటి శ్లోకము నందు మధురాతిమధురమైన వాగ్విలాస సంపత్తితో - సంభాషించుటకు, రచనలు చేయుటకు అమ్మవారిని ఏ రూపము గల దానిగా ధ్యానించవలెనో ఆ రూపవర్ణన తెలుపబడినది. ప్రస్తుత శ్లోకమునందు మరియొక రకమైన లక్ష్యమునకు ధ్యాన రూపము తెలుపబడుచున్నది. విద్వత్సభలలోని విబుధజనుల హృదయములను రంజింప చేయుటకు అవసరమగు చమత్కారయుతమైన, శృంగార రసపుష్టి గల వాగ్విలాస సంపదను పొందుటకు ధ్యానించవలసిన అమ్మవారి రూపమును తెలుపుచున్నారు. సారస్వతా లోకమునందు విహరించుటకు సుందర గంభీర పదవిన్యాస, వాక్యవిలాస, భావవికాస సంపద ఉండవలెను. అట్టి విద్వత్సం పదను పొందుటకు అమ్మవారిని ధ్యానించవలసిన రూపము ప్రస్తుత శ్లోకమునందు వివరింపబడుచున్నది.

**ధ్యాన రూపము**

క్రిందిటి ''శరజ్జ్యోత్స్నా'' శ్లోకమునందు అమ్మవారిని 'శ్వేత వర్ణ' ఛాయ గల దానిగా ధ్యానించినచో వచ్చు ప్రతిఫలము చెప్పబడినది. ప్రస్తుత శ్లోకమునందు అమ్మవారిని 'అరుణ వర్ణ' రూపిణిగా ధ్యానించినచో వచ్చు ప్రతిఫలము చెప్పబడుచున్నది. ఉదయించు సూర్యుడు అరుణవర్ణములో నుండును. కాబట్టి అట్టి సూర్యకిరణముల కాంతి కూడా అరుణ వర్ణములోనే ఉండును. శృంగార రసము - రాగరంజితమై, అనురాగ సంజనితమై, భోగవిలాససమ్మిళితమై, ఆనంద భరితముగా నుండును. ఉదయ సూర్యుని కాంతిలో ఈ గుణములు ప్రస్ఫుటముగా నుండును. సత్కవుల చిత్తములనెడి కమలముల తోటను తన శరీర అరుణరుణ కాంతులనెడు ఉదయ సూర్యుని అరుణా కిరణములచే స్పృశించి, పరవశింప జేసి, పరిపూర్ణ వికాసము నొందించగల దానిగా అమ్మవారిని కొందరు ధ్యానింతురట! శృంగార రస ప్రవాహము ఉప్పొంగి పెల్లుబికెడు యౌవ్వనపరిపుష్టితో, సుందర

బంధురమైన ఈ సృష్టి రచనకు విరించికి ప్రేరణయై, ప్రేయసియై వర్తించెడుసరస్వతిని - పైవిధముగా తనను (అమ్మవారిని) ధ్యానించు వారిలో ప్రవేశింప జేసి, వారిని పుంభావ సరస్వతులను జేయునట! అప్పుడు వారు గంభీర విశిష్టవచోవిశారదులై, విద్వత్సభలలోని విబుధ జనులను విశేషముగా ఆకట్టుకొందురుట!

**నిక్షిప్త బీజాక్షరములు**

క్రిందటి శ్లోకమునందు 'శ్రీం' అను బీజాక్షరము ఉన్నట్లే - ఈ శ్లోకమునందు వాగ్భవ బీజాక్షరమైన ''ఐం'' ఉన్నది. వాక్యశక్తిని కోరువారందఱూ ఈ ''ఐం'' అను బీజాక్షరమును జపించవలెను. 'బాలా' మంత్రములోని మొదటి బీజాక్షర మిదియే! మరియు వాగ్వాదిని, వాగీశ్వరీ మొదలగు వాగ్దేవతలను ధ్యానించుటకు గూడా ''ఐం'' అను ఈ బీజాక్షరమునే జపించవలెను. ఈ బీజాక్షరము అమ్మవారికి ముఖము (ముఖమనగా సంస్కృతములో - నోరు) వంటిదిగా తెలుసుకొనవలెను. ఈ ''ఐం'' అను బీజాక్షరము ఈ శ్లోకమునందు ఏ విధముగా నిక్షిప్తమై ఉన్నదో తెలిపెదను.

''భజంతే యే సంతః కతిచి దరుణా మేవ భవతీం'' ఈ 2వ పాదము నందు ''అరుణామేవ భవతీం'' లో ''ఐం'' అను బీజాక్షరము నిక్షిప్తమై ఉన్నది. అది ఎట్లనగా -

''అరుణాం'' పదములోని మొదటి అక్షరము ''అ''.

''ఏవ'' - పదములోని మొదటి అక్షరము - ''ఏ''.

''భవతీం'' - పదములోని చివరి అక్షరము నందలి అచ్చు అక్షరము - ''ఈం'' ఈ మూడు అక్షరములు, అనగా - 'అ + ఏ + ఈం' కలిసి ''ఐం'' అగును.

ఈ శ్లోకము యొక్క 1, 2 పాదములలో ఇతరులను ఆకట్టుకొను 'పరాక్రమము' నకు సంబంధించిన ''క్రీం'' బీజాక్షరము గూడా నిక్షిప్తమై ఉన్నది. అది ఎట్లనగా -

''కవీంద్రాణాం'' - పదములోని ''క'' కారము, 'అరుణాం' పదము సూచించు - ఉదయ సూర్యుడు రగుల్కొలుపు వేడికి సంబంధించిన అగ్ని బీజము - ''ర'' కారము,

''భవతీం'' పదములోని ''ఈం'' కారము - ఈ మూడు అక్షరములు, అనగా - 'క + ర + ఈం' కలిసి ''క్రీం'' అగును.

రాబోవు శ్లోకము గూడా సారస్వత ప్రయోగ ఉపదేశమునకు సంబంధించినదే!



## సంస్కృత శ్లోకము - 17

**శ్లో. సవిత్రీభిర్వాచాం శశిమణి శిలాభంగరుచిభిః**
**వశిన్యాద్యాభిస్త్వాం సహజనని సంచింతయతి యః**
**స కర్తా కావ్యానాం భవతి మహతాం భంగిరుచిభిః**
**వచోభిర్వాగ్దేవీ వదన కమలామోద మధురైః**

## అనువాద పద్యము

*మ. శశిరత్న ద్యుతు లొప్పచున్, మధుర వాక్సంపత్తి గల్గించు నీ*
*వశినీ మున్నగు శక్తులన్ గలిపి యంబా! నిన్ను ధ్యానించు, వా*
*డసమానంబగు కావ్యకర్తయగు నా భారతీ వక్త్రసా*
*రస సౌగంధ మనోహరార్థ పద సామ్రాజ్య ప్రభాధీశుడై.*

## టీక

(ఓ జగజ్జననీ!) వాచాం = వాక్కుకు, పవిత్రీభిః = జనక స్థానీయులును, శశిమణి శిలా = చంద్రకాంతమణుల, భంగ = ముక్కల యొక్క, రుచిభిః = కాంతులను పోలెడు (తెల్లనిదేహ) కాంతి గలవారైన, వశిన్యాదిభిః సహ = వశినీ మొదలగు శక్తులతో గూడ, త్వాం = నిన్ను, యః = ఎవడు, సంచితయతి = చక్కగా ధ్యానించునో - సః = అతడు, మహతాం = వాల్మీకి మొదలైన మహాకవుల యొక్క, భంగిరుచిభిః = (రచనల) రీతుల వలె నుండు రసవంతమైన, వాగ్దేవీ వదనకమల = సరస్వతీదేవి ముఖము అనెడు కమలము నందలి, ఆమోద = పరిమళముచే, మధురైః = మధురములైన, వచోభిః = వాక్సంపత్తితో, కావ్యానాం = కావ్యములకు, కర్తాభవతి = రచయితగా సమర్థుడగు చున్నాడు.

## తాత్పర్యము

జగజ్జననీ ! వాక్కులను సృజించు వారును, చంద్రకాంతమణుల శకలముల వలె తెల్లనైన దేహముల కాంతికలవారును అగు – వశినీ మొదలగు శక్తులతో గూడ నిన్ను ఎవడు చక్కగా ధ్యానించునో వాడు – మహాకవులైన వాల్మీకి కాళిదాసాదుల కవిత్వరచన వలె మధురమైన, శ్రవణరమణీయమైన, సరస్వతీ దేవి యొక్క ముఖ కమల పరిమళములను వెదజల్లు మృదువైన వాక్కులతో – రసవంతమైన కావ్య రచన చేయగల సమర్థుడగును.

## వివరణము

గత రెండు శ్లోకములవలె ఈ శ్లోకము గూడ సారస్వత ప్రయోగమునకు సంబంధించినదే !

ఈ శ్లోకమునందు మాతృకావర్ణరూపిణి అయిన – త్రిపురాంబికను వర్ణించుట జరిగినది.

''మాతృకాం వశినీయుక్తాం యోగినీభి స్సమన్వితామ్
గంధాద్యాకర్షిణీ యుక్తాం సంస్మరే త్రిపురాంబికామ్''

అను శ్లోకమును బట్టి – అమ్మవారి ఈ మాతృకా వర్ణ స్వరూపము – వశిన్యాది ఎనిమిది శక్తుల చేతను, విద్యాయోగిని మొదలైన నలుగురు శక్తుల చేతను కూడి వుండునని అర్థము చేసుకొనవలెను. వీరిచే కూడియుండు అమ్మవారిని ధ్యానించినచో సుమధుర సురుచిర రచనలు చేయగల కవిత్వరీతులు అబ్బును.

**వశిన్యాదిశక్తులు**

భగవతి – 'మాతృకావర్ణరూపిణి' 'పంచాశత్పీఠ రూపిణి' – అని చెప్పబడును. అనగా 'సంస్కృత భాషయందుగల' 'యాబది అక్షరముల స్వరూపిణి' అని – అర్థము. అందులకే – ఇట్టి అమ్మవారిని, వాగ్దేవి అయిన సరస్వతి ఒక చామరముతో వీచుచు సేవించుచుండును, అని లలితా సహస్ర నామములో – ''సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా'' అను నామములో చెప్పబడినది. సంస్కృత భాషలో లిపి యందు గల యాబది అక్షరములను ఎనిమిది వర్గములుగా విభజించిరి. ఈ ఎనిమిది వర్గములకు ఎనిమిది వశిన్యాది శక్తులను సమన్వయ పరచుకొనవలెను.

| | | |
|---|---|---|
| 1. 'అ' వర్గము | – అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః | (16) |
| 2. 'క' వర్గము | – క ఖ గ ఘ ఙ | (5) |
| 3. 'చ' వర్గము | – చ ఛ జ ఝ ఞ | (5) |
| 4. 'ట' వర్గము | – ట ఠ డ ఢ ణ | (5) |
| 5. 'త' వర్గము | – త థ ద ధ న | (5) |
| 6. 'ప' వర్గము | – ప ఫ బ భ మ | (5) |
| 7. 'య' వర్గము | – య ర ల వ | (4) |
| 8. 'శ' వర్గము | – శ, ష, స, హ, ళ | (5) |

**విద్యాది యోగినులు**

యోగినులు పండ్రెండు మంది ఉందురు. వీరి పేర్లు వరుసగా 1) విద్యాయోగిని, 2) రేచికా యోగిని, 3) మోచికా యోగిని, 4) అమృతా యోగిని, 5) దీపికా యోగిని, 6) జ్ఞాన యోగిని, 7) ఆప్యాయనీ యోగిని, 8) వ్యాపినీ యోగిని, 9) మేధా యోగిని, 10) వ్యోమ రూపా యోగిని, 11) సిద్ధరూపా యోగిని, 12) లక్ష్మీ యోగిని – ఈ యోగినులు, ఇంతకు ముందు తెలిపిన ఎనిమిది వశిన్యాది శక్తులు కలిసి మొత్తము ఇరువది మంది అగుదురు. ఈ ఇరువది మంది – శ్రీ చక్రము నందలి దశారయుగ్మము ($2 \times 10 = 20$ కోణములు) నందు ఉండు ఇరువది కోణముల వద్ద వుందురని ధ్యానించవలెను.

**గంధాకర్షిణ్యాదులు**

శ్రీ చ క్రమునకు నాలుగు ద్వారములుండును. ఈ నాలుగు ద్వారముల వద్ద ధ్యానించవలసిన నలుగురినీ వరుసగా – 1. గంధాకర్షిణి, 2. రసాకర్షిణి, 3. రూపాకర్షిణి, 4. స్పర్శాకర్షిణి అందురు. వీటి ప్రసక్తి శ్రీ సూక్తమునందు గూడ ''గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం'' అను మంత్రము నందు గలదు. ఇవి పంచతన్మాత్రలలోని ఆకాశమునకు సంబంధించిన శబ్ద తన్మాత్రకు తప్ప మిగిలిన స్పర్శ, రూప, రస, గంధములకు ప్రతీకలే! ఆకాశము కేంద్ర బిందువై, ఈ నాలుగూ నాలుగు దిక్కులుగా నుండునని ధ్యానించవలెను. ఆ కేంద్ర బిందువువైన ఆకాశము నుండి వెలువడునదే శబ్ద గుణకము, లేదా – వాక్కు అని గ్రహించవలెను. పంచవముఖగాయత్రీదేవికి కూడా ఐదుతలలను ఇదే విధముగా ఊహించి

ధ్యానించవలెను. (ఈ విధమైన పంచముఖ రూప గాయత్రీదేవిని గుంటూరు బ్రాడీపేటలోని ఓంకార క్షేత్రమునందు చూడవచ్చును.)

పైన తెలిపిన ఎనిమిది వశిన్యాది శక్తులు, పండ్రెండు విద్యాదియోగినులు, నలుగురు గంధాకర్షిణ్యాది శక్తులు మొత్తము ఇరువది నలుగురు గూడ – తెల్లనిదేహ కాంతి గలవారుగానే ధ్యానించవలెను. చంద్రకాంతశిలయే చల్లగాను, తెల్లగాను వుండును. వారి ఆ మణుల ఖంఢములు మరింత తెల్లదనమును, చల్లదనమును గలిగి యుండును. కావున, శ్లోకమునందు ''శశిమణి శిలాభంగ రుచిభిః'' అను సమాస పదములు వాడబడినవి. ఇట్టివారితో గూడిన అమ్మవారిని ధ్యానించినవాడు – మహాకవుల వలె మనోహరమైన, మనోజ్ఞమైన మధుర రచనాపటిమతో కవిత్వమును చెప్పగలడనునది ఈ శ్లోక పఠన ఫలశ్రుతి.

లలితా సహస్రనామ స్తోత్రము నందలి ''మాతృకావర్ణ రూపిణీ'' ''పంచాశత్పీఠ రూపిణీ'' నామములకు ఈ శ్లోకమునకు గల సమన్వయమును గ్రహించవచ్చును.



## సంస్కృత శ్లోకము - 18

**శ్లో. తనుచ్ఛాయాభిస్తే తరుణ తరణి శ్రీ సరణిభిః**
**దివం సర్వాముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతి యః**
**భవంత్యస్య త్రస్యద్వన హరిణ శాలీన నయనాః**
**సహోర్వశ్యా వశ్యాః కతికతి న గీర్వాణ గణికాః.**

## అనువాద పద్యము

*చం. అరుణ గభస్తికాంతులకు నాలయమౌ భవదంగకాంతి, న*
*య్యరుణిమయందు - భూసతియు నంబరమున్ జతగూడినట్లుగా*
*వరణముజేయువానికి త్రపాయుత భీతమృగాక్షులైన సురే*
*శ్వర గణికల్ సహోర్వశిగ వశ్యులునై పరిరమ్భమందరే.*

## టీక

(ఓ జగజ్జననీ!) తరుణ తరణి = ఉదయ సూర్యుని యొక్క, శ్రీ సరణిభిః

= కాంతి సౌభాగ్యమును బోలు, తే = నీ యొక్క, తనుచ్ఛాయాభిః = దేహపు కాంతుల చేత, సర్వా = సమస్తమైన, దివం = ఆకాశమును, ఉర్వీం = భూమిని, అరుణిమని = అరుణ వర్ణము నందు, మగ్నాం = మునిగినదానిగా, యః = ఏ సాధకుడు, స్మరతి = తలంచుచున్నాడో, అస్య = అట్టిసాధకునికి, త్రస్యత్ = బెదరుచుండు, వనహరిణ = అడవి లేళ్ళ యొక్క, శాలీన = సిగ్గుతో అతి సుందరము లైన, నయనా = కన్నులు కలిగిన వారు, గీర్వాణ గణికాః = దేవలోక వేశ్యలు, (అనగా, అప్సర స్త్రీలు) ఊర్వశ్యాసహ = ఊర్వశి అను అప్సరస్త్రీతో సహా, కతికతి = ఎందరెందరో, న వశ్యాః భవంతి = లొంగిన వారు ఏలకారు ? – అనగా అందఱూ వశ్యులగుదురని భావము.

## తాత్పర్యము

జగజ్జననీ ! ఉదయించుచున్న బాల సూర్యుని అరుణారుణ కాంతి సౌభాగ్యమునుబోలు నీ యొక్క దివ్య దేహపు అరుణ కాంతులలో – ఈ సమస్తమైన ఆకాశము, భూమియు మునిగి యున్నట్లు భావించి ధ్యానించెడు సాధకునికి – బెదురు చూపులతోనుండు అడవిలేళ్ళ యొక్క సింగారపు కన్నులు కలిగిన దేవలోక వేశ్యలైన అప్సర స్త్రీలు – ఊర్వశితో సహా – అందరూ వశీకృతులౌదురు గదా !

## వివరణము

ఇంతకు పూర్వము సారస్వత ప్రయోగమునకు సంబంధించిన శ్లోకములు చెప్పబడినవి. ప్రస్తుత శ్లోకము నందు వశీకరణకై చేయు ధ్యానమును గూర్చి చెప్పబడుచున్నది. డబ్బు, అందము – వీటి కన్నా ముందు – తెలివి, జ్ఞానము ప్రధానము – అను ఉద్దేశ్యముతో ముందు సారస్వత ప్రయోగ శ్లోకములు చెప్పబడినవి. ఉపనిషత్తులలో గూడ 'సమేంద్రోమేధయాస్పృణోతు... తతోమే, శ్రియమావహ' – అను వరుసలోనే చెప్పబడినది. ఈ సౌందర్యలహరి ఫలశ్రుతి శ్లోకమైన 'సరస్వత్యా లక్ష్మ్యా... రతౌః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా...' అను శ్లోకము నందు గూడ ముందు సరస్వతీ అనుగ్రహము, తర్వాత లక్ష్మీ కటాక్షము, అటుపైన సౌందర్య ప్రాప్తి గురించి చెప్పబడినది.

**ధ్యానఫలము**

సమస్త భూమి, ఆకాశము ఈ రెండును అమ్మవారి మేని అరుణారుణ

కాంతులలో మునిగి లీనమైనట్లు అమ్మవారిని ధ్యానించినచో దేవలోకవేశ్యలు, అనగా – అప్సర స్త్రీలైన రంభ, తిలోత్తమ మొదలైన వారు – ఊర్వశితో సహా – అందరూ వశమగుదురట ! ఈ దేవలోకస్త్రీలకు అనిమిషత్వము ఉండును. అనగా చెక్కు చెదరని స్థిరమైన కనుచూపు, అనగా – తెప్పపాటు లేని చూపు వుండును. అనగా – వారి చూపులకు నదురు, బెదురు వుండదన్నమాట ! అది వారి సహజ దేవతాలోక లక్షణము. అమ్మవారి మేని అరుణారుణ కాంతిలో భూమ్యాకాశములు రెండును లీనమైనట్లు ధ్యానించిన సాధకునికి – తెప్పపాటు లేని అప్సర స్త్రీలు కూడా – అందమైన బెదురు చూపుల సొగసుతనముతో వశమై వెంటపడుదురట ! వారి బెదురుచూపుల సొగసు దనము అడవిలేళ్ళ బెదురుచూపులను పోలివుండునట ! లేళ్ళ కనుచూపులలో ఒక విధమైన తత్తర పాటు, ఒక విధమైన భీతి, బేలతనము (ముగ్ధత్వము) వుండును. అమ్మవారిని పై విధముగా ధ్యానించిన సాధకుని చూచుటతోడనే నిశ్చలముగా, స్థైర్యముతో నుండవలసిన అప్సర స్త్రీలకు ఒక విధమైన తత్తరపాటు, బేలతనము (ముగ్ధత్వము) కలిగి, వశముదప్పి బెదురు చూపులతో అతనికి వశమగుదురట ! దేవ వేశ్యలే అట్లైనపుడు మానవ జాతి స్త్రీల విషయము వేరుగా చెప్పవలసిన పనిలేదు గదా !

అమ్మవారి మేనిసౌందర్యమును శ్లోకములో చెప్పిన విధముగా ధ్యానించి అనుభూతి పొందిన సాధకుని అనుసరించి – ముల్లోక యువతులు వెంటపడుదురేమోగాని సాధకుడు మాత్రము అమ్మవారి సౌందర్యమును ధ్యానములో దర్శించిన తరువాత ఇక ఎట్టి ప్రలోభములకు లొంగడని గూడా శ్లోకమునకు అర్థము చెప్పుకొనవలసి యుండును. అనగా – అమ్మవారి సౌందర్యము ముందు – వారి సౌందర్యము అంత తక్కువ అన్నమాటే గదా!

**ఊర్వశి ప్రత్యేకత**

దేవలోక వేశ్యలైన అప్సర స్త్రీలందఱూ, ఊర్వశితో సహా వశమగుదురు– అని శ్లోకములో చెప్పబడినది. దీనిని బట్టి దేవలోక వేశ్యలందఱిలోను 'ఊర్వశి' కి ఒక ప్రత్యేకత వుండివుండవలెనని అనిపించును. ఊర్వశి నారాయణుని తొడ (ఊరువు) నుండి పుట్టినదగుటయే ఆమెకు ఆ ప్రత్యేకత వచ్చి వుండవచ్చును.

'రంభ' – దేవలోక వేశ్యలందరిలోను ఎక్కువ అందగత్తె – అని అందురు. ఈ విధముగా అందరికిని అని గాక – ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క విధమైన 'రూపు' గల వారు అందముగా తోచుదురు. అనగా – ప్రతి వ్యక్తికి తన మనస్సులో నచ్చిన రూపము, అనగా – ఊహలో రూపము ఒకటి వుండును. ఆ మనస్సులోని – ఆ నచ్చిన రూపము – అతనికి 'ఊర్వశి' అగును. ప్రస్తుత శ్లోకములో 'ఊర్వశి'తో సహా అనినపుడు – ఆ మనస్సులోని నచ్చిన రూపము గల వారితో సహా అని అర్థము చెప్పుకోవచ్చును.



## సంస్కృత శ్లోకము - 19

**శ్లో. ముఖం బిందుం కృత్వా కుచయుగ మథస్తస్య తదధో**
**హరార్థం ధ్యాయే ద్యో హరమహిషి తే మన్మథ కలామ్**
**ససద్య స్సంక్షోభం నయతి వనితా ఇత్యతి లఘు**
**త్రిలోకీ మప్యాశు, భ్రమయతి రవీందుస్తన యుగామ్.**

## అనువాద పద్యము

ఉ. *ముంగల బొట్టు - మో, మడుగు బొట్టులు - చన్గవయున్, హరార్థమ*
*య్యంగము గాగ. నీదు కుసుమాంబక బీజము ధ్యానమందు నీ*
*భంగిని చూచువాడిక గభస్తి సుధాంశుకుచద్వయ త్రిలో*
*కింగన గల్గునన్న పరకీయనితంబను లెంత ఈశ్వరీ.*

## టీక

హరమహిషి = ఓ శివుని పట్టమహిషీ!, ముఖం = ముఖమును, బిందుం కృత్వా = బిందువునుగా చేసి (అనగా – బిందుస్థానమును ముఖముగా ధ్యానించి అని అర్థము), తస్య = ఆ ముఖమునకు, అధః = క్రిందిభాగమునందు, కుచయుగం కృత్వా = స్తనద్వయమును ధ్యానించి, తత్ + అధః = తదధః = ఆ స్తనద్వయమునకు క్రిందుగా, హరార్థం కృత్వా = హరుని సగభాగమును, అనగా – శక్తిని, అనగా – త్రికోణమును, అనగా – యోని రూపమును, యః = ఏ సాధకుడు, ధ్యాయేత్ = ధ్యానించునో, సః = ఆ సాధకుడు, సద్యః = వెనువెంటనే, వనితాః = కామాసక్తులగు

స్త్రీలను, సంక్షోభం = చిత్తవికారమున, నయతి ఇతి = పొందించుచున్నాడు. ఈ విషయము అతిలఘు = అతిస్వల్ప విషయము (అనగా – ఈ విధముగా చేయుట పెద్ద గొప్ప విషయమేమియు కాదని భావము) ఏమనగా, అతడు – రవీందు స్తనయుగాం = సూర్యచంద్రులే స్తనములుగా గల, త్రిలోకీం అపి = మూడు లోకములనెడు (స్వర్గ, మర్త్య, పాతాళలోకములనెడు) స్త్రీని సైతము, ఆశు = శీఘ్రముగా, భ్రమయతి = భ్రమింప చేయుచున్నాడు (కాబట్టి)

## తాత్పర్యము

ఓ సదాశివుని పట్టమహిషీ! బిందుస్థానమును ముఖముగాను, దానికి క్రింద భాగమును కుచయుగముగాను, ఇంకను క్రిందుగానున్న హరార్థమును శక్తి, లేదా – త్రికోణమును, లేదా – యోని రూపమును – ఏ సాధకుడు ధ్యానించునో, ఆ ధ్యాన ఫలితముగా – కామాసక్తులైన స్త్రీలను, చిత్తక్షోభమునకు, అనగా – కామ విషయమై కలవరపడునట్లు చేయుచున్నాడు. ఈ విషయము ఏమంత లెక్కలోనిది కాదు. ఏలననగా – ఆ సాధకుడు సూర్యచంద్రులను స్తనయుగముగా గలిగిన త్రిలోకిని, అనగా – స్వర్గ, మర్త్య పాతాళ లోకములనెడు స్త్రీనే శీఘ్రముగా భ్రమింప చేయుచున్నాడు కనుక.

## వివరణము

ఈ శ్లోకము కూడా క్రిందటి – 'తనుచ్ఛాయాభిస్తే ... గీర్వాణ గణికాః..'' అను శ్లోకము వలెనే స్త్రీ వశీకరణముకు సంబంధించినది. ఈ శ్లోకమునందుగూడా ఒక ప్రత్యేకమైన ధ్యానమును చెప్పుచున్నారు.

### 'క్లీం' బీజాక్షర ధ్యానము

ఒక బిందువు, దాని క్రింది భాగము, ఇంకను దానికి క్రిందుగా నుండు భాగము – ఈ విధముగా మూడు భాగములు చెప్పుచున్నారు. ఆ మూడు భాగములు దేనికి సంబంధించినవో ఈ శ్లోకమునందు చెప్పలేదు. ఇది స్త్రీ మోదన ప్రయోగమునకు సంబంధించిన ధ్యానము. ఇట్టి దానికి సంబంధించిన బీజాక్షరము 'కామకళా బీజము' అనగా – 'క్లీం'. ఈ 'క్లీం' అక్షరము నందలి హల్లు భాగమును అచ్చు భాగమును విడదీసి వ్రాసినచో 'క్లీం = క్ల + ఈం' అగును. (సంస్కృత లిపిలో అయినచో 'क्ली' అగును.) ఇది కామకళకు సంబంధించినది. దీనిని ఒక

మామూలు బీజాక్షరముగా కాక – ఒక 'యంత్రము' గా గ్రహించి ధ్యానించవలెను ఈ 'ఈఁ' యంత్రము నందు పైన వున్న చుక్కను బిందువు అందురు. ఈ బిందువును ముఖముగా ధ్యానించవలెననియు, ఆ బిందువు క్రింద నిలువుగా క్రిందకు వున్న గీతను మెడతో గూడిన వెన్నెముకగాను, ఈ నిలువు గీతకు రెండు వైపులా వంకర తలములుగా కనబడు [(, )]అను వానిని స్తనద్వయముగాను ధ్యానించవలెనని అర్థము చేసుకొనవలెను.

**హరార్థ విషయము**

హరార్థమనగా 'హ' కారార్థమే ! సంస్కృత లిపిలో 'హ' అను అక్షరము. 'హ్'వలె ఉండును. ఈ అక్షరము యొక్క క్రింది అర్థభాగము 'ए' గదా! ఇది ఎట్లున్నది? త్రికోణము వలె నున్నది. అంతేకాదు. సంస్కృత లిపిలో 'ए' అనునది 'యోని' ని తెల్పు బీజాక్షరము. 'యోని' అనగా ఉత్పత్తి స్థానము. అయ్యవారికి లేదా పురుషునకు సంబంధించిన బీజాక్షరమైన 'అ' కారము ( అక్షరాణాం అకారోస్మి – గీత), మరియు అమ్మవారికి, లేదా – ప్రకృతికి సంబంధించిన బీజాక్షరమైన 'ఇ' కారముల కలయిక (సంధి) వలన, అనగా – అ + ఇ = ఎ (సంస్కృత భాషలో ఎ, ఏ అను రెండు అక్షరములుండవు. రెంటికి 'ఎ' అను అక్షరమే వుండును) అను అక్షరము ఏర్పడును. (నిర్గుణుడైన అయ్యవారు – అమ్మవారి కలయికతో సృష్టి సామర్థ్యము కలిగి గుణమయుడగును – అను విషయమును స్ఫురింప చేయుటకు ఈ 'అ + ఇ = ఎ' అను సంధికి 'గుణ' సంధి అను పేరు పెట్టిరి!) సృష్టి ఉత్పత్తిని సూచించు ఈ అక్షరమును 'యోని' ని సూచించు బీజాక్షరముగ సంకేతించిరి).

పైన తెలిపిన విధముగా ముఖము, స్తనయుగము, యోనిల ఆకారములను – కామకళాబీజము, త్రికోణములందు మంత్రపూర్వకముగా ధ్యానించినచో – అందుకు సద్యఃఫలితముగా – ఆ ధ్యానించు సాధకునికి స్త్రీ వశీకరణ సాధ్యమగును. మూడులోకములను ఒక స్త్రీగా ఊహించి, సూర్య చంద్రులే ఆమె కుచయుగముగా ఊహించినచో – అట్టి త్రిలోకి కూడా పైన తెలిపిన ధ్యానము చేయు సాధకుని వలన భ్రమ చెందుననగా ఇతర స్త్రీలు వశమగుట పెద్ద విషయము కాదు గదా!

**ఆధ్యాత్మిక సమన్వయము**

ముఖ్యముగా 1. ఆత్మ, 2. మనస్సు, 3. భౌతిక దేహ ఉత్పత్తికి

సంబంధించిన కేంద్రము - ఈ మూడును ఆధీనములోనుండి, వాటిపై స్వామిత్వము చెల్లినపుడు ధ్యానమునకు సిద్ధి చేకూరును. 'ఆత్మ' - అనగా సూర్యుడు (సూర్య ఆత్మా జగతుః, కాలాత్మా దినకృత్), 'మనస్సు' అనగా - చంద్రుడు (చంద్రమా మనసోజాతః), బిందువు - అనగా - సంకల్ప కేంద్రము, 'యోని' - అనగా కల్ప కేంద్రము (సంకల్ప కేంద్రమును గూడా యోని అందురు. (సేంద్రయోనిః - తైత్తిరీయమ్). వాస్తవమునకు సంకల్ప కేంద్రమైన దీని Reflective and Reproductive Centre అగుట వలన - క్రింద వుండు దానిని గూడా యోని అనిరి).

ప్రతి వ్యక్తిలోను మూడు లోకములుండును. 1. పాతాళము, ఇది దేహము నందు నాభికి దిగువ భాగముచే సూచింపబడును. 2. మర్త్యలోకము ఇది దేహమునందు నాభి - కంఠముల మధ్య భాగముచే సూచింపబడును. 3. దేవలోకము - ఇది కంఠమునకు పైన వుండు శిరోభాగముచే సూచితము. ఈ శ్లోకమునందు చెప్పిన బిందువు - దేవలోకమునకు, స్తన ద్వయము - మర్త్యలోకమునకు, యోని - పాతాళ లోకమునకు సంబంధించినవిగా సమన్వయించు కొనవలెను. ఈ పాతాళ, మర్త్య, దేవలోకములనే - భూః, భువః, సువః అనగా 'భూర్భువస్సువర్లోకములు' అందురు. ఇవి మనలో పదార్థ (Matter), శక్తి లేదా - బలము (Force), ప్రజ్ఞ (Consiousness) లను సూచించును.

ఆత్మ, మనస్సు, యోనిలపై స్వామిత్వము సాధించిన వానికి భూర్భువస్సువర్లోకములపై గూడ స్వామిత్వము కలుగును. అట్టివానిపై ఇతర ప్రలోభములు ప్రభావమును చూపక అతని ఆధీనములో ఉండునని చెప్పుటయే వశీకరణ చెందునని చెప్పుట. అట్టి ఆధిపత్యము సాధించిన వానికి పరలోక సంబంధమైన ముక్తికాంతయే చేరువగుననగా ఇహలోక సంబంధమైన కాంతల మాట ఏమని చెప్పవలెను ? ('క్లీం' లోని 'ల' కారము పదార్థమునకు చెందిన పృథివీ తత్త్వమును సూచించు బీజాక్షరము, 'ఈం' అనునది శక్తి బీజము).

ఇంతవఱకు చెప్పినది ఆధ్యాత్మిక సమన్వయము. మామూలుగా శ్లోకము నందలి పదముల అర్థములను బట్టి సాధారణార్థమును గ్రహించవచ్చును. వామాచారులకు, కాపాలికులకు స్త్రీ జన వశీకరణాదులతో ప్రమేయముండునేమో గాని సమయాచారులకు అవసరము లేదు. ఆధ్యాత్మిక సమన్వయమే వీరికి కావలసినదని గ్రహింతురు గాక !



## సంస్కృత శ్లోకము - 20

శ్లో. కిరంతీ మంగేభ్యః కిరణ నికురం బామృత రసం
హృది త్వా మాధత్తే హిమకర శిలామూర్తి మివ యః
స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ
జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధార సిరయా.

## అనువాద పద్యము

*చం. కిరణ సుధారసంబు నొలికించెడు నంగములున్ననిన్ సుధా*
*కరమణిమూర్తిగా నెదను గాంచినవాడు, భుజంగ దర్పమౌ*
*గరళ మడంచగల్గును - ఖగ ప్రభువట్లు, మతిన్ విషజ్వరో*
*ద్ధురులను - జూపు తోనె సుఖధుర్యుల జేయుగదే సుధామయీ.*

## టీక

(ఓ జగజ్జననీ!) యః = ఏ సాధకుడు, అంగేభ్యః = కరచరణాది అవయవముల నుండి, కిరణనికురంబామృతరసం = వెలుగుల వెల్లువ నుండి పుట్టిన అమృతరసమును, కిరంతీం = వర్షించుచున్న దానివిగా, త్వాం = నిన్ను, హృది = హృదయమునందు, హిమకర శిలామూర్తి + ఇవ = చంద్రకాంతి మణిమయ ప్రతిమవలె, ఆధత్తే = ధారణ చేసి ధ్యానించునో, సః = ఆ సాధకుడు, సర్పాణాం = పాముల యొక్క, దర్పం = పొగరును, శకుంతాధిప ఇవ = గరుత్మంతుని వలె (అనగా - గరుత్మంతుడు శాంతింప చేసినట్లు) శమయతి = శాంతింప చేయుచున్నాడు. జ్వరప్లుష్టాన్ = జ్వరతాపముచే బాధపడువారిని, సుధాధార సిరయా = అమృతమును స్రవించు నాడివంటి, దృష్ట్యా = వీక్షణము చేత, సుఖయతి = సుఖమును కలుగ చేయుచున్నాడు.

## తాత్పర్యము

జగజ్జననీ! కరచరణాది అవయవములనుండి ప్రసరించు కిరణపుంజము నుండి జనించిన అమృతరసమును వర్షించుచుండు నిన్ను - ఏ సాధకుడు చంద్రకాంతి మణిచే నిర్మితమైన దేహము గల ప్రతిమవలె హృదయమున ధారణ చేసి ధ్యానించునో - ఆ సాధకుడు విషసర్పముల దర్పమును - గరుత్మంతునివలె శాంతింప చేయును.

జ్వరతీవ్రతలవలన తాపమును పొందురోగులకు అమృతధారను స్రవించు నాడివంటి చల్లనిచూపుమాత్రముచేతనే - ఆ తాపమును, జ్వరబాధను తొలగించి సుఖమును కలుగచేయును గదా!

## వివరణము

అమ్మవారి అనుగ్రహము అనంతమైన అనువర్తనములు (Applications) కలిగినది. మధురమైన ప్రసంగములు చేయగల సామర్థ్యమును, రచనా సామర్థ్యమును, సౌందర్యవికాసముతో స్త్రీజన వశీకరణ సామర్థ్యమును మరియు ముక్తిపద సామ్రాజ్యమును ప్రసాదించగల అమ్మవారి అనుగ్రహమునుగూర్చి గత శ్లోకమునందు వివరింపబడినది. ప్రస్తుతము వాటి అన్నిటి కన్న ముఖ్యమైన పరోపకార సేవాధర్మ నైపుణ్యమును పొందుటకు అవసరమగు ధ్యాన రహస్యము చెప్పబడుచున్నది. సేవా నైపుణ్యము వలన పుణ్యము, పుణ్యము వలన పురుషార్థమైన ముక్తిని పొందవచ్చును.

**బాహ్యార్థము**

ప్రపంచములో రకరకముల బాధలనుభవించు వారుందురు. విషసర్పముల కాటుకు గురియై మరణ బాధను పొందు వారికి అమ్మవారి భక్తుడు చక్కని ఉపశమనమును కలుగ చేయగలడట ! ఇందులకు అమ్మవారిని ఏ విధముగా ధ్యానించవలెనో ఇక్కడ చెప్పుచున్నారు. చంద్రకాంతి మణిచే నిర్మితమైన దానిగా అమ్మవారిని తన హృదయములో సాధకుడు ధ్యానించవలెను. అంతేకాదు, అట్టి అమ్మవారి కరచరణాద్యవయవముల నుండి ప్రసరించు కిరణముల నుండి అమృతరసము వర్షించుచున్నట్లు గూడ ధ్యానించవలెను. ఇట్టి ధ్యాన ఫలితముగా సాధకునికి ఒక ప్రత్యేకమైన శక్తి ప్రసాదింపబడును. ఎవరైన విష సర్పము యొక్క కాటుకు గురియై బాధపడు చున్నచో - వారిని బాధించు సర్పదర్పము, అనగా - విషమును - పక్షి రాజైన గరుత్మంతునివలె సాధకుడు తన స్పర్శతో హరించి, వారికి ఉపశాంతిని కలుగ చేయగలడు.

అమృత ధారలను స్రవించు నాడి వంటి తన చల్లని చూపుతో - తీవ్రజ్వర తాపమునకు గురియైన రోగులకు ఆ జ్వరబాధను తొలగించి, ఉపశాంతిని కలుగ చేయగలడు. ఇట్టి దివ్య శక్తులు అమ్మవారి అనుగ్రహము వలన సాధకునికి ధ్యానఫలితముగా వచ్చును.

పైన తెలిపిన రెంటిలో మొదటిది 'స్పర్శ'కు సంబంధించినది కాగా, రెండవది 'చూపు'నకు సంబంధించినది. 'స్పర్శ' - దేహ సంబంధమైన

'రోగము' లకును, చూపు – మనోసంబంధమైన 'భవరోగము' లకును ఉపశాంతిని కలుగచేయుననిగూడా అర్థము చేసుకొనవలెను.

**నిగూఢార్థము**

తేలు, సర్పము, అనగా – పాము – ఇవి వృశ్చికరాశికి (Scorpio) సంబంధించినవి. ఆత్మ – పూర్తిగా పదార్థత్వములోనికి దిగబడిన స్థితిని (State of spirit deeply burried in matter) తెలియజేయు రాశి – వృశ్చికము (వృశ్చికము - గర్భకోశమును, జన నేంద్రియమును సూచించునని జ్యోతిశ్శాస్త్రము చెప్పును). పాము, తేలు ఇవి కన్నములలోనికిపోవు స్వభావము గలవి. అనగా – ఇవి అధో మార్గమును (Fall or depression) సూచించును. వైకుంఠపాళి (పరమపద సోపాన పటము) లో పాములు అధోమార్గమును సూచించునని తెలిసిన విషయమే గదా! మానవులను కామ ప్రలోభముతో అధోగతిని పొందించు వానిగా సర్పములు ఆధ్యాత్మిక విద్యలో సంకేతింప బడును. (బైబిల్ నందు Genesis అధ్యాయములో ప్రతిపాదింపబడిన సర్పము 'ఈవ్' ను వర్జిత ఫలమును (Forbidden furit) తినమని ప్రలోభ పెట్టును. 'ఈవ్' ఆ ఫలమును తినుటవలన భౌతిక సృష్టి పథమునకు దిగజాఱెను.) అధోమార్గమునకు గుఱి అయిన మానవులను తిరిగి ఊర్ధ్వ మార్గమునకు మళ్లించువానిగా గరుత్మంతుడు సంకేతించబడును. ఈ గరుత్మంతునిది ఊర్ధ్వమార్గము (Raise or elevation or upward path) గదా! దీని సారాంశమేమనగా – అమ్మవారిని ఈ శ్లోకములో చెప్పిన విధముగా ధ్యానించి ఉపాసించు సాధకుడు – 1) తన 'స్పర్శ' తో, అనగా – సాన్నిధ్య, సత్సాంగత్యములతో – సంసార లంపటములో చిక్కుకొని దిగజాఱు మానవులను ఉద్ధరించునని, 2) తన 'చూపు' తో – సంసార తాపత్రయ బాధితులకు ఆ బాధను తొలగించి ఉపశాంతిని గలుగ చేయునని అర్థము.



## సంస్కృత శ్లోకము - 21

**శ్లో. తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీం**
**నిషణ్ణాం షణ్ణా మప్యుపరి కమలానాం తవ కలామ్**
**మహాపద్మాటవ్యాం మృది తమల మాయేన మనసా**
**మహాంతః పశ్యంతో దధతి పరమాహ్లాదలహరీమ్.**

## అనువాద పద్యము

చం. ఇనశశి వహ్ని సారమున నింపగు వైద్యుత తన్వియై మఱి
స్వనజము లాఱుపైన గల పద్మవనమ్మున వెల్గుచుండు నీ
దునవ కళాఖ్య గాంచుచును దుష్కృతమాయలు దూరమైన వా
రనదగు ధీరులున్ సతతమందుదు రాపరమార్థ సౌఖ్యమున్.

## టీక

( ఓ జగజ్జననీ! ) తటిత్ + లేఖా = మెఱుపు తీగవంటి, తన్వీం = సూక్ష్మమైన, క్షణ ప్రకాశ వికాస లక్షణము గలదియు, తపనశశి వైశ్వానరమయీం = సూర్యచంద్రాగ్ని రూపము కలదియు, షణ్ణాం = ఆరు సంఖ్యగలదియు, కమలానాం = పద్మముల యొక్క అనగా – షట్చక్రముల యొక్క, అపి ఉపిరి = మరియుపై భాగమందు, మహా పద్మాటవ్యాం = గొప్పతామర తోటయందు అనగా – సహస్రార కమలమందు, నిషణ్ణాం = కూర్చున్న, తవ = నీయొక్క, కలాం = 'సాదాఖ్య' అను కళను, మృదిత = క్షాళనము కావింపబడిన, మలమాయేన = కామాది మలినములు, అనగా – మాయ, అవిద్య, అహంకారాదులు గల, మనసా = మనస్సు చేత, పశ్యన్తః = చూచుచున్న, మహాంతః = మహాపురుషులు, అనగా – యోగీశ్వరులు, పరమానందలహరీం = ఉత్తమ సుఖానుభవరసానంద ప్రవాహమును, దధతి = పొందుచున్నారు.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! మెఱుపు తీగవలె సొగసైన, సూక్ష్మమైన, పొడవైన క్షణకాల ప్రకాశ వికాస విలక్షణము గలదియు, సూర్య చంద్రాగ్ని రూప సమన్వితమైనదియు, షట్చక్రముల పైభాగమున గల గొప్పతామర తోటయందు, అనగా – సహస్రార కమలమందు వెలుగొందు నీ యొక్క 'సాదాఖ్య' కళను – కామాది మలినములను పోగొట్టు కొనిన మనస్సుతో మహాపురుషులైన యోగీశ్వరులు – ధ్యానించి, మహదానంద ప్రవాహములో ఓలలాడుచున్నారు.

## వివరణము

అమ్మవారి అనుగ్రహమునకు పరాకాష్ఠ ఈ ప్రస్తుత శ్లోకములోను, తరువాత శ్లోకములోను చెప్పబడును. తెలివితేటలు, వక్తృత్వము, రచనా సామర్థ్యము,

అందము, వశీకరణము, సేవా సౌభాగ్యము మొదలైనవన్నియు పొందిన తరువాత గూడా ఇంకను పొందవలసినది ఒకటి యున్నది. అది జీవన్ముక్తిపదము. ఇది జీవితమునకు పరమ లక్ష్యము. దీనినే పరమానంద స్థితిని తెలియుచేయు 'పరమపదము' అందురు. శ్రీ చక్రోపాసనలోని పరమ ధ్యేయము ఇదియే ! దీని విషయము 'మహీంమూలాధారే... సహరహసిపత్యావిహరసే'' అను 9వ శ్లోకమునందు పూర్వము కొంత చెప్పబడినది. ఇక్కడ మరికొంత వివరణ ఇవ్వబడుచున్నది.

**కులపథ విషయము**

వెన్నెముక యందలి సుషుమ్నా మార్గమును 'కులపథము' అందురు. తామర తూడును విరిచినపుడు వచ్చు సన్నని దారపు పోగు (Fibre) కంటె సూక్ష్మముగా ఈ పథము వుండును. దీనిని లలితా సహస్రానామములలో 'కుండలినీ' 'బిసతంతుతనీయసీ' అను నామములతో వ్యవహరించిరి. సాధకుని తేజస్వంతమైన ధాతువు ఈ మార్గము ద్వారానే మూలాధారాది షట్చక్రములను వరుసగా దాటుచు, చివరకు – ఆ షట్చక్రములపైన వుండు సహస్రార కమల కేంద్రమును చేరును. తేజస్వంతమైన ధాతువును 'కుండలినీ శక్తి' అందురు. సహస్రార కమల కేంద్రము నందలి ప్రజ్ఞను (Consciousness) శివునితో సంకేతించుదురు. కుండలినీ శక్తి అను అమ్మవారు సహస్రార కమల కేంద్రమందలి ప్రజ్ఞానసంకేతుడైన శివునితో ఐక్యము చెందుట సాధకుని ఉపాసనకు పరమావధి. సహస్రారకమల కేంద్రమును శ్రీ చక్రము నందలి కేంద్ర బిందువుతో సమన్వయ పరచుకొనవలెను. దీనిని 'బిందువు' అందురు. దీనిని ఆసనముగా నున్న అమ్మవారిని – 'శివశక్త్యైక్య రూపిణీ' అని లలితాసహస్ర నామములలో చిట్ట చివరి శ్లోకములో తెలుపబడినది. ఈ స్థానమందు ప్రతిపాదింపబడిన కళను శ్రీ విద్యలో 'సాదాఖ్య' అందురు. ఇట్టి 'సాదాఖ్య' కళను దర్శించుట సామాన్య మానవునికి సాధ్యము కాదు. ఈ 'సాదాఖ్య' కళయొక్క ఆద్యంత రూపవికాసము ఈ శ్లోకమునందు చెప్పబడుచున్నది.

'సౌదామని' అనగా – మెఱుపు తీగను చూచిన వారికి ఈ సాదాఖ్య కళ యొక్క రూపము కొంతవరకు అర్థము కాగలదు. సూక్ష్మము, దీర్ఘము, క్షణకాల

వికాసము, అత్యంత ప్రకాశ వంతము – దీని లక్షణములు. సరిగా 'సాదాఖ్య' కళ యొక్క లక్షణములు గూడ అట్లే వుండును. కర్బనపు కడ్డీల మధ్య విద్యుత్తు వల్ల ఏర్పడు చాప దీపము (Carbon Arc Lamp) వలె ప్రకాశించును. మానవ లోకములకు మానవాతీత లోకములకు మధ్య ఏర్పడు ప్రకాశ మార్గమే ఈ చాప దీపము. దీనినే Master C.V.V.గారు (Higher Bridge Beginning) అను మంత్రముతో తెలియపరచిరి.

**త్రిగంథుల విషయము**

కుండలినీశక్తి మొట్టమొదట మూలాధార, స్వాధిష్ఠాన చక్రములను దాటినపుడు – ఆ రెండింటిని సంధించు బ్రహ్మముడి, లేదా – 'బ్రహ్మగ్రంథి', (Brain of instincts and emotions) భేదనము చెందును. ఈ రెండు చక్రములకు సంబంధించిన 56 + 52 = 108 కిరణములను 'అగ్ని జ్వాలలు' గా చెప్పుదురు. ఇటుపైన మణిపూర, అనాహత చక్రములను, కుండలినీ శక్తి దాటినపుడు – ఈ రెంటినీ సంధించు 'విష్ణుగ్రంథి' (Brain of affections and love) భేదనము చెందును. ఈ రెండు చక్రములకు సంబంధించిన 62 + 54 = 116 కిరణములను సూర్య కిరణములుగా చెప్పుదురు. ఇటుపైన విశుద్ధి, ఆజ్ఞాచక్రములను కుండలినీ శక్తి దాటి నపుడు ఈ రెంటినీ సంధించు 'రుద్రగ్రంథి' (Brain of intellect and wisdom) భేదనము చెందును. ఈ రెండు చక్రములకు సంబంధించిన 72 + 64 = 136 కిరణములను 'చంద్రకళలు' గా చెప్పుదురు. ఈ అగ్నితత్త్వ, సూర్యతత్త్వ, సోమ, లేదా – చంద్రతత్త్వ స్థితులను దాటి, ఊర్ధ్వమార్గము పట్టి సహస్రార కమలమును చేరిన కుండలినీశక్తి లలితా సహస్ర నామములో వరుసగా 'మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ ... విష్ణుగ్రంథివిభేదినీ .... కుండలినీ ... బిసతంతు తనీయసీ ...' అను వరుస నామములలో చెప్పబడినది.

కుండలినీ శక్తి యొక్క అగ్నితత్త్వము చేతను, సూర్యతత్త్వము చేతను చివరకు చంద్రతత్త్వము చేతను మనలోని మాయాది మలినములు, అనగా – మాయ, అవిద్య, అహంకారము, అజ్ఞానము మొదలగునవి క్షాళనము కావింపబడును. అపుడు మాత్రమే మానవుడు 'మహాత్ముడు' లేదా 'యోగి' అగును. అట్టి స్థితికి చేరిన యోగి మనస్సునకు మాత్రమే 'సాదాఖ్యకళ' ద్యోతకమగును. సాదాఖ్యద్యోతకమైన వారికి

భౌతిక ప్రపంచములో ఉండి కూడా భౌతికమైన సంపదల మీద, ఆకర్షణలమీద దృష్టి వుండదు, అనగా – కోరిక ఉండదు. ఇవి అన్నియు సాపేక్షకములైన సుఖములని తెలియును. నిరపేక్షకమైన, నిరతిశయ ఆనందమును కలుగ చేయు ఈ 'జీవన్ముక్తి' స్థితి యందు మాత్రమే ఆ సాధకుడు ఉండును. ఇది అమ్మవారి అనుగ్రహమునకు పరాకాష్ఠస్థితి.



## సంస్కృత శ్లోకము - 22

**శ్లో. భవాని త్వం దాసేమయి వితర దృష్టిం సకరుణాం**
**ఇతి స్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వ మితియః**
**తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం**
**ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుట మకుట నీరాజిత పదామ్.**

## అనువాద పద్యము

***శా. అమ్మా ! దాసుడ నో భవాని ! కరుణార్ద్రాపాంగ భాగ్యమ్ము నం***
***దిమ్మంచున్ నినుగొల్చు వేళల 'భవాని త్వ'మ్మనన్ మధ్యనే***
***యమ్మా ! నీవు గ్రహించి దాసునికి నింద్రాజాచ్యుతోర్ధ్వాంగర***
***త్నమ్మౌ నాత్మపదమ్ము నిత్తువు గదా ధన్యత్వసాయుజ్యముల్.***

## టీక

(హే) భవాని ! = ఓ భవుని రాణీ !, త్వం = నీవు, దాసే, దాసుడనైన, మయి = నాయందు, సకరుణాం = దయతో కూడిన, దృష్టిం = చూపును, వితర = ప్రసరింపచేయుము, ఇతి = ఈ ప్రకారముగా, స్తోతుం = స్తుతించుటకు, వాంఛన్ = ఇచ్ఛగించువాడై, 'భవానిత్వం' ఇతి = 'భవానిత్వం' అని, కథయతి = పలుకునో, తస్మై = ఆ విధముగా ఉచ్చరించు వానికి, త్వం = నీవు, తదైవ = ఆ విధముగా ఉచ్చరించుట పూర్తి కాకమునుపే, ముకుంద = విష్ణువు, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, ఇంద్ర = దేవేంద్రుడు అనువారి యొక్క, స్ఫుట మకుట = స్పష్టముగా కనబడు కాంతివంత కిరీటముల చేత, నీరాజిత = హారతి ఇవ్వబడిన, పదాం = అడుగులు కల, నిజసాయుజ్య పదవీం = నీ తోడి తాదాత్మ్యమును, దిశసి = ఇచ్చెదవు.

## తాత్పర్యము

తల్లీ ! భవానీ ! 'నేను దాసుడను. నీవు నా యందు దయతో కూడిన నీ చల్లని చూపును ప్రసరింప చేయుము'' అని ఈ విధముగా స్తుతించదలచిన వాడై - నిన్ను పై విధముగా, అనగా – 'భవానిత్వం' అని మొదలు పెట్టి ఇంకను చెప్పబోవు లోపునే వానికి హరి బ్రహ్మేంద్రుల రత్న కిరీటములచే హారతి పట్టబడు నీ పద సాయుజ్యమును ఇత్తువు.

## వివరణము

ఒక లక్ష్యమును ఉద్దేశించి ఉపాసన చేయుచున్నప్పుడు – ఉపాసకుడు ఆ లక్ష్యమే తానైపోవుట ఆ ఉపాసన యొక్క పరాకాష్ఠ ఫలితముగా చెప్పవచ్చును. ఉదా: బంగారము కొఱకు తపస్సు చేయువాడు ఆ బంగారమును పొందుట ఒక రకమైన ఫలము. కాని, ఆ బంగారమే తానైపోవుట ఆ తపస్సుకు పరాకాష్ఠ ఫలితమగును. ఈ శ్లోకమునందు అట్టి విధమైన ఉపాసనా ఫలితము చెప్పబడుచున్నది.

అమ్మవారి అనుగ్రహమును పొందుటకై ఉపాసకుడు అమ్మవారిని 'ఓ భవానీ! నీ దాసుడను. దయతో నీ కరుణా కటాక్షణమును నాపై ప్రసరింపచేసి, నన్ను నీ దాసునిగా అనుగ్రహింపుము' అని స్తుతించ బోయి ముందుగా - 'భవానిత్వం....' అని ఇంకను చెప్పదలచుకున్న విషయము పూర్తి కాకమునుపే - ఆ ఉపసాకునికి అమ్మవారు హరి. బ్రహ్మేంద్రాదులచే హారతి పట్టబడు 'సాయుజ్య' పదవిని ఇచ్చునని శంకరులు చెప్పుచున్నారు. ఇందు ఒక విశేషము కలదు. 'భవానిత్వం' అని ఉపాసకుడు స్తుతిని ప్రారంభించినపడు 'భవానిత్వం' అను పదములకు 'ఓ భవానీ! నీవు ...' అని స్తుతికి ప్రారంభంలో చేయు సంబోధనను తెల్పును. అంతేకాదు 'భవానిత్వం' అను పదములకు సంస్కృతములో వేరొక అర్థము గలదు.

**వ్యాకరణ సమన్వయము**

'భవాని' – అనగా 'నేను అగుదును' అని – ఉత్తమ పురుష ఏక వచనము నందును, 'భవావ' అనగా 'మేమిద్దరము అగుదుము' అని ఉత్తమ పురుష ద్వివచనము నందును, 'భవామ' అనగా 'మేము (అందఱము) అగుదుము' – అనియు సంస్కృతములో చెప్పవలసి యుండును. కాబట్టి, ప్రస్తుత శ్లోకములో 'భవానిత్వం'

అనుపదమునకు 'నేను నీవు అగుదును గాక' అను అర్థము వచ్చును. భక్తుడు చేయు ప్రార్థన ప్రారంభంలోనే 'నేను నీవు అగుదును' అనుట జరిగినది. అనగా- ఇది 'సాయుజ్యము' అనగా 'తాదాత్మ్యము'ను తెలియచేయు పద ప్రయోగము. తన భక్తుడు తనను (అమ్మవారిని) ఏదో కోరిక తీరుటకు అనుగ్రహించవలసినదిగా ప్రార్థించగా తనతో సమానమైన సాయుజ్యస్థితిని ప్రసాదించు జగజ్జనని కరుణ ఎంతటిదని చెప్పవలెను. ఈ విషయము 'త్వదన్యఃపాణిభ్యాం... చరణావేవనిపుణా'' అను 4వ శ్లోకమునందు 'ఫలమపి చ వాంఛాసమధికం' అనుచోట ముందే చెప్పబడినది ('భక్తుడు కోరిన వాని కన్న 'ఎక్కువ ఫలములను' ఒసంగుటకు అమ్మవారి చరణ యుగళమే తగి యుండగా – మరల వేరుగా అభయ ముద్రను, వరద ముద్రను ఇతర దేవతలవలె ధరించవలసిన అవసరము లేకపోయినది – అని ఈ శ్లోక నాల్గవ పాదమునకు అర్థము).



## సంస్కృత శ్లోకము - 23

**శ్లో. త్వయా హృత్వా వామం వపు రపరితృప్తేన మనసా**
**శరీరార్థం శంభో రపరమపి శంకే హృతమభూత్**
**యదౌత త్త్వద్రూపం సకల మరుణాభం త్రినయనమ్**
**కుచాభ్యా మానమ్రం కుటిల శశి చూడాల మకుటమ్.**

## అనువాద పద్యము

***చం. అరుణ శరీరియై, త్రినయనా కృతియై, కుచభార నమ్రయై,***
***యరనెలవంక పింఛమున నందములొల్కెడు నీదురూపమున్***
***అరయగ వామ మర్థమును నందియు తృప్తిని బొందలేక - యా***
***హర తను శేషమున్ సయుత మందితివా యనిపించు నంబికా.***

## టీక

(ఓ జగజ్జననీ!) త్వయా = నీ చేత, శంభోః = శివుని యొక్క, వామం = ఎడమ భాగమైన, వపుః = దేహము, హృత్వా = అపహరింపబడి, అపరితృప్తేన = సంతుష్టినొందని, మనసా = మనస్సు చేత, అపరం = రెండవ (కుడి) భాగమైన,

శరీరార్ధం అపి = (శివుని) శరీరము యొక్క రెండవ దైనకుడి భాగమును సైతము, హృతం = గ్రహింపబడినదిగా, అభూత్ = అయెనని, శంకే = సందేహపడెదను, యత్ = ఏ కారణము వలన, ఏతత్ = (నా హృదయములో భాసించు) ఈ, త్వత్ రూపం = ఈ దేహము, సకలం = వామ దక్షిణ భాగములు రెండును, అరుణాభం = ప్రాతఃకాల సూర్యుని వంటి ఎఱ్ఱని కాంతి గలవియై, త్రినయనం = మూడు కన్నులతో గూడినదియు, కుచాభ్యాం = స్తన యుగ్మముచే, ఆనమ్రం = కొద్దిగా ముందుకు వంగినదియు, కుటిల శశిచూడాల మకుటం = వంకరగా నుండు చంద్రకళచే శిరోమణి గల కిరీటవము గలదై ఒప్పుచున్నదో (అందువలన సందేహపడితిని – అని అర్థము).

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ దేహమంతయు అరుణకాంతులు వెదజల్లుతూ, మూడు కన్నులు గలిగి, స్తనభారముచే కొద్దిగా వంగినట్లు కనబడుచు, నెలవంకను శిరోమణిగా గలిగి యుండుటను చూడగా – మొదట నీవు శివుని శరీర వామభాగమును హరించి, అంతటితో సంతృప్తి చెందక, కుడిభాగమైన శరీరార్ధమును కూడ హరించితివి కాబోలునని సందేహము కలుగుచున్నది.

## వివరణము

ఈ శ్లోక వివరణకు అర్ధనారీశ్వర రూపము, సౌందర్యలహరిలో ప్రతిపాదింపబడు జగజ్జనని రూపము పూర్తిగా అవగాహన కావలెను. 'ప్రకృతీ – పురుషుల' జంటను 'పార్వతీ – శివుల' జంటగా, అర్ధనారీశ్వర రూపముగా సూచించుదురు. ఈ అర్ధనారీశ్వర రూపమునందు ఎడమ వైపున నుండు సగభాగము అమ్మవారిది. కుడివైపున నుండు రెండవ సగభాగము అయ్యవారిది. అనగా స్త్రీ – పురుష దేహముల ఎడమ – కుడి భాగములు కలసి వున్నట్లు ఈ అర్ధనారీశ్వర రూపము వుండును. అనగా మొత్తము శివుని దేహములో ఎడమ సగభాగమును పార్వతి ఆక్రమించినట్లు, లేదా మొత్తము పార్వతి దేహములో కుడి సగభాగమును శివుడు ఆక్రమించినట్లు కనబడును. అమ్మవారు అరుణ వర్ణములోను, అయ్యవారు శ్వేతవర్ణములోను వుందురు.

**శివాశివుల సారూప్యత**

ఇక జగజ్జననిని పరిశీలించినచో – దేహము అరుణ కాంతులు విరజిమ్మునదిగా నుండును. శివుని వలెనే సూర్య, చంద్రాగ్నులను సూచించు మూడు కన్నులుండును. శివుని వలెనే నెలవంకను శిరోభూషణముగా కలిగి యుండును. ఈ విధముగా భాసించు జగజ్జనని యొక్క రూపమును హృదయములో దర్శించినపుడు శంకరులకు ఈ క్రింది సందేహము కలిగినది.

**శంకర శంక**

అర్ధనారీశ్వర రూపము నందు పార్వతి శివుని యొక్క అర్ధభాగమును మాత్రమే అపహరించినట్లు కనబడును. కాని, జగజ్జనని రూపమును దర్శించినపుడు – ' ఆ జగజ్జనని శివుని దేహమును అర్ధభాగమును మాత్రమే అపహరించి దానితో సంతృప్తి నొందక మిగిలిన అర్ధభాగమును గూడా ఆక్రమించలేదు గదా! అని అనిపించునట్లు ఉండునని శంకరులు చెప్పుచున్నారు. ఈ విధముగా అనిపించుటకు కూడా తగిన కారణములను సహేతుకముగా శంకరులు ఈ శ్లోకమునందు చెప్పిరి.

అర్ధనారీశ్వర రూపములో ఎడమవైపున అమ్మవారి దేహము అరుణకాంతులు విరజిమ్ముచు తన పరిసరములనుగూడ అరుణ ప్రభావితము చేయును గదా! ఆ ప్రభవామునకు అతి సన్నిహితముగా తనకుడి వైపున నుండు శివుని తెల్లని దేహభాగము కూడా అరుణముగానే ద్యోతకమగును కదా! అప్పుడు చూచు వారికి ఇంక అర్ధనారీశ్వర రూపము కనబడదు. అరుణకాంతులు జిమ్ముచూ మొత్తము అమ్మవారి రూపమే కనబడును. దీనికి తోడు – జగజ్జననికి శివుని వలెనే సూర్య చంద్రానలాత్మకములగు మూడు కన్నులు వుండి, శివుని వలెనే తలకట్టుపై నెలవంకను శిరోభూషణముగా కలిగి వుండును. మరి అట్టి జగజ్జననిని చూచునపుడు – శివుని పూర్తిగా ఆక్రమించిన అమ్మవారి వలెనే అనిపించుట సమంజసమే కదా!

**అసలు రహస్యం**

శివుని వ్యక్తరూపమే అమ్మవారు. అవ్యక్తముగా నున్న శివునికి రూపమే వుండదు కదా! 'క్వణత్కాంచీదామా... పురమథితురాహో పురుషికా' అను 9వ శ్లోకము నందు ఈ విషయము చెప్పబడినది. శివుని 'అహం' – ఆకారము దాల్చిన

రూపమే అమ్మవారని - ఈ 'పురమథితురాహోపురుషికా' అనుపదము సూచించును.

ఈ శ్లోకములందు 'శివునికి వేరే అస్తిత్వము లేదు. అంతయు అమ్మవారే! అని సిద్ధాంతీకరించినట్లుండును. శాక్తేయులు ఈ సిద్ధాంతమునే అంగీకరింతురు గూడా!

ఈ జగజ్జనని అరుణ వర్ణము - అనురాగమును, కిరీటము - సర్వేశ్వరీత్వమును, చంద్రుడు - ఆహ్లాద ప్రసన్నతలను, స్తనయుగ్మము - జగత్పోషకారకత్వమును, మూడు కన్నులు - త్రికాలజ్ఞత్వమును సూచించునని సమన్వయము చేసుకొనవలెను.



## సంస్కృత శ్లోకము - 24

**శ్లో. జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే**
**తిరస్కుర్వ న్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి**
**సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః**
**తవాజ్ఞా మాలంబ్య క్షణ చలితయో ర్భ్రూలతికయోః.**

## అనువాద పద్యము

***చం. జగమును జేయు స్రష్ట, హరి సాకును, త్రుంచు రుద్రు, డీశుడీ***
***త్రిగతుల లోన నిల్పి తన దేహము నట్టులెయుంచు, నన్నియున్***
***సుగతిని సృష్టియౌనటుల చూచు సదాశివుడిట్టి కృత్యమున్***
***మొగమున నీదు బొమ్మముడి పోకడబట్టియె తాముచేయుటల్***

## టీక

( ఓ జగజ్జననీ! ) ధాతా = సృష్టికర్త అగు బ్రహ్మ, జగత్ = ప్రపంచమును, సూతే = సృజించుచున్నాడు, హరిః = విష్ణువు, అవతి = ( ఆ ప్రపంచమును) పాలించి రక్షించుచున్నాడు, రుద్రః = రుద్రుడు, క్షపయతే = లీనము చేయుచున్నాడు, ఈశః = ఈశ్వరుడు, ఏతత్ = ఈ ముగ్గురిని, తిరస్కుర్వన్ = తిరస్కరించు వాడై, స్వమపి = తనదగు, వపుః = శరీరమును, తిరయతి = అంతర్ధానమును పొందించుచున్నాడు,

సదాపూర్వః = 'సదా' అను శబ్దము ముందు గల, శివః = (సదా) శివుడు, తదిదం = (ఈ చెప్పబడిన) తత్త్వ చతుష్టయమును, క్షణ చలితయోః = క్షణ కాలమాత్ర వికాసము గల, తవ = నీ యొక్క, భ్రూలతికయోః = కనుబొమల యొక్క, ఆజ్ఞాం = ఆజ్ఞను, అలంబ్య = పొంది, అనుగృహ్ణాతి = అనుగ్రహించుచున్నాడు. అనగా మఱల సృజించు చున్నాడు.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! బ్రహ్మ ఈ లోకమును సృజించును, విష్ణువు రక్షించును, రుద్రుడు లయింప చేయును. ఈశ్వరుడు ఈ త్రయమును తన శరీరము నందు అంతర్ధానము నొందించును. సదాశివుడు నీ కటాక్షమును అనుసరించి ఈ తత్త్వ చతుష్టయమును మరల ఉద్ధరించుచున్నాడు. అనగా, అనేక కోటి బ్రహ్మాండములను సృజించుట యందును, రక్షించుట యందును, లయించుట యందును నీ భ్రూవిక్షేపము ననుసరించియే చేయుదురని అర్థము.

## వివరణము

వృత్తమునకు ఆద్యంతములు ఎట్లు ఉండవో - సృష్టికి గూడా అదే విధముగా ఆద్యంతములు వుండవు. అనగా - ఇది మొదటి సృష్టి ఇది చివరి ప్రళయము అని వుండదు. సృష్టి ప్రళయములు నిరంతరము ఒక దాని తరువాత ఒకటి పునరావృతమగు (Cyclic or periodical) ఒక శాశ్వత ప్రక్రియను (eternal phenominon) రూపొం దించును.

**పంచకృత్యములు**

సృష్టి, స్థితి, ప్రళయములకు వరుసగా బ్రహ్మ, విష్ణు, రుద్రులు అధిష్ఠాన దేవతలు. దీనికి సంబంధించిన విషయము 'తనీయాంసంపాంసుం... భసితోద్ధూలన విధిమ్' - అను రెండవ శ్లోకమునందు చక్కగా వివరింపబడినది. సృష్టి, స్థితి, లయములను - విశ్లేషణ (Analysis), సమతాస్థితి (Poise or equilibrium), సంయోగము (synthesis) లను సూచించు మూడు బలములు గాను, వాటి మధ్య వర్తించు సంబంధమును త్రిభుజ బల సూత్రము (Triangle of forces) తోను అర్థము చేసుకొనవచ్చును. ఈశుడు - ఈ దేవతా త్రయమును వారి ద్వారా ఉద్భవించిన

ప్రపంచముతో సహా తన యందు లీనము చేసుకొనుటకు సంబంధించిన వాడు. దీనిని శోషణ ప్రక్రియ (Absorption)గా అర్థము చేసుకొనవలెను. దీనిని సూచించు వానిగా ఈశుని సంకేతించుదురు. దీనినే 'తిరోధానము' అను కృత్యముగా కూడ చెప్పుదురు. ఇంతవరకు 'సృష్టి, స్థితి, లయ, తిరోధానములు' అను నాలుగు విధములైన కృత్యములు చెప్పబడినవి. ఇంక 'అనుగ్రహము' అను ఐదవ కృత్యము కూడ కలదు. ఇంతకు ముందు తెలిపిన నాలుగు కృత్యములను, లేదా - తత్త్వములను తన యందు లీనము చేసుకొనుచు, జగజ్జనని కనుబొమ్మల సంజ్ఞతో చేసిన ఆజ్ఞను అనుసరించి పునః సృష్టి కార్యమునంతను నిర్వహించుటను 'అనుగ్రహము' అను కృత్యముగా చెప్పుదురు. ఈ అనుగ్రహ కృత్యమును నిర్వహించువాడే సదాశివుడు.

సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములను - 'పంచకృత్యములు' అందురు. ఈ పంచకృత్యములను నిర్వహింపచేయుగలుగునది కనుకనే - లలితాసహస్ర నామ స్తోత్రములో అమ్మవారు 'పంచకృత్యపరాయణా' అను నామముతో స్తుతింపబడినది.

శిష్యులను సృష్టించి, పోషించి, తనయందువారిని నింపుకొని, వారియందు తాను ఉండి, ఎంతటి వారినైనను అనుగ్రహించగల సామర్థ్యమును అమ్మవారిని ఆరాధించు భక్తుడు కూడా తన ఉపాసనా ఫలితముగా పొందవచ్చును. కంచి కామకోటి పీఠ పరమాచార్యులైన శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామివారు, శ్రీరామకృష్ణ పరమహంస మొదలైన వారు ఈ కోవకు చెందుదురు.



## సంస్కృత శ్లోకము - 25

శ్లో. త్రయాణాం దేవానాం త్రిగుణ జనితానాం తవశివే
భవేత్పూజా పూజా తవ చరణయో ర్యా విరచితా
తథాహి త్వత్పాదోద్వహన మణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వ న్ముకుళిత కరోత్తంస మకుటాః.

## అనువాద పద్యము

చం. *కరయుగళమ్ము శీర్షమున కాంతులు జిమ్ము కిరీటమై, భవ*
*చ్చరణ యుగమ్ము మోపు మణిజాల విభూషిత పీఠసన్నిధిన్*
*ఒరిగి త్రిమూర్తులుండు భవదుత్తమ పాద శుభార్చనమ్ము - నీ*
*వరగుణ జన్యులైన పయివారల పూజయెకాదె పార్వతీ !*

## టీక

శివే = ఓ భవానీ, తవ = నీ యొక్క, త్రిగుణజనితానాం = సత్త్వరజస్తమో గుణముల వలన ఉద్భవించిన, త్రయాణాం = ముగ్గురైన, దేవానాం = బ్రహ్మ, విష్ణు, రుద్రులకు, తవ = నీ యొక్క, చరణయోః = పాదములందు, యాపూజా = ఏ పూజ, విరచితా = చేయబడినదో, పూజా = ఆ పూజయే, భవేత్ = అగును. (వేరొక పూజ కాదు - అని భావము) తథాహి = ఇది యుక్తము, (ఏలననగా) త్వత్పాద = నీ పాదములను, ఉద్వహనమణిపీఠస్య = వహించురత్న పీఠము యొక్క, నికటే = సింహాసన సమీపము నందు, శశ్వత్ = ఎల్లపుడూ, ముకుళిత = మోడ్పబడిన, కర = హస్తములే, ఉత్తంస = భూషణముగాగల, మకుటాః = కిరీటములు గలవారై, ఏతే = ఈ త్రిమూర్తులు, స్థితాః = వర్తించుచున్నారు కాబట్టి.

## తాత్పర్యము

ఓ భవానీ ! సత్త్వరజస్తమోగుణముల వలన జన్మించిన బ్రహ్మ, విష్ణు, రుద్రులకు - నీ పాదములకు చేయు పూజయే పూజ అగుచున్నది. వేరుగా పూజ కాదు. అది యుక్తమే ! ఏలననగా, నీ పాదములను ఎల్లప్పుడూ వహించు నవరత్న ఖచితమైన పీఠమునకు సమీపమునందు నీ సింహాసనముచెంతజేరి, తమ కైమోడ్పులనే మకుటములుగా గలిగిన త్రిమూర్తులు సదా నీ సజ్జను వర్తించుచున్నారు గదా!

## వివరణము

అర్చించుటకు, ఆరాధించుటకు, మ్రొక్కుటకు హిందువులకు పెక్కుమంది దేవతలు ఉందురు. దేహి ఒక్కడే అయినను దేహాంగములు మాత్రము ఎక్కువగా నుండునట్లు - దేవుడు ఒక్కడే అయినను ప్రపంచ వ్యవహారములు నిర్వహించు దేవతలు (Administrative staff) ఎక్కువ మంది వుందురు. వీరిలో

ముఖ్యమైన వారు త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, రుద్రులు. ప్రతి ఒక్క దేవతను ఆరాధించవచ్చును. కాని, ఈ దేవతలకందరికీ మూలమైన జగజ్జనని అయిన అమ్మవారిని ఆరాధించినచో అందరినీ ఆరాధించినట్లే అగునను విషయమును ఆదిశంకరులు ఈ శ్లోకమునందు వివరించుచున్నారు.

అమ్మవారి ఆజ్ఞను అనుసరించి త్రిగుణాత్మకమైన అంశలతో బ్రహ్మ, విష్ణు, రుద్రులు వారికి అమ్మవారు నిర్దేశించిన సృష్టి, స్థితి, లయములకు సంబంధించిన కార్యములను చక్కబెట్టుదురు. ఈ కార్యనిర్వహణలో వారు ముగ్గురును ఎల్లప్పుడు అమ్మవారి అనుజ్ఞలకై, ఆదేశములకై నిరీక్షించవలసినదే! ఆమె రాకకై నిరీక్షించుచు, కొలువుకూటములో ఆమె ప్రవేశించుట తోడనే ఆమె అధిష్ఠించు సింహాసనమునకు దగ్గరలో ఆమె పాదముమోపు నవరత్నఖచిత పీఠము చుట్టును తమ కైమోడ్పులను తలలపై మకుటముగా చేసి అంజలి ఘటించుచుందురు. ఇట్టి సందర్భములో అమ్మవారి పాద పూజ జరుగునప్పుడు ఆ పూజా పుష్పములు ఆమె పాదము పెట్టిన పీఠము చుట్టును గల త్రిమూర్తుల శిరములపై గూడ పడును గదా! ఇందువలన 'అమ్మవారికి' జరిపిన పూజతో త్రిమూర్తులకు గూడా పూజ జరిగినందున వేరుగా మరల వారికి పూజ అవసరము లేదు. అమ్మవారి పాదపూజయే వారికిని పూజ అగుచున్నది – అని ఆదిశంకరులు చెప్పుచున్నారు. అనగా – జగజ్జనని పూజ అంత విశిష్టమైనది అని అర్థము.



## సంస్కృత శ్లోకము - 26

**శ్లో. విరించిః పంచత్వం ప్రజతి హరి రాప్నోతి విరతిం**
**వినాశం కీ నాశో భజతి ధనదో యాతి నిధనమ్**
**వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలిత దృశా**
**మహా సంహారే స్మిన్ విహరతి పతి త్వత్పతిరసౌ.**

## అనువాద పద్యము

**చం. తొలగు విధాత, శౌరియును తూలు, యముండణగారు, నాశమై**
**కలియు కుబేరుడున్, మరియు గన్నులు మూయు మహేంద్ర ధామమున్,**
**నిలుచు సదాశివుండొకడు నిర్మల చిత్తము తోడ నమ్మహా**
**ప్రళయమునందనన్నది భవాని 'పతిత్వ' మహత్వసత్వమే!**

## టీక

విరించిః = బ్రహ్మ, పంచత్వం = మరణమును, ప్రజతి = పొందుచున్నాడు, హరిః = విష్ణువు, విరతిం = చైతన్యరహితుడై, సమాప్తిని, ఆప్నోతి = పొందుచున్నాడు, కీనాశః = యముడు, వినాశంభవతి = వినాశమును పొందుచున్నాడు. ధనః = కుబేరుడు, నిధనం = మరణమును, యాతి = పొందుచున్నాడు. మాహేంద్రీ = ఇంద్రునికి సంబంధించిన, వితతిః అపి = పరివారము గూడ, సమ్మీలితదృశా = కనులు మూతపడి, వితంద్రీ = నిద్రాణమగుచున్నది. హే సతి! = ఓ పతివ్రతామతల్లీ!, అస్మిన్ = ఈ కనబడు ప్రపంచము, మహా సంహారే = మహా ప్రళయము పొందునపుడు, అనగా – కల్పాంతమునందు, త్వత్ = నీ యొక్క, పతి = భర్త అయిన, అసౌ = ఈ సదాశివుడు మాత్రము (ఏ మార్పునకు గుఱికాక) విహరతి = క్రీడించుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! ఈ ప్రపంచమునకు మహా ప్రళయము సంభవించినపుడు బ్రహ్మదేవుడు, విష్ణువు, యముడు, కుబేరుడు, చివరకు ఇంద్రుడు – వీరందఱూ కాలధర్మము చెందుచున్నారు. కాని, ఓ పతివ్రతామతల్లీ! నీ భర్త అయిన సదాశివుడు మాత్రము ఎట్టి మార్పులకు గుఱికాకుండా నిరంకుశుడై విహరించు చున్నాడు గదా!

## వివరణము

విశ్వనాథునికి, విశ్వనాథుని నుండి వ్యక్తమగు విశ్వమునందలి విశ్వ ప్రణాళికను నిర్వహించు విశ్వేదేవతలకును మధ్య గల తేడాను ఈ శ్లోకమునందు ఆదిశంకరులు వివరించుచున్నారు.

జనన మరణముల మధ్య కాలమునందు వివిధ రకముల జీవన వ్యాపారముల బాధ్యతలను నిర్వహించువారు వేరు వేరుగా నుందురు. జనన మరణముల మధ్య గల జీవిత కాలమునందు మాత్రమే దేహము పట్ల వీరు, వీరి బాధ్యతలు పరిమితము.

గృహమును కట్టుకొనక పూర్వము, గృహము శిథిలమై రూపు మాసిపోయిన తరువాత గూడ గృహస్థు ఎట్లుండునో – అట్లే దేహమును ధరించక పూర్వము, దేహమును త్యజించిన తరువాత గూడ దేహి వుండును. ఇదే ఉదాహరణలను

విశ్వపరముగా విస్తరించినచో - ఈ విశ్వము రూపు కట్టుకొనక పూర్వము, అనగా - సృష్టికి పూర్వము ఈ విశ్వము రూపు మాసినపుడు - అనగా ప్రళయమునకు తరువాత - ఈ విశ్వము విశ్వ ప్రణాళికను నిర్వహించు విశ్వేదేవతల కాల ధర్మము ననుసరించి కాలమునకు వశులై పోవచ్చును గాని విశ్వనాథుడు మాత్రము ఎల్లవేళలా సాక్షీ భూతుడుగా నుండును. ఎల్లవేళలా (సదా) చెక్కు చెదరక సాక్షీభూతుడుగా నుండును. ఈ విశ్వనాథునే 'సదాశివుడు' అను పేరుతో వ్యవహరింతురు.

పైన తెలిపిన సదాశివుడు మనలో మానవ ప్రజ్ఞకు అతీతముగా బ్రహ్మ రంధ్రము వద్ద నుండు 'సహస్రార చక్రము'లో ఎల్లవేళలా నిశ్చలస్థితిలో ధ్యాననిమగ్నుడై వుండును. ఆ సదాశివుని నుండి బయటకు వ్యక్తమగు, సదాశివునిలో లీనమగు - విశ్వమును ప్రకృతి అందురు. ఈ 'అభివ్యక్త - అభిక్లుప్తము'లనే 'సృష్టి - ప్రళయము' లందురు. ఈ విశ్వ ప్రకృతినే జగ్జనని అందురు. బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, యమాది ఉన్నత స్థాయి విశ్వేదేవత మూర్తులైనను కాలమునకు వశులై, కాలధర్మముననుసరించి తమ తమ వ్యక్తిగత అస్తిత్వములను కోల్పోవలసినదే గాని ఈ విశ్వనాథుడైన 'సదాశివుడు' మాత్రము అన్ని వేళలా చెక్కు చెదరక ఉండగలుగును. ఆ విశ్వనాథుని పత్ని అయిన విశ్వజనని యొక్క పాతివ్రత్య బలమే దీనికి కారణమని ఆదిశంకరులు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.



## సంస్కృత శ్లోకము - 27

**శ్లో. జపో జల్ప శ్శిల్పం సకలమపి ముద్రావిరచనా,**
**గతిః ప్రాదక్షిణ్యా క్రమణ మశనా ద్యాహుతి విధిః**
**ప్రణామ స్సంవేశ స్సుఖమఖిల మాత్మార్పణ దృశా**
**సపర్యా పర్యాయ స్తవభవతు యన్మే విలసితమ్.**

## అనువాద పద్యము

శా. నా సల్లాపము నీదు మంత్రమగుగా, నా కృత్యముల్ పూజయౌ,
నా సంచారము నీ ప్రదక్షిణమగున్, నా నమ్రతల్ మ్రొక్కులౌ,
నా శారీరిక పోషణమ్మగును నీ నామార్థ హోమంబుగా,
నా సంసేవలు నీకు పూజలగుగా నా యాత్మనర్పింపగా.

## టీక

తల్లీ ! జగజ్జననీ ! ఆత్మ + అర్పణ + దృశా = ఆత్మ సమర్పణ బుద్ధితో, అనగా – సర్వమును పరమాత్మకు సమర్పించుచున్నానను బుద్ధితో, జల్పః = నేను చేయు సల్లాపము, జపః = నీకు చేయు జపము; సకలం = సమస్తమైన, శిల్పం = నేను చేయు క్రియా కలాపములు, ముద్రావిరచనా = నీకు చేయు ముద్రలు; గతిః = నా గమనములు, ప్రాదక్షిణ్య క్రమణం = నీకు చేయు ప్రదక్షిణలు; అశనా + ఆది = తిను భోజనాదులు, ఆహుతి విధిః = నీకు సమర్పించు హవిస్సులు; సంవేశః = నేను నిద్రించునపుడు, పరుండునపుడు జరుగు నా దేహ మందలి మార్పులు, ప్రణామః = నీకు చేయు సాష్టాంగ ప్రణామములు; అఖిలం = సమస్తమైన, సుఖం = సుఖకరమైన, వస్తువులు విలసితం = నా విలాసములు, తవ = నీకు, సపర్యా పర్యాయః = పరిచర్యలు గాను అయి నీ పూజయే అగుగాక !

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! ఆత్మ సమర్పణ బుద్ధితో నేను చేయు సల్లాపములు – నీకు జపముగాను, క్రియా కలాపములు – నీకు చేయుముద్రలు గాను, గమనములు – నీకు చేయు ప్రదక్షిణలు గాను, స్వీకరించు భోజనాదులు – నీకు సమర్పించు హవిస్సులు గాను, నిద్రించునపుడు, పరుండునపుడు జరుగు దేహములోని మార్పులు – నీకు చేయు సాష్టాంగ ప్రణామములు గాను, ఉపయోగించు సమస్త సుఖకర వస్తువులు విలాసములును – నీకు చేయు పరిచర్యలు గాను అయి అన్నియు నీ పూజగానే అగుగాక !

## వివరణము

ఈ శ్లోకము నందలి విషయములు చదువుకొను వారి సంస్కార మును బట్టి, దృష్టిని (Motive) బట్టి – అక్షరములు తాత్పర్యములు మారిపోవును. శంకరాచార్యుల వారు ఏ ఉద్దేశ్యముతో – ఏ దృష్టితో ఈ శ్లోకము నందలి విషయములను వ్రాసిరో ఆ ఉద్దేశ్యమును, దృష్టిని కలిగి యున్నపుడు తప్పుడు త్రోవలు త్రొక్కుట జరుగదు. లేనిచో ఆచార్యుల వారే చెప్పిరని వక్రభాష్యములు చెప్పుకుని ఎంతకైనను తెగించు దుష్టకార్యములను చేసి, దురభ్యాసములకు లోనై

అంతయు అమ్మవారిపై నెట్టివేయుటకు ఆస్కారమ కలదు. లీలాశుకవిరచితమైన కృష్ణకర్ణామృతములోని 'సంధ్యావందన భద్రమస్తు' అన్న శ్లోకము కూడ ఇటువంటి కోవకు చెందినదే నని గుర్తుంచుకొనవలెను. ఇట్టి వక్రభాష్యములు వచ్చునేమోయని పూర్తిగా ఈ శ్లోకమందలి విషయములు జీవన్ముక్తులకు తప్ప సామాన్యులైన ఇతరులకు కాదని లక్ష్మీ ధర పండితుడు అభిప్రాయ పడిరి. ఇక ప్రస్తుత విషయము-

**జపోజల్పః**

నాకు ఈ మానవ జన్మను ప్రసాదించిన నీ దయవలన కొన్ని మాటలను మాటలాడగల అవకాశము గలిగినది. నాకు నీ గురించి స్తోత్రములు గాని, మంత్ర జపములు గాని తెలియవు. ఎవరితో ఎప్పుడు ఏ మాటలు మాట్లాడినను త్రికరణ శుద్ధిగా ఆ ఎదుటి వ్యక్తి యందు నిన్ను దర్శించి, ఆ మాటలను నీకు చేయు స్తోత్రములుగా, మంత్ర జపముగా భావించుచున్నాను.

**ముద్రావిరచనా**

బాధ్యత కలిగిన వ్యక్తిగా కొన్ని పనులు చేయునపుడు గూడా వాటినన్నిటినీ ప్రణాళికగానే భావించి – నీకు సంబంధించిన పనులే అను ఉద్దేశ్యముతో చక్కబెట్టుచున్నాను. నీ కొఱకై కొందరు చేయు 'ముద్రలు' గుఱించి నాకు తెలియదు. కాని, పైన తెల్పిన విద్యుక్త ధర్మములను చక్కబెట్టునపుడు జరుగు నా హస్తముల కదలికలనే నీకు నేను చేయు ముద్రలుగా భావించుచున్నాను.

**గతిః ప్రాదక్షిణ్య క్రమణమ్**

నా ద్వారా జరుగవలసిన పనులను నిర్వహించుటకు నలుగురిని కలసి, నాలుగు చోట్లకు తిరగవలసి వచ్చును. అప్పుడు గూడా నేను కలసిన వ్యక్తులలో నిన్ను దర్శించి, వారిని కలియుటకై నేను తిరిగిన నడకలను – నీకు నేను చేయు ప్రదక్షిణములుగా భావించుచున్నాను.

**అశనాద్యాహుతివిధిః**

బ్రతుకుటకై జఠరాగ్నిని తృప్తిపరచు నుద్దేశ్యముతో అవసరమైనపుడు అవసరమైనంత మేరకు – ఆకలికి ఆహారమును, దప్పికకు పానీయమును స్వీకరించుచున్నాను. హోమములో నీకు సమర్పించు హవిస్సులుగా వీటిని భావించుచున్నాను. ఆరోగ్య పరిరక్షణకై నిద్రించుచున్నపుడు, విశ్రమించునపుడు నా దేహము నందు

కలుగు కదలికలు, భూతల స్పర్శలు వీటన్నిటిని నీకు చేయు సాష్టాంగ ప్రణామములుగా భావించు చున్నాను.

**సుఖమఖిల మాత్మార్పణ దృశా**

నా శరీర సౌకర్యమునకై ఎప్పుడైనను సుఖకరమైన, సదుపాయకరమైన ద్రవ్యములను వాడి ఉపచారములను పొందినపుడు, ఆ ద్రవ్యములను, ఉపచారములను ఈ దేహములలో నున్న నీ పరిచర్యలకై చేయు ఉపచారములుగానే భావించి జీవించు చున్నాను. నా ప్రవర్తనకు సంబంధించిన ప్రసంగ కార్య కలాపాదులన్నియు నీ పూజగానే అగునట్లు అనుగ్రహించుము తల్లీ! – అని భావము.

'నేను ఒక శ్రీవిద్యా ఉపాసకునిగాని, ఒక పూర్ణ దీక్షాపరుని గాని కాదు. నాకు ఒక మంత్రము కాని, స్తోత్రము కాని, జపము గాని తెలియవు. ముద్రల గురించి అష్టాంగ ప్రణామ విధానములు, హోమములు, యాగములు, హవిస్సుల గురించి అసలే తెలియదు. అయినను – ఏమి మాట్లాడినను, ఏమి చేసినను, ఎవరిని దర్శించినను అన్నిటినీ నీ కొఱకే అని, నీ ప్రణాళికలో భాగమేనని, ఆత్మసమర్పణ బుద్ధితో, త్రికరణ శుద్ధిగా చేయుచున్నాను. నన్ను నీవు ఏ విధముగా అర్థము చేసుకొని శాసించి కర్తవ్యమును తెలిపినను అదియే శిరోధార్యముగా భావించి, నిర్వహించి నా ఈ జీవితమును నీకు సమర్పించెదను' – అని చెప్పు సామాన్య మానవుని గూడా ఆ జగజ్జనని హృదయమునకు హత్తుకొని లాలించగలదని తెలిసిన నాడే ఎవరికైనను నిజమైన ఆధ్యాత్మికత ద్యోతకమైనట్లు పరిగణించవలెను. (భగవద్గీత – 9వ అధ్యాయములోని ''యత్కరోషియ దశ్నాసి..... తత్కురుష్వ మదర్పణమ్'' అన్న 27వ శ్లోక భావమును ఇక్కడ గుర్తుకు తెచ్చుకుని సమన్వయము చేసుకొనవలెను).

**ముఖ్య గమనిక**

పైన తెలిపిన విధముగా కాక – నేను నా ఇష్టము వచ్చినట్లు మాట్లాడు మాటలు గాని, చేయు పనులు గాని, తిరిగెడి అడ్డమైన తిరుగుళ్ల గాని, సేవించు పానీయ, ద్రవ్యములు గాని, అనుభవించు సుఖకరమైన ఏర్పాటులను గాని అమ్మవారి నిమిత్తమే అని, అమ్మవారి కొఱకే అని – చెప్పువారు సైతము, ఈ శ్లోకమును ఉదహరించి తమ పనులను సమర్థించుకొన జూడవచ్చును. దాని వలన వచ్చు ఫలము వారి నిజాయితీని బట్టి, ఋజుత్వమును బట్టియే వుండునని మౌనముగా వుండుటయే పెద్దలు చేయుదురు గాని – అనవసరముగా విమర్శించరు.

దైనందిన కార్యక్రమ మంతయు దేవీపూజగా గావించెడు వారికి సద్వినియోగ పడని సమయము, కాలము వుండవు. సద్వినియోగ పడుటకు అవకాశము లేని కాలము, సమయములు వున్నప్పుడు, పూజాదికములకై, కాల, సమయములను వినియోగించు కొనవలెను. అంతేగాని – చేయవలసిన పనులను విస్మరించి, దైవభక్తునిగా ప్రపంచములో చెప్పుకొనబడుటకు చేయు ప్రయత్నములుగా – పూజా హోమములతో సతమతమగుట, లేదా – దురభ్యాసములతో అన్ని రకముల దుష్కార్యములను చేయుచు, అవి అన్నియు తనచే అమ్మవారే చేయించుచున్నదని వక్రభాష్యములు చెప్పుకొనుట – ఇవి ఆత్మవంచనకు నిదర్శనమగునే కాని ఆత్మోద్ధరణకు కాదని గ్రహించవలెను.



## సంస్కృత శ్లోకము - 28

**శ్లో. సుధా మప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యు హరిణీం**
**విపద్యన్తే విశ్వే విధి శతమఖ ముఖాద్యా దివిషదః**
**కరాళం యత్క్ష్వేళం కబలితవతః కాలకలనా**
**నశంభో స్తన్మూలం తవ జనని తాటంక మహిమా.**

## అనువాద పద్యము

***చం. మరణ జరాది భీతులకు మారణమౌ సుధగ్రోలియున్ సదా***
***సరసిజసంభవేంద్ర దివిషత్తతి గెల్తురె మృత్యబాధ ? భీ***
***కరగరళమ్ము మ్రింగియును కాలము నీపతి పొందదన్న నీ***
***మెరిసెడు కర్ణభూషతతి మేలగు చల్లదనమ్మె శాంభవీ!***

## టీక

(ఓ జగజ్జననీ !) విధి = బ్రహ్మ, శతమఖ = ఇంద్రుడు, ముఖాద్యాః = మొదలగు ముఖ్యమైన, విశ్వేదివిషదః = దేవతలందరు, ప్రతిభయ జరామృత్యుహరిణీం = మిక్కిలి భయంకరములయిన జరామరణములను పోగొట్టునది అయిన, సుధా = అమృతమును, ఆస్వాద్యఅపి = త్రాగినవారై కూడా, విపద్యంతే = కాలధర్మము చెందుచున్నారు. (అనగా – చనిపోవుచున్నారు). కరాళం = కఠోరమైన, యత్క్ష్వేళం

= ఏ కాలకూటవిషమును, కబళితవతః = భక్షించి (గూడ), శంభోః = (నీపతియైన) శివునకు, కాలకలనా = కాలధర్మము చెందుట (అనగా – మరణము చెందుట) న = లేదు, తత్మూలం = ఆ విధముగా మరణము చెందక పోవుటకు కారణము, తవ = నీ యొక్క తాటంక మహిమా = చెవికమ్మల (కర్ణాభరణముల) ప్రభావమే, లేదా – సామర్థ్యమే ! (అయివుండవలెను).

## తాత్పర్యము

ఓ జగజ్జననీ ! బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన ముఖ్యమైన దేవతలందరూ మిక్కిలి భయంకరమైన ముసలి తనము, చావులను పోగొట్టగలుగు అమృతమును సేవించిన వారైనను కాలమునకు వశులై చనిపోవుచున్నారు. కాని, నీ పతి అయిన సదాశివుడు ఘోరమైన కాలకూట విషమును మ్రింగి కూడా కాలమునకు వశుడు కాక, చెక్కు చెదరక, సదావసించు చున్నాడు. ఈ విధముగా నీ భర్త మరణమును పొందకుండుటకు నీ చెవి తాటంకముల ప్రభావమే అయి వుండవలెను.

## వివరణము

ప్రతి వ్యక్తి, ప్రతి జీవి తప్పనిసరిగా కాలధర్మము ననుసరించి జనన, జరా, వ్యాధి, మరణములకు వశము కాక తప్పదు. దేవతలు ఈ దురవస్థల నుండి తప్పించు కొనుటకు అమృతమును సేవించిరి. అమృత పానము చేసిన వారికి జరామరణము లుండకూడదు. అయినను బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలందరు కాలవశులై మహాప్రళయ సమయమున కాలధర్మము నొందవలసినదే ! మరణమునకు దారి తీయు ఘోరమైన కాలకూట విషమును స్వయముగా చేతబూని మ్రింగిన సదాశివుడు వాస్తవమునకు నామ రూపములు లేకుండా పోవలెను. కాని, మహాప్రళయ సమయము నందు గూడా దానిని సాక్షీ భూతుడుగా వీక్షించు సదాశివుడు చెక్కుచెదరక జీవించుటకు కారణము ఏమై వుండవలెను ? ఆదిశంకరులు దీనికి గల ముఖ్యకారణమును ఈ శ్లోకములో చెప్పుచున్నారు. ''అమ్మవారి రెండు చెవులకు ఆభరణములుగా ధరించిన 'తాటంక యుగళము' యొక్క ప్రభావమే శివుని ఆవిధముగా సదావసించునట్లు చేసినది! ఆ తాంటక యుగళము యొక్క అంతటి మహిమయే అమ్మవారి పాతివ్రత్యమునకు పరాకాష్ఠ ప్రతిభను చేకూర్చినది!'' అని చెప్పుచున్నారు.

**మంగళకర చిహ్నములు**

ప్రతి భారతీయ హైందవస్త్రీకి మంగళకరమైన ఆభరణములు, కట్టుబాట్లు కొన్ని కలవు. వాటిలో ముఖ్యముగా మంగళ సూత్రము, గాజులు, ముక్కు, చెవులకు పెట్టుకొను – ఆభరణములు, పసుపు, కుంకుమ, కాటుక, పారాణి మొదలైనవి ఈ కోవకు చెందినవే ! ఇవి స్త్రీ సౌభాగ్యమునకు సంబంధించినవి. భర్త మరణించినపుడు భార్య వీటి వాడకమునకు దూరమగును. అందుచేతనే ప్రతి హైందవ స్త్రీ వీటిని సువాసినీ లేదా – సుమంగళీ లక్షణముగా అభిమానించి, గౌరవించి జాగ్రత్తగా కాపాడుకొనును. వీటిని ధరించని స్త్రీని భర్తను పోగొట్టుకున్న స్త్రీగా కూడా అపార్థము చేసుకొను నంతటి ప్రాముఖ్యము వీటికి కలదు. అనగా – పెళ్లైన స్త్రీ వీటిని ధరించనిచో ఆమె భర్తలేడేమోనని అపోహపడుట గాని, భర్తను పోగొట్టుకున్న స్త్రీ వీటిని ధరించకూడదనుటను గాని సూచించును.

అమ్మవారు ధరించిన ఆభరణములలో చెవులకు ధరించిన తాటంక యుగళము (కమ్మలజత) నకు ప్రత్యేకత కలదు. ఈ ప్రత్యేకత లలితా సహస్ర నామములో చెప్పబడినది.

**తాటకం వైశిష్ట్యము**

'తాటంకయుగళీభూత తపనోడుప మండలా' అను నామ రహస్యార్థమును పరిశీలించినచో తెలియును. 'సూర్యమండలము, చంద్రమండలములను తన రెండు చెవులకు తాటంకములుగా రూపొందించినది' – అని ఈ నామమునకు అర్థము. మండలాత్మకమైన కాలగతి పూర్తిగా సూర్య, చంద్ర గమనముల పైనే ఆధారపడి వున్నది. ఈ కాలగమనమునకు ఆద్యంతములు లేవు. అనంతత్వమే కాలము యొక్క లక్షణము. ఆద్యంతములు అనగా – మొదలు, తుది; అనగా – జనన, మరణములు అని అర్థము. కాబట్టి, అమ్మవారి రెండు చెవులకు ఆభరణములుగానున్న తాటంకములు గూడా ఆద్యంతములు లేనివి అనగా, నిరంతరము ఆమె చెవులకు ఉండవలసినవే అని భావము. అమ్మవారి సౌభాగ్యము ఈ విధముగా అనంతత్వ లక్షణము గలది అగుట వలననే అయ్యవారైన శివునికి ఎట్టి పరిస్థితులలోను మరణ బాధలేదు. మహా ప్రళయ సమయములో కూడా ఎంతమంది కాలవశులైనను శివుడు మాత్రము సదావశించు లక్షణము గలిగి 'సదాశివుని' గా సంకేతింపబడుచున్నాడు.

అమ్మవారికి కలిగిన ఆ అదృష్టమునకు కారణము 'అమ్మవారి పాతివ్రత్యమునకు వన్నె తెచ్చిన తాటంకముల మహిమయే !' అని ఆదిశంకరులు చెప్పుచున్నారు.

(ఆకాశము శబ్ద గుణకము. అటువంటి ఆకాశములో సంచరించు సూర్య, చంద్రులు – శబ్ద గ్రాహ్యమునకు సంబంధించు అమ్మవారి చెవులకు ఆభరణములుగా చెప్పబడుట కూడ సమంజసమే కదా !

అమ్మవారి రెండు కన్నులు, చెవుల తాటంకములు – సూర్య, చంద్ర సంబంధమైనవిగా పోల్చుటలో మరి యొక ఔచిత్యము కలదు. ప్రపంచములో జరుగు అన్నిరకముల కర్మలను రేయింబవళ్ళు ఈ సూర్య, చంద్రులు తిలకించుదురు. కాబట్టి, ఈ ఇద్దరినీ జీవులు చేయు కర్మలకు సాక్షులుగా గుర్తించవచ్చును. వారు చూసినవి చూసినట్లు చెప్పుటకు అమ్మవారి కళ్లగను, విన్నవి విన్నట్లు చెప్పుటకు అమ్మవారి చెవుల వద్దనే తాటంకములుగను ఉన్నారని సంకేతింపబడినట్లుగా అర్థము చేసుకొనవలెను. జీవులు చేసిన కర్మలను బట్టి ఆయా ఫలములను వారికి అమ్మవారు ఒసంగుటలో సూర్య చంద్రులు ఈ విధముగా అమ్మవారి అనుజ్ఞలకు, ఆజ్ఞలకు బద్ధులై సహకరించుదురు, (ఈ విషయములు నేను వ్రాసిన శ్రీ లలితా సహస్ర నామ వివరణ లోనివి).



## సంస్కృత శ్లోకము - 29

**శ్లో. కిరీటం వైరించం పరిహర పురః కైటభభిదః**
**కఠోరే కోటీరే స్ఖలసి జహి జంభారి మకుటమ్**
**ప్రణమ్రేష్వేతేషు ప్రసభముపయాతస్య భవనం**
**భవస్యాభ్యుత్థానే తవ పరిజనోక్తి ర్విజయతే.**

## అనువాద పద్యము

*చం. కొలువును జేరవచ్చు శివుగూడగ నీ వెదురేగవేగ, నీ*
*చెలులు - 'విధాత మౌళియిది' జేరకు దానిని జాఱవచ్చు, నా*
*శిలవలె నుండు మాధవుని సీసక, మింద్రుని మౌళి దాటు, మం*
*చలుసుగ తెల్ప నీకు తగు నంతటి వేల్పులు మ్రొక్కు చుండగా.*

## టీక

(ఓ భువనేశ్వరీ దేవీ !), పురః = నీ ముందు, వైరించ = బ్రహ్మకు సంబంధించిన, కిరీటం = కిరీటమును, పరిహర = వదలి దూరముగ నడువుము, కైటభభిదః = కైటభుడను రాక్షసుని వధించిన విష్ణుమూర్తి యొక్క, కఠోరే = (రత్నఖచితమగుటచే) కఠినముగా అయిన, కోటీరే = కిరీటము అంచులందు తాకి, స్ఖలసి = జారెదవేమో, జంభారి మకుటమ్ = జంభుడను రాక్షసుని సంహరించిన దేవేంద్రుని కిరీటమును, జహి = వదలి దూరముగా నడువుము – అని ఈ విధముగా – ఏతేషు = బ్రహ్మేంద్రాదులు ప్రణమ్రేషుసత్సు = మ్రొకరిల్లుచుండగా, భవనం = (నీ) మందిరమునకు, ఉపయాతస్య = వచ్చిన, భవస్య = (నీ పతియగు) పరమేశ్వరునికి, ప్రసభ = వెంటనే, తవ అభ్యుత్థానే = నీవు ఎదురు వెళ్ళు సమయమందు, తవ = నీ యొక్క, పరిజన + ఉక్తి = నీ సేవికలవచనము, విజయతే = సర్వోత్కర్షతో విరాజిల్లుచున్నది.

## తాత్పర్యము

నీ మందిరమునకు నీ పతియగు పరమేశ్వరుడు వచ్చిన తరుణములో నీవు వెనువెంటనే స్వాగత వచనములతో ఎదురేగి, ఆయనను పలుకరించుటకు లేచి ముందుకు సాగు ప్రయత్నములో నుండగా – దారిలో నీకు సాష్టాంగ దండ ప్రణామము లాచరించు స్థితిలో నున్న బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదుల యొక్క కిరీటములు నీ పాదములకు అడ్డు తగుల వచ్చునను ఉద్దేశ్యముతో వీటిని జాగ్రత్తగా దాటుచు నడువుమని చెప్పు నీ పరిజనుల మాటలు సర్వోత్కృష్టముగా నున్నవి.

## వివరణము

తన మందిరములో అమ్మవారు కొలువుతీరి ఠీవిగా సుఖాసీనురాలై వుండగా – ఆమెకు సాష్టాంగ దండ ప్రణామములు చేయు స్థితిలో బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు నేలమీద సాగిలపడి వున్నారు. అదే సమయములో ఆ మందిరమునకు పరమేశ్వరుడు వచ్చుట జరిగినది. ఆ పరమేశ్వరుని స్వాగత వచనములతో పలుకరించుటకు జగజ్జనని తన ఆసనము నుండి వెనువెంటనే లేచి ముందుకు పోవు ప్రయత్నములో నుండగా – పరిజనులు – ''అమ్మా జాగ్రత్త! నీ పాదమునకు

ముందు బ్రహ్మ దేవుని తలనుగూడి ఆయన కిరీటము వున్నది. నీ పాదమునకు తగిలినా తగుల కలదు. దానిని చూచి కొంచెము ప్రక్కగా తొలగినడువుము. అదిగో అటుగా వెళ్ళకుము. అటువైపు విష్ణువు తలకు ఉన్న రత్నఖచితమైన కిరీటము వున్నది. అది నీ మెత్తని పాదములకు తగిలి గ్రుచ్చుకొన వచ్చును. దానికి ప్రక్కగా నడువుము. అదిగో ఆ కనబడుచున్నది ఇంద్రుని కిరీటము. నీ పాదములకు తగలకుండా దానిని గూడా విడిచి ప్రక్కవైపుగా నడిచి ముందుకు పోయి నీ పతిని చేరుము'' - అని అనెడు మాటలు కడు రమ్యముగా నున్నవని శ్రీ శంకర భగవత్పాదులు అనుచున్నారు.

పైన చెప్పిన దానిని బట్టి అమ్మవారి కొలువులో ఆమె దర్శనార్థమై ఆమెకు సాష్టాంగ ప్రణామములు చేయునుద్దేశ్యముతో బ్రహ్మ, విష్ణువు, దేవేంద్రాదులు నేలమీద సాగిలపడి వుందురని తెలియుచున్నది. వారు ఆ విధముగా సాగిలపడి వున్నపుడు - అమ్మవారు వారిని దాటుచు పతిని చేరుటకై ముందుకు నడుచుచున్నప్పుడు ఆమె సుతిమెత్తని పద పల్లవములకు రత్న ఖచితమైన వారి వారి కిరీటములు తగిలి ఇబ్బంది పెట్టకుండా వుండుటకు పరిజనులు అమ్మవారి నుద్దేశించి పలికిన పలుకులు, అమ్మవారి వైభవమును, ఆధిక్యమును, సర్వోత్కృష్టతను, సాంప్రదాయ సంస్కృతిని వెల్లడి చేయుట చేతనే ఆదిశంకరులు ఆ విధముగా సెలవిచ్చిరి.

**భారతీయ ఆదర్శము:**

పేరు, ప్రతిష్ఠ, అధికారము, పదవి కలిగిన వారు ప్రణిపాతము (సాష్టాంగపడి) చేయుచు, ప్రస్తుతించు చున్నను - వీటికన్న పతికి జరగవలసిన మర్యాదకు ముందు ప్రాముఖ్యము నొసంగవలెనని ఈ శ్లోకములో సూచన వున్నది. భారతీయ మహిళలకు ఆదర్శ ప్రాయమైన అమ్మవారు వ్యవహరించిన తీరు గృహిణులు గుర్తుంచుకొందురు గాక!



## సంస్కృత శ్లోకము - 30

శ్లో. స్వదేహోద్భూతాభి ర్ఘృణిభి రణిమాద్యాభిరభితః
నిషేవ్యే నిత్యే త్వామహమితి సదా భావయతి యః
కిమాశ్చర్యం తస్య త్రినయన సమృద్ధిం తృణయతః
మహా సంవర్తాగ్ని ర్విరచయతి నీరాజన విధిమ్.

## అనువాద పద్యము

మ. *చరణోద్భూత మయూఖ పుంజములతో, సర్వాణిమాదిప్రభా*
*పరివృత్తంబగు నీకు నిత్యమును సేవల్ జేయు నీ భక్తుడున్*
*గిరిశ శ్రీ ధృణమట్లు జూడ ప్రళయాగ్ని జ్యోతులవ్వానికిన్*
*వర నీరాజన మిచ్చునన్న జగదంబా! యేమి యాశ్చర్యమౌ ?*

## టీక

నిత్యే = ఆద్యంతములు లేని తల్లీ!, నిషేవ్యే = చక్కగా సేవింపదగిన మాతా! స్వదేహ + ఉద్భూతాభిః = తన యొక్క (అనగా - ప్రస్తుతము నీ యొక్క) దేహము నుండి, (అనగా - ప్రస్తుతము పాదముల నుండి) ఉద్భవించినట్టి, ఘృణిభిః = కిరణములతోడను, అణిమా + ఆద్యాభిః = అణిమాగరిమాది అష్టసిద్ధులతోడను, అభితః = చుట్టును ఉండు వానితోడను, (కూడి), త్వాం = (ఉన్న) నిన్ను, అహంఇతి = నేను అను అహంభావన చేత, సదా = ఎల్లవేళల, యః = ఏ సాధకుడు, భావయతి = ధ్యానము చేయునో, త్రినయన సమృద్ధిం = సదాశివుని యొక్క ఐశ్వర్యమును, తృణయత = తృణీకరించుచున్న గడ్డి పోచవలె నెంచుచున్న, తస్య = ఆ సాధకునికి, మహా సంవర్త + అగ్ని = మహా ప్రళయాగ్ని, నీరాజన విధిం = నీరాజనమును, కరోతి = ఇచ్చుచున్నది (అని అనుటలో), కిం ఆశ్చర్యం = ఏమి ఆశ్చర్యము ?

### తాత్పర్యము

చక్కగా సేవించదగిన, ఆద్యంతములు లేని జగజ్జననీ! నీ పాదముల నుండి ఉద్భవించు కిరణముల తోను, చుట్టునూ - అణిమా, మహిమా మొదలైన అష్ట సిద్ధులతోను ఆవరించి యుండు నిన్ను 'నీవేనేను' అను భావనతో నిత్యము ధ్యానము చేయుచు నీతో తాదాత్మ్యమును పొందు సాధకుడు - సదాశివుని అష్టైశ్వర్యములనే

గడ్డి పోచవలె ఎంచుననగా మహా ప్రళయాగ్ని ఆ సాధకునకు నీరాజన మెత్తుననుటలో ఆశ్చర్యమే మున్నది?

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారిని 'నిత్యే' అని ఆదిశంకరులు సంబోధించినారు. 'సర్వకాల సర్వావ స్థలయందును చెక్కు చెదరని శాశ్వతమూర్తి అమ్మవారు' - అని ఈ సంబోధన సూచించును. ఏ లక్షణములు గల దేవతను ఆరాధించినచో - ఆ సాధకునకు గాని, ఆ ఉపాసకునికి గాని పరాకాష్ఠసిద్ధిగా ఆ లక్షణములు వచ్చును. కాబట్టి - తాను ఆశించు ప్రతి ఫలమును దృష్టిలో పెట్టుకొని ఆయా దేవతను సాధకులు ఉపాసింతురు. అద్వైత సిద్ధితో, లేదా - సాయుజ్య సిద్ధితో శాశ్వతత్వమును ఆశించు సాధకుడు - మరి యే ఇతర దేవతలను ఆరాధించి, ఉపాసించినను పొందలేడు. ఒక్క అమ్మవారే ఆద్యంత రహితురాలు కాబట్టి, మిగిలిన వారందరూ ప్రళయకాలములో కాలవశులగుట తప్పదు కాబట్టి - శాశ్వతత్వమును ఆశించు సాధకుడు, జగజ్జననినే ఆరాధించవలెను.

నిత్యము తన పాదముల నుండి వెలువడు కిరణ పుంజములతోను, నిత్యమూ తనను సేవించు నవావరణ దేవతా సముదాయముతోను - ముఖ్యముగా ఆ ఆవరణముల లోని - అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి , ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము - అను అష్టసిద్ధులతోను కూడి ఉండు అమ్మవారిని త్రికరణ శుద్ధిగా 'నీవే నేను' అను భావముతో ధ్యానము చేసిన సాధకుడు అటువంటి అమ్మవారితో ఐక్యమై, అద్వైత తాదాత్మ్యమును పొందును. సాధనశుద్ధిని బట్టి అమ్మవారు సాలోక్య, సామీప్య, సారూప్య, సిద్ధులనే కాక, సాయుజ్య సిద్ధిని కూడా సాధకునకు ప్రసాదించును. 'భవానిత్వం దాసే....'' అన్న శ్లోకములో ఇంతకు పూర్వమే ఈ విషయము చెప్పబడినది. సాయుజ్య స్థితిలోని సాధకునకు పొందవలె ననుకొనునది ఏమియు నుండదు. ఎంతటి ఐశ్వర్యమైనను - చివరకు శివుని అష్టైశ్వర్యములు కూడా అతనికి తృణప్రాయమై గోచరించును. అట్టి స్థితిలోని సాధకునిపట్ల మహాప్రళయాగ్నికూడా ఏమియు చేయలేకపోగా ఆ సాధకునికి నిలువెత్తు నీరాజనముగామారి గౌరవ భావమునే ప్రదర్శించును.

**తృప్తి**

పుట్టలు పుట్టలుగా నుండు ఐహికమైన కోర్కెలు గల వారికి అన్నియు ఇబ్బందులే! అన్నియు అవరోధములే! వీటి వలన తృప్తి – అసంతృప్తుల మధ్య జీవి సతమత మగుట తప్పదు. ఆశ్రయింపులు, పొగడ్తలు తప్పవు. వ్యాపార దృష్టితో అర్జించు వారి విషయములో ఏమో గాని, ఇట్టి ఐహికమైన కోర్కెలు లేకుండా కేవలము అమ్మవారితోడి సాయుజ్య స్థితిలో ధ్యాననిమగ్నుడై యుండు వానికి – ఎట్టి ఆటంకములు, అధికారవములు అడ్డుగా నిలవవు. ప్రళయాగ్ని కూడా ప్రసన్నముగానే వుండును.



## సంస్కృత శ్లోకము - 31

**శ్లో. చతుష్షష్ట్యా తంత్రైః సకల మతి సంధాయ భువనం**
**స్థిత స్తత్త త్సిద్ధి ప్రసవ పరతంత్రైః పశుపతిః**
**పునస్త్వన్నిర్బంధా దఖిల పురుషార్థైక ఘటనా**
**స్వతంత్రం తే తంత్రం క్షితితల మవాతీతరమిదమ్.**

## అనువాద పద్యము

***చం. అరువదినాల్గు తంత్రముల నన్నిటి నీశ్వరు డీ జగాలకున్***
***వరముగనిచ్చి లోకులను వంచన సేయుచు నాడుచుండగా***
***కరమనురక్తి నీవు నిజకాంతుని గట్టిగకోర నిచ్చెగా***
***ధరనఖిలార్థదాయిగను 'తాన'యి నిత్యస్వతంత్ర తంత్రమున్.***

## టీక

(ఓ జగన్మాతా!) తత్‌తత్ = ఆయా, సిద్ధిప్రసవపరతంత్రైః = తంత్రముల ప్రయోజనములు ఇష్టపడునవైన, చతుష్షష్ట్యా = మహామాయాశాంబరాదులగు అఱువదినాలుగు సంఖ్యగల, తంత్రైః = తంత్ర గ్రంథముల చేత, సకలంభువనం = సమస్త ప్రపంచమును, అతిసంధామ = మోహపెట్టివంచింప చేసి, పశుపతిః = శివుడు, స్థితః = స్థిమితముగా నుండెను. పునః = మరల, తత్వత్ నిర్బంధాత్ = నీ నిర్బంధము వలన, సమస్తమైన, పురుషార్థ = చతుర్విధ పురుషార్థములను, ఏకఘటనా =

ముఖ్యముగాసమకూర్చుట యందు; స్వతంత్రం = 'స్వ' తంత్రమైన, తే = నీ యొక్క, తంత్రం = శ్రీ విద్యా తంత్రమును, ఇదం = ఈ చెప్పబడుచున్న దానిని, క్షితి తలం = భూతల వాసులనుద్దేశించి, అవాతీతరత్ = అవతరింప జేసెను.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! పశుపతి అయిన శివుడు, జీవులను తృప్తి పరచుటకై వివిధ విధాన ప్రక్రియలతో రకరకముల ఫలితములనిచ్చు అఱువదినాలుగు రకముల తంత్రములను ఈ లోకమునకు ఇచ్చి, జీవులను మోహ వ్యామోహములలో చిక్కుకొనునట్లు చేయగా - ఆ విధముగా మోహము నందు పడకుండుటకు బిడ్డలైన జీవుల యందు వాత్సల్యముతో - నీవు నీ భర్త అయిన శివుని ప్రేమతో నిర్బంధ పెట్టగా - పరమ పురుషార్థ ప్రదమైన నీదైన శ్రీ విద్యాతంత్రమును ఈ భూలోక వాసులకు ప్రసాదింప జేసేను.

## వివరణము

భైరవాష్టకము మొదలైన తంత్రము లెన్నియో గలవు. (వీటి వివరములను - అవి అందజేయు ప్రతిఫలములను స్థలాభావముచే ఇక్కడ వ్రాయుట లేదు.) ఈ తంత్రములన్నియు చిరుతిళ్ల వంటివి. ఆకలి తీరుటకు ఉపయోగపడుట కన్న అన్న హితవును తగ్గించుటలో ఈ చిరుతిళ్లు ప్రాధాన్యము వహించును. అయినను చాలామందికి అన్నము కన్న చిరుతిళ్ల పైన మక్కువ ఎక్కువ వుండును. అవి తాత్కాలికమైన ఆర్తిని తీర్చగలవే కాని, శాశ్వతమైన అన్నహితవును. తద్వారా ఆరోగ్యమును చేకూర్చలేవు. అట్లే, మోక్ష సంబంధమగు శాశ్వత ఆనందమునకు దారితీయలేనివియు, కేవలము ఇంద్రియ సుఖములకే పరిమితమగు ఫలితములను చేకూర్చగలవియు మాత్రమే ఈ తంత్రములు. దూరదృష్టి, ఉత్తమ లక్ష్యసిద్ధిలేని వారే సాధారణముగా జీవులలో ఉందురు. అట్టివారు పశుపతి కల్పించి ఇచ్చిన అఱువది నాలుగు తంత్ర విషయములలో పడి అసలు విషయమును మరచుట జగజ్జనని గమనించెను.

విశ్వమంతయు నిండి వున్నది 'బ్రహ్మ' మని చెప్పునది - 'బ్రహ్మ విద్య' కాగా, తనను గుఱించి చెప్పునది - 'ఆత్మ విద్య' అగును. ఈ రెంటిని సమన్వయ

పఱచునది - 'శ్రీవిద్య! ఈ కారణమువలననే - మహత్తర ప్రయోజనమును, మహోపయోగకరమైన లక్ష్యమును గలదిగా శ్రీ విద్య చెప్పబడును. మిగిలిన తంత్రములన్నియు మిఠాయి దుకాణములోని తినుబండారముల వంటివి. ఆ తినుబండారములన్నిటినీ తినవలసిన అవసరమున్నదా ? - అవసరము లేదు. అయినను వాటిని గమనించుట తోడనే ఆకర్షితులై వ్యామోహపడుట సామాన్యముగా జరుగుచుండును. ఈ విధముగానే సకల తంత్రములు జీవులను ప్రలోభ పెట్టుట జరుగును. జగజ్జనని అయిన అమ్మవారు జీవులు ఇట్టి భ్రమలలో పడకుండా వారికి అసలైన ఈ శ్రీవిద్యా తంత్రమును ప్రసాదింపచేసి వారు, మోక్షమును పొందుటకు దోహదకారి అయ్యెను.



## సంస్కృత శ్లోకము - 32

శ్లో. శివ శ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరా మార హరయః
అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజంతే వర్ణాస్తే తవ, జనని నామావయవతామ్.

## అనువాద పద్యము

చం. హరశక్తి స్మరధాత్రులున్, మిహిరసోమానంగహంసేంద్రులున్,
మఱియాపైని పరాస్మరాచ్యుతులుగా నామావళీ బీజముల్
వరుసన్ కూటములట్లుజేసి, తుదలన్ వ్రాయంగ హృల్లేఖలన్
సిరులన్ చిందు మహాంగవర్ణములగున్ శ్రీమంత్రరాణ్మూర్తికిన్.

## టీక

జనని ! = ఓ మాతా!, శివః = శివుడు ('క' కారము) శక్తిః = శక్తి ('ఏ' కారము, కామః = మన్మథుడు ('ఈ' కారము) క్షితిః = భూమి ('ఏ' కారము); అథః = తర్వాత, రవిః = సూర్యుడు ('హ' కారము) శీతకిరణః = చంద్రుడు ('స' కారము) స్మరః = మన్మథుడు ('క' కారము) హంసః = సూర్యుడు ('హ' కారము) శక్రః = ఇంద్రుడు ('ల' కారము); తత్ + అనుచ = వానికి తర్వాత,

పరా = పరాశక్తి ('స' కారము) మారః = మన్మథుడు ('క' కారము) హరిః = విష్ణువు ('ల' కారము) అమీ = (ఈ మూడు వర్గములుగానున్న) ఈ వర్ణములు, త్రిస్రుభిః = మూడైన, హృల్లేఖాభిః = 'హ్రీం' కారముల చేత, అవసానేషు = వర్గాంతములందు, ఘటితాః = సంకలితమై, అనగా – కూడినదై, హేజనని = ఓ మాతా!, తే = ఆ, వర్ణాః = అక్షరములు, తవ = నీయొక్క, నామ + అవయవతాం = అవయువములగుటను, అనగా – మంత్ర స్వరూపమగుటను, భజంతే = పొందుచున్నవి.

## తాత్పర్యము

శివుడు, శక్తి, మన్మథుడు, భూమి – ఈ నలుగురూ వరుసగా సూచించు క, ఏ, ఈ, ల – అను అక్షర కూటము; సూర్యుడు, చంద్రుడు, మన్మథుడు, సూర్యుడు, ఇంద్రుడు – ఈ ఐదుగురు వరుసగా సూచించు హ, స, క, హ, ల – అను అక్షర కూటము; పరాశక్తి, మన్మథుడు, హరి – ఈ ముగ్గురు వరుసగా సూచించు స, క, ల – అను అక్షర కూటములు – వాటి అంతము నందలి విరామ స్థానములందు – 'హ్రీం' కారముల చేత సమకూర్చబడినపుడు ఏర్పడు ఆ మూడు కూటములలోని మొత్తము పదునైదు అక్షరములు (జగజ్జననీ!) నీ పంచదశాక్షరీ మంత్ర స్వరూపమునకు అవయవములుగా భాసించుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి పంచదశాక్షరీ మంత్రము నందలి పదునైదు బీజాక్షరములను సూటిగా చెప్పుటకాక సంకేత పద్ధతిలో వాటిని సూచించుకొన్ని నామములల వరుసతో చెప్పబడినవి. ఇది ఒక పద్ధతి. మన భారతీయ శాస్త్రములన్నిటిలోను ఈ పద్ధతి వున్నది. ఆధునికులకు అర్థమగునట్లు చెప్పవలెనన్నచో ఇది ఒక టెలిగ్రాఫ్ వ్యవస్థ ఉపయోగించు సంకేత భాష(Telegraphic language) వంటిది. టెలిగ్రాఫిక్ భాషలోని సంకేతముల నుండి అవి సూచించు మాటలను, వాటి అర్థములను ఏ విధముగా టెలిగ్రాఫిక్ సంస్థవారు మనకు తెలియపరచుదురో అట్లే – ఈ శ్లోకమునందలి సంకేత నామములనుండి అవి సూచించు బీజాక్షరములను గ్రహించి అమ్మవారి పంచదశాక్షరీ మంత్రమును రాబట్టుకొనవలెను.

పైన తెల్పిన మూడు కూటములకు అంతమునందు 'హ్రీం' కారమును చేర్చినపుడు ఏర్పడు - క - ఏ - ఈ, - ల - హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం - అను బీజాక్షరములు అమ్మవారి పంచదశాక్షరీ మంత్రమును రూపొందించును.

పంచదశాక్షరీ మంత్రము నందలి మూడు కూటములు అమ్మవారి స్థూల విగ్రహమును మూడు భాగములుగా విభజించి తెలుపును. ఈ మూడు కూటములు శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రమునందు వరుసగా - వాగ్భవకూటము, మధ్యకూటము, లేదా - కామరాజ కూటము, శక్తికూటములుగా చెప్పబడునని ఈ క్రింది శ్లోకపాదములు సూచించును.

**'శ్రీ మద్వాగ్భవకూటైక' స్వరూపముఖ పంకజా**
**కంఠాధః కటిపర్యంత 'మధ్యకూట' స్వరూపిణీ**
**'శక్తికూటైక' తాపన్న కట్యథోభాగ ధారిణీ**

మొదటి కూటము అయిన - క - ఏ - ఈ - ల - హ్రీం - అమ్మవారి ముఖమును సూచించును అనియు, రెండవ కూటము అయిన - హ - స - క - హ - ల - హ్రీం - కంఠము నుండి కటి ప్రదేశము (నడుము) వరకు గల భాగమును సూచించు ననియు, మూడవ కూటము అయిన - స - క - ల - హ్రీం - కటి ప్రదేశము నుండి క్రింది వరకు గల భాగమును సూచించుననియు - పై శ్లోక పాదముల అర్థము. అందుచేతనే ఈ మూడు కూటములందలి బీజాక్షరములు అమ్మవారి పంచదాక్షరీ మంత్ర స్వరూపమునకు అవయవములుగా ఈ శ్లోకము నందు చెప్పబడినవి. ఈ మూడు కూటములు వరుసగా - వాక్సంపత్తిని, శక్తిని, మోక్ష సౌభాగ్యములను ప్రసాదించునని చెప్పుదురు. శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములోని 'త్రికూటా' 'మూలమంత్రాత్మికా' 'మూల కూటత్రయ కళేబరా' అన్న నామములను గూడా ఇక్కడ సమన్వయపరచు కొనవచ్చును (శ్రీ లలితా సహస్ర నామములకు నేను వ్రాసిన వివరణను చదివినచో మరికొన్ని విషయములు తెలియగలవు - వివరణకర్త).

**రెండు పద్ధతులలో పంచదశాక్షరీ మంత్రము**

శ్రీవిద్యలో అమ్మవారి పంచదశాక్షరీ మంత్రమునకు రెండు విధములైన

పద్ధతులలో బీజాక్షరములను చెప్పుదురు. 1. లక్ష్మీధర పండితుల పద్ధతి. 2. కైవల్యాశ్రమిపండితుల పద్ధతి. ప్రస్తుత శ్లోకమునకు ఇంత వఱకు టీక, తాత్పర్య, వివరణలు లక్ష్మీ ధర పండితుల పద్ధతి ప్రకారమే తెలుపబడినవి. కైవల్యాశ్రమి పద్ధతి ప్రకారమైనచో ఈ పంచదశాక్షరీ మంత్రములోని ప్రథమకూటము నందలి 'క ఏ ఈ ల హ్రీం' బీజాక్షరములు 'హ స క ల హ్రీం' బీజాక్షరములుగా మారును. మిగిలిన రెండు కూటములందలి బీజాక్షరములలో మార్పు ఉండదు. అప్పుడు కైవల్యాశ్రమి పద్ధతి ప్రకారము పంచదశాక్షరీ మంత్రము – 'హ స క ల హ్రీం'; 'హ స క హ ల హ్రీం'; 'స క ల హ్రీం' అగునని గ్రహించవలెను.



## సంస్కృత శ్లోకము - 33

**శ్లో. స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిద మాదౌ తవ మనోః**
**నిధాయైకే నిత్యే నిరవధి మహాభోగరసికాః**
**భజన్తి త్వాం చింతామణి గుణ నిబద్ధాక్షవలయాః**
**శివాగ్నౌ జుహ్వన్త స్సురభి ఘృతధారాహుతి శతైః**

## అనువాద పద్యము

***చం. అనవరతమ్ము దివ్యసుఖమందగ నాదిని నీదు మంత్రమున్***
***మనసిజయోని లక్ష్ములుగ మార్చి జపింతురు దివ్యభోగులున్***
***నినుభజియింత్రుగా సురమణీగుణమాలిక నక్షమాలగా***
***గొనుచు శివాగ్నిలో సురగోఘృతధారలు వేల్చువేళలన్.***

## టీక

నిత్యే = ఓ నిత్యాస్వరూపురాలా !, తవ = నీ యొక్క, మనోః = మంత్రమునకు, ఆదౌ = మొదటను, స్మరం = మన్మథుని బీజమును (క్లీం), యోనిం= భువనేశ్వరీ బీజమును ( హ్రీం), లక్ష్మీం = శ్రీ బీజమును (శ్రీం), ఇదం = ఈ మూడింటిని నిధాయ = ఉంచి, లేదా – చేర్చి, ఏకే = కొందఱు మాత్రము, నిరవధిక = హద్దులులేని, మహాభోగ = దొడ్డదైన ఆనందానుభవము యొక్క, రసికాః= రసజ్ఞులు, చింతామణి = చింతామణుల యొక్క, గుణ = సమూహము

చేత, నిబద్ధ = కూర్చబడిన, అక్షవలయాః = అక్షమాలలు గలవారై, శివా + అగ్నే = శివాగ్ని యందు, (అనగా స్వాధిష్ఠాగ్నియందుంచి) త్వాం = నిన్ను, సహస్రారము నుండి హృదయ కమల మందు నిల్పి, సురభి = కామధేనువు యొక్క, ఘృత = నేయి యొక్క, ధారా = ధారల చేత, ఆహుతి = ఆహుతల యొక్క, శతైః = పలు మారులు, జుహ్వాంతః = హోమము చేయుచు, చక్కని తృప్తిని పొందుచు, భజంతి = సేవించుచున్నారు.

## తాత్పర్యము

ఓ నిత్యస్వరూపిణీ ! రసజ్ఞులు, సమయాచారపరులు అగు కొంతమంది పరమ యోగీంద్రులు – నీ మంత్ర ప్రథమ కూటము నందలి (32వ శ్లోకములో తెలిపిన పంచదశాక్షరీ మంత్ర ప్రథమ కూటము నందలి) క, ఏ, ఈ బీజాక్షరములకు ముందు వరుసగా కామరాజ బీజాక్షరమైన 'క్లీం', భువనేశ్వర బీజాక్షరమైన 'హ్రీం', లక్ష్మీబీజాక్షరమైన 'శ్రీం' లను చేర్చి అష్టదశాక్షరిగా జపించుచూ, చింతామణులు అను రత్నములచే కూర్చబడిన అక్షమాలికలను హస్తములందు ధరించి, 'శివాగ్ని' అని పేరు పొందిన స్వాధిష్ఠానాగ్ని యందు కామధేనువు యొక్క నేతి ధారలు అను ఆహుతులను – నిత్యాస్వరూపురాలైన నిన్ను తమ హృదయ కమలములందు నిల్పి – హోమము చేయుచు నిన్ను సంతృప్తి పరచుచూ తాము – నిరుపమాన, శాశ్వత మహాభోగ రూపమైన సుఖానుభవమును పొందుచున్నారు.

## వివరణము

భౌతికము, మానసికము – అని సుఖము సాధారణముగా రెండు విధములుగా నుండును. కేవలము దేహేంద్రియ పరితృప్తికి మాత్రమే దారితీయు సుఖము భౌతికము. ఇంద్రియార్థములతో సంబంధము లేకుండా మానసికోల్లాసమును కలిగించు ఆనందమునకు దారితీయు సుఖమును – మానసికము అందురు. ఈ రెండు విధములైన సుఖములు కాక మనస్సునకు అతీతమైన సుఖము గూడా నుండును. ఈ సుఖము ఇంద్రియ మానసిక సుఖములకన్న మిన్నగా వుండును. ఇందుకు ఉదాహరణగా నిద్రాసుఖమును చెప్పుకొనవచ్చును. శ్రీ కృష్ణుని వేణుగానమునకు గోపికలు పరవశించు స్థితిలోని

సుఖము గూడ ఇటువంటిదే ! ఇది భక్తికి పరాకాష్ఠస్థితి. శ్రీ విద్యలో గూడా ఉపాసకులు ఇటువంటి పరమ సుఖమును పొందగలరు. ఈ పరమ సుఖమునే శ్రీ విద్యలో 'మహాభోగము' అందురు. ఒక విధముగా దీనిని 'మోక్షానందము' అని కూడా చెప్పుకొనవచ్చును. ఈ మోక్షానంద సుఖమును కోరుకొను వారినే 'మహా భోగరసికులు' అని అందురు. వారు ఈ ఆనందము పొందు మార్గము ఈ శ్లోకములో వివరింపబడినది.

ఈ శ్లోక వివరణ విషయములో కొన్ని అభిప్రాయ భేదములు కలవు. లక్ష్మీధర పండితుల అభిప్రాయము ఒక విధముగాను, కైవల్యాశ్రమి పండితుల అభిప్రాయము మరియొక విధముగాను కలదు. ఇంతకు ముందు 32వ శ్లోకమునకు చెప్పిన వివరణలో కూడా కైవల్య శర్మ పండితుల అభిప్రాయము వేరుగా చెప్పబడినది గదా!

కైవల్యాశ్రమి పండితుల వివరణ ప్రకారము 32వ శ్లోకము నందలి మొదటి కూటమునకు సంబంధించిన – శివః, శక్తిః, కామః, క్షితిః – అను పదములకు వరుసగా 'హ', 'స', 'క', 'ల', అను బీజాక్షరములను చెప్పుకొనవలెను. మిగిలిన బీజాక్షరములలో మార్పు ఉండదు. ఈ మార్పు వలన అమ్మవారి మంత్రము – హ, స, క, ల, హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం – అగును. కైవల్యాశ్రమి పండితులు దీనినే పంచదశాక్షరీ మంత్రముగా చెప్పిరి. ఈ మంత్రము 'హ' అను బీజాక్షరముతో ప్రారంభమైనదగుటచే దీనిని 'హాదివిద్య' గా కూడా చెప్పుదురు. 'క ఏ ఈ ల హ్రీం; హ స క హ ల హ్రీం; సకల హ్రీం' మంత్రము 'క' అను బీజాక్షరముతో ప్రారంభింపబడుటచే దీనిని 'కాదివిద్య' గా చెప్పుదురు. కాదివిద్య ఆధ్యాత్మికోన్నతికి ఫలమునిచ్చు మంత్రముగాను, హాదివిద్యను భౌతిక జీవితోన్నతికి సంబంధించిన ఫలము నిచ్చు మంత్రముగాను చెప్పుదురు. కాని, ఈ వాదము సర్వజన సమ్మతము కాదు.

లొల్ల లక్ష్మీ ధర పండితుల అభిప్రాయ ప్రకారము – 32వ శ్లోకము నందలి మూడు కూటముల బీజాక్షరములు అయిన ' క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం స క ల హ్రీం' లతో పాటు చివరకు 'శ్రీం' ను కూడా చేర్చినచో మొత్తము 16

బీజాక్షరములు 16 కళలను, 16 నిత్యలను సూచించును. చిట్టచివరి 16వ బీజాక్షరమైన 'శ్రీం' – 16వ కళకు సంబంధించిన 16వ నిత్యను సూచించును. ఈ 16వ కళనే – 'సాదాఖ్య' కళ అందురు. దీనినే – 'చిత్కళ', 'మహానిత్య', 'ఆద్యకళ', 'లలిత', 'శ్రీకళ', 'నైసర్గికకళ', 'సంవిత్కళ' అని కూడా అందురు. ఇది తరుగు పెరుగుదలు లేని పరిపూర్ణ కళను సూచించును.

ప్రస్తుత 33వ శ్లోకమునకు చెందిన మొదటి పాదమునందలి 'స్మర, యోని, లక్ష్మీ – పదములు వరుసగా – 'క్లీం', హ్రీం, శ్రీం బీజాక్షరములను సూచించునవిగా అర్థము చెప్పుకొని, ఈ మూడింటిని 'క, ఏ, ఈ, హ్రీం' 'హసకహలహ్రీం' 'సకలహ్రీం' అను కూటములకు ముందు చేర్చి కలిపి అష్టదశాక్షరీ మంత్రముగా చెప్పుకొనవలెనని లక్ష్మీధర పండితుల అభిప్రాయము. ఈ మంత్రమును ఉచ్ఛరించుచూ, పైనున్న సహస్రారము నందలి బిందువు నుండి దేవిని చిత్తాకాశములోనికి అవతరణము చెందించి – అదే సమయములో క్రింద నున్న స్వాధిష్ఠానము నుండి అగ్నిని కూడా ఈ చిత్తాకాశము వద్దకు చేర్చి, కామధేను ఘృత ధారలతో హవిస్సులను సమర్పించవలెను. ఆ విధముగా అర్చించు అమ్మవారి భక్తునికి ఇహపరమైన భోగ మోక్షములు రెండును సంప్రాప్తమగునని లక్ష్మీధర పండితుల అభిప్రాయము.

32వ శ్లోకములోని మొదటి పాదములోని మొదటి మూడు 'హ, స, క' లకు బదులుగా 'క, ఏ, ఈ' – లను ప్రతిక్షేపించినచో ఏర్పడు 'క ఏ ఈ ల హ్రీం – హ స క హ ల హ్రీం', సకల హ్రీం' – అను మంత్రమును జపించుచు ఈ శ్లోక తాత్పర్యములో చెప్పిన విధముగా చేసినను ఇహ పర భోగమోక్షములు సంప్రాప్తమగునని కైవల్యాశ్రమి పండితుల అభిప్రాయము. ఈ అభిప్రాయముతోనే చాలా మంది వ్యాఖ్యాన కర్తలు ఏకీభవించిరి. (తెలుగు అనువాద పద్యము దీనిప్రకారమే తెలుపబడినది.)

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 34

శ్లో. శరీరం త్వం శంభో శ్శశిమిహిర వక్షోరుహయుగం
తవాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘమ్
అతశ్శేషశ్శేషీ త్యయ ముభయ సాధారణ తయా
స్థితః సంబంధో వాం సమరస పరానంద పరయోః.

## అనువాద పద్యము

చం. *రవిశశులే స్తనమ్ములుగ రంజిలు శంభుశరీరమీవు, శాం*
*భవి! భవదీయమైన తనుభాగ్యముగొల్తు నవాత్మగా మతిన్*
*'భవునకు - నీకె' చెల్లుగద 'భైరవ - భైరవి', 'శేష-శేషి' భా*
*వ విధమునందు 'సృష్టి-లయ' వైభవమందున నెంచి చూడగన్.*

## టీక

(హే) భగవతి = (ఓ) భగవతీ ! శంభోః = శంభునకు, త్వం = నీవు, శశిమిహిర = చంద్రుడు, సూర్యుడు, వక్షోరుహయుగం = స్తనముల జంటగా గలిగిన, శరీరం = దేహముగల దానివి, తవ = నీయొక్క, ఆత్మానం = దేహమును, అనఘమ్ = దోషము లేని, నవాత్మానం = నవవ్యూహాత్మకుడగు శివానంద భైరవునిగా, మన్యే = తలంచుచున్నాను. అతః = ఈ కారణమువలన, శేషః = గుణముగా నుండునది, అనగా - ఆధేయమై వుండు అప్రధానము, శేషీ = ఆధారమై వుండు ప్రధానము, ఇతి = అను, అయం = ఈ, సంబంధః = సంబంధము, సమరస = సామ్య సామరస్యములతో గూడిన, పరానంద = ఆనందరూపుడైన ఆనంద భైరవుడు, పరయోః = ఆనంద రూపమైన భైరవీరూపులుగా, వాం = మీ, ఉభయ = ఇరువురకు, సాధారణ తయా = సామ్యము సామాన్యమై, స్థితః = ఉండుట అన్నది ధ్రువమై చెల్లుతున్నది.

## తాత్పర్యము

ఓ భగవతీ ! ఆనంద భైరవునకు - చంద్రుడు, సూర్యుడు స్తనములుగా గల దేహముగా నీవు అగుచున్నావు. దోషరహితుడైన ఆ ఆనంద భైరవుని నీ యొక్క దేహముగా తలంచుచున్నాను. ఒకరి కొకరు దేహములై చెల్లు మీ ఇరువురి సమన్వయ

స్వరూపములకు శేషశేషి సంబంధ సామరస్యము, అనగా – 'ఆ ధేయ – ఆధార' లేదా 'అప్రధాన – ప్రధాన' సంబంధ సామరస్యము చెల్లుచు, ఆనంద భైరవీ ఆనంద భైరవులుగా ధ్రువీకరింపబడుచున్నారు.

## వివరణము

ఈ శ్లోకములో తెలుసుకొనవలసిన కొన్ని సాంకేతిక విషయములు కలవు.

'భ' అను అక్షరము వెలుగును లేదా వ్యక్తమును, 'గ' అను అక్షరము గమనమును సూచించును. ఏ ఇరువురి సంబంధమున సృష్టి ప్రళయములుగా విశ్వము 'వ్యక్తము – అవ్యక్తము' లుగా తారుమారు అగుచు, నిరంతరము అనంత కాలగమనము కలిగియున్నదో – ఆ ఇరువురుని 'భగవతీ – భగవంతులు' గా నిర్దేశించవచ్చును. ఈ ఇరువురినీ 'ప్రకృతీ – పురుషులు' అని కూడా అనవచ్చును.

**''ప్రకృతిం పురుషం చైవ విద్ధి అనాది ఉభౌ అపి''.**

''ఈ ప్రకృతీ పురుషులు ఆద్యంతములు లేనివారు. ఇద్దరూ ఎల్లప్పుడూ కలిసియే ఉందురు'' అని తెలిసి కొనుము – అని పై గీతా వాక్యమునకు అర్థము.

ఈ ప్రకృతీ పురుషుల సంబంధము చాలా విచిత్రమైనది. ఈ విషయము సౌందర్యలహరిలోని ఈ శ్లోకము ద్వారా చెప్పబడుచున్నది. వీరి పేర్లు 'ఆనందభైరవి – ఆనందభైరవులు' గా ఈ శ్లోకమునందు ప్రతిపాదింపబడినది. వీటి సంబంధము 'శేష – శేషి సంబంధము' అనగా 'అప్రధాన – ప్రధాన' లేదా – 'ఆధేయ – ఆధారము' లుగా చెప్పబడినది. అన్ని విషయముల లోను వీరిరువురు ఒకరిపై ఒకరు ఆధారపడిన వారే అగుట వలన ఒకరి శరీరము ఒకరుగా చెప్పబడినది.

ఆనందభైరవునికి సూర్య చంద్రులు స్తనములుగా గల శరీరముగా దేవి ఇందు చెప్పబడినది. దేవి యొక్క స్తనములను, నేత్రములను, తాటంకములను గూడ సూర్య, చంద్రులతో పోల్చుట వైదిక సంప్రదాయమే అని ఈక్రింది శ్లోకము తెలుపును.

**''సూర్య చంద్ర స్తనౌ దేవ్యాః తావేవ నయనే స్మృతౌ**
**ఉభౌ తాటంక యుగళ మిత్యేషా వైదికీ శ్రుతిః''**

స్తనములు పోషక ధర్మమునకు చిహ్నములు. పగలు సూర్యరశ్మి వలన, రాత్రి చంద్రుని వెన్నెల వలన సమస్త జీవులకు ఆహారము వృక్షముల ద్వారా, ఓషధుల

ద్వారా అందివ్వబడుచున్నది. అందువలన సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారి స్తనములను సూర్య, చంద్రులతో పోల్చుదురు.

అమ్మవారు విశ్వ సామ్రాజ్యమునకు మహారాజ్ఞి (శ్రీ మహారాజ్ఞి). ఈ విశ్వము నందు ఎక్కడ, ఎప్పుడు, ఎవరి వలన ఏ యే పుణ్య, అపుణ్య కార్యములు నిర్వహింపబడుచున్నవో ఎప్పటికప్పుడు ఆలస్యము లేకుండా తెలుసుకుని, ఆయా కార్యములకు తగిన రీతిని చర్య తీసుకొనుటకు – పగలు సూర్యుని, రాత్రి చంద్రుని ఆయా కర్మలకు సాక్షులుగా అమ్మవారు ఏర్పాటు చేసుకున్నది. 'ఆ సూర్యచంద్రులిద్దరూ సమాచారమును వెనువెంటనే ఆలస్యము లేకుండా తనకు నివేదించుటలో – విన్నది విన్నట్లుగా తెలుపుటకు తన రెండు చెవులు గాను, చూసినది చూసినట్లుగా తెలుపుటకు తన రెండు కన్నులు గాను – ఆ సూర్య చంద్రులను ఏర్పాటు చేసుకున్నది' అని అంతరార్థము. ఈ సూర్యచంద్రులిరువురూ ఇడా, పింగళానాడీ సూచితములని గూఢార్థము.

ఒక సన్నివేశముగాని, సంఘటనము గాని భౌతికముగా జరిగిన తరువాత మాత్రమే మనకు తెలియును. కాని, అది జరుగుటకు పూర్వమే దానికి సంబంధించిన జ్ఞానము తెలియు లక్షణము గల వారిని 'భైరవు' లందురు. కాలజ్ఞానము తెలియు వీరిని 'కాలభైరవుల' ని గూడా వ్యవహరింతురు. కాశీలో కాలభైరవుడు ఇట్టి వారలను సూచించు అధిదేవత. అమ్మవారి సహస్ర నామములో 'కాలభైరవ పూజితా', 'మార్తాండ భైరవారాధ్యా' – మొదలగు నామములు కూడా కలవు. వ్యక్తావ్యక్త లక్షణము గల ఈ విశ్వమునకు నేపథ్యములో గల పూర్తి జ్ఞానము తెలిసిన వారైన జగజ్జననీ జనకులను గూడా 'భైరవీ – భైరవులు' గా సంకేతించుదురు. విశ్వసృష్టి క్రీడాత్మకమే అగుట వలన అదివారికి ఆనంద కారకము అగును. అందువలన వారిరువురిని 'ఆనంద భైరవీ – ఆనంద భైరవు' లనుట సమంజసమే గదా !

ఆనంద భైరవునే 'మహాభైరవు' డు అని కూడా వ్యవహరింతురు. ఈ మహా భైరవుడు నవాత్మకుడగుట వలన 'నవాత్మకు' డను పేరుతో కూడా పిల్చుదురు. నవవ్యూహములు కలవాడగుట వలన నవాత్మకుడనిరి.

కాలవ్యూహము, కులవ్యూహము, నామవ్యూహము, జ్ఞానవ్యూహము, చిత్తవ్యూహము, నాద వ్యూహము, బిందు వ్యూహము, కలా వ్యూహము, జీవ వ్యూహము – అను తొమ్మిదింటిని 'నవవ్యూహములు' అందురు.

1. కాలవ్యూహము – కాలమునకు సంబంధించినది.

2. కుల వ్యూహము – వర్ణములకు ( రంగులకు) సంబంధించినది.

3. నామ వ్యూహము – చరాచర జీవుల నామధేయములకు సంబంధించినది.

4. జ్ఞాన వ్యూహము – మనస్సు, బుద్ధి మొదలగు వాని ద్వారా పొందు జ్ఞానమునకు సంబంధించినది.

5. చిత్త వ్యూహము – మనస్సు, మహత్తు, బుద్ధి, చిత్తము, అహంకారములకు సంబంధించినది.

6. నాదవ్యూహము – నాదము, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్థితులలోని వాక్కుకు సంబంధించినది.

7. బిందు వ్యూహము – ఆధార, స్వాధిష్ఠానాది చక్రములకు సంబంధించినది.

8. కలావ్యూహము – పంచాశత్ (50) అక్షరములకు సంబంధించినది.

9. జీవ వ్యూహము – జీవాత్మ సముదాయమునకు సంబంధించినది.

పైన తెల్పిన 'శక్తి – శివు'లైన ఆనందభైరవీ, ఆనంద భైరవులు ఈ శ్లోకములో 'పరా', 'పరానందుడు' అను పేర్లతో కూడా తెలుపబడిరి.

సృష్టి (Evolution) యందు 'పర' కు ప్రాధాన్యము (Principal Factor) 'పరానందు' నకు అప్రధానత్వము (Subsidiary or Accessory); ప్రళయము (Distation) నందు 'పరానందు' నకు ప్రాధాన్యము, 'పర' కు అప్రధానత్వము చెల్లును. ఈ ఇద్దరి తాదాత్మ్యము నందు నవాత్మకత్వము ఇద్దరికీ సమానముగా చెల్లును.

సృష్టి విచ్చు కొనునపుడు శక్తికి లేదా ఆనందభైరవికి ప్రాధాన్యము, ఆనంద భైరవునకు అప్రధానత్వము వుండును. ఇది చెట్టుకి దాని ఫలములోని బీజము వంటి స్థితి. ఈ స్థితిలో చెట్టుకే ప్రాధాన్యము కదా! ఇక ప్రళయము నందు శివునకు లేదా ఆనంద భైరవునకు ప్రాధాన్యము. ఆనంద భైరవికి అప్రధానత్వము చెల్లును. ఇది వృక్షసారము విత్తనములోనికి లీనమైన స్థితి వంటిది. ఈ స్థితిలో ఆ విత్తనములో అంకుర ప్రాయముగా చెట్టు నిక్షిప్తమై వుండును గదా ! అపుడు విత్తనమునకే

ప్రాధాన్యము గాని చెట్టుకు కాదు గదా! ప్రధానత్వము చెల్లునపుడు 'శేషిత్వము' ను, అప్రధానత్వము చెల్లునపుడు 'శేషత్వము' ను సమన్వయించవలెను. అనగా - ఇద్దరికీ సమయ సందర్భములను బట్టి రెండు లక్షణములు చెల్లుచుండును. ఇందువలన ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అను తరతమ భేదములు, ముందు వెనుకలు వారికి ఉండవని ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 35

**శ్లో. మనస్త్వం వ్యోమత్వం మరుదసి మరుత్సారథి రసి**
**త్వ మాపస్త్వం భూమి స్త్వయి పరిణతాయాం నహి పరం**
**త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా**
**చిదానందాకారం శివయువతి భావేన బిభృషే.**

## అనువాద పద్యము

***ఉ. నీవె మనస్సు, నీవె దివి, నీవెసమీరము నగ్నివారులు***
***న్నీవెగదమ్మ, యన్నియును నీవగ నేమి మిగుల్ తుదిన్ మఱి***
***న్నీవె జగత్స్వరూపవయి నిన్నఖిలమ్ముగ మార్చునిచ్చతో***
***నీవు ధరింతువట్టి యతినిర్మల భైరవరూపు శాంభవీ.***

## టీక

(హే) శివయువతీ ! = ఓ శివుని ప్రియురాలా, మనః = ఆజ్ఞాచక్రము నందలి మనస్తత్వమును, త్వం + ఏవ + అసి = నీవే అగుచున్నావు, వ్యోమ = విశుద్ధి చక్రమునందలి ఆకాశ తత్త్వమును, మరుత్ = అనాహత చక్రమందలి వాయుతత్త్వమును, మరుత్సారథిః = స్వాధిష్ఠాన చక్రము నందలి వాయు సఖుడైన అగ్ని తత్త్వమును, ఆపః = మణిపూర చక్రమందలి జలతత్త్వమును, భూమిః = మూలధార చక్రము నందలి భూతత్త్వమున, త్వంఏవఅసి = గూడా నీవే అగుచున్నావు, త్వం = నీవు, పరిణతాయాం = ఈ రూపములలో పరిణమించిన, అనగా - పూర్తిగా తదాత్మ్యమును పొందిని దానవు కాగా, నహిపరం = నీ కంటె ఇతరమగు నది కొంచెము కూడా లేదు. త్వంఏవ = నీవే, స్వ + ఆత్మానం =

స్వస్వరూపమును, విశ్వవపుషా = ప్రపంచ రూపముతో, పరిణమయితుం = పరిణమింప చేయుటకు, చిత్ + ఆనంద + ఆకారం = చిచ్ఛక్తియుతుడైన ఆ ఆనంద భైరవుని, లేదా – శివతత్త్వమును, శివయువతిభావేన = శివయువతి భావముచేత, బిభృషే = ధరించుచున్నావు.

## తాత్పర్యము

ఓ శివుని ప్రియురాలైన జగజ్జననీ ! ఆజ్ఞా చక్రమందలి మనస్తత్త్వము, విశుద్ధియందలి ఆకాశతత్త్వము, అనాహత మందలి వాయుతత్త్వము, స్వాధిష్ఠాన మందలి అగ్నితత్త్వము, మణిపూరమందలి జలతత్త్వము, మూలాధార మందలి భూతత్త్వము గూడా నీవే అయి వున్నావు. ఈ విధముగా పంచభూతములు నీవే అయినపుడు ఇంక ఈ విశ్వమందు నీ కంటె ఇతరమైన పదార్థము ఏదియు కొంచెము కూడా వుండదు, ఉండలేదు. నీవే నీ స్వరూపమును జగదాకారముగ పరిణమింప చేయుటకు చిచ్ఛక్తి యుతుడైన ఆనందభైరవుని స్వరూపమును లేదా శివతత్త్వమును నీ చిత్తముతో ధరించుచున్నావు.

## వివరణము

పంచభూతములలోను, మనస్సులోను అంతర్లీనముగా నుండు అమ్మవరా తత్త్వమే విరూపణము (Transformation or Diformation) చెందుచు – ఆజ్ఞ, విశుద్ధి, అనాహత, స్వాధిష్ఠాన, మణిపూర, మూలాధారాది షట్చక్రములు వరుసగా నియంత్రణ చేయు మనస్సు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి తత్త్వములుగా పరిణామము చెందుచున్నదని ఈ శ్లోకములో చెప్పబడినది. దీనిన బట్టి పంచభూతములతో నిండి వుండు ఈ విశ్వములో అమ్మవారి తత్త్వమే వివిధ స్థితులలో వివిధ తత్త్వములుగా మారుచున్నదని తెలియుచున్నది. కావున, ఈ విశ్వములో నిండి వున్నదంతయు అమ్మవారే కాని ఇతర ద్రవ్యము కించిత్తైనను లేదని తెలియుచున్నది.

శుక్రము కారణముగానే రసరక్తమాంసాది సప్తధాతువులతో ఏర్పడు పిండము ఏర్పడునట్లు, క్షీర సారము కారణముగానే పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు హవ్య ద్రవ్యములు ఏర్పడునట్లు, మట్టి కారణముగానే వివిధ ఆకృతులు

పరిమాణములు గల పాత్రలు ఏర్పడునట్లు – విశ్వములో అమ్మవారే షట్చక్రములు నియంత్రణ చేయు మనస్సు మరియు పంచభూతములుగా పరిణామము చెందునని అర్థము చేసుకొనవలెను.

ప్రళయము నుండి సృష్టి ఉన్ముఖమగుటకు ముందు శివశక్తులు కలిసి తాదాత్మ్య స్థితిలో ఒకటిగానే వుందురు. కాని, సృష్టి ప్రక్రియ ప్రారంభములో శివుని నుండి శక్తి వేరగుట ప్రారంభించును. ఈ మార్పు స్థితిని శ్రీవిద్యలో – 'ప్రకాశ' బిందువు (శుద్ధప్రజ్ఞ) నుండి 'విమర్శ' బిందువు ఏర్పడుట అనియు, ఈ మార్పిడి ప్రక్రియ – 'నాద', 'బిందు', 'కళా' ప్రేరణలతో జరుగుననియు అందురు. ప్రకాశములోని అహంకార తత్త్వమును రగుల్కొల్పునది ఈ 'విమర్శ' యొక్క పరావర్తిత లక్షణమే! ఇట్టి పరావర్తిత లక్షణముగల విమర్శ శక్తిని 'శివయువతి' గా ఈ శ్లోకములో చెప్పిరి. ఈ విమర్శశక్తినే ''క్వణత్ కాంచీదామా...'' అను 7వ శ్లోకమందలి నాల్గవ పాదములో 'పురమథితుః ఆహోపురుషికా' (Manisafestation of ego) అని చెప్పబడినది. సృష్టికి దోహదకారియగు ఈ శక్తితత్త్వమునే 'మహా త్రిపురసుందరి' గాను, ప్రళయమునకు దోహదపడు శక్తి తత్త్వమును 'మహాకాళీ' గాను సంకేతించుదురు.

ఈ శ్లోకములో తెలియపరచిన విషయముననుసరించి ఉత్తర కౌళుల, పూర్వ కౌళులకు సంబంధించిన ఆరాధనలలోని తేడాలు లక్ష్మీధర పండితులు తెలుపుటకు ప్రయత్నించిరి. కాని, ఆ వివరములు పలు అభ్యంతరములకు లోనగుటచే అట్టి విమర్శలు, ప్రతి విమర్శలు అంత ఉపయోగకరము కాదను భావముతో ఇక్కడ తెలుపుట లేదు.



## సంస్కృత శ్లోకము - 36

**శ్లో. తవాజ్ఞా చక్రస్థం తపనశశికోటి ద్యుతిధరం**
**పరం శంభుం వందే పరిమిళిత పార్శ్వం పరచితా**
**యమారాధ్య న్భక్త్యా రవిశశి శుచీనా మవిషయే**
**నిరాలోకేఽలోకే నివసతిహి భాలోకభువనే.**

## అనువాద పద్యము

మ. *భవదాజ్ఞన్ రవిచంద్రకోటి రుచులన్ వర్ధిల్లు వానిన్, సదా*
*భవదీయంబగు చిత్తనూ విభవమున్ వామార్ధమౌవాని, నా*
*రవి చంద్రాగ్నులు సైతమున్ కనుటకున్ రానట్టి భాలోకమౌ*
*ధ్రువ మందున్ తన భక్తులన్నిలుపు భద్రున్ శంభునే గొల్చెదన్.*

## టీక

(ఓ జగజ్జననీ!) తవ = నీ సంబంధమైన, ఆజ్ఞా చక్రస్థ = ఆజ్ఞాచక్రము నందున్న వాడును, తపన శశికోటి ద్యుతిధరం = కోటి సూర్య చంద్రుల కాంతి ధరించినవాడును, పరచితా = 'పర' మగు చిచ్ఛక్తి చేత; పరిమిళిత పార్శ్వం = కలసిన (ఎడమ) ఇరు పార్శ్వములు కలవాడును, పరం = 'పరు' డను పేరుగల, శంభుం = శంభుని గూర్చి), వందే = నమస్కరించుచున్నాను. యం = అట్టి ఏ పరమశివుని, భక్త్యా = భజించుట యందు ప్రీతితో, ఆరాధ్యన్ = పూజించుచు ప్రసన్నునిగా చేసుకొను సాధకుడు, రవిశశి శుచీనాం = రవిచంద్రాగ్నులకు, అవిషయే = అగోచరమై, అనగా – వెలిగింప వీలుకానటువంటిదియు, నిరాలోకే = బాహ్యదృష్టికి అందరానివంటిదియు, అలోకే = జనము లేని ఏకాంత మైనుటవంటిదియునైన, భూలోకభువనే = వెలుగుల లోకమునందు (సంపూర్ణముగా వెన్నెల వెలుగులతో నిండిన లోకమందు, అనగా – సహస్రారకమలము నందు) నివసతిహి = వసించుననుట ప్రసద్ధిమైన విషయము, అనగా – నీ సాయుజ్యమును పొందును అని అర్థము.

## తాత్పర్యము

ఓ జగజ్జననీ! నీకు సంబంధించినదైన ఆజ్ఞాచక్రము నందు – కొన్ని కోట్ల సూర్య, చంద్రుల కాంతిని ధరించిన వాడును, 'పర' యను పేరు పొందిన చిచ్ఛక్తి చేత కలిసిన ఇరు పార్శ్వములు కలవాడును అగు పరమశివుని గూర్చి నమస్కరించు చున్నాను. ఏ సాధకుడు భజనతత్పరుడై ఇట్టి పరమ శివుని ప్రసన్నునిగా చేసుకొనునో అతడు రవిచంద్రాగ్నులకు సైతము వెలిగింప వీలుకానటువంటిదియు, బాహ్యదృష్టికి అనగా – చర్మచక్షువులకు గోచరింపనిదియు, ఏకాంత ప్రదేశమైన జ్యోత్స్నామయ

లోకమందు (నిండు వెన్నెలలోకమందు, అనగా - సహస్రార కమలమందు) నివసించును. అనగా - నీ సాయుజ్యమును పొందును.

## వివరణము

ఈ శ్లోకము నుండి 41వ శ్లోకము వరకు గల 6 శ్లోకములలో సృష్టి క్రమమును సూచించు మనస్సు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి తత్త్వములకు సంబంధించిన ఆజ్ఞ, విశుద్ధ, అనాహతము, స్వాధిష్ఠానము, మణిపూరము, మూలాధార చక్రముల వరుసలో ఆయా చక్రముల వద్ద అమ్మవారిని ఏ విధముగా ధ్యానము చేయవలెనో తెలుపబడినది. ధ్యానము స్థూలము నుండి సూక్ష్మమునకు జరుగుపద్ధతిలో నుండవలెనని ఈ వరుసను మూలాధారము నుండి ఆజ్ఞాచక్రము వరకుగా మార్చి వ్రాసిన వారు గూడా కొందరు గలరు. శ్రీ ఆదిశంకరులు అవలంబించిన విధానమే ఇక్కడ అనుసరింపబడుచున్నది గాని వేరు మార్గములు కాదు. స్వాధిష్ఠాన చక్రము జలతత్త్వముగాను, మణిపూరము అగ్నితత్త్వముగాను గూడా కొందరు మార్చి వ్రాసిరి. ఈ విషయములో కూడా ఆదిశంకరులు తెలిపిన పద్ధతినే (మణిపూరము, జలతత్త్వము, స్వాధిష్ఠానము - అగ్నితత్త్వము) ప్రస్తుత వివరణలో అనుసరించుట జరిగినది. ఈ విషయము 9వ శ్లోకమైన 'మహీంమూలాధారే ... విహరసి' - అన్న శ్లోక వివరణలో గూడా తెలుపబడినది.

ఆజ్ఞా చక్రము భ్రూమధ్యము నందు ఉండును. ఈ చక్రము మనస్తత్త్వమును నియంత్రించును. మానవ శరీరమందు మానవ ప్రజ్ఞకు లోబడి వుండు ఆ చక్రములలో ఈ చక్రము విశిష్టమైనది. ఇది ఆరు చక్రములకు ఒక విధముగా చెప్పుకొనవలెనన్నచో Main Switch వంటిది. ఇచ్చట శివశక్తులు ఒకరితో ఒకరు కలసి అర్ధనారీశ్వరులుగా ఉందురు. ఈ కలయిక, ఈ సమన్వయ స్వరూపమే సమస్త జ్ఞానమునకు మూలకారణము.

ఆజ్ఞా చక్రము వద్ద ఈ అర్ధనారీశ్వరులు కోట్ల సూర్యచంద్రుల కాంతులతో విరాజిల్లు చుందురు. శివుని ఎడమ పార్శ్వమందు శక్తి వుండును. ఈ శక్తి చిచ్ఛక్తి అగుట వలననే ఈ ఆదిదంపతి సమస్త జ్ఞానమునకు మూలమగుచున్నారు. ఈ చిచ్ఛక్తి యుతుడైన పరమశివుని ధ్యానము చేసి, ప్రసన్నుని చేసుకున్న సాధకుడు-

సూర్యచంద్రాగ్నులు కూడా వెలిగించలేని, వారి కాంతులు ప్రసరించలేని ఘనీభవించిన వెన్నెల లోకములో నివసించగలడు. ('క్షితౌషట్పంచాశత్' అను 14వ శ్లోకములో అగ్ని సంబంధమైన 108, సూర్యసంబంధమైన 116, చంద్రసంబంధమైన 136 కిరణములకు మూలమైన పైన వున్న అమ్మవారి చరణ యుగళ మయూఖ కాంతి వుండునని లోగడే చెప్పబడినది). ఈ ఘనీభవించిన వెన్నెలలోకవమునే 'సుధాసింధువు' అందురు. (సుధాసింధోర్మధ్యే - అన్న శ్లోకమును ఇక్కడ గుర్తుచేసుకొనవలెను) ఇది అమృత లోకము. సహస్ర దళ పద్మ మధ్యస్థానమే ఈ సుధాసింధుస్థానము. సహస్రార చక్రమందలి కేంద్రము, లేదా - శ్రీ చక్ర మందలి బిందు స్థానమే ఇది. ఇది అమ్మవారి స్థానము. ('బైందవాసనా' - అని అమ్మవారికి ఒక నామము కలదు). ఆజ్ఞాచక్రము వద్ద కోటి సూర్య చంద్ర ప్రకాశమానమైన అర్ధనారీశ్వరులను ధ్యానము చేసినచో అమ్మవారితో సాయుజ్య ఫలమును సాధకుడు పొందునను సూచన ఈ శ్లోక సారాంశము.

**భ్రూమధ్యము - జ్ఞాన స్థానము**

భ్రూమధ్య స్థానము తూర్పు దిశను సూచించును. దీనిని జ్ఞానదిశ (Wisdom) అని గూడా అందురు. ఈ దిక్కున ఉదయించిన జ్ఞాన సూర్యుడే అజ్ఞాన తిమిరమును పటాపంచలు చేసి సుజ్ఞాన ప్రకాశమును వికసింప చేయును. ఎవరైనను ఒక విషయము అర్థము కానపుడు గాని, గుర్తుకు రానపుడు గాని, చర్మ చక్షువులను మూసుకుని దృష్టిని భ్రూమధ్యములో కేంద్రీకరించుట ఇందులకే! ఎంత చెప్పినను అర్థము కానపుడు తూర్పు తిరిగి దణ్ణము పెట్టమనుట మనము వినుచుందుము. అప్పుడు ఆ తూర్పున ఉన్న జ్ఞానదేవత కరుణించి అర్థమగునట్లు, గుర్తువచ్చునట్లు చేయునని వారి అభిలాషకావచ్చును. ఆజ్ఞాచక్రము వద్ద నున్న ఈ అర్ధనారీశ్వర దంపతియే ఈజ్ఞాన దేవత అని సమన్వయము చేసుకొనవలెను.

ఈ ఆజ్ఞాచక్రము వద్ద 'ధ్యానము చేయవలసిన అధిష్ఠాన దైవతముల పేర్లు 'పరశంభునాథుడు - చిత్పరాంబ'.

(ఈ శ్లోకవము 'తవాజ్ఞా చక్రస్థం' అని ప్రారంభింపబడినది. ఆజ్ఞాచక్రమనుట తోడనే ద్విదళ పద్మము అని చెప్పుట సరిగాదని 'నీ ఆజ్ఞా చక్రము వద్ద' అని చెప్పుటచే శ్రీ చక్రాంతర్గత శివచక్ర చతుష్టయగా అర్థము చేసుకొనవలెనని లక్ష్మీధర పండితుల అభిప్రాయము).

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 37

శ్లో. విశుద్ధౌ తే శుద్ధ స్ఫటిక విశదం వ్యోమజనకం
శివం సేవే దేవీమపి శివసమాన వ్యవసితామ్
యయోః కాంత్యా యాంత్యా శ్శశికిరణ సారూప్య సరణేః
విధూతాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతీ.

## అనువాద పద్యము

ఉ. *అమ్మ ! విశుద్ధి చక్రమున నంబర హేతువు శంభునిన్, సమా*
*నమ్మగు నిన్ను గల్పి భజనమ్ము నొనర్తు, భవచ్ఛశిద్యుతుల్*
*క్రమ్మగ నీ జగంబు మయికమ్మను చీకటి వీడగా చకో*
*రమ్ము సుఖించు రీతి గడురంజిలు చల్లని వెల్గులందునన్.*

## టీక

(ఓ జగజ్జననీ!) తే = నీ యొక్క, విశుద్ధౌ = విశుద్ధి చక్రము నందు, శుద్ధస్ఫటిక విశదం = దోషము లేని స్ఫటిక స్వచ్ఛతతో మిక్కిలి నిర్మలమైన వాడును, వ్యోమజనకం = ఆకాశతత్త్వమును ఉత్పాదించు వాడును, శివం = శివునిని, శివసమానవ్యవసితాం = శివునితో సమానమైన సామర్థ్యము గల, దేవీం అపి = భవగతి ఐన నిన్నుగూడ, సేవే = ఉపాసించెదను, యయోః = ఏ శివాశివుల నుండి, యాంత్యా = వచ్చుచున్నదైన, శశికిరణ సారూప్య సరణేః = చంద్రకిరణ మార్గ సదృశమైన, కాంత్యాః = కాంతివలన, జగతీ = ముజ్జగములు, విధూత + అంతః + ధ్వాంతా = వదలగొట్ట బడిన అంతర అజ్ఞానము గలదై, చకోరీ + ఇవ = ఆడ చకోర పక్షివలె, విలసతి = ప్రకాశించుచున్నదో - (అనగా - అట్టి శివాశివులను సేవించెదను అని భావము.)

## తాత్పర్యము

ఓ జగజ్జననీ ! నీ విశుద్ధి చక్రము నందు దోషరహితమైన స్ఫటిక స్వచ్ఛతతో మిక్కిలి నిర్మలమై వుండు వాడును, ఆకాశోత్పత్తికి హేతువైన వాడును అగు శివునిని, అట్టి శివునితో సమానమైన దేవివైన నిన్ను గూడా ఉపాసించుచున్నాను. చంద్రకాంతులతో సాటి వచ్చు మీ ఇరువురి కాంతులు క్రమ్ముకొనుటచే ఈ సాధక లోకము అజ్ఞానము నుండి తొలగి, ఆడు చకోర పక్షివలె ఆనందించును.

## వివరణము

విశుద్ధి చక్రము వద్ద చేయు ధ్యానము ఈ శ్లోకములో చెప్పబడుచున్నది. 'విశుద్ధి' అనుపదములోనే శుద్ధత్వము ఉన్నది. అందువలన ఈ చక్రము వద్ద ఏ మాత్రమైనను మలినములు ఇతర దోషములు లేని శుద్ధ స్ఫటికము వంటి స్వచ్ఛమైన శివుని, ఆ శివునితో అన్ని విధములా సాటిగా నిలుచు దేవిని కలిపి ధ్యానించవలెనని చెప్పబడినది. పంచభూతములే శివుని ముఖములు. సృష్టి ఉన్ముఖమునకు తన నుండి పంచ భూతములలో సూక్ష్మతమైన ఆకాశమును, ఆ ఆకాశము నుండి మిగిలి భూతములను వరుస క్రమములో ఉత్పాదించి, ప్రళయ ఉన్ముఖమునకు మిగిలిన నాలుగు భూతములను ఆకాశములోకి లీనమగు నట్లు చేసి ఆ ఆకాశతత్త్వమును తనలోకి లీనము చేసుకొనును కాబట్టి పరశివుని ఆకాశతత్త్వమును ఉత్పాదించువానిగా చెప్పుట జరిగినది.

ఈ విశుద్ధి చక్రము వద్ద చెప్పిన విధముగా శివాశివులను ధ్యానము చేసిన సాధకులకు వచ్చు ఫలమును చెప్పుటకు – శివాశివుల వెలుగును చంద్రుని నిండు వెన్నెల కాంతుల తోను – సాధకులను చకోర పక్షులతోను పోల్చిరి. చంద్రుని వెన్నెలకై ఆడుచకోర పక్షి తపన చెందుచూ నిరీక్షించును. మిగిలిన వాటిని దేనినీ ఆ చకోర పక్షి గ్రోలదు. ఆ చంద్రుని వెన్నెల మాత్రమే దాని తృష్ణను, ఆసక్తిని తీర్చి సంతృప్తి పరచును. అట్లే, సాధకులు కూడా – ధ్యానములో శివాశివుల నుండి వెడలి వచ్చు వెన్నెల వెలుగుల ప్రసార ప్రాభవములచే హృదయాంతర్గత అజ్ఞాన తిమిరము పటాపంచలై – సుజ్ఞాన ప్రభనిండి సంతుష్టాంతరంగులగుదురు. అప్పుడు ఇట్టి సుజ్ఞాన ప్రభ నిండిన సాధకునకు మొత్తము విశ్వమంతయు ప్రజ్ఞాన ప్రకాశమయముగా ద్యోతకమగును. ఈ విశుద్ధి చక్రము వద్ద ధ్యానము చేయవలసిన అధిష్ఠాన దైవతముల పేర్లు – 'వ్యోమేశ్వర – వ్యోమేశ్వరి' అని కొందఱు, అర్ధనారీశ్వరులని కొందఱు చెప్పుదురు.



## సంస్కృత శ్లోకము - 38

శ్లో. సమున్మీల త్సంవి త్కమల మకరందైకరసికమ్
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరమ్
యదాలాపా దష్టా దశగుణిత విద్యాపరిణతిః
యదాదత్తే దోషా ద్గుణ మఖిల మద్భ్యః పయఇవ.

## అనువాద పద్యము

చం. అనవరతమ్ము జ్ఞాన హృదయాబ్జ మరందము గ్రోలునట్టిదై
వనమును క్షీరమున్ గుణివిభాగము జేయు సమర్థమైన దా
నిని, మరి దేనిని గొల్వ పదునెన్మిది విద్యలు గల్గు - దానినే
ననయము గొల్తు యోగిమనమందు చరించెడు హంసయుగ్మమున్.

## టీక

( ఓ జగజ్జననీ! ) సమున్మీలత్ = వికసించుచున్న, సంవిత్ కమల = జ్ఞానము అను పద్మము నందలి, మకరంద = తేనెయందు మాత్రమే, ఏకరసికం = ముఖ్యముగా ఇష్టపడునదియు, మహతాం = యోగీశ్వరుల యొక్క, మానసచరం = మనస్సులలో చరించునది, లేదా – మానస సరోవరము నందు, కిమపి = ఇట్టిదని చెప్పుటకు వీలులేని, హంసద్వంద్వం = రాజహంసల జంటను, భజే = సేవించెదను, యత్ + ఆలాపాత్ = ఏ హంస మిధునము యొక్క , (పరస్పర మధుర సంభాషణాదుల వలన) అష్టాదశగుణిత = పదునెనిమిది సంఖ్యగా చెప్పబడిన, విద్యా పరిణతిః = విద్యలయొక్క పరిణామము, యత్ = ఏ హంసల జంట, దోషాత్ = అవలక్షణముల నుండి, అఖిలం = సమస్తమైన, సద్గుణ సముదాయమును, అద్భ్యః = నీళ్ళనుండి, పయః ఇవ = పాలను వలె, ఆదత్తే = గ్రహించుచున్నదో.

## తాత్పర్యము

ఓ జగజ్జననీ ! (అనాహత) జ్ఞాన కమలము నందలి తేనెను మాత్రమే గ్రోలుట యందు ఆసక్తి కలిగినదియు, యోగీశ్వరుల మానస సరోవరములందు విహరించు నదియు, నీరమును విడిచి పాలను మాత్రమే గ్రహించుసామర్థ్యము గలదియు, దేనిని భజించినచో అష్టాదశ విద్యలు కరతలామల కమగునో అట్టి అనిర్వచనీయమైన శివశక్తు లనెడి రాజహంసల జంటను ధ్యానించి భజించుచున్నాను.

## వివరణము

ఈ శ్లోకము నందు అనాహత చక్రము వద్ద ధ్యానము చేయవలసిన శివశక్తులను గూర్చి చెప్పబడుచున్నది.

అనాహత చక్రము హృదయ ప్రాంతములోనుండును. జీవన వ్యాపారమునకు, జీవన ప్రసారమునకు, అనురాగ ప్రసారమునకు హృదయము కేంద్రము. జీవకారకుడు శక్తి కారకుడు అయిన సూర్యునికి, ఈ హృదయమే స్వస్థానము. ఈ కారణము వలననే జ్యోతిశ్శాస్త్రములో హృదయమును సూచించు సింహరాశి సూర్యునికి స్వస్థానముగా చెప్పబడినది.

**హృదయ వైశిష్ట్యము**

మనలో పాపము అంటని ప్రదేశము ఈ హృదయమే ! దీనిలోనే 'దహరాకాశము' (పంచభూతములలోని ఆకాశమునకు 'మచ్చు' అనగా – (Sample Space) ఉండును. దీనిని 'దహ్రము' అని గూడా అందురు. ఈ హృదయము వద్దనే అనాహత పద్మము వుండును. ఈ కారణము వలననే హృత్పుండరీకం (పుండరీకం అంటే 'పద్మము' అని అర్థము). శరీరములోని మధ్యస్థానముగా, ప్రధాన కేంద్రముగా నుండును. ప్రతి జీవిలోను ఈశ్వరునిగా పరమేశ్వరాంశ ఉండునది ఇక్కడే ! (ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి – గీత) మనలో శోకము వుండని ప్రదేశము, పరమాత్మ ఉండు ప్రదేశము కూడా ఇదియే ! ఇదే విషయము తైత్తిరీయములోని మహానారాయణంలో –

**దహ్రం విపాపం పరమేశ్మ భూతం**
**హృత్పుండరీకం పురమధ్యసగ్ంస్థమ్**
**తత్రాపి దహ్రం గగనం విశోకః**
**తస్మిన్ యదన్తస్తదు పాసితవ్యమ్.**

అని చెప్పబడినది. ఇటువంటి నిర్మలమైన పవిత్రమైన హృదయ పద్మమునందలి జ్ఞాన మధువును గ్రోలుట యందు మాత్రమే ఇక్కడ వున్న శివశక్తులు అను హంసద్వయము ఆసక్తి కలిగి వుండును.

సామాన్య మానవుల మనస్సులు – అభిప్రాయములు, కోరికలు, ఆవేదనలు, ఆతృతలు, ఉద్వేగములు, ఉద్రేకములు అనెడి అలలు కలిగిన సరస్సుల

వలె నుండును. కాని, యోగీశ్వరుల మనస్సులు అటువంటి అలలు లేని సరస్సులవలె వుండును. ఇట్టి నిర్మలమైన, నిశ్చలమైన మానవ సరోవరములందు మాత్రమే ఈ శివశక్తులు అను హంసద్వయము సంచరించును.

శివశక్తులనెడి ఈ రాజహంసల జంట చేయు సల్లాప సంభాషణాదులే వేద వేదాంగాది అష్టాదశ విద్యలుగా (నాలుగు వేదములు, ఆఱు వేదాంగముల, మీమాంస, న్యాయ, దర్శన, ధర్మశాస్త్ర, ఆయుర్వేద, గాంధర్వవేద, ధనుర్వేద, అర్థశాస్త్రములను కలిపి ఈ పదునెనిమది విద్యలను అష్టాదశ విద్యలందురు) రూపొందును. ఈ శివశక్తులనెడి పరమహంస ద్వంద్వము - జలముల నుండి క్షీరమును గ్రహించునట్లు దోషముల నుండి సద్గుణ సముదాయమును గ్రహించగలవు.

పైన తెలిపిన లక్షణములు గల శివశక్తులనెడి హంస ద్వంద్వమును సాధకులు ఈ అనాహత చక్రము వద్ద ధ్యానించవలెను. అనాహత చక్రము వద్ద ధ్యానము చేయవలసిన శివశక్తుల జంటను 'హంసేశ్వర – హంసేశ్వరి' అందురు.



## సంస్కృత శ్లోకము - 39

శ్లో. **తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం**
**తమీడే సంవర్తం జనని మహతీం తాంచ సమయామ్**
**యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే**
**దయార్ద్రా యా దృష్టి శ్శిశిరముపచారం రచయతి.**

## అనువాద పద్యము

ఉ. **ధ్యానము జేతునమ్మ ప్రళయాగ్నిని యాశ్రమ మంది నీ యధి**
**ష్ఠానమునన్ మహత్సమయ సాధ్విని జేర్చి నిరంతరమ్ము, క్రో**
**ధానల వీక్షణమ్మునకు నాహుతి జెందుచునుండ లోకముల్**
**ఏ నయనార్ద్ర దృష్టి చలవిచ్చుచు సేవలు జేయు దానినేన్.**

## టీక

(ఓ జగజ్జననీ!) తవ = నీ యొక్క, స్వాధిష్ఠానే = స్వాధిష్ఠాన చక్రమందలి, హుతవహం = అగ్నితత్త్వమును, అధిష్ఠాయ = అధిష్ఠించి, నిరతం = ఎల్లపుడు,

(వెలుగొందు) = తం = ఆ, సంవర్తమ్ = 'సంవర్తము' అను అగ్ని రూపములో ప్రకాశించు పరశివుని, ఈడే = స్తుతించెదను, సమయాం = సమయము అను పేరుగలదైన, మహతీం = మహిమాన్వితమైన - గొప్పదైన, తాంచ = సంవర్తాగ్ని రూపమైన నిన్ను గూడ, ఈడే = స్తుతించెదను, మహతి = మిక్కిలి గొప్పదై, క్రోధకలితే = క్రోధముతో కూడినదైన, యత్ + ఆలోకే = యదాలోకే = సంవర్తాగ్నిరూపుడైన ఏ పరమేశ్వరుని యొక్క వీక్షణము, లోకాన్ = భూలోకాది లోకములను, దహతి = దహించునది అగుచుండగా, యా = ఏ, దయార్ద్రా = కృపకలిగిన, దృష్టిః = చూపు, శిశిరం = శీతలమును, ఉపచారం = ఉపశమనమును కలిగించు సత్కారమును, రచయితి = కావించుచున్నదో.

## తాత్పర్యము

ఓ జగజ్జననీ ! నీ స్వాధిష్ఠాన చక్రమందున్న అగ్నితత్త్వమును అధిష్ఠించి నిరంతరము వెలుగొందుచు, ప్రసిద్ధుడైన 'సంవర్తాగ్ని' అను రూపముతో జ్వలించు ఆ పరమేశ్వరుని స్తుతించుచున్నాను. అట్లే మహిమాన్వితమైన, మహనీయురాలైన, 'సమయ' అను పేరు గలదియు, ఆ సంవర్తాగ్ని రూపిణియైన శక్తిని (నిన్ను) స్తుతించెదును. మహత్తరము, మహాద్భుతమునైన పరమేశ్వరుని 'సంవర్తము', అనుక్రోధాగ్ని దృష్టి భూలోకాదులను దహించగా, నీవు దయార్ద్ర దృష్టితో ఆ లోకము లన్నిటినీ శీతలోపచారములతో ఉపశమనము కలుగ జేసి సంరక్షించుచున్నావు.

## వివరణము

స్వాధిష్ఠాన చక్రము వద్ద ధ్యానము చేయవలసిన శివశక్తులను గూర్చి ఈ శ్లోకము నందు చెప్పబడుచున్నది. స్వాధిష్ఠానము అగ్నితత్త్వమును నియంత్రించును. ఈ చక్రము వద్ద 'సంవర్తాగ్ని' అను మహాగ్ని జ్వాలలను చిందించు పరమేశ్వరుని, ఆ సరసనే మహనీయురాలు 'సమయ' అను పేరుగలిగినది అగు ఆ సంవర్తాగ్ని రూపిణి యైన శక్తిని కలిపి ధ్యానించవలెను. 'సంవర్తము' అను ప్రళయకాల రుద్రాళిక నయన జ్వాలలకు భూలోకాదులన్నియు దహించుకుపోవుచుండగా – దయార్ద్రమైన

చల్లని చూపులతో జగజ్జనని ఆ లోకములకు శీతలోపచారములు కలుగునట్లుగ ఉపశమనము కలుగ చేసి, వాటిపునః సృష్టికై సంరక్షించును. ఈ విషయమునే ఆదిశంకరులు తన అర్ధనారీశ్వర స్తోత్రములో అమ్మవారి లాస్యమును, అయ్యవారి తాండవమును ఇదే విధముగా స్తుతించెను.

**'ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై**
**సమస్త సంహారక తాండవాయ' - నమశ్శివాయై చ నమశ్శివాయ.**

ఈ స్వాధిష్ఠాన చక్రము మనలో జీర్ణాశయము వద్ద వుండును. అందువలన దీనిని ఆంగ్లములో 'Spleen centre' అందురు. మనము తిను అన్ని రకముల ఆహార పదార్థములు జీర్ణాశయము అను హోమ గుండములో జఠరాగ్నికి ఆహుతి అయి, అవి అన్నియు సూక్ష్మరూపమును పొందును. నిర్మాణాత్మక చైతన్య స్వరూపిణి అయిన అమ్మవారి శక్తి వలన ఆ సూక్ష్మ రూపములలో నున్న ఆహార పదార్థములు అన్నియు రస, రక్త, మాంసాది ధాతువులుగా మారి, శరీర పోషణకై ఉపయోగపడి, మనలో పునర్జీవనము పొందును అను ప్రక్రియతో ఈ స్వాధిష్ఠాన కార్యకలపామును పోల్చుకొనవచ్చును. స్వాధిష్ఠాన చక్రము వద్ద ధ్యానము చేయబడు శివశక్తుల పేర్లు 'సమవర్తేశ్వర – సమయాంబ'.



## సంస్కృత శ్లోకము - 40

శ్లో. **తటిత్త్వంతం శక్త్యా తిమిర పరిపంథిస్ఫురణయా**
**స్ఫురన్నానా రత్నా భరణ పరిణ ద్ధేంద్ర ధనుషమ్**
**తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక శరణమ్**
**నిషే వే వర్షంతం హరమిహిర తప్తం త్రిభువనమ్.**

## అనువాద పద్యము

ఉ. *నీ మణిపూర చక్రమున, నిన్ తిమిరమ్ముకు శత్రుశక్తి సౌ*
*దామని గూడి, వర్ణమణి ధామ విభూషణ జన్యమైన, సు*
*త్రామ ధనుస్సు గల్గి ప్రమథాధిపభాస్కర తప్తలోక సు*
*శ్యామలమైన మేఘముగ ధ్యానము జేయుచు నేను గొల్చెదన్.*

## టీక

(ఓ జగజ్జననీ!) తవ = నీ యొక్క, మణిపూర = మణిపుర చక్రమే, ఏకశరణం = ముఖ్యమైన నివాసముగా గలదియు, తిమిర = (ఆ మణిపూర చక్రమున పొందిన) చీకటికి, పరిపంథి = శత్రువై; స్ఫురణయా = ప్రకాశించునట్టి, శక్త్యా = శక్తి చేత, తటిత్త్వంతం = విద్యుల్లత, అనగా - మెఱుపు గలదియు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, నానారత్న = వివిధములైన రత్నముల చేత నిర్మింపబడిన, ఆభరణ = నగలచేత, పరిణద్ధ = కూర్పబడిన, ఇంద్రధనుషం = ఇంద్రధనుస్సు గలదియు, శ్యామం = నీలి వన్నెలు గలదియు, హర మిహిర తప్తం = శివుడను సూర్యునిచే దగ్ధమైన, త్రిభువన = మూడు లోకముల గూర్చి, వర్షంతం = వర్షించునదైన, కంఅపి = ఇట్టిది అని చెప్పడానికి వీలుకాని, మేఘం = మేఘస్వరూపమున నున్న శివుని, నిషేవే = చక్కగా సేవించెదను.

## తాత్పర్యము

నీ మణిపూర చక్రమే నివాసముగా గలిగి, ఆ మణిపూర చక్రమును ఆక్రమించి యుండు చీకటికి శత్రువై ప్రకాశించునట్టి మెఱుపుశక్తిని గలిగి, వివిధ రత్నముల చేత తయారు చేయబడిన నగల చేత కూర్పబడిన ఇంద్రధనుస్సును గలిగి, నీలి వన్నెలు గలిగిన హరుడను సూర్యునిచే (సంవర్తాగ్నిచే) దగ్ధమైన మూడు లోకములకు తాపోపశమనముగా వర్షించునదియు, ఇంతటిది అని చెప్పనలవి కానిదియు అయిన - మేఘమును, మేఘ స్వరూపములో నున్న శివుని సేవించుచున్నాను.

## వివరణము

మణిపూర చక్రము వద్ద ధ్యానము చేయవలసిన శివ - శక్తుల గురించి ఈ శ్లోకములో చెప్పబడుచున్నది. మణిపూర చక్రము జలతత్త్వమును నియంత్రించును. ఈ మణిపూర చక్రము మానవ శరీరములో వాస్తవమునకు అనాహత చక్రము తరువాత వెన్నెముక వెంబడి క్రిందుగా నాభివద్ద నుండు చక్రమైనప్పటికిని పంచభూతముల అవరోహణ క్రమము ననుసరించి వాయుతత్త్వమును నియంత్రించు అనాహతము తరువాత అగ్నితత్త్వమునకు సంబంధించిన స్వాధిష్ఠానము గురించి చెప్పి తరువాత

జలతత్త్వమునకు సంబంధించిన ఈ మణిపూర చక్రము గురించి చెప్పబడుచున్నది. నాభి – మానవ శరీరమునకు కేంద్రము, లేదా – గరిమనాభి (Centre of Gravity) వంటిది. జ్యోతిశ్శాస్త్రములో ఇది తులారాశిచే సూచింపబడును. నాభి – మానవ శరీరమును – పై భాగము, క్రింద భాగములుగా – రెండు సమభాగములుగా చేయును. (అందుచేతనే నాభి తులారాశిచే సూచితము). ఇది భూమికి భూమధ్యరేఖ వంటిది. ఈ నాభికి దిగువన ఉండు లోకములను అధోలోకములనియు, ఎగువ వుండు లోకములను ఊర్ధ్వ లోకములనియు అందురు. నాభికి = కంఠమునకు మధ్య వుండు లోకములను మర్త్యలోకములనియు (మనుష్య లోకములు), కంఠమునకు పైన ఉన్నవాటిని దేవలోకములనియు నాభికి దిగువ వుండు లోకములను పాతాళ లేదా రాక్షస లోకములనియు అందురు. (పురాణములలో అధ్యాత్మపరముగా వివిధ లోకములకు సంబంధించిన కథలు అర్థము చేసుకొనునపుడు ఈ విభజన, ఈ సమన్వయము గుర్తుంచుకొనవలెను.)

నాభికి దిగువన వుండు లోకములనగా మణిపూర చక్రము నుండి క్రింద వుండు లోకములని అర్థము. ఇవి అజ్ఞాన తిమిరములు దట్టముగా వుండు లోకములందురు. ఈ అంధకార లోకములను వెలుగులతో నింపుటకు, బంజరు భూముల వలె నుండు ఈ లోకములను సస్యశ్యామలము చేయుటకు, మణిపూర చక్రమును అధిష్ఠించి యుండు 'శివ-శక్తులు' 'మేఘము – మెఋపు' ల రూపములో నుందురని ధ్యానము చేసి వారి అనుగ్రహము పొందవలెను.

(క్రిందటి శ్లోకములో – రుద్రుని క్రోధావిష్టదృష్టి యొక్క ప్రళయాగ్ని సెగలకు గురియై మలమల మాడిన లోకములకు తాపోపశమనము ఈ మణిపూర చక్రము వద్ద చేయబడు ధ్యానములో చెప్పబడినది).

వర్షాగమనమునకు ముందు మేఘము, మెఋపు, ఇంద్రధనుస్సుల దర్శనము జరుగును. ఇక్కడ శివుడు మేఘునితోను, శక్తి మెఋపు తీగతోను పోల్చబడిరి. క్రిందటి శ్లోకములో స్వాధిష్ఠాగ్ని ప్రళయ కాలరుద్రుడైన హరునితో పోల్చబడినది. అనాహత మండలి మిహిరునికి (సూర్యునికి) ఈ హరునికి గురి కాబడిన లోకములతో నాడులు పోల్చబడినవి. మేఘుని ఆశ్రయించి యుండు ఇంద్రధనుస్సులలోని వివిధ వర్ణములే కుండలినీ శక్తికి కాంతులు విరజిమ్ము ఆభరణములుగా పోల్చబడినవి.

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 41

శ్లో. తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటమ్
ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనక జననీమ జ్జగ దిదమ్.

## అనువాద పద్యము

చం. *నవరస పూర్ణమైన నటనమ్మును జేయు నవాత్ముడైన యా*
*శివుని సమీపమున్ సమయ చిత్కళ కాంతయు లాస్యమాడ దాం*
*డవమునుగూడునట్టి మిథునమ్మును మూలమునందు గొల్చెదన్*
*శివతరమైన వీరికృప సృష్టికి తల్లియు - తండ్రి నీయగా.*

## టీక

(ఓ జగజ్జననీ!) తవ = నీ యొక్క, మూలాధారే = మూలాధార చక్రమునందు, లాస్యపరయా = నృత్యాసక్తిగల, సమయయాసహా = 'సమయ' అను పేరుగల శక్తి గూడ, నవ = తొమ్మిది, రస = శృంగారాదిరసముల చేత, మహత్ = అద్భుతమైన, తాండవ = నాట్యమునందు, నట = అభినయించువాడైన, నవ + ఆత్మానం = తొమ్మిది రూపులుగల ఆనందభైరవుని, మన్యే = తలచెదను, ఉదయవిధిం = జగదుత్పత్తి కార్యమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, ఏతాభ్యాం = ఈ, ఉభాభ్యాం = ఇరువురి చేత (అనగా – ఆనందభైరవ మహాభైరవుల చేత), దయయా = (ప్రళయాగ్నికి దగ్ధమైన లోకములను మరల నుత్పత్తి చేయుట యందు) కరుణతో, సనాథాభ్యాం = ఇరువురి కలయిక చేత, ఇదంజగత్ = ఈ జగత్తు, జనక జననీమత్ = తండ్రియు తల్లియు గలది (అగుచున్నదని) జజ్ఞే = తెలుసుకొనుచున్నాను.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ యొక్క మూలాధార చక్రము నందు – లాస్యము నందు ఆసక్తురాలైన 'సమయ' అను పేరుగల మహాభైరవితో గూడి, శృంగారాది నవరసములతో నొప్పారు 'తాండవ' మును అభినయించు వానిని – నవాత్మునిగా, లేదా – తొమ్మిది రూపులు గల ఆనందభైరవునిగా తలంచుచున్నాను. ప్రళయాగ్నికి

దగ్ధమైన లోకములను మరల నుత్పత్తి చేయు కారణమువలన, ఈ ఇరువురి కలయికతో జగత్తు తల్లితండ్రులు కలిగినదగుచున్నదని తెలుసుకొనుచున్నాను.

## వివరణము

ప్రస్తుత 41వ శ్లోకముతో సౌందర్యలహరిలోని పూర్వభాగము పూర్తి అగును. ఈ పూర్వభాగమును 'ఆనందలహరి' అని గూడా వ్యవహరింతురు. ఈ భాగమునందు ఎక్కువ షట్చక్రముల గుఱించి శ్రీచక్రము గుఱించి, షట్చక్రములవద్ద ధ్యానము చేయవలసిన అధిష్ఠాన దేవతా మూర్తుల గుఱించి – వివరణ ఉండును. ప్రస్తుత శ్లోకములో షట్చక్రములలో మొదటిది, పృథివీతత్త్వమును నియంత్రించునది అయిన – మూలాధార చక్రము గుఱించి చెప్పబడుచున్నది.

**లాస్యతాండవములు**

భౌతిక ప్రపంచమునకు 'ఆది – అంత్యము', అనగా 'సృష్టి= ప్రళయము' లుండును. ఈ సృష్టి ప్రళయములు, అందు జరుగు సన్నివేశ సందర్భములన్నియు – శివశక్తుల వివిధ విన్యాసములతో జరుగు నృత్య వికాసములుగా న్యాసము చేసుకొని, అవగాహన చేసుకొనవలెను. సృష్టియందు అమ్మవారికి ప్రాధాన్యము, ప్రళయమునందు అయ్యవారికి ప్రాధాన్యము ఉండును. సృష్టిఆవిర్భావమున జరుపు అమ్మవారి నృత్యమును – 'లాస్యము' అందురు. ప్రళయ ప్రారంభమునకు జరుపు అయ్యవారి నృత్యమును 'తాండవము' అందురు. లాస్యమును చేయు అమ్మవారిని 'ఆనందభైరవి' గను, తాండవమును చేయు అయ్యవారిని 'ఆనందభైరవుని' గను సమన్వయ పరచుకొనవలెను. స్వాధిష్ఠాన చక్రము వద్ద రుద్రకోపాగ్నికి దగ్ధమైన లోకములను మరల ఉత్పన్నము గావించుటకు విశ్వజననీ జనకులుగా ఈ ఇరువురి కలయిక ఆవశ్యకము. శక్తిరూపమును 'సమయాదేవి' గను, శివుని – 'నవాత్మ' కునిగను ఈ మూలాధార చక్రము వద్ద ధ్యానము చేయవలెనని ఈ శ్లోకము చెప్పుచున్నది.

శక్తిని 'సమయాదేవి' గను, శివుని 'నవాత్మ' కుని గను చెప్పుటలో సార్థకత గలదు. శక్తికి శివునితో ఐదు విధములుగా సామ్యము కలదు. 1) అధిష్ఠాన సామ్యము, 2) అనుష్ఠాన సామ్యము, 3) అవస్థా సామ్యము, 4) రూప సామ్యము, 5) నామ సామ్యము.

1) శివశక్తులిరువురికి గూడా మూలాధారాది షట్చక్రములు అధిష్ఠాన రూపమై ఉండుటవలన – అధిష్ఠాన సామ్యము చెల్లుచున్నది. 2) జగత్తుకు ఈ ఇరువురు జననీ జనకులుగా చెప్పబడుటవలన – ఇద్దరూ జగత్తుకు సంబంధించిన సృష్టి ప్రళయముల ఉత్పత్తికి – లాస్య, తాండవ, నృత్య, రూప కార్యోన్ముఖులగు చుండుట వలన – అనుష్ఠాన సామ్యము చెల్లుచున్నది. 3) వర్షాకాలపు మేఘముతోను, ప్రళయాగ్నితోను పోల్చబడుట చేత – అవస్థా సామ్యము చెల్లుచున్నది. 4) త్రిలోచనత్వ, శశిరేఖా మకుటత్వముల వలనను, పరస్పర దేహార్థ పరిపూరక శోభనత్వము వలనను – రూపసామ్యము చెల్లుచున్నది. 5) 'శివ – శివా', 'శర్వ – శర్వాణీ', 'భవ – భవానీ', 'రుద్ర – రుద్రాణీ' మొదలగు నామ యుగళముల వలన – నామసామ్యము చెల్లుచున్నది.

పైన తెలిపిన ఐదు విధముల సామ్యము శివునితో శక్తికి – చెల్లుచుండుటచే శక్తిని 'సమయా' దేవిగా చెప్పుట జరిగింది.

ఇక శివుని 'నవాత్మకునిగా' చెప్పుటలో గూడా సార్థకత గలదు. 1) కాలవ్యూహము 2) కుల వ్యూహము 3) నామ వ్యూహము 4) జ్ఞాన వ్యూహము 5) చిత్త వ్యూహము 6) నాద వ్యూహము 7) బిందు వ్యూహము 8) కలా వ్యూహము 9) జీవ వ్యూహము – అను నవ వ్యూహాత్మకుడగుట వలన శివుని నవాత్మకునిగా చెప్పుట జరిగినది. (ఈ నవ వ్యూహముల వివరణ – 34వ శ్లోకమైన 'శరీరంత్వం శంభోః.. అను శ్లోకములో చెప్పబడినది. ఇదే విధముగా శక్తిపరముగా, 1) వామా, 2) జ్యేష్ఠా 3) రౌద్రీ 4) అంబికా 5) ఇచ్ఛా 6) జ్ఞాన 7) క్రియా 8) శాంతి 9) పరా– అని నవ వ్యూహములు కలవు. ''శ్రీ చక్రం శివయోర్వపుః...'' అను దానిని బట్టి, 'చతుర్భిః శ్రీ కంఠైః.'' అన్న 11వ శ్లోకములో చెప్పిన దానిని బట్టి – శ్రీకంఠుని కోణములు నాలుగు, శివయువతి కోణములు ఐదు కలసి మరల తొమ్మిది మూల త్రికోణములగును. ఈ విధముగా శివుడు 'నవాత్మ'కుడని చెప్పుటలో సార్థకత కలదు.

**మూలాధారచక్ర ప్రాధాన్యము**

మూలాధార చక్రము – భౌతిక ప్రపంచమునకు ప్రథమ ప్రధాన కారణము, ఆధారము అగును. దీని విశిష్టత దీని పేరులోనే వున్నది. దీని విశిష్టత యోగ వాశిష్ఠములో గూడా –

''ఆధార వాత రోధేన శరీరం కంపతేయథా
ఆధార వాత రోధేస యోగీనృత్యతి సర్వదా
ఆధార వాత రోధేన విశ్వం తత్రైవ దృశ్యతే
సృష్టిరాధార మాధారే ఆధారే సర్వదేవతాః
ఆధారే సర్వవేదాశ్చ తస్మాదాధార మాశ్రయేత్''.

అని తెలుపబడినది. యోగము ఈ చక్రముతోనే ప్రారంభము. ప్రాణశక్తి వృథాకాకుండా నిరోధింపబడి, చక్రవిలసనమునకు – తద్వారా జీవ వికాసమునకు దోహదపడు విధముగా చేయునదియే కుండలినీయోగము. ప్రారంభ చక్రమైన మూలాధార చక్రము వద్ద కుండలినీయోగ సాధన ప్రారంభ ప్రతి ఫలమును సాధించగలుగుటయే గొప్ప అనుభూతి. ఆ అనుభూతిని పొందుట జరిగినచో యోగి పులకాంకితుడై నృత్యము చేయును. ఈ నృత్యము శివశక్తుల లాస్య, తాండవ నృత్యముతో శ్రుతి లయ బద్ధమగును. అప్పటి నుండి సాధకుని జీవితము సార్థకమై విశ్వ ప్రణాళికతో శ్రుతి కుదిరి న్యాసము చెందును.

**ఆధార చక్రము - కవ్వము**

భౌతిక ప్రపంచములో జీవించు జీవి యొక్క జీవనములో తప్పులు చేయుట– దిద్దుకొనుట, మంచి చేయుట – మన్నన పొందుట, ప్రయత్నించుట- ఫలితము పొందుట – అనునవి దధిమథనము ( అనగా – గట్టిగా నున్న పెరుగును కవ్వముతో చిలుకుట) వంటివి. ఈ జీవన దధిమథనమునకు ముక్తి వంటి నవనీతము (వెన్న) ప్రతిఫలముగా పొందబడును. ఒకసారి పెరుగునుండి వెలువడిన తరువాత వెన్న ఏ విధముగా మజ్జిగకు అంటక, మజ్జికపై తేలుచూ, దానికి అతీతముగా నుండునో – అదే విధముగా ముక్త స్థితి వచ్చిన జీవి సంసారములో వున్ననూ, ఆ సంసారము అంటక, దానికి అతీతముగా నుండును. ఈ స్థితి వచ్చుటకు దధిమథనములో దండమునకు క్రిందుగా నుండు కవ్వము ఎటువంటిదో యోగసాధనలో వెన్నెముక అనెడి యోగదండమునకు క్రిందుగా నుండు మూలాధార చక్రము అటువంటిది. యోగసాధనా ప్రతిఫలమునకు కవ్వము వంటి ఈ మూలాధారమే ప్రథమ, ప్రధాన ఉపకరణము. ఈ కవ్వము చేయు భ్రమణ

చలనములతో మూలాధార చక్రము వద్ద విరాడ్విశ్వ సృష్టి ప్రసార రూపమైన శివాశివుల లాస్య తాండవములను పోల్చుకొనవచ్చును.

యోగ ప్రక్రియకు ప్రధానమైన ఈ నృత్యమునే - యోగానందలహరికి - ప్రథమ తరంగ జనక స్థానముగా సమన్వయ పరచుకొనవలెను.



## సంస్కృత శ్లోకము - 42

శ్లో. గతైర్మాణి క్యత్వం గగనమణిభి స్సాంద్రఘటితం
కిరీటం తే హైమం హిమగిరి సుతే కీర్తయతి యః
స నీడేయచ్ఛాయా చ్ఛురణ శబలం చంద్రశకలం
ధనుశ్శౌనాసీరం కిమితి న నిబధ్నాతి ధిషణామ్.

## అనువాద పద్యము

*చం. గగనమణి ప్రభాతమణి కాంతి నెలార్చు భవత్కిరీటమున్*
*పొగడ - గవీశ్వరుండు మరి బోల్చన్ మానడు - నీ శిరంబునన్*
*జిగిబిగి జిత్రవర్ణముల జిందుచునున్న సుధాంశుఖండరే*
*ఖగని - పురందరాఖ్యువిలుగాన్ హిమపర్వత రాజపుత్రికా !*

## టీక

హిమగిరిసుతే ! = ఓ మంచుకొండ కూతురైన పార్వతీ, మాణిక్యత్వం = మాణిక్యాదులచే, గతైః = పొందబడినట్టి, గగనమణిభిః = ఆకాశములో మణులవలె ప్రకాశించు ద్వాదశ ఆదిత్యుల చేత, సాంద్రఘటితం = దగ్గఱ దగ్గఱగా కూర్చబడినది అగు, హైమం = బంగారముతో నిర్మింపబడిన, తే = నీయొక్క, కిరీటం = కిరీటమును, యః = ఏ సాధకుడు ( లేదా – కవి) కీర్తయతి = కీర్తించునో ( లేదా – వర్ణించునో), సః = అతడు కిరీటము నందలి ఆ రత్నముల యొక్క, ఛాయా = కాంతిచేత, చురణ = వ్యాపించుట యందు, శబలం = పీతారుణనీలవర్ణాది చిత్ర చిత్ర వర్ణములు గలిగినదైన, చంద్రశకలం = చంద్రరేఖను చూచినపుడు, శౌనాసీరం = ఇంద్ర సంబంధమైన, ధనుః ఇతి = ధనుస్సు ఇది అని, ధిషణాం = (అతని)

బుద్ధిని, నవిబధ్నాతి = (ఎట్లు) బంధింపకుండును ? (అనగా - తలచకుండా ఎట్లు ఉండును ? - అని భావము.

## తాత్పర్యము

హిమగిరి సుతా ! ఓ పార్వతీ ! మాణిక్యముల రూపుతో ఆకాశమునకు మణుల వలె నుండు ద్వాదశ ఆదిత్యులచేత చక్కగా, దట్టముగా, కూర్చబడి చెక్కబడినదైన - నీ బంగారు కిరీటమును ఎవడు వర్ణించి కీర్తించునో అతడు - గోళాకారముగా నుండు ఆ నీ కిరీటము నందు పొదగబడిన ఆదిత్యమణి కాంతి వ్యాపించుట చేత పసుపు, ఎఱుపు, నీలము, ఆకుపచ్చ మొదలగు వింత వింత వన్నెలను పొందినదై నీ నుదురుపైన అలంకారముగా నున్న చంద్రరేఖను గాంచి - దానిని తప్పనిసరిగా ఆ ఇంద్రధనుస్సే అయి వుండునని తన చిత్తములో భావించి ధ్యానించును.

## వివరణము

ఈ సౌందర్యలహరీ స్తోత్రరాజము రెండు భాగములుగా విడదీయబడి నట్లుండును. 41వ శ్లోకము వరకు మొదటి భాగము పూర్తి అగును. ఈ 42వ శ్లోకము నుండి రెండవ భాగము ప్రారంభమగును. మొదటి భాగము నందు - శ్రీ చక్రవిశేషములు, మూలాధారాది చక్రవివరములు సంపూర్ణముగా తెలియ చేయబడును. భజంతిత్వాంధన్యాః కతిచన చిదానందలహరీం' (8వ శ్లోకం) అను శ్లోకములోను, 'మహాన్తః పశ్యంతో దధితి పరమానందలహరీం' (21వ శ్లోకం) అను శ్లోకములోను చెప్పబడినట్లు - బాహ్యమైన కాయిక పూజలతో సంబంధము లేకుండా మనలోనే ఉండు అమ్మవారిని సూక్ష్మధ్యాన పద్ధతిలో ఆరాధించి తరించుటకు ఇవ్వబడిన విధానము గలిగినదే - ఈ మొదటి భాగము. ఈ 8వ 21వ శ్లోకములలో సూచింపబడిన 'ఆనందలహరీ' నామముతోనే ఈ భాగము సాధారణముగా తెలుపబడును.

ఇక అంతర్ముఖ ధ్యానము కంటె - ధ్యాన ఆవాహనాది షోడశోపచారాది పూజతో బహిర్ముఖముగా ఆరాధించుటకు అవసరమగు అమ్మవారి ఆపాదమస్తమకుటాంతము వరకు వర్ణించి ఇవ్వబడిన వివరములు కలిగినదే రెండవ

భాగము. ఈ రెండవ భాగము – 42వ శ్లోకము నుండి చివర వరకు గల శ్లోకముల సంపుటము. ముఖ్యముగా అమ్మవారి దేహ సౌందర్య వర్ణన ప్రధానముగా గల ఈ రెండవ భాగములోని 44వ శ్లోకములో తెలుపబడిన 'తనోతు క్షేమం తవవదన సౌందర్యలహరీం' అన్నపాదము ఈ రెండవ భాగమునకు 'సౌందర్యలహరీ' నామమును ధ్రువపరచునని చెప్పుకొనవచ్చును. ఈ 'ఆనందలహరి – సౌంద్యరలహరి' అను రెండు భాగములను కలిపి 'సౌందర్యలహరి' అని ఒకే నామముతో ఈ స్తోత్రము సాధారణముగా వ్యవహరింపబడుచున్నది.

ప్రస్తుత 42వ శ్లోకములో అమ్మవారి తలపై గల మకుటమును, చంద్రరేఖను ముందుగా శంకరులు వర్ణించుచున్నారు. ఈ విశ్వమును అమ్మవారి విరాడ్దేహముగా దర్శించి ఈ సౌందర్యలహరీ భాగములోని శ్లోకములలో శంకరులు వర్ణించిరి. అందువలన, అమ్మవారి దేహ వర్ణనతో పాటు భూగోళ, ఖగోళ విజ్ఞానము గూడా సమన్వయ పరచబడి ఈ శ్లోకములలో ఉండును.

సాధారణముగా కిరీటము మణులచే కూర్చబడి దగద్ధగాయమానముగా ప్రకాశించును. ఇక్కడ అమ్మవారిది విశ్వవిరాడ్దేహము కాబట్టి ఇట్టి విరాడ్దేవీ మకుటమునకు సామాన్య మణులు సరిపోవునా ? ఆకాశమే మకుటముగా తోడి మస్తకము అనియు, భూమియే పాదములు అనియు పురుష సూక్తములో "శీర్ష్ణో ద్యౌః సమవర్తత! " పద్భ్యాగ్ం భూమిః" అని చెప్పబడినది. కాబట్టి – ఆకాశ మస్తకమకుటమునకు సరిపోవు మణులుండవలెను. ఆకాశమునందు పెద్ద పరిమాణములో మణుల వలె ప్రకాశించునవి ఏవి ? – అని ప్రశ్నించుకొని, ఊహించుకొనినవుడు తప్పనిసరిగా సూర్యుడు గుర్తు రాక మానడు. ఈ సూర్యుని పేరే ఆదిత్యుడు. ఈ ఆదిత్యులు 12 మంది ఉందురు. వీరినే 'ద్వాదశాదిత్యు'లు అందురు. (వీరి పేర్లు 1. ఇంద్రుడు, 2. ధాత 3. పర్జన్యుడు 4. త్వష్ట6. పూషుడు 7. అర్యముడు 7. భగుడు 8. వివస్వంతుడు 9. విష్ణువు 10. అంశుమంతుడు 11. వరుణుడు 12. మిత్రుడు. ఈ ద్వాదశాదిత్యులు వెలుగుల లోకములకు (Planes of light and Radiation) ) అధిపతులు. ఈ ద్వాదశాదిత్యులనే అమ్మవారి మకుటమునకు కూర్చబడిన మణులుగా దర్శింపవలెనని ఈ శ్లోక ప్రథమ పాద భావము.

ఇక 'గగనమే మస్తక మకుటముగాగల అమ్మవారి యొక్క తలపై గల

చంద్రరేఖ ఎట్లు తోచవలెను ? – అను ప్రశ్న ఉదయించినపుడు అందుకు సమధానము గూడా శంకరులు మిగిలిన పాదములలో చెప్పుచున్నారు.

తెల్లగా కనబడు సూర్యుని కిరణములలో వాస్తవమునకు నీలహరిత పీతారుణాది వర్ణములు (VIBGYOR) అన్నియు నిక్షిప్తమై వుండునని భౌతిక విజ్ఞాన శాస్త్రము చెప్పును. మకుటముపై కూర్చబడిన సూర్యమణుల ప్రకాశము - అమ్మవారి తలపైననే అలంకారముగా గల చంద్రరేఖ పైబడి – పరావర్తనము చెంది, ప్రకాశించునపుడు ఆ వివిధ వర్ణములు వ్యక్తమగును. అప్పుడు ఆ విధముగా వివిధ వర్ణములతో ప్రకాశించు చంద్రరేఖను చూచినపుడు – ఆ చంద్రరేఖ సప్త వర్ణములతో అందముగా, ఆకర్షణీయముగా, ఆనందదాయకముగా కనుపించు ఇంద్రధనుస్సువలె ద్యోతమవక మానదని శంకరుల నిర్ధారణ. స్తవనీయమైన శంకరుల ఈ దర్శనము కడుంగడు కమనీయము. దర్శించిన దానిని ఇతరుల హృదయములకు హత్తుకొనునట్లు గూడా చెప్పగలుగుటకు ఉదహరించిన ఉపమానము రమణీయము. నిరంతర స్మరణీయము.

ఈ శ్లోకములో కొన్ని ఖగోళ రహస్యములు గూడా గలవు. అమ్మవారి మకుటముపై మణివంటి సూర్యుడు, ఆ పైననే సమీపములో అందమైన సన్నని చంద్రరేఖ ఉండును. ఈ దృశ్యము ఆకాశములో గూడా కొన్ని సమయములలో ద్యోతకమవు చుండును. దాని వివరములు ఖగోళశాస్త్ర పరముగా అర్థము చేసుకొనవలెను.

అమావాస్యనాడు సూర్యుడు, చంద్రుడు ఒకే రాశిలో, ఒకే డిగ్రీవద్ద వుందురు. సూర్యుడు రాశి చక్రములో 1 రోజుకు 1 డిగ్రీ ముందుకు పోవును. చంద్రుడు సుమారు $13^0$ ముందుకు పోవును. అనగా – సూర్యునితో పోల్చినపుడు చంద్రుని సాపేక్ష వేగము 1 రోజుకు $13^0 - 1^0 = 12^0$ అగును. ఒక్కొక్క రోజుకు చంద్రుడు ఈ $12^0$ సాపేక్షవేగముతో సూర్యుని కంటె ముందు వుండును. ( మాసములోని మొత్తము $15 + 15 = 30$ తిథులలో చంద్రుడు $30 \times 12 = 360$ డిగ్రీలు పూర్తి చేసి మాసాంతమునకు మరల సూర్యుని వద్దకు చేరును. )

అమావాస్యనాడు సూర్యుడు, చంద్రుడు – రాశి చక్రములో ఒక చోటనే

వుండగా, ఆ మర్నాడు – అనగా – శుద్ధ పాడ్యమి నాడు చంద్రుడు సూర్యునకు $12^0$ ముందు ఉండును. అనగా – ఈ విధముగా పోవుచూ పూర్ణిమ వచ్చునాటికి $15 \times 12 = 180^0$ సూర్యునకు ముందు వుండును. అనగా – ఆ పూర్ణిమ నాడు సూర్యునకు సరిగా $180^0$లో చంద్రుడు వుండును. అనగా సూర్యోదయము వేళకు సూర్యుడు తూర్పుదిశ వద్ద ఉండగా – చంద్రుడు పశ్చిమ దిక్కున ఉండును. లేదా – సూర్యాస్తమయ సమయములో సూర్యుడు పశ్చిమ దిక్కున క్రిందికి క్రుంగుచుండగా చంద్రుడు తూర్పు దిక్కున పైకి ఉదయించు చుండును.

అమావాస్య నాడు సూర్యుడు, చంద్రుడు రాశి చక్రములో ఒక చోటనే ఉండగా, అమావాస్యకు ముందురోజు అనగా కృష్ణ చతుర్దశి రోజున చంద్రుడు సూర్యుని కన్న $12^0$ వెనుక ఉండును. ఈ ప్రస్తుత శ్లోకములో వర్ణించిన అమ్మవారి మకుటములోని దినమణి (సూర్యుడు), ఇంద్రధనుస్సు వలె భాసించు ఇందు రేఖలు – సూర్యచంద్రులతో కూడిన అమావాస్య కృష్ణచతుర్దశి సంధికాలము నాటి దృశ్యముగా స్ఫురింప చేయును. ఇందువలననే – కృష్ణచతుర్దశిని అమ్మవారి మకుట ధ్యానమునకు సమన్వయ రూపముగా చెప్పుదురు. శరదృతువులోని కార్తీక కృష్ణ చతుర్దశి అయినచో ఈ దృశ్యమును మరింత స్ఫుటముగా స్ఫురింపజేయును. అందువలననే – కార్తీక కృష్ణ చతుర్దశిని 'రూప చతుర్దశి' అని గూడా చెప్పుదురు.



## సంస్కృత శ్లోకము - 43

శ్లో. ధునోతు ధ్వాంతం న స్తులిత దళితేందీవరవనం
ఘనస్నిగ్ధ శ్లక్ష్ణం చికుర నికురుంబం తవ శివే
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో
వసన్త్యస్మి న్మన్యే వలమథన వాటీ విటపినామ్.

## అనువాద పద్యము

శా. శ్యామస్నిగ్ధతటిత్సమన్వయ రుచుల్ సాధించు నిందీవర
స్తోమ శ్రీరుచి గుప్పచున్ పరిమళ స్ఫూర్తుల్గొనన్ నందనా
రామంబందలి కల్పసూనతతి దూరంగోరు నీ వేణియున్
మా మాలిన్యతమస్సు బోదొలచుగా మా డెందముల్ వెల్గగాన్.

## టీక

(హే) శివే ! = (ఓ) పార్వతీ, దళిత = వికసించిన, ఇందీవరవనం = నల్లకలువలతో దట్టముగా నిండి యున్న తోటవలె ఒప్పారుచు, ఘన = నల్లని మేఘము వలె, లేదా - చక్కనైన, స్నిగ్ధ = సుగంధ తైలవాసనలు గుబాళించుచు, లేదా - నునుపుగా నుండునదియు, శ్లక్ష్ణం = మెత్తగా నుండునదియు, అయిన - తవ = నీయొక్క, చికుర నికురుంబం = శిరోజముల సమూహము, లేదా - కేశపాశము, నః = మా యొక్క, ధ్వాంతం = అంతస్తిమిరమును, అనగా - హృదయగత అజ్ఞానాంధకారమును, ధునోతు = తొలగించుగాక, యదీయం = ఏ కేశపాశ సంబంధమైన, సహజం = స్వభావసిద్ధమైన, సౌరభ్యం = పరిమళమును, ఉపలబ్ధుం = పొందుటకు, అస్మిన్ = ఈ కేశపాశమందు, వలమథన = ఇంద్రుని, వాటీ = నందనోద్యానమందలి, విటపినాం = కల్పవృక్షముల యొక్క, సుమనసః = పుష్పములు, వసంతి = నివసించుచున్నవని, లేదా - తురమబడుటను కోరుచున్నవని, మన్యే = తలంచెదను.

## తాత్పర్యము

ఓ తల్లీ ! పార్వతీ ! వికసించుచున్న నల్లకలువలు ఒత్తుగా నున్న తోటవలె ఒప్పారుచు - నల్లదనము, చిక్కదనము, నునుపుదనము, మెత్తదనము గలిగిన నీ కేశ పాశమునందు తురమబడుటకు, లేదా - వసించుటకు స్వర్గలోకమందలి కల్పవృక్ష పుష్పములు ఆసక్తిగా ఎదురు చూచుచుండును. అట్టి నీ కేశపాశ దర్శనము మా హృదయగత అజ్ఞానాంధకారమును తొలగించి, మమ్ము ప్రజ్ఞానవంతులుగా చేయుగాక!

## వివరణము

కిరీట వర్ణన అయిన తరువాత అమ్మవారి తలకట్టు, కేశపాశముల గురించి సంబంధించి ఈ శ్లోకములో చెప్పబడుచున్నది. క్రొత్తగా వికసించుచున్న, ఒత్తుగా దట్టముగానున్న నల్లకలువల తోటవలె అమ్మవారి తలకట్టు వున్నదట ! ఒత్తుగా వున్న నల్ల కలువల తోటను చూచుచున్నపుడు - నల్లదనము, చిక్కదనము, నునుపుదనము, మెఱుపుదనము, మెత్తదనముల కలయిక లక్షణము ద్యోతకమగును. సరిగా

అమ్మవారి కురులకు ఈ లక్షణము లన్నియు ఉండి, సహజమైన సౌరభము గూడా ఉండును. తలకట్టు ప్రాంతములో బ్రహ్మరంధ్ర ప్రాంతము వద్దనే సహస్రారచక్రము, చంద్రమండలము (సుధాసముద్రము) వుండును. ఈ చంద్రమండలము ఘనీభవించిన వెన్నెలను కలిగి యుండును. కాబట్టి, ఈ వెన్నెల ప్రభావమువలన వెలుగొందుచు వికసించు నల్లకలువలతో ఆ ప్రాంత మందలి తలకట్టు కురులను పోల్చుట చక్కని ఔచిత్యమును తెలియచేయునని అంతరార్థము.

సాధారణముగా రకరకముల పుష్పములను స్త్రీలు తమ తమ కబరీ బంధము నందు తురుముటకు ఆసక్తిని, ఆతృతను చూపుదురు. కాని, ఇంద్రలోకమునందలి కల్పవృక్ష పుష్పములు - తాము ఎప్పుడు అమ్మవారి పెన్నెరులందు వసించి, ఆకురుల సహజ సుగంధమును పొంది, తమ పుష్ప లక్షణ ఔన్నత్యమును పెంపొందింప చేసుకొనగలమా - అని ఉవ్విళ్ళూరుచుండునట !

'సుధాసింధోర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే...' అన్న 8వ శ్లోకములో చెప్పినట్లు బ్రహ్మ రంధ్ర ప్రాంతములో కల్పవృక్షముల సమూహముచే చుట్టబడి వుండు సుధాసిందు మధ్యలోనే అమ్మవారి నివాసము. ఇక చేరువలోని అమ్మవారి కురులలో కల్ప వృక్ష విరులు చేరుటకు ఆసక్తిని చూపవా ? అఱ్ఱులు చాచవా ? - అని అంతరార్థము.

మన క్లేశములకు, కోరికలకు - కేశములు ప్రతీకలని 'నరంవర్షీయాంసం.. గల ద్వేణీబంధాః...'' అన్న శ్లోకములో వివరించుట జరిగినది. అమ్మవారి కబరీ బంధ దర్శనముతో మన పాపమువలన, అజ్ఞానము వలన ఏర్పడు క్లేశములు, కర్మబంధము తొలగింపబడి; హృదయము ప్రక్షాళనమై - ప్రజ్ఞానవంతుల మగుదమను సూచన అంతర్లీనమై ఈ శ్లోకభావములో నున్నది. అనగా - ''జన్మల తరబడి గట్టిపడి, పీటముడి పడిన కర్మబంధము - దేని దర్శనముతో పూర్తిగా విడివడి అజ్ఞాన దూరులమై, ప్రజ్ఞాపంతుల మగుదుమో - అట్టిది అమ్మవారి కబరీబంధము'' అని అంతరార్థము.



## సంస్కృత శ్లోకము - 44

శ్లో. తనోతు క్షేమం న స్తవ వదన సౌందర్యలహరీ
పరీవాహ స్రోత స్సరణిరివ సీమంత సరణిః
వహన్తీ సిందూరం ప్రబల కబరీ భార తిమిర
ద్విషాం బృందైర్బందీకృత మివ నవీనార్క కిరణమ్.

## అనువాద పద్యము

ఉ. *భారకచాంధకార పరిపన్థుల చేతుల చిక్కినట్టి బా*
*లారుణ ధామ రేఖవలె నందము లొల్కెడు సిందురమ్ముతో*
*తీరము లేని నీదు ముఖదీప్తి సరస్సున పిల్లకాల్వగా*
*తీరిన నీదు పాపట మదీయము సేమము కూర్చు నిచ్చలున్.*

## టీక

( ఓ జగజ్జననీ! ) తవ = నీ యొక్క, వదన సౌందర్య = ముఖ సౌందర్యపు, లహరీ = అలల వెల్లువల యొక్క, పరీవాహ = కాలువయందు, స్రోతః = నీటి ప్రవాహము వలె పారుచున్న, సరణిః ఇవ = దారివలె కనబడు, సీమంతసరణిః = నీ పాపట దారి, - ప్రబల = బలముగాను, దట్టముగాను ఉన్న, కబరీభార = (నీ) కురుల మొత్తమును, తిమిర = కటిక చీకటి రూపముగా గలిగి యున్న, ద్విషాం = శత్రువుల, బృందైః = సమూహముచేత, బందీకృతం = బందీగా చేయబడిన, నవీన + అర్క = ప్రాతః కాలపు సూర్యుని, కిరణం = కిరణమువలె, సిందూర = సిందూరమును, వహంతీ = వహించుచున్నదై, నః = మాకు; క్షేమం = శుభమును, క్షేమమును, తనోతు = విస్తరింప చేయుగాక !

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ ముఖ సౌందర్య ప్రకాశ ప్రవాహము ప్రవహించుటకు వీలుగా నుండు కాలువవలె - నీ పాపట దారి కనబడుచున్నది. ఆ పాపటకు ఇరువైపులా దట్టముగానున్న నీ కురుల సమూహములు - కటికచీకటి రూపముతో ఇరువైపులా బృందములుగా తీరి యున్న శత్రువులవలె కనబడు చుండగా - వాటి మధ్య బందీగా చిక్కబడిన ప్రాతః కాలసూర్య కిరణము వలె - నీ పాపట యందలి

సింధూరపు రేఖ భాసించుచున్నది. అట్టి సిందూర రేఖతో నుండు నీ పాపట మాకు నిత్యము శుభ సౌభాగ్య యోగ క్షేమములను విస్తరింపచేయుగాక !

## వివరణము

అమ్మవారి కిరీట, కబరీ బంధములను వర్ణించిన తరువాత ప్రస్తుత శ్లోకములో ఆదిశంకరులు అమ్మవారి పాపట, (కేశవీధి) అందలి సిందూరరేఖను అత్యద్భుతమైన ఉపమానములతో వర్ణించుచున్నారు. రెండు భాగములుగా చెప్పబడు ఈ స్తోత్రము యొక్క రెండవ భాగము 'సౌందర్యలహరి' నామముతో వ్యవహరింప బడుటకు సూచన ప్రాయమైన 'సౌందర్యలహరి' పద ప్రయోగము ఈ శ్లోకములో గలదు.

ఈ శ్లోకము నందలి భావము పూర్తిగా అవగాహన గలిగి, అమ్మవారి పాపట, అందలి సిందూరరేఖ - ఏ విధముగా నున్నవో దర్శనము జరుగుటకు - సంక్షిప్తముగా కాక, విపులముగా వివరించుకొనవలసిన అవసరమున్నది. లేనిచో - పాత వ్యాఖ్యానములలో వలె, సంక్షిప్త వివరణము వలన సందిగ్ధత, అసంపూర్ణత్వము చోటు చేసుకొను అవకాశము కలదు.

అమ్మవారి తలకట్టుపై జుట్టు - నునుపుగా, చిక్కగా, చక్కగా, మెత్తగా, ఒత్తుగా వుండునని క్రిందటి ''ధునోతుధ్వాంతం...'' అన్న 43వ శ్లోకములో చెప్పబడినది. ఆ తలకట్టుకు మధ్యగా ఋజుమార్గములో - కేశపాశములు ఇరువైపులా - సమముగా, సౌష్ఠవరీతిలో ఉండునట్లు - పాపట ఉన్నది. ఆ పాపటలో సిందూరరేఖ అందముగా వున్నది. ఈ విషయములను ప్రస్తుత శ్లోకములో ఆదిశంకరులు వర్ణించుచున్నారు.

**పాపట ప్రాముఖ్యము**

అమ్మవారి వదన సౌందర్య కాంతులు ప్రహించుటకు అనువుగానుండు విధముగా - పిల్లకాలువ రూపములో అమ్మవారి పాపట - తిన్నగా, తీరుగా తలకట్టు మధ్య భాగములో ఉన్నదిట ! అనగా, ఈ పాపట - తలకట్టుపై గల బ్రహ్మరంధ్ర ప్రాంతము చేరుటయే యోగ సాధనకు పరాకాష్ఠస్థితి అని గూడా గ్రహించవలెను. అమ్మవారి ముఖ సౌందర్య ప్రకాశము యోగ వికాసమునకు ప్రతీక కాబట్టి, అమ్మవారి పాపట ఆ యోగ వికాస ప్రగతికి సద్గతి అగునను సూచన గూడా ఈ ఉపమానములో

గలదు (శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములో అమ్మవారు 'సద్గతిప్రదా' అని 201 నామములో చెప్పబడిన విషయము ఇక్కడ గుర్తుంచుకొనవలెను) ఈ బ్రహ్మరంధ్ర ప్రాంతమువద్దనే సుముహూర్తములకు జీలకఱ్ఱ, బెల్లము ఉంచి, లక్ష్యసిద్ధిని, యోగ సిద్ధిని కోరుదురని గూడా గ్రహించవలెను).

**చీకటి కురుల ప్రణాళిక**

తన రాకతో వెలుగును పెంచి, చీకటిని త్రుంచు సూర్య కిరణములకు ప్రబల శత్రువైన చిమ్మచీకటుల సమూహము వలె – అమ్మవారి తలకట్టుపై కురుల తీరు ఉన్నదిట! సూర్య కిరణముల రాకతో – ఈ చీకటి అనెడి శత్రువుకు – ప్రతి ఉదయము పరాభవము జరుగును. ఈ పరాభవ బాధకు తగిన ప్రతీకారము తీర్చుకొనవలెనని చెల్లా చెదురుగా నున్న చీకటులన్నియు ఒక చోట సమావేశమై ఒక నిర్దిష్ట ప్రణాళికను రూపొందించు కున్నవట !

సూర్యుడు పూర్తిగా ఉదయించినచో వచ్చు వెలుగును తాము (చీకటులన్నియు) కలిసి కట్టుగా చేరినను ఓడించలేవని తెలిసి, సూర్యోదయము అగుచున్న తక్షణములో వెలువడు ఒకే ఒక సూర్య కిరణమునైనను ఉమ్మడి కృషితో, తమ మధ్య ఇరకాటములో పెట్టి, నిర్బంధించవచ్చునను ఉద్దేశ్యముతో – ఆ విధముగా ఎదురు బదురు వర్గములుగా, దగ్గఱ దగ్గఱగా వుండి, సమయమునకై నిరీక్షించు చీకటి శత్రువుల వలె (సైనిక దళములవలె) అమ్మవారి పాపట కిరువైపులా కురులున్నవట ! పాపట యందలి సిందూరరేఖ అప్పుడే ఉదయించు సూర్యుని ఒక కిరణము వలె ఉన్నదిట. (సిందూరము అరుణ వర్ణములో ఉండును. సూర్యోదయ కాలములో వెలువడు సూర్యకిరణముల రంగును – 'అరుణవర్ణము' అందురు)

'పవిత్రమైన సౌభాగ్యమునకు చిహ్నము అయిన పరమపావని పార్వతి యొక్క పాపట యందలి సిందూరము మాకు శుభసౌభాగ్య యోగ క్షేమములను విస్తరింప జేయుగాక' – అని ఆశించుట గూడా సందర్భ ఔచిత్యమును సూచించును.

అమ్మవారి దర్శనానుభూతికి సంబంధించిన రమణీయమైన ఊహలకు కమనీయమైన ఉపమానములతో ఆదిశంకరులు వ్రాసిన శ్లోకమిది.



## సంస్కృత శ్లోకము - 45

శ్లో. అరాళై స్స్వాభావ్యా దళికలభస శ్రీ భిరలకైః
పరీతం తే వక్త్రం పరిహసతి పంకేరుహరుచిమ్
దరస్మేరే యస్మిన్ దశనరుచికింజల్కరుచిరే
సుగంధౌ మాద్యంతి స్మరదహన చక్షుర్మధులిహః.

## అనువాద పద్యము

మ. *దరహాస ద్యుతిపూర్ణమై, దశన సూత్రజ్యోత్స్న కింజల్కికా*
*స్థిర సౌగంధనివాసమై, స్మరహరాక్షి ద్వంద్వ భృంగమ్ములన్*
*వరరాగమ్మున నుంచి, నైజముగనేవంపైన భృంగాలకల్*
*పరమై యుండెడు నీదు వక్త్రము నవ్వన్ జూచు పద్మద్యుతిన్.*

## టీక

(హే జగజ్జననీ!) స్వాభావ్యాత్ = సహజముగనే, అరాళైః = వంకరగానుండు, అళికలభసశ్రీభిః = గండు తుమ్మెదల కాంతి వంటి కాంతులు గలవియైన, అలకైః = ముంగురుల చేత, పరీతం = అందముగా తీర్చిదిద్దబడిన, తే = నీ యొక్క, వక్త్రం = వదనము, పంకేరుహరుచిం = కమలముల యొక్క వికాస సౌందర్యమును, పరిహసతి = తనతో సాటి రాదని ఎగతాళి చేయుచున్నది. (కారణమేమనగా) దరస్మేరే = వికాస స్వభావముగల లేనగువు గలదై, దశన = దంతముల యొక్క, రుచి = కాంతులనెడి, కింజల్క = కేసరములచే, రుచిరే = సుందర బంధురమై, సుగంధౌ = సహజ సుగంధముతో, ఒప్పారుచునుండు, యస్మిన్ = ఏ ముఖ (పద్మము) నందు, స్మరదహన = మన్మథుని (తన మూడవ కంటితో) దహించిన శివుని యొక్క, చక్షుః మధులిహః = కన్నులు అను తుమ్మెదలు, మాద్యంతి = మత్తు గొని ఆనందించుచున్నవి కావున.

## తాత్పర్యము

తల్లీ జగజ్జననీ ! చిఱునగవుతో వెలువడు వికాసము గలిగి, దంత కాంతులనెడి కేసరములచే సుందర బంధురమై, సహజ సుగంధములతో ఒప్పారుచు నుండి, సహజముగానే వంకరగా నుండి, గండు తుమ్మెదల కాంతి వంటి కాంతి

గలవి యైన ముంగురుల చేత అందముగా తీర్చిదిద్దబడిన – నీ ముఖము అనెడి పద్మమును చూచుచు శివుని కన్నులు అను తుమ్మెదలు ముదముతో నిరంతరము మత్తు గొని ఆనందించుచున్న కారణమున నీ వదనార విందము – కమలముల యొక్క వికాస సౌందర్యము తనతో సాటి రాదని వాటిని ఎగతాళి చేయుచున్నది.

## వివరణము

అమ్మవారి వదన సౌందర్యము ఈ శ్లోకములో వర్ణింపబడు చున్నది. సాధారణముగా అందమైన ముఖమును – శరత్కాల పూర్ణిమా చంద్రునితో గాని, పూర్తిగా వికసించిన పద్మముతో గాని – పోల్చుచుందురు. ప్రస్తుత శ్లోకములో అమ్మవారి వదన సౌందర్యమును పోల్చుటకు పద్మమును ముందుగా ఎంచుకొనుట జరిగినను – అమ్మవారి ముఖమును, పద్మమును – జాగ్రత్తగా, నిశితముగా పరిశీలించిన మీదట ఆదిశంకరులు అమ్మవారి ముఖమును పోల్చి చెప్పుటకు పద్మము సరి రాదని ఆ రెంటి సమాన ఆధిక్య లక్షణములను సరిపోల్చి చెప్పుచున్నారు.

పద్మ సౌందర్యమునకు కారణములైన లక్షణములను, అట్టి పద్మ సౌందర్యమును గూడా నిరసించి, పరిహసించు నట్టి సౌందర్యవైభవము గల అమ్మవారి వదన సౌందర్య లక్షణములను సరిపోల్చి మనమే నిస్సంకోచముగా ఒక నిర్ణయమునకు రావచ్చునని శంకరులు ఈ శ్లోకము నందు వివరించిరి.

1) పద్మమునకు వికాస లక్షణముండును – నవ్వినపుడు అమ్మవారి ముఖము నందు గూడా వికాస లక్షణము పొడ సూపును.

2) పద్మమునకు కేసరములు అందము చేకూర్చును – అమ్మవారు నవ్వినపుడు దంతముల నుండి వెలువడు కాంతులే కేసరములుగా భాసించును.

3) పద్మమునకు సుగంధము వుండును – అమ్మవారి ముఖము నిత్యము సహజమైన సుగంధముతో పరిమళించును. ఈ సుగంధ లక్షణము పద్మమునకు శాశ్వతము గాదు. వాడిన తరువాత పోవును – కాని, అమ్మవారి ముఖ సౌరభము శాశ్వతమైనది.

4) పద్మములో మధురమైన తేనె వుండును – అమ్మవారి ముఖము (నోరు)

నందలి అధరములలో మధువు వుండును. ముఖము నుండి తేనె లొలుకు పలుకులు (మాటలు) వెలువడును. (శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములోని 'శ్రీమద్వాగ్భవకూటైక స్వరూప ముఖ పంకజా' అన్న 85వ నామమును ఇక్కడ గుర్తు తెచ్చుకొనవలెను). పద్మము నందు మాటలు పలుక లేని మధువు మాత్రమే ఉండును.

5) పద్మముపై ఝుంకార రాగము చేయుచు తుమ్మెదలుండుట శోభాయమానముగా నుండును - అమ్మవారి ముఖము అనెడి పద్మమునందే శివుని రెండు కన్నులు అనెడి గండు తుమ్మెదల చూపు నిరంతరము ఆసక్తిగా, అనురాగముతో ఉండును. (సౌంద్యరమునకు అధిదేవత అయిన మన్మథుని దహించి వేసిన వాడు శివుడు. అట్టి శివుని రెండు కన్నులు అమ్మవారి ముఖమును చూడకుండా ఉండలేకపోవుట అమ్మవారి ముఖ సౌందర్య ఔన్నత్యమును పద్మ సౌందర్యముపై ఆధిక్యమును సూచించును) మరియు, పద్మముపై తుమ్మెదలు ఝుంకార రాగము చేయును - అమ్మవారి ముఖమును చూచు శివుని కన్నులలో అనురాగ దృక్కులు వుండును.

6) పద్మము లోని మకరందము అయిపోయిన వెంటనే తుమ్మెద ఆ పద్మమును విడిచి వేరొక పద్మమును గాని, పుష్పమును గాని చేరును. కాని, శివుని కన్నులు ఎడబాటు లేకుండా ఎల్లప్పుడునూ అమ్మవారినే అనురాగపూరిత మైన దృక్కులతో చూచుచునే యుండును. (ఇది పద్మము తుమ్మెదల మధ్య సంబంధము కన్న మిన్నయైన ఏకపత్నీ పాతివ్రత్య సల్లక్షణ, సుధర్మము అమ్మవారికి, అయ్యవారికి మధ్య నుండునని సూచించును.)

7) కృతకముగా ఏర్పరచు కొను ముంగురులు తెచ్చు అందము వలె గాక - సహజ సిద్ధమైన నల్లని కుటిల కుంతలముల (ముంగురులు) శోభ అమ్మవారి ముఖమునకు ప్రత్యేక శోభను, సౌందర్యాకర్షణలను ఒనగూర్చును. ఇది అమ్మవారి ముఖ సౌందర్యమునకు గల విశిష్టమైన అదనపు లక్షణము.

పైన తెల్పిన ఏడు లక్షణములను బట్టి - పద్మ సౌందర్యము కన్న అమ్మవారి ముఖ సౌందర్యమే మిన్నయని ఒప్పుకొనక తప్పదు. అందువలననే పద్మమును

చూచుచున్నపుడు అమ్మవారి కన్నులలో 'నా ముఖ సౌందర్యముతో నీవు సరితూగలేవు' అన్న పరిహాస దృక్కులు కనబడునని ఆదిశంకరులు నిర్ధారణ చేసి ఈ శ్లోకములో చెప్పుచున్నారు.



## సంస్కృత శ్లోకము - 46

శ్లో. లలాటం లావణ్యద్యుతి విమల మాభాతి తవ యత్
ద్వితీయం తన్మన్యే మకుట ఘటితం చంద్రశకలమ్
విపర్యా సన్యాసా దుభయ మపి సంభూయ చ మిథః
సుధాలేపస్యూతిః పరిణమతి రాకాహిమకరః.

## అనువాద పద్యము

లావణ్య ద్యుతులొల్కు నీ విమల ఫాలప్రాంతమౌశోభ నే
భావింతున్ మకుటస్థ చంద్రశకలోర్ధ్వం బందుభాగమ్ముగా
వైవిధ్యంబుల రెండు రేఖలను త్రిప్పన్ మల్పి సంధింపగా
సేవించందగు పూర్ణచంద్రముఖమై చిందించు పీయూషమున్.

## టీక

(ఓ జగజ్జననీ!) తవ = నీ యొక్క, యత్ = ఏ లలాటం = నుదురు భాగము, లావణ్యద్యుతి = సౌందర్యాతిశయకాంతితో, విమలం = స్వచ్ఛము, పవిత్రవంతమును అగుచు, ఆభాతి = అంతటా ప్రకాశించుచున్నదో, తత్ = దానిని, మకుట ఘటితం = కిరీటము నందు కూర్పబడినదైన, ద్వితీయం = రెండవ దైన, చంద్రశకలం = చంద్రుని అర్థఖండముగా, మన్యే = ఊహించుచున్నాను. యత్ = ఏ కారణము వలన, ఉభయం అపి = నీలలాటభాగము, ఆ చంద్ర ఖండము – ఈ రెండును, విపర్యాసన్యాసాత్ = వ్యత్యస్తముగా కలుపుట వలన, మిథః = పరస్పరము, సంభూయచ = కలసికొని, సుధాలేపస్యూతిః = అమృతస్రావలేపనము వలన, రాకాహిమకరః = పూర్ణిమాచంద్రునిగా, పరిణమతి = (తదాకారమును పొందబడినదిగా) అగుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీలలాటభాగము, అనగా – నుదురు భాగము – పవిత్రమైన సౌందర్యాతిశయముతో ప్రకాశించు చున్నది. అట్టి ఈ లలాటభాగము – నీ కిరీటము నందు కనబడకుండా నున్న చంద్రుని రెండవ అర్థభాగముగా ఉన్నట్లు ఊహించుచున్నాను. (నా ఈ ఊహ నిజమే అయి వుండవచ్చును). కారణమేమనగా – నీలలాట భాగమును ఆ అర్థ చంద్రభాగమును వ్యత్యాస్తముగా వాటి వాటి కొమ్ములు కలియునట్లు కలిపినచో అమృతమును స్రవించు పూర్ణచంద్రుని ఆకారమును పొందుచున్నది. ఆ స్రవింపబడు అమృతముతోనే ఆ రెండును అతకబడినట్లుగూడా కనబడని విధముగా కలసిపోయి పూర్ణచంద్రుని వలె భాసించుచున్నవి గదా!

## వివరణము

అమ్మవారి కిరీటము నుండి ప్రారంభింపబడిన వర్ణన ప్రస్తుత శ్లోకములో లలాట భాగము వఱకు వచ్చినది. అమ్మవారి లలాటభాగము, అనగా – ఫాలభాగము, లేదా – నుదురు భాగము అర్థచంద్రాకృతిలో వుండును. అనగా అర్థవృత్తా కారములో వుండును. అట్టి అర్థవృత్తాకృతి చంద్రునికి అష్టమినాడు వుండును. అష్టమి అనుటతోడనే శుద్ధ అష్టమా? బహుళ అష్టమా ? అని అనుమానము రావచ్చును. ఈ విషయము లలితా సహస్ర నామములోని 'అష్టమీచంద్ర విభ్రాజదలిక స్థలశోభితా' అన్న 15వ నామ వివరణలో కూడా వచ్చును. ఆ లలితాసహస్రనామ స్తోత్రములో ఇట్టి అనుమానము వచ్చుటకు అవకాశము వున్నది. కాని, అట్టి అనుమానము రాకుండా ఆది శంకరులు ఈ శ్లోకములో తెలిపిరి.

**ఫాలభాగము బహుళాష్టమి చంద్రుడే !**

అమ్మవారికి కిరీటము నందు చంద్రుడు గూడా వుండును. ఈ చంద్రుని పై సగభాగము మకుటములోపల కూర్చబడి, మిగిలిన క్రింది సగభాగము మాత్రమే కనబడుచున్నట్లుగా వుండుననిపించును. కనబడు చంద్రుని సగభాగము ఈ విధముగా నుండును. అప్పుడు కిరీటములోపల కూర్చబడినట్లున్న అర్థ చంద్రభాగము ఈ విధముగా ఉండును. ఈ రెండవ ఆకారము చంద్రునికి బహుళ అష్టమి నాడు వుండును గాని శుద్ధ అష్టమినాడు కాదు. అనగా, అమ్మవారి

ఫాలభాగము బహుళ అష్టమి నాటి చంద్రుని ఆకృతిలో నుండునని నిర్ధారణ అగుచున్నది. దానిని మరింత విపులముగా నిర్ధారించుటకు ఈ శ్లోకములోనే ఆది శంకరులు మరియొక విషయము ద్వారా తెలుపుచున్నారు.

''అమ్మవారి ఫాలభాగమును. కిరీటము నందు గల అర్ధచంద్రుని భాగమును వ్యత్యస్తముగా కలిపినట్లు ఊహించవలెను. (అనగా - అమ్మవారి ఫాలభాగము ⌓ యొక్క కోణములు, లేదా - కొమ్ములు పైకి వచ్చునట్లు, అనగా - ◡ ఈ విధముగాను; కిరీటముపై గల చంద్రుని అర్ధభాగము యొక్క కోణములు, లేదా - కొమ్ములు క్రిందికి వచ్చునట్లు - అనగా - ⌓ ఈ విధముగాను - ఒకదానిపై ఒకటి వచ్చునట్లుగా - వాటి వాటి కొమ్ములు సరిగా ఏకీభవించునట్లు ఉంచవలెను). అప్పుడు ⊖ ఈ విధమైన సంపూర్ణ వృత్తాకారా కృతి ద్యోతకమగును. ఈ ఆకృతి పూర్ణిమా చంద్రాకృతిని స్ఫురింప చేయును'' - అని శంకరులు భావ సందిగ్ధత లేకుండా తెలిపిరి.

**అమ్మవారి నిర్వికారత**

మాసములోని శుక్లపక్ష, కృష్ణపక్షములలోని చంద్రుని కళలను సూచించు నిత్యాదేవతల పేర్లు నేను వ్రాసిన శ్రీ లలితా సహస్రనామ వివరణములో తెలుపబడినవి. (స్థలా భావము చేత ఆ పేర్లు మరల ఇక్కడ తెలుపుట లేదు). శుక్లపక్షములోని, కృష్ణపక్షములోని ఒకే తిథికి రెండు రకములైన పేర్లు ఉన్నను, రెండు పక్షములలోని అష్టమితిథికి ''త్వరితా'' అని ఒకే నిత్యాదేవత పేరు వుండునని తెలుపబడినది. 'శుక్లపక్ష - కృష్ణపక్షములు', వరుసగా - 'వృద్ధి - క్షయములకు', 'వికాస - వికల్పములకు', 'వినోద - విషాదములకు' ప్రతీకలుగా చెప్పుకొనవచ్చును. అప్పుడు అష్టమీ చంద్రునిచే సూచింపబడు అమ్మవారి ఫాలభాగము రెండు పక్షములలోను మార్పులేకుండా ఒకే నిత్యాదేవత 'త్వరిత'చే సూచింపబడుటచేతను, రెండు పక్షములలోని అష్టమీ చంద్రునికి పరిమాణములో మార్పు ఉండకపోవుట చేతను, ముందు ఉదహరించిన జంటల లక్షణముల ప్రభావము పనిచేయక, వాటికి అతీతముగా ఏకరీతిలోనే నుండు అమ్మవారి నిర్వికార లక్షణమును తెలియచేయును.

**పరిణత శరచ్చంద్ర వదనము**

అమ్మవారి ఫాలభాగముతో అర్ధచంద్రుని భాగము వ్యత్యస్తముగా

కలిసినపుడు – ఆ రెండును 'వేరు వేరు' అని అనిపించని విధముగా కలిసిపోవును. ఆ విధముగా కలిసినపుడు ఏర్పడు పూర్ణిమా చంద్రుని నుండి స్రవించు వెన్నెలయే ఆ రెండు భాగములను ఆ విధముగా కలిపి వుంచినదని గూడా ఈ శ్లోకములో చెప్పబడినది. ఈ విధముగా జరుగుటకు, కనిపించుటకు – ఆ రెండు భాగములు ఒకే జాతి, ఒకే లక్షణము గలవి అయినపుడే చెల్లును. కావున, 'అమ్మవారి ఫాలభాగమే అర్ధచంద్రుడు, అర్ధచంద్రుడే అమ్మవారి ఫాలభాగము' అను విషయము దీనివలన తేట తెల్లమగును. అందువలననే శంకరులు ఈ సౌందర్యలహరీ స్తోత్రములో 'క్వణత్కాంచీదామా...' అన్న 7వ శ్లోకములో అమ్మవారి వదనమును గుఱించి 'పరిణతశరచ్చంద్రవదనా' – అని చెప్పిరి.

**ముఖము వాగ్భవము**

అమ్మవారి వదనము వృత్తాకారముగా నుండి, ఆ వృత్తమునకు కేంద్రముగా భ్రూమధ్యమున ఉండు బొట్టు ఉండునని ఊహించవచ్చును. అప్పుడు బొట్టుగుండా అడ్డముగా పోవురేఖ ఆ వృత్తమునకు వ్యాసమగును. ఈ వ్యాసమునకు పైన ఉండు అమ్మవారి ఫాలభాగము అర్ధవృత్తాకారములో ఉండును. ఫాలభాగము అర్ధవృత్తాకారములో నుండుట ఉత్తమ సాముద్రిక లక్షణము. ఈ బొట్టు 'అ' అను అచ్చును, అమ్మవారి వదన వృత్తము 'ఆ' అను అచ్చును సూచించునని శ్రీ లలితా సహస్ర నామ వివరణలో చెప్పబడినది 'శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూపముఖపంకజా' అన్న అమ్మవారి నామ వివరణను గూడా ఇక్కడ గుర్తుకు తెచ్చుకొనవలెను.

**మనస్సు - కవాటము**

అమ్మవారి వదన వృత్తములో ఫాలభాగము – కిరీటము లోపల కూర్చబడినట్లున్న కనబడని చంద్రుని అర్ధభాగముతో – పోల్చబడినది. అమ్మవారి వదన వృత్తకేంద్రమైన బొట్టు ప్రాంతము ఆజ్ఞాచక్రస్థానమును సూచించునని ముందే చెప్పబడినది. ఈ ఆజ్ఞాచక్రస్థానము – అమ్మవారి వదన వృత్తమును రెండు భాగములుగాచేయగా, పైభాగము – కనబడని, లేదా – తెలియని జ్ఞానమునకు, క్రింది భాగము– కనబడు, లేదా – తెలిసిన జ్ఞానమునకు ప్రతీకలుగా సమన్వయించు కొనవలెను. ఈ రెంటికి మధ్య సంధి స్థానములో నుండు ఆజ్ఞాచక్రము 'మనస్తత్త్వము'ను సూచించునని (మనో ఽపి భ్రూమధ్యే) యోగ శాస్త్రము చెప్పును.

అనగా - తెలిసిన, లేదా - కనబడు దానికి; తెలియని, లేదా - కనబడని దానికి మధ్యన మనస్సు కవాటము (Gate) వంటిదన్నమాట ! (Mind is the gate way between Matter and Spirit) ఈ రెంటి సమన్వయ సంయోగము యోగామృతత్వసిద్ధిని చేకూర్చును.

(గమనిక - మాస్టర్ C.V.V. యోగములో కూడా ఇదే విధముగా ఇటువంటి అర్ధవృత్తములు రెండు కప్పులుగా (Two Tea cupes) పోల్చబడి ఒక యోగ సూత్రము చెప్పబడును).

శ్రీ లలితా సహస్ర నామ వివరణములోని 'ముఖచంద్రకళం కాభా' అన్న 16వ నామములోని అమ్మవారి కస్తూరీ తిలకమును గురించి తెల్పిన వివరణములో - అమ్మవారి బొట్టు తెలియ వలసిన జ్ఞానమునకు కేంద్రము వలె నున్నదని చెప్పబడిన విషయము ఇక్కడ గుర్తుకు తెచ్చుకొనవలెను. 'అష్టమీ చంద్ర విభ్రాజదళిక స్థల శోభితా' 'ముఖచంద్ర కళంకాభమృగనాభివిశేషకా' - అన్న నామముల సంఖ్యలు గూడా చంద్రుని పూర్ణకళలను సూచించు 15, 16 సంఖ్యలే అని గూడా గుర్తుకు తెచ్చుకొనవలెను. (అమ్మవారి ముఖమునకు పూర్ణిమా చంద్రునికి గల సంబంధ సామ్యములను అర్ధము చేసుకొనుటకే ఇన్ని విధములుగా ఈ విషయములన్నియు ఇక్కడ చెప్పబడినవి.)

(ఇటువంటి విషయమే నేను వివరించిన 'తైత్తిరీయోపనిషత్తు - శిక్షావల్లి లోని 'మహాచమస్య ప్రవేదయతే' అన్న మంత్ర వివరణములో కూడా వచ్చును. ఊర్ధ్వ అర్ధ గోళము, అధో అర్ధగోళముల కలయికచే ఏర్పడు - చోటు గోళముతో (Space Globe) 'చమసము' అను పాత్రను సమన్వయించి అక్కడ చెప్పబడినది).



## సంస్కృత శ్లోకము - 47

శ్లో. భ్రువౌ భుగ్నే కించిద్భువన భయభంగవ్యసనిని
త్వదీయే నేత్రాభ్యాం మధుకర రుచిభ్యాం ధృతగుణమ్
ధను ర్మన్యే సవ్యేతరకర గృహీతం రతిపతేః
ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాంతర ముమే.

## అనువాద పద్యము

ఉ. *సొంపుగ వంగి తుమ్మెదల సోయగ మందిన కన్నుదోయి సొ*
*రింపులు నారిగా, ముకులించిన నీ కనుబొమ్మ జంట - బల్*
*వంపుగ వామ హస్తమున పట్టగ ముష్టికి కౌను దాగుచున్*
*సొంపుగ నున్న మన్మథుని సుంద కార్ముక మంచునెంచెదన్.*

## టీక

(హే) ఉమే ! = ఓ పార్వతీ ! భువన = లోకముల యొక్క, భయ = ఉపద్రవములను, భంగ = నాశము చేయుట యందే, వ్యసనిని = ఆసక్తిగలదేవీ ! త్వదీయే = నీ యొక్క, కించిత్ భుగ్నే = కొద్దిగా వంగినవి అయిన, భ్రువే = కనుబొమలను, మధుకర రుచిభ్యాం = తుమ్మెదలవంటి శోభకలిగినటువంటి లేదా - తుమ్మెదల వరుసగా అగుపించు, నేత్రాభ్యాం = కనుదోయిచేతను, ధృతగుణం = పొందిన అల్లెత్రాడు గలదై, రతిపతేః = మన్మథుని యొక్క, సవ్యేతర = ఎడమది అయిన, కర = హస్తముచేత, గృహీతం = పట్టుకొనబడినదియు, ప్రకోష్ఠే = మణికట్టును, ముష్టౌచ = పిడికిలియు, స్థగయతిసతి = కప్పుచున్నది కాగా, నిగూఢాంతరం = కప్పబడిచూడబడని వింటినారి, వింటి నడిమి భాగము గలదైన, ధనుః = విల్లునుగా, మన్యే = తలంచుచున్నాను, లేదా - ఊహించుచున్నాను.

## తాత్పర్యము

ఎల్లలోకములకు గలుగు ఆపదలనుండి వాటిని రక్షించుటయందే పట్టుదలతో గూడిన ఆసక్తి గల ఓ తల్లీ, ఉమా ! కొద్దిగా వంపుగా వంగినట్లున్న నీ కనుబొమల తీరు - తుమ్మెదల వంటి శోభను గలిగి, అడ్డముగా వరుసలో నున్న నల్లని కనుదోయిని వింటినారిగా గలిగి - మన్మథుని వామహస్తము యొక్క పిడికిలి చేత నడిమి భాగములో పట్టుబడుటచే కనబడకుండా నున్న కొంతనారి భాగమును, దండభాగమును కలిగిన - విల్లుగా అనిపించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి కనుబొమలు వర్ణింపబడుచున్నవి. అమ్మవారి ముఖమును చూచునపుడు కనబడు కనుబొమలు కొద్దిగా వంగినట్లు ⌒ ఈ ఆకారములో నుండును. ఆ రెండు కనుబొమలు మధ్యలో కలసి వుండవు. అనగా- వాటి మధ్య నడిమి భాగములో కొంత ఖాళీ (Gap) వుండును. ఇట్టి కనుబొమల తీరు మన్మథుడు ఎడమ చేత నడిమి భాగములో పట్టిన విల్లువలె శంకరులకు దర్శనమైనది. విల్లు అనుటతోడనే వంగిన దండము, ఆ దండము యొక్క రెండు కొనలను కలుపుచుండు వింటినారి (అల్లెత్రాడు) వుండవలెను గదా! మన్మథుడు ఎడమచేతితో పట్టిన విల్లు యొక్క దండమును అమ్మవారి రెండు కనుబొమలు రూపొందించును. మన్మథుని పిడికిలిచే నడిమి భాగము పట్టుకొనబడుట వలన కనబడని వింటి దండము యొక్క నడిమి భాగము, వింటినారి యొక్క మధ్యభాగము వరుసగా – అమ్మవారి కనుబొమల మధ్య నున్న 'ఖాళీ' ప్రదేశము చేతను, కన్నుల మధ్య ఖాళీ ప్రదేశము చేతను సూచితము. ఇక తుమ్మెదల వరుసను స్ఫురింప చేయు అమ్మవారి రెండు కన్నులవరుస ఆ వింటికి అల్లెత్రాడుగా భాసించును. పిడికిలితో వింటినడుమ భాగమును పట్టిన మన్మథుని ఎడమ ముంజేయిగా అమ్మవారి ముక్కుదూలమును సమన్వయ పరచుకొనవచ్చును. కాబట్టి, శంకరులకు జరిగిన దర్శనము ఇట్టి వర్ణనచే పూర్తిగా సార్థకమైనదిగానే అనిపించు చున్నది గదా!

**సవ్య, అపసవ్య పదములు**

ఈ శ్లోకములో 'సవ్యేతరకరగృహీతం' అన్న పదము నందలి 'సవ్య' పదమునకు 'ఎడమ' అని సామాన్యముగా అర్థము చెప్పుదురు. శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములోని 'సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా' అన్న నామములో గూడా 'సవ్య' పదమునకు 'ఎడమ' (left), 'దక్షిణ' పదమునకు కుడి (Right) అనియే అర్థము కదా! అదే విధముగా ఇక్కడ గూడా 'సవ్య' పదమునకు 'ఎడమ' అని అర్థము చెప్పుకొన్నచో – 'సవ్యేతర' అన్నదానికి 'కుడి' అని అర్థము చెప్పుకొనవలసి యుండును. విల్లును కుడిచేతితో ఎవరునూ పట్టుకొనరు. (ఎడమ చేతి వాటము వారు తప్ప!) సాధారణముగా ఎడమ చేతితో విల్లును పట్టుకొని,

కుడిచేతితో వింటినారి మధ్య బాణము సంధించి, ఆ వింటినారిని లాగి బాణమును ప్రయోగింతురు. 'సవ్యేతర' మునకు 'కుడి' అని అర్థము చెప్పుకున్నచో దీనికి వ్యతిరేకముగా వచ్చును గదా! ఈ విధమైన వ్యతిరేకము రాకుండుటకు ఇక్కడ ప్రయోగించిన 'సవ్యపదమునకు 'కుడి' అని, 'సవ్యేతర' మునకు 'ఎడమ' అని అర్థము చెప్పుకొనవలయును. ఇట్లు చెప్పుకొనుట కూడా తప్పుకాదు. శబ్దార్థ రత్నాకరములో 'సవ్య' పదమునకు 'ఎడమ', 'కుడి' అని రెండర్థములను ఇచ్చుట వలన ఈ 'సవ్య' పదమునకు సందర్భమును బట్టి అర్థము చెప్పుకొనుట సముచితముగా నుండును.

[ఆబ్దీక, అపర కర్మలు నిర్వహించునపుడు – సవ్యము అన్నపదమునకు – ఎడమ భుజముపై యజ్ఞోపవీతము ఉండవలెనని, 'అపసవ్యము' అన్నపదముకు – కుడి భుజముపై యజ్ఞోపవీతము ఉండవలెననియే అర్థము. కాబట్టి, ఇక్కడ సవ్యమనగా 'ఎడమ', 'అపసవ్య' మనగా 'కుడి' అను అర్థములు చెల్లుచున్నవి.

భౌతిక శాస్త్రములో వృత్తాకార మార్గదిశను నిర్దేశించు సమయములందు 'సవ్యదిశ' అనగా Clock wise direction, అనగా – గడియారము ముల్లులు తిరుగు దిశ, ఇది ప్రదక్షిణ మార్గమే, అనగా – కుడి వైపుగా తిరుగుట, 'అపసవ్యదిశ' అనగా – Anticlockwise direction అనగా – గడియారము ముల్లులు తిరుగు దిశకు వ్యతిరేక మార్గము. ఇది ప్రదక్షిణమునకు వ్యతిరేకము, అనగా – ఎడమ వైపుగా తిరుగుట అని చెప్పుదుము. కాబట్టి, ఇక్కడ పైన తెల్పిన దానికి వ్యతిరేకముగా – సవ్యమనగా 'కుడి' అపసవ్యమనగా – 'ఎడమ' అర్థములు చెల్లుచున్నవి.]



## సంస్కృత శ్లోకము - 48

**శ్లో. అహస్సూతే సవ్యం తవ నయన మర్కాత్మక తయా**
**త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా**
**తృతీయా తే దృష్టి ర్దర దళిత హేమాంబుజరుచి**
**స్సమాధత్తే సంధ్యాం దివసనిశయో రంతరచరీమ్.**

## అనువాద పద్యము

మ. రవి నీ దక్షిణలోచనమ్మగుటచే రంజింపగా జేయు దాన్
పవలింటిన్ - శశి వామనేత్రమగుటన్ ప్రాపింపజేయున్నిశిన్,
భవదీయాలిక నేత్ర హేమరుచిమత్పంకేజ సౌందర్యమున్
స్తవనీయంబగు సంధ్యయై - దిననిశాసంధానమై వెల్గెడిన్.

## టీక

(హే భగవతీ!) తవ = నీ యొక్క, సవ్యం = కుడివైపున దైన, నయనం = కన్ను, అర్కాత్మకతయా = సూర్యసంబంధమైన దగుటచేత, అహః = పగటిని, సూతే = పుట్టించుచున్నది, వామం = ఎడమవైపునదైన, తే = నీయొక్క, నయనం = కన్ను, రజనీనాయకతయా = చంద్ర సంబంధమైనదగుటచేత, త్రియామాం = రాత్రిని, సృజతి = కలిగించుచున్నది. దర = కొంచెముగా, దళిత = వికసించినదైన, హేమాంబుజ = ఎఱ్ఱతామర పూవు యొక్క, రుచిం = ప్రకాశము వంటి రంగుగల, తే = నీ యొక్క, తృతీయాదృష్టిః = లలాటమున నున్న మూడవ కన్ను, దివస నిశయోః = పగలు రాత్రి అను వాని యొక్క, అంతరచరీ = నడుమ వర్తించు చున్నదైన, సంధ్యాం = సాయం, ప్రాతః కాలముల సంబంధమైన సంధ్యల జంటను, సమాధత్తే = చక్కగా ధరించుచున్నది.

## తాత్పర్యము

అమ్మా! జగజ్జననీ! నీ కుడికన్ను సూర్య సంబంధమైన దగుటచే పగటిని జనింపజేయుచున్నది. నీ యొక్క ఎడమకన్ను చంద్ర సంబంధమైన దగుటచే రాత్రిని పుట్టించుచున్నది. ఎఱ్ఱ తామర పూవు రంగు గల నీలలాట నేత్రము అహోరాత్రముల నడుమ వర్తించుచు సాయం పాత్రః కాల సంబంధమైన ఉభయ సంధ్యలను (అగ్నిని సూచించు ఎఱుపు దనము తన వర్ణ లక్షణముగా గలదని సూచించుట వలన ఈ తృతీయ నేత్రము అగ్ని సంబంధమైనదని గ్రహించవలెను) గావించుచున్నది.

## వివరణము

ఈ 48వ శ్లోకము నుండి 'దృశాద్రాఘీయస్యా...'' అను 57వ శ్లోకము వరకు - అమ్మవారి నేత్రములకు, వాటి వివిధ వ్యాపారములకు సంబంధించిన వివరములు ఆదిశంకరులు వర్ణించిరి. ఇదే విధముగా అమ్మవారి చరణములకు

సంబంధించిన వర్ణన గూడా దాదాపు ఎనిమిది శ్లోకములలో వివరించిరి. ఇవి మనకు కరుణానుగ్రహములను ప్రసాదించుటకు సంబంధించినవి గాబట్టి, శంకరులు ఈ రెండు విషయములలో కొంత ప్రత్యేకత జూపిరి.

ప్రస్తుత శ్లోకములో అమ్మవారికి ఉన్న మూడు కన్నుల గురించిన విషయము చెప్పబడుచున్నది. అమ్మవారికి అందరివలె గాక దక్షిణ వామనేత్రములతో పాటు లలాట నేత్రము గూడా గలదు.

**త్రినేత్రములు - త్రినాడులు**

శ్రీవిద్య కుండలినీ యోగ ప్రధానమైనది. కుండలినీ యోగములో సూర్య చంద్రాగ్నుల ప్రసక్తి – తప్పక వచ్చును. యోగ దండమైన వెన్నెముకయందు ముప్పేటలుగా – ఇడా, పింగళా, సుషుమ్నా నాడులుండును. ఇవి వరుసగా – చంద్ర, సూర్య, అగ్ని సంబంధమైనవి.

**'దక్షిణే పింగళానాడీ వహ్నిమండల గోచరా**
**దేవయాన మితి జ్ఞేయం పుణ్యకర్మాను సారిణీ' అని -**
**'ఇడాచ వామనిశ్వాసా సోమమండల గోచరా**
**పితృయాన మితిజ్ఞేయం వామమాశ్రిత్యతిష్ఠతి'**

– అన్నశ్లోకములనుబట్టి – జీవికి జన్మవచ్చుటకు, పితృయాన మార్గమునకు, చంద్రునకు సంబంధించిన విషయములు – ఇడా నాడికి సంబంధించిన విషయములు కాగా, జీవికి ముక్తివచ్చుటకు, దేవయాన మార్గమునకు, సూర్యునకు సంబంధించిన విషయములు – పింగళానాడికి సంబంధించినవి అగును. అంతేకాదు, 'ఇడానాడి వామ సంబంధమైనది. పింగళానాడి దక్షిణ సంబంధమైనది' అని కూడా పై శ్లోకము తెలుపును. కావున, అమ్మవారి దక్షిణ నేత్రము సూర్య సంబంధమైనది. వామనేత్రము చంద్ర సంబంధమైనదిగా గ్రహించవలెను.

(ఈ సందర్భములో నేను వ్రాసిన శ్రీ లలితా సహస్ర నామ వివరణ ప్రథమ భాగ అనుబంధములో – 'నాడులు' అను శీర్షిక క్రింద తెలిపిన విషయములు చదువు కొనినచో నాడులను గురించి పూర్తి వివరములు తెలియగలవు).

పితృయాన దేవయానములను సమన్వయపరచి మానవుల యోగమార్గ ఫలసిద్ధికి సంబంధించినదే సుషుమ్నానాడి. ఫాలనేత్రము దీనికి సంబంధించినది.

'సూర్యచంద్రులను అమ్మవారి రెండు కన్నులతోనే కాక అమ్మవారి స్తన యుగము గాను, తాటంక యుగళముగాను గూడా సమన్వయ పరచి చెప్పుట శ్రుతి బద్ధమే' అని ఈ క్రింది శ్లోకము నిర్ధారపరచును.

**శ్లో. సూర్యచంద్రౌస్తనౌ దేవ్యాం తావేవనయన స్మృతా**
**ఉభౌతాటంక యుగళం ఇత్యేషా వైదికో శ్రుతిః.**

విశ్వసామ్రాజ్యమును పరిపాలించు శ్రీ మహారాజ్ఞి అయిన జగన్మాత - ఎక్కడ ఎప్పుడు ఎవరి వలన ఏఏ పనులు జరుగుచున్నవో తెలుపు కర్మ సాక్షులుగా పగటికి సూర్యుని, రాత్రికి చంద్రుని ఏర్పాటు చేసినది. వీరిరువురూ చూసినది చూసినట్లు ఆలస్యము కాకుండా చెప్పుటకు అమ్మవారి రెండు కన్నుల వద్దనే తమ నివాసము ఏర్పరచుకొనిరి. అట్లే, విన్నది విన్నట్లు ఆలస్యము కాకుండా విన్నవించుటకు అమ్మవారి వీనుల వద్దనే తాటంకములుగా తమ తమ మండలములను ఏర్పరచు కొనిరి. ('తాటంక యుగళీ భూత తపనోడుపమండలా' శ్రీలలితా సహస్ర నామం).

పసిపిల్లలు స్తన్యముతో పోషింపబడునట్లు – సమస్త జీవులు తన నుండి ఆహారమును పొందుటకు ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మవారు – వృక్ష సంతతిని, ఓషధులను పెంపొందించుటకు అవసరమగు సూర్యచంద్రులను తన స్తనయుగముగా ధరించినది.

పైన తెలిపిన విధముగా సూర్య చంద్రులను సృష్టించి వారి యందు వెలుగుతూ తానే వుండునని చెప్పుట గూడా తప్పుకాదని 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్' – అను తైత్తిరీయ శ్రుతి వాక్యము నిర్ధారించును. (జగత్తును సృష్టించి ఆ సృష్టించిన జగత్తులోని ప్రతి అణువులోను తాను ప్రవేశము చేయును' అని – ఈ శ్రుతి వాక్యమునకు అర్థము. మనము వస్తువులను తయారు చెయ్యగలమేమో కాని ఆ వస్తువులోనికి మనము ప్రవేశించలేము)

సూర్య రూపముతో అమ్మవారి దక్షిణ నేత్రము పగటిని, చంద్రరూపములో వామనేత్రము రాత్రిని, అగ్నిరూపములో – పగలు రాత్రి ఒరుసుకొనునపుడు మెఱుపువలె జనించు సంధ్యాకాలములను – జనింపచేయునని ఈ 48వ శ్లోక సారాంశము. దినములు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు

చివఱకు కల్పముల మేర వఱకు సాగు కాల విభజన, కాలతత్త్వము – ఈ సూర్య చంద్రాగ్నులకు ప్రతీకలై అమ్మవారి కను కదలికల వలననే జరుగునను సూచన గూడా ఈ శ్లోకములో గలదని గుర్తించవలెను. ('ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః' శ్రీ లలితాసహస్ర నామం).

అమ్మవారి మూడు కన్నులు – జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలను గూడా సూచించును. సూర్య సంబంధమైన పగటికి సంబంధించిన దక్షిణ నేత్రము జాగ్రదవస్థను, అగ్ని సంబంధమైన సంధ్యకు సంబంధించిన ఫాలనేత్రము స్వప్నావస్థను, చంద్ర సంబంధమైన రాత్రికి సంబంధించిన వామనేత్రము సుషుప్త్యావస్థను సూచించునను సమన్వయము గూడా ఈ శ్లోక భావమునందు గలదు.



## సంస్కృత శ్లోకము - 49

**శ్లో. విశాలా కళ్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః**
**కృపాధారాఽఽధారా కిమపి మధురా భోగవతికా**
**అవంతీ దృష్టి స్తే బహునగర విస్తార విజయా**
**ధ్రువం తత్తన్నామ వ్యవహరణ యోగ్యా విజయతే.**

## అనువాద పద్యము

***మ. సువిశాలా మధురాఖ్యలై నగరులొౌచున్ దెల్పు నీ దృష్టిలో***
***శ్రవణోపాంత సిరుల్ గదే విజయధారాయోధ్య కళ్యాణులున్***
***ఛవిమద్భోగవతుల్ జనావన భవేచ్ఛావన్తికల్ నీ దయా***
***ద్రవిలోకంబులు పుణ్య తీర్థములుగా రంజిల్లు చిత్రంబులై.***

## టీక

(హే భగవతీ!) తే = నీ యొక్క, దృష్టిః = చూపు, అనగా – నేత్రము, విశాలా = విపులము, కళ్యాణీ = మంగళ స్వరూపము, స్ఫుటరుచిః = స్పష్టకాంతివంతము, కువలయైః = నల్లకలువల చేత, అయోధ్యా = జయించుటకు వీలుకానిది, కృపాధారా + ఆధారా = కరుణాప్రవాహమునకు ఆధారము, కిమపి

= ఇట్టిదని చెప్పుటకు వీలుకానిది, మధురా = మధుర మనోజ్ఞము, ఆభోగవతికా = విశాల దృక్పథము గలది, అవంతీ = రక్షణ లక్షణము గలది, బహునగర = పెక్కుపట్టణముల, విస్తార = విస్తరిల్లినది, విజయా = విజయము గలదియు (అగుచు) తత్‌తత్ = ఆయా నామనగరముల పేర్ల చేత, అనగా విశాలా, కళ్యాణీ, అయోధ్యా, ధారా, మధురా, భోగవతీ, అవంతీ, విజయా – అను ఎనిమిది నగరముల పేర్ల చేత, వ్యవహరణ = వ్యవహరించుటయందు, యోగ్యా = తగినదై, విజయతే = వియజయవంతమై వర్ధిల్లుచున్నది, ధ్రువం = (ఇది) నిశ్చయము.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ చూపు విశాలమై – విశాలయను నగర నామమున వ్యవహరించుటకు తగినదియై; కళ్యాణవంతమై – కళ్యాణీ అనునగర నామ వ్యవహారమునకు యోగ్యమై; స్పష్టమైన కాంతి గలిగి – నల్ల కలువలు జయించలేని సౌందర్యము కలది అగుచు; అయోధ్య అను నగరము పేర పిలుచుటకు తగినదై; కృపారస ప్రవాహమునకు ఆధారమగుచు – ధారా నగర నామముతో వ్యవహరించుటకు తగినదై; వ్యక్తము చేయ వీలులేని మధుర మనోజ్ఞ మగుచు - మధురానగర నామముతో పిలుచుటకు అర్హమై; విశాలము, పరిపూర్ణ దృక్పథమును గలుగుచు – భోగవతీ నగర నామముతో వ్యవహరించటకు తగినదై; రక్షణ లక్షణము కలిగి – అవంతీ నగర నామముతో పిలుచుటకు తగినదై; విజయ లక్షణముతో- విజయనగర నామముతో వ్యవహరింప తగినదై – ఈ విధమైన ఎనిమిది లక్షణములతో ఎనిమిది నగరముల పేర వ్యవహరించుటకు తగినదై – సర్వోత్కర్షత చేత స్వాతిశయముతో వర్తించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నేత్ర దృష్టి (చూపుల) గురించి చెప్పబడుచున్నది. ఈ శ్లోకములో ఒక ప్రత్యేకత గలదు. పైకి అమ్మవారి నేత్రదృష్టివైభవమును గురించి చెప్పుచున్నట్లు ఉండును. కాని, ఆ దృష్టిలక్షణములను చెప్పుటకు ఉపయోగించిన విశేషణములు – ఆ విశేషణముల పేర్లతోనే

వ్యవహరింపబడు - భారతదేశములోని ఎనిమిది విశిష్ట నగరములను గూడా సూచించును.

'విశాలా' అనునపుడు 'కళ్ళు పెద్దవిగా వుండి ఎంత దూరమైనను, ఎన్ని వైపుల' కైనను ప్రసరించి తన భక్తులను అను గ్రహించగల దృష్టి లక్షణము గలది' అనియు, ఈ దృష్టి మిక్కుటముగా ప్రసరించిన ప్రాంతము విశాలా నగరముతో వ్యవహరింప బడుచున్నదనియు తెలుసుకొనవలెను. (నేటి బదరీనాథ్ ఈ విశాల నగరమును సూచించును) అట్లే 'కళ్యాణీ' అనునపుడు మంగళకరమైన, శుభప్రదమైన దృష్టి లక్షణము గలది' అనియు, ఈ దృష్టి విశిష్టముగా ప్రసరింపబడిన ప్రాంతము 'కళ్యాణీ' నగరముగా రూపొందెనని తెలుసుకొనవలెను. (నేటి బొంబాయి - నాసిక్‌ల మధ్య నున్న ఒక ప్రాంతము ఈ కళ్యాణీ నగరమును సూచించును) 'అయోధ్య' అనునపుడు - దృష్టిలోపములేని స్పష్టమైన, స్ఫుటమైన దృష్టి ప్రకాశము గలది, నల్ల కలువలు గూడా జయించ లేని సౌందర్య గుణము గల దృష్టిలక్షణము గలది' అనియు, ఇట్టి దృష్టి మిక్కుటముగా ప్రసరింపబడగా ఏర్పడిన భారత భూభాగము 'అయోధ్యానగరము' గా రూపొందెననియు గ్రహించవలెను (ఉత్తర ప్రదేశ్‌లోని అయోధ్యయే ఈ అయోధ్యా నగరము) 'కృపాధారా ధారా' అనునపుడు - 'కరుణాపూరిత రసార్ద్ర ప్రసారాధారమైన దృష్టి లక్షణము గలది' అనియు, ఈ దృష్టి ప్రసార ఫలితముగా ఏర్పడిన భారత భూభాగము. - 'ధారానగరము' గా రూపొందెననియు గ్రహించవలెను. (నేటి ధార్ ప్రాంత ప్రదేశము) 'మధురా' అనునపుడు - చెప్పనలవి కాని మాధుర్య దృష్టి లక్షణము గలది అనియు, ఈ దృష్టి ప్రసరింపబడిన ప్రదేశమే 'మధురా' నగరమయ్యెననియు తెలుసుకొనవలెను. (నేటి మధురా నగరమే ఈ మధురానగరము) 'భోగవతీ' అనునపుడు అంతరాంతముల లోనికి ప్రసరించ గల లోతైన భోగవైభవములను పొందు దృష్టి లక్షణము గలది' అనియు, ఈ దృష్టి ప్రకృష్టముగా పడిన ప్రదేశమే భోగవతీ నగరముగా రూపొందెనినయు తెలుసుకొనవలెను. (నేటి అమరావతియే ఈ భోగవతి) 'అవంతీ' అనునపుడు - ఆశ్రిత రక్షణ లక్షణము గల దృష్టి గలది' అనియు, ఈ దృష్టి విశేషముగా ప్రసరింపబడిన ప్రదేశమే అవంతీ నగర మైనదనియు తెలుసుకొనవలెను. (నేటి ఉజ్జయినీ నగరమే ఈ అవంతీ నగరము) 'విజయ'

అనునపుడు - చూపులతోనే ఎదుటి వారిని జయించగల విజయలక్షణము గల దృష్టి గలది' అనియు, ఇట్టి దృష్టిఎక్కువగా ప్రసరింపబడిన ప్రదేశమే విజయనగరమనియు గ్రహించవలెను. (నేటి విజయనరగమే ఈ విజయా నగరము).



## సంస్కృత శ్లోకము - 50

శ్లో. కవీనాం సందర్భస్తబక మకరందైక రసికం
కటాక్ష వ్యాక్షేప భ్రమర కలభౌ కర్ణయుగళమ్
అముంచన్తౌ దృష్ట్వా తవ నవరసాస్వాదతరళా
వసూయా సంసర్గా దళికనయనం కించి దరుణమ్.

## అనువాద పద్యము

మ. కవి వాక్సూన మరందధార మధురైక గ్రాస కర్ణంబులన్
భవదక్షుల్ తమ వీక్షణాళికలభ వ్యాజమ్ముతో మాధురిన్
చవిచూడన్ దరిజేరరాగ గని ఈర్ష్యావ్యాకులమ్మైన యా
భవదీయాళిక నేత్రమం దరుణభావం బొప్పె కాత్యాయనీ.

## టీక

(హే భగవతీ!) కవీనాం = కవుల యొక్క, సందర్భ = రసవత్తర రచనలు అనెడి, స్తబక = పుష్ప గుచ్ఛము నందలి, మకరంద = తేనె యందు (మాత్రమే), ఏకరసికం = ముఖ్యముగా ఇష్టపడు, తవ = నీ యొక్క, కర్ణయుగళం = రెండు చెవులను, కటాక్ష = కడగంటి చూపులను, వ్యాక్షేప = నెపముగా పెట్టుకొని (వర్తిం నీ కనుదోయి అను) భ్రమర కలభౌ = గండు తుమ్మెదలు రెండు - నవరస = శృంగారాది తొమ్మిది రసముల యొక్క, ఆస్వాద = ఆస్వాదమునందు, లేదా - అనుభవించుట యందు, తరళౌ = అత్యంతాసక్తి కలిగినవై - అముంచంతే = ఆ రసాస్వాదనలాంపట్యము చేత, (రసాస్వాదన చేయు) నీ వీనుల జంటను విడువలేక యుండుటను, దృష్ట్వా = చూచి, అళికనయనం = మూడవదైన నీ లలాట నేత్రము, అసూయా సంసర్గాత్ = ఈర్ష్య చెందుట వలన, కించిత్ + అరుణము = కొంచెము ఎఱుపు వన్నెగలదైనది, లేదా - ఎఱ్ఱబడినది.

## తాత్పర్యము

సుకవీశ్వరుల రసవత్తర రచనలనెడి పుష్పగుచ్ఛముల నుండి జాలువారు తేనెయందు మాత్రమే అత్యంతాసక్తిని చూపు నీ యొక్క చెవుల జతను – కడగంటి చూపులు అను నెపముతోనీ రెండు కన్నులు అను గండు తుమ్మెదలు – శృంగారాది నవరసాస్వాదానాను భూతిని పొందుట యందు అత్యంతాసక్తిని కలిగినవై – ఆ రసాస్వాదన లాంపట్యము చేత నీ వీనుల జంటను విడువలేక యుండగా – పైన ఉన్న లలాట నేత్రము చూచి – మిక్కిలిగా అసూయ చెంది, ఎఱుపు వన్నెకలదైనది (అనగా – 'కోపముతో ఎఱ్ఱబడినది' అని భావము).

## వివరణము

అమ్మవారి మూడు కన్నులగుఱించి మరి కొన్ని విషయములు ఈ శ్లోకములో చెప్పబడుచున్నవి. కనుబొమ్మల క్రిందుగా, ముక్కు దూలమునకు ఇరువైపులా అందరి వలెనే అమ్మవారికి కూడా రెండు కన్నులున్నవి. ఇవి రెండును నల్లగా నున్న ఆకర్ణాంత విశాల నేత్రములు. అనగా – నల్లగా వుండి చెవుల వరకు సాగివున్న కోసగా నుండు విశాల దీర్ఘనయనములు. ఇక ఈ రెండును కాక, లలాటముపై భ్రూమధ్య ప్రాంతములో మూడవ నేత్రము ఉండును. ఇది సంధ్యా వర్ణములో, అనగా – కొంచెము ఎఱ్ఱగా నుండును. మొదటి రెండు కన్నులు నల్లగా వుండి చెవుల వరకు సాగి ఆ కర్ణాంత దీర్ఘ లక్షణమును కలిగి ఉండుటకు, మూడవ కన్ను కొంచెము ఎఱ్ఱగా నుండుటకు గల కారణములను శంకరులు అత్యంత సుందర పటిమతో వర్ణించి చెప్పిరి.

ఎప్పుడును సుకవీశ్వరుల రసవత్తర కావ్య రచనలు అను పుష్పగుచ్ఛము నుండి జాలువారు తేనె ధారలను ఆస్వాందించుట యందు మాత్రమే అమ్మవారి రెండు చెవులు మిక్కిలి ఆసక్తి కలిగి యుండునట ! కావ్యరచనలలోని నవరస సారమును తేనె ధారలతో పోల్చినపుడు అటువంటి తేనె ధారల మాధుర్యము చెవులకేమి తెలియును అను శంక కలుగుక మునుపే – శంకరులు ఆ శంకను తీర్చుటకై – అమ్మవారు తన రెండు కన్నులు అనెడి గండు తుమ్మెదలను ఆ తేనె ధారలను

గ్రోలవలసినదిగా ఆజ్ఞాపించినదని చెప్పిరి. అప్పుడు ఆ కన్నులకు చెవుల వైపుగా వెళ్ళవలసిన అవసరమేర్పడును గదా! కవీశ్వరుల రసవత్తర కావ్యరసాను భూతిని అనుభవించు చెవులకు మాటి మాటికి ఈ కన్నులనెడి గండు తుమ్మెదలు అదే సమయములో సఖ్యము కోరినట్లు వచ్చి తమ వద్దనే తిష్ఠవేయుట కొంత ఇష్టము లేకపోవచ్చును. అప్పుడు – ఆ చెవులు ''మేము రసానుభూతిని పొందు వేళలోనే మీరు ఎందుకు వచ్చుచున్నారు''? అని నిలదీసి అడిగినచో – అప్పుడు ఆ కన్నులు లౌక్యముగా – ''అమ్మవారి ముఖములో మీరు – వినుటకు ఉపకరించు జ్ఞానేంద్రియములు. మేము – చూచుటకు, భక్తకవులను అనుగ్రహించుటకు ఉపకరించు జ్ఞానేంద్రియములయు అమ్మవారి ఆజ్ఞను మీరును మేమును సమముగానే నిర్వర్తించవలెను గదా! ఈ వైపున వుండు భక్తులను అనుగ్రహించమని అమ్మవారు ఆజ్ఞాపించినది. అందునిమిత్తము మేము ఈ వైపుగా రావలసి వచ్చినది'' – అని చెప్పునట! అనగా – కవుల రచనలలోని సాహిత్య వైభవమును చెవులు అనుభవించు చుండగా – భక్త కవులను కటాక్షించవలెనను నెపముతో చెవుల వద్దకు చేరిన ఆ కన్నులు అనెడి గండు తుమ్మెదలు ఆ కవుల రచనలలోని మకరంద మాధుర్యమును ఆస్వాదించుచున్నవన్నమాట!

**లలాట నేత్ర ఆరాటము, అసూయత్వము**

''అమ్మవారి ముఖములోని రెండు కన్నులకు పైన లలాటము వద్ద వుండ గలుగుటచే – క్రింద జరుగునని గమనించగలుగు మూడవ నేత్రమునకు ఈ వ్యవహారము తెలిసినది. ఆ రెండు కన్నులు ఎటువంటివో తానును అట్టువంటి జ్ఞానేంద్రియమే అయి వుండి గూడా – అవి పొందు రచనా మాధుర్యాస్వాదనా దృష్టమును తాను పొందలేక పోవుటతో (ఫాలనేత్రము ప్రక్కలకు సాగలేదు కదా!) అట్టి అదృష్టమును పొందు ఆ రెండు కన్నులపై అసూయ జనించినదని, ఇట్టి అవకాశము కలుగు చున్నపుడెల్ల ఈ విధముగా లలాట నేత్రము అసూయ పడుచుండుటతో – అసూయ కలిగి కలిగి, కోపావేశము పెరుగుటతో – దాని వళ్ళు ఎఱ్ఱబడినది. అందువలననే ఆ లలాట నేత్రము చూచుటకు సంధ్యా వర్ణము వలె ఎఱ్ఱగా కొంత అరుణ వర్ణములో నున్న''దని శంకరులు ఒక అద్భుతమైన రీతిలో చెప్పిరి.

సౌందర్యలహరీ స్తోత్రములో ఈ శ్లోకము తలమానికమైనది. నాకు అత్యంత ప్రీతిప్రాతమైనది. మహాకవులు మాత్రమే ఈ విధముగా చెప్ప గలుగు కవితా పాండిత్య సామర్థ్యములను కలిగి యుందురు. అందమైన ఊహలకు సుందరమైన వ్యక్తీకరణ ఇది. కమనీయమైన కల్పనలకు రమణీయమైన, పునఃపునః స్మరణీయమైన అద్భుత కవితా శిల్పము (Poetic Beauty) ఇది.



## సంస్కృత శ్లోకము - 51

**శ్లో. శివే శృంగారార్ద్రా తదితరజనే కుత్సనపరా,**
**సరోషా గంగాయాం, గిరిశ చరితే (నయనే) విస్మయవతీ,**
**హరాహిభ్యో భీతా, సరసిరుహ సౌభాగ్యజయినీ,**
**సఖీషు స్మేరా, తే మయి జనని దృష్టి స్సకరుణా.**

## అనువాద పద్యము

***శా. శృంగారార్ద్రము భర్తయందు, పయివారిన్ జూడ బీభత్సమున్***
***గంగన్ జూడగ రోషమున్, శివుని పైకన్నున్‌గనన్ విస్మయా***
***పాంగమ్మున్, హరసర్పమందు భయమున్, పద్మమ్ముపై గెల్పగున్***
***భంగిన్, చిర్నగవున్ సఖీజనముపై, నాపై దయాపాంగమున్.***

## టీక

(హే) జనని = ఓ జగజ్జననీ! తే = నీ యొక్క, దృష్టిః = చూపు, శివే = సదాశివుని యందు, శృంగార + ఆర్ద్రా = శృంగార రసముచేత తడుపబడినదియు, తత్ + ఇతరజనే = ఆ సదాశివుని కంటె ఇతరులైన జనుల విషయమై, కుత్సనపరా = అయిష్టము వలన జాగుప్సతో బీభత్సరసావేశము గలదియు, గంగాయాం = గంగయందు, సరోషా = రౌద్రరసముతో గూడినదియు, గిరిశచరితే = శివుని చరిత్రను వినుటలో (లేదా – గిరిశనయనే = శివుని ఫాలనేత్ర వైశిష్ట్యమును తిలకించినపుడు), విస్మయవతీ = అద్భుతరసము గలదియు, హర + అహిభ్యః = హరాహిభ్యో = శివుడు ధరించిన సర్పముల వలన, భీతా = భయానకరసావేశము

గలదియు, సరసిరుహ = ఎఱ్ఱతామర పద్మముల యొక్క, సౌభాగ్య = వర్ణవికాస ప్రకాశములను, జయినీ = జయించిన వీరరసముతో గూడినదియు, సఖీషు = ఇష్టసఖురాండ్ర యందు, స్మేరా = చిరుదరహాసముతో హాస్య రసము గలదియు, మయి = నాయందు; కరుణా = అనుగ్రహము వలన కరుణ రసము గలిగినదై ఉండును.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ యొక్క చూపు – నీ పతి యొక్క శివుని యందు శృంగార రసమును, శివేతరజనులయందు అయిష్ట పరాఙ్ముఖత్వములతో బీభత్సరసమును, గంగ యెడల రోషముతో రౌద్రరసమును, శివుని చరిత్రను వినుచున్నపుడు గాని, శివుని మూడవ నేత్ర వైశిష్ట్యమును చూచునపుడు గాని అద్భుతరసమును, శివుడు ధరించెడి సర్పముల యెడ భయానకరసమును, ఎఱ్ఱ తామర పద్మముల వర్ణవికాస ప్రకాశముల యెడ జయించిన భావము పొడ చూపు వీరరసమును, నీ సఖురాండ్ర యెడల హాస్యరసమును, నా యెడల కరుణ రసమును (మామూలుగానున్నప్పుడు శాంతరసమును) పొందుచు నవరసాత్మకముగా నుండును.

## వివరణము

అమ్మవారి చూపులలోని వైవిధ్యము నవరసాత్మకమై యుండునని ఈ శ్లోకములో శంకర భగవత్పాదులు అతి సులభముగా అర్థమగు రీతిలో వివరించిరి.

**కన్నుల ప్రత్యేకత**

అన్ని అవయవములలోను కన్ను ప్రధానమైనది. (సర్వేంద్రియాణాం నయనం ప్రధానం) కంటి ఱెప్పలకు, కంటి పాపలకు ఉన్న చైతన్య గుణము మరి ఇతర ఇంద్రియములకు దేనికిని ఉండదని చెప్పవచ్చును. కళ్ళను చూచి – జీవి బ్రతికి ఉన్నదీ లేనిదీ గూడా చెప్పవచ్చును. (బ్రతికి లేనిచో 'గుడ్లు తేలవేసినాడు' అని గూడా అనుచుందురు. లోపలి భావములు వ్యక్తము చేయుటలో, భాషకు అందని విషయములను గూడా కన్నుల ద్వారా వ్యక్తము చేయవచ్చును. ఎవ్వరైననూ మాట్లాడుచున్నపుడు వారి ముఖమును, కళ్ళను జాగ్రత్తగా గమనించినచో – వారి ఆంతర్యము 1/16 వంతు తెలిసిపోవును ! ఇది ముఖమునకు కన్నులకు వున్న

వైశిష్ట్యము. వైఖరీ వాక్కు నోటి నుండి వెలువడినను, మనోభావము కళ్ళనుండి వెలువడును. 1) నోటి ద్వారా వెలువడు వైఖరీ వాక్కు 2) ముఖములో కలుగు కవళికలు 3) కన్నుల ద్వారా వ్యక్తమగు కదలికలు – ఈ మూడింటి సమన్వయము – మాట్లాడు వ్యక్తి ఆంతర్యమును చాలా భాగము అవగతము చేయును. నోటి మాటలు అవసరము లేకనే – కేవలము కంటి చూపులతోనే – ఆజ్ఞలను జారీ చేసి భావములను ప్రకటించు సామర్థ్యము ఈ కళ్ళకు ఉండును. చూడబడువాని ముఖము ఎక్కువగా చూచువారికి అవసరము గాని, చూడబడు వానికి కాదు. అనగా – మన ముఖము – మన కోసము కంటె ఎదుటివారి కోసమే ఎక్కువగా ఉపయోగపడుచున్నదని తెలుసుకొనవలెను. శ్రోతలు వినుటతో పాటు, వక్త ముఖమును గూడా చూడవలెనని అనిపించుట ఇందులకే !

ఇట్టి విషయములు – శ్రీ నేత్ర తంత్రములో చక్కగా వివరింపబడినవి.

వివిధ సందర్భములలో అమ్మవారి కన్నుల చూపులు, కదలికలు, హావ భావములు – ఏ విధముగా నవరసములు ఒలికించునో ప్రస్తుత శ్లోకములో చెప్పబడుచున్నది.

1) నిర్మలత్వము, నిరంజనత్వము గలిగిన అమ్మవారి కన్నుల చూపులలో శృంగార రసము నిండుగా వుండుటను గమనించుటకు శంకరులు ఒక ఉపాయము చెప్పుచున్నారు. పతి దేవుడైన శివునితోనున్నపుడు, సంభాషించునపుడు అమ్మవారి కన్నుల తీరు చూసి తీరవలసినదేనట ! ఆ సమయమమునందు మాత్రమే అమ్మవారి కన్నులలో **శృంగార రసము తొణికిసలాడునట !**

2) శివుడు కాక పరపురుషుల సాన్నిధ్యములో అమ్మవారు ఉన్నపుడు ఆమె కంటి చూపులలో అయిష్టత, పరాఙ్ముఖత్వము జుగుప్సలు చోటు చేసుకుని **బీభత్సరసము తాండవించునట !**

3) సవతియైన గంగపేరెత్తినను, గంగ గుర్తుకు వచ్చినను, ఎవరైన గుర్తుకు తెచ్చినను అమ్మవారికి కోపము, రోషము కలిగి ఆమె కంటిచూపులలో **రౌద్రరసము తాండవించునట !**

4) శివుని వంటిపై నుండు సర్పములను చూచినపుడెల్ల – అవి ఎక్కడ బుసలు కొట్టి మీద పడి కాటువేయునో, అని – మనసులో భీతి కలిగి, కన్నులలో

**భయానక రసము చోటు చేసుకొనునట !**

5) హాలాహల భక్షణము, త్రిపురాసుర సంహారము (ఎవరికినీ వుండుటకు అవకాశము లేని - ఫాలనేత్రము, ఆ నేత్ర దృష్టి మన్మథుని దహించిన విధము) మొదలగు శివుని చరిత్రలు వినుచు అమ్మవారు గొప్పగా విస్మయము చెందుచున్నపుడు కన్నులలో **అద్భుత రసము తొణికిసలాడునట !**

6) తమ సౌందర్యమునకు తమతో సాటిగానిలుచువారు గాని, తమను జయించగలవారు కాని లేరని గర్వపడు ఎఱ్ఱతామర పద్మములను - అంతకు మించిన సౌందర్యము, వర్ణ ప్రకాశ వికాసము గలిగిన అమ్మవారు చూచుపుడు ఆమె కళ్ళలో విజయగర్వము, **వీరరసము** ఒప్పారునట !

7) తన చెలికాండ్రతో అమ్మవారు సరస సల్లాపములతో సంభాషించునపుడు, మసలునపుడు చూడగలిగినచో అమ్మవారు ఎంతటి **హాస్యరసమును** ఒలికించగలదో తెలియునట !

8) చివరకు శంకరులు కరుణ రస విషయమును మహా చతురముగా చెప్పిరి. 'అమ్మవారు నన్ను (శంకరులను) చూచునపుడు మీరెప్పుడైనా చూచినారా ? ఎంత **కరుణ** ఆమె కన్నుల నిండి వుండునో చెప్పనలవి కాదు' అని ముగించిరి. ఇది కొస మెరుపు వంటి రచన.

9) ఇప్పటి వరకు పాదమునకు రెండు రసముల చొప్పున నాలుగు పాదములకు 4 X 2 = 8 రసముల విషయము ఈ శ్లోకములో వచ్చినది. అమ్మవారు మామూలుగా నున్నపుడు ఆమె యొక్క స్వాభావిక దృష్టి **శాంతరసమును** స్పష్టపరచును. అనగా - మొత్తము మీద నవరసములు అమ్మవారి చూపులలో వర్తించునను నిర్ధారణ ఈ శ్లోకమునందు సూచింపబడినది.

**పాఠాంతర విషయము**

(ఈ శ్లోకములోని మూడవ పాదములో 'సరసిరుహ సౌభాగ్య జయినీం' అనునది 'సరసిరుహా సౌభాగ్యజననీం' అని గూడా పాఠాంతరము గలదు. 'సౌభాగ్యజననీం' అని చదువుకొని గూడా అర్థమును చెప్పుకొనవచ్చును. తామర పద్మముల యొక్క సౌభాగ్యము పూర్తిగా సూర్యుని కిరణ స్పర్శవల్లనే గదా! ఆ సూర్యుడు అమ్మవారి కుడికన్నే గదా ! కాబట్టి, తామర పద్మముల సౌభాగ్యమునకు

అమ్మవారి దక్షిణ నేత్ర అనుగ్రహమే గదా. దీనిని బట్టి అమ్మవారి దక్షిణ నేత్ర అనుగ్రహము తామర పద్మముల సౌభాగ్యమునకు తల్లివంటిదన్నమాట ! ఇదే అర్థములో 'సరసిరుహ సౌభాగ్య జననీం' అని ఈ పాదములో వ్రాయబడినదని సమాధానపడవచ్చును. తన అనుగ్రహము మీద ఆధారపడిన తామర పద్మ సౌభాగ్యము - తనతోనే తగుదునమ్మా అని సాటిగా పోటీకి నిలబడినచో - దానిని చూచునపుడు అమ్మవారి కన్నులలో వీరరసము తాండవించును అని వర్ణించుట సమంజసమే గదా !)



## సంస్కృత శ్లోకము - 52

**శ్లో. గతే కర్ణాభ్యర్ణం గరుత ఇవ పక్ష్మాణి దధతీ**
**పురాం భేత్తు శ్చిత్త ప్రశమరస విద్రావణఫలే**
**ఇమే నేత్రే గోత్రాధరపతి కులోత్తంసకలికే**
**తవా కర్ణాకృష్ట స్మరశరవిలాసం కలయతః.**

## అనువాద పద్యము

***చం. గరుతములట్లు పక్ష్మములు గర్ణములంటి విశాలమౌచు నా***
***పురరిపు చిత్త శాంతమును పూర్తిగ నాశము జేయు కోర్కెతోన్***
***కరము వెలుంగు నీదు నయనమ్ములు - వీనుల జేరలాగు - శ్రీ***
***స్మరశర రామణీయకము జాటు నగేశ్వర వంశరత్నమా !***

## టీక

హే గోత్రాధరపతి కులోత్తంస కలికే ! = భూమిని ధరించు పర్వతరాజ వంశమునకు సిగను ధరించు పువ్వు మొగ్గ అయిన ఓ పార్వతీ ! తవ = నీ యొక్క, నేత్రే = కన్నులు, కర్ణ + అభ్యర్ణం = చెవుల సమీపమును, గతే = పొందినవై, పక్ష్మాణి = కనుఱెప్ప వెంట్రుకలను, గరుతః ఇవ = ఈకలవలె, దధతీ = ధరించుచున్నవై, పురాం = త్రిపురముల యొక్క, భేత్తుః = భేదించిన వాడైన శివుని యొక్క, చిత్తే = మనస్సునందు, ప్రశమరస = శాంతముగా నుండు నిస్పృహను, విద్రావణ =

పారద్రోలుటఅను, ఫలే = ప్రయోజనముగా గలవియై, ఆ కర్ణ = చెవుల వరకు, ఆకృష్ట = ఆకర్షింపబడిన, లేదా - లాగబడిన, స్మరశర = మన్మథుని బాణముల యొక్క, విలాసం = సౌభాగ్యమును, లేదా - సౌందర్యమును, కలయితః = చేయుచున్నవి. అనగా - చేయుచున్నట్లు కన్పించుచున్నవి అని, ఇయే = ఈ నా హృదయకమలమందు భాసించుచున్నది.

## తాత్పర్యము

భూమిని ధరించు పర్వత రాజైన హిమవంతుని వంశమునకు సిగను ధరించు పూవు మొగ్గ అయిన ఓ పార్వతీ ! చెవుల వఱకు సాగునీ కనుఱెప్పల తీరు చూచుచున్నపుడు నా మనస్సునకు ఈ విధముగా కన్పట్టు చున్నది. బాణముల కిరుప్రక్కలకట్టు గ్రద్ద ఈకలవలె నుండు ఱెప్ప వెంట్రుకలతో చెవుల వఱకు సాగు నీ నేత్రములలో - త్రిపుర హరుని మనస్సునకు ప్రాప్తించిన శాంతమైన నిస్పృహను పోగొట్టి, మోహమును కలిగించుటయే ప్రయోజనముగా గలవియై, ఆకర్ణాంతములాగబడిన - మన్మథుని బాణముల సౌందర్యము గోచరించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో గూడా అమ్మవారి నేత్రములే వర్ణింపబడినవి. క్రిందటి శ్లోకములో అమ్మవారి కనుబొమ్మలు, వాటి క్రింది రెండు కన్నులు వర్ణింపబడగా, ఈ శ్లోకములో - అందమైన కనుఱెప్పలు గల అమ్మవారి కన్నులు వర్ణింపబడుచున్నవి.

**తూపుల చూపులు**

అమ్మవారి కన్నులు రెండును రెండు చెవుల వరకు సాగి, కోసగా, ఆకర్ణాంత విశాలముగా నున్నవిట. చూచుటకు అవి - త్రిపురములను చిత్తు చేసిన త్రినేత్రుని నిర్లిప్త చిత్తమును సైతము మోహపెట్టుటయే తన లక్ష్యముగా గలిగి ఆ కర్ణాంతము లాగబడిన - మన్మథుని బాణముల జంటవలె వున్నవిట. ''మరి బాణములకు చివర ఇరుప్రక్కల గ్రద్ద ఈకలు కట్టబడి అందముగా నుండును గదా ! మరి అమ్మవారి కనులకు అట్టి శోభను తెప్పించునవి ఏమైనా వున్నవా ?'' అని అడిగినచో - ''లేకేమి? జాగ్రత్తగా చూడుడు. ఆ కనులకు - క్రింద, పైన వుండు కనురెప్పలకు తీరుగా,

వంపుగా కొసలు గలిగిన నల్లని అందమైన వెంట్రుకలు అట్టి గ్రద్ధ ఈకల కూర్పును స్ఫురింప చేయుట లేదా!'' అని శంకరులు సమాధానము చెప్పుచున్నారు.

శివుని చిత్తమునకు మోహమును కలుగచేయుటకు సాధారణముగా తాను ఉపయోగించు ఐదు బాణములు పనిచేయవని, మన్మథుడు అమ్మవారి కటాక్షము (అనగా కడకంటిని)నే స్ఫురింపచేయునట్లు ఆరవ బాణమును రూపొందించుకొని, శివునిపై ప్రయోగించెననుట ఎక్కువ సత్యమనిపించుకొనును. అనగా – ముక్కంటిని మోహపెట్టుటకు ములుకుల బాణములను పోలెడి – ఆయన ముద్దరాలి ముచ్చటైన కోసకళ్ళనే – మన్మథుడు ప్రయోగించి సాధించినాడన్నమాట!



## సంస్కృత శ్లోకము - 53

**శ్లో. విభక్త త్రై వర్ణ్యం వ్యతికరితలీలాంజనతయా**
**విభాతి త్వన్నేత్ర త్రితయ మిద మీశానదయితే**
**పున స్స్రష్టుం దేవాన్ ద్రుహిణహరి రుద్రానుపరతాన్**
**రజ స్సత్వం బిభ్రత్తమ ఇతి గుణానాం త్రయ మివ.**

## అనువాద పద్యము

***మ. భవదక్షిద్వయ వైభవాంజనము త్రైవర్ణద్యుతుల్ నింపగా -***
***నవసానమ్మున బ్రహ్మ విష్ణు హర సృష్ట్యారంభ కార్యక్రమో***
***త్సవమున్ జేయుదువమ్మ నీవును - రజస్సత్త్వాది త్రైగుణ్యమున్***
***భవదీయాంజన రేఖ గూడి యది సంప్రాప్తించు - మాహేశ్వరీ!***

## టీక

హే! ఈశానదయితే = ఓ మహాదేవుని ప్రియురాలా! ఇదం = ఈ కనబడు, త్వత్ నేత్ర త్రితయం = నీ యొక్క మూడు కన్నులు, వ్యతికరిత = అర్థవలయాకారముగా తీర్చినదై, లీలా = లీలార్థమై ధరించిన, అంజనతయా = కాటుక గలిగినదగుట చేత, విభక్త = ఒక దానితో ఒకటి కలసి కొనకుండ వేఱుపరచిన, త్రైవర్ణ్యం = తెలుపు, నలుపు, ఎఱుపు అను మూడు వన్నెలుగలదై, ఉపరతాన్ =

లీనమైనవారగు, ద్రుహిణహరి రుద్రాన్ = బ్రహ్మ, విష్ణు, రుద్రుల ముగ్గురిని, దేవాన్ = త్రిమూర్తిత్రయమును, పునః = మరల, స్రష్టుం = జగత్ సృష్టి కొఱకు, రజః = రజోగుణమును, సత్త్వం = సత్త్వ గుణమును, తమః = తమోగుణమును, ఇతి = అను, గుణానాం = సత్త్వరజస్తమస్సులను పేరుగల గుణముల యొక్క, త్రయం ఇవ = మూడింటి వలె, బిభ్రత్ = ధరించుచున్నట్లు ప్రకాశించుచున్నది.

## తాత్పర్యము

ఓ సదాశివుని ప్రియురాలా! నీ మూడు కన్నులు అర్ధవలయాకారముగా తీర్చినదై; లీలా విలాసార్థము ధరించిన కాటుక కలిగినదగుట చేత ఒక దానితో ఒకటి కలసికొనని తెలుపు, నలుపు, ఎఱుపు, అను మూడు రంగులు కలదై; గత ప్రళయము నందు తన యందు లీనమైన బ్రహ్మ, విష్ణు, రుద్రులు అను త్రిమూర్తులను మరల మరల విశ్వ సృష్టికొఱకు – సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములను ధరించు దాని వలె ప్రకాశించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకమునందు కాటుకతో నుండు అమ్మవారి కన్నులలోని తెలుపు, నలుపు, ఎఱుపు రంగుల ప్రయోజనమును, ప్రాముఖ్యమును వర్ణించుచున్నారు.

సాధారణముగా కన్నులలో – తెల్లగ్రుడ్డు తెల్లగాను, కంటిపాప నల్లగాను, రక్త జీరలు ఎఱ్ఱగాను వుండును. (మహాత్ముల నయనములు కొంచెము ఎఱుపుగా గూడా వుండును). అమ్మవారి వామ, దక్షిణ నేత్రములకు ఈ మూడు రంగులు ఉండును. లలాట నేత్రము గూడా – సహజముగ ఎఱుపురంగును, తెల్లగ్రుడ్డు వలన తెలుపు రంగును, కాటుక పెట్టుట వలన నలుపు రంగును కలిగి వుండును. కావున మొత్తము మీద విలాసార్థము కాటుక పెట్టబడిన అమ్మవారి మూడు కన్నులలో తెలుపు, ఎఱుపు, నలుపు మూడు రంగులు వుండును.

**వర్ణసమన్వయ రహస్యము**

తెలుపురంగు – సత్త్వగుణమును, ఎఱుపురంగు – రజోగుణమును, నలుపురంగు – తమోగుణమును సూచించును. ఈ త్రిగుణములకు సంబంధించినవారే త్రిమూర్తులు. బ్రహ్మ – రజోగుణమునకు, విష్ణువు -

సత్త్వగుణమునకు, రుద్రుడు - తమోగుణమునకు సంబంధించిన అధిదేవతలు. బ్రహ్మ సృష్టి కారకుడు. విష్ణువు స్థితి కారకుడు. రుద్రుడు లయకారకుడు. ఈ ముగ్గురు అధిదేవతలు అమ్మవారి ఆజ్ఞలను అనుసరించి, వారికి కేటాయించిన సృష్టి, స్థితి, లయ కార్యములను నిర్వహించుదురు. జగత్ప్రళయములో ఈ బ్రహ్మ, విష్ణు, రుద్రులు ముగ్గురు - దేవి కనువమూతలో లీనవముగుచు మరల విశ్వసృష్టి కాలమాసన్నమైనపుడు - అమ్మవారు తెఱచిన కన్ను నుండి వ్యక్తమై, ఆమె ఆజ్ఞాను వర్తులై, మరల వారి వారి కార్యములను నిర్వహించుదురు. ఈ విధముగా సృష్టి, స్థితి లయకారుల చేత వారి వారి బాధ్యతలను నిర్వర్తింప చేయుటకు అమ్మవారు తన కన్నులతోనే వారిని ఆజ్ఞాపించును. అందుకు వారి వారి గుణములను సూచించు తెలుపు, ఎఱుపు, నలుపు రంగులనే తాను తన కళ్లయందు ధరించినదన్నమాట ! సృష్టి, స్థితి, సంహారములు చేయుటకు మూడు శక్తులు వేరుగా వున్నను, అవి పరాశక్తి యొక్క మూడు రూపములే అని భావము.



## సంస్కృత శ్లోకము - 54

**శ్లో. పవిత్రీ కర్తుం నః పశుపతి పరాధీన హృదయే**
**దయా మిత్రై ర్నేత్రై రరుణ ధవళ శ్యామరుచిభిః**
**నద శ్శోణో గంగా తపన తనయేతి ధ్రువ మయం**
**త్రయాణాం తీర్థానా ముపనయసి సంభేద మనఘమ్.**

## అనువాద పద్యము

**మ. దయతో రాగసితాసిత ప్రభల నార్ద్రమ్మౌచు రాజిల్లు నీ**
**నయన జ్యోతుల కూర్పుతో నదులు శోణా జాహ్నవీ సూర్యసూ**
**త్రయమున్ సంగమ మొంద జేయు దొక చెంతన్ పుణ్య తీర్థమ్ముగా**
**భయ పాపమ్ములు మమ్ము వీడ - శివసంబంధైక సాధ్వీమణీ !**

## టీక

(హే) పశుపతి పరాధీన హృదయే ! = శివునికి అధీనమైన చిత్తము గల ఓదేవీ! దయామిత్రైః = దయకు స్నేహితమైన, లేదా - దయచేత తడిసి మృదులమైన,

అరుణ ధవళ శ్యామరుచిభిః = ఎఱుపు, తెలుపు, నలుపు అను కాంతి గలవియై, నేత్రైః = నేత్రముల చేత, శోణః నదః = శోణయను పేరు గల నదము, గంగా = గంగానది, తపనతనయా = సూర్యుని కూతురైన యమున, లేదా - కాళిందీనది, ఇతి = అను, త్రయాణాం = మూడుగా నున్న, తీర్థానాం = పుణ్యతీర్థముల యొక్క, అనఘం = పాపములను పోగొట్టు జలము కలదైన, అయం = ఈ, సంభేదం = నదీ సంగమ స్థానమును, నః = మమ్ములను, పవిత్రీకర్తుం = పవిత్రవంతముగా చేయుటకు, ఉపనయసి = దగ్గఱకు చేర్చుచున్నావు.

## తాత్పర్యము

శివాధీనమైన చిత్తము గల ఓ పార్వతీ ! కరుణరసార్ద్రత వలన మృదుత్వమును, ఎఱుపు, తెలుపు, నలుపు అను మూడు వన్నెల వికాసమునుగల నీ నేత్రత్రయము చేత ఎఱుపురంగు నీటితో ప్రవహించు శోణయను నదము (శోణ పశ్చిమ దిశగా పయనించును గాబట్టి దీనిని 'నదము' అనవలెను). తెల్లని నీటితో ప్రవహించు గంగానది, నల్లని నీటితో ప్రవహించు సూర్యపుత్రిక అయిన యమునానది - ఈ మూడు పుణ్య తీర్థములతో పాపములను పోగొట్టి అపవిత్రులను పావనలుగా చేయుటకు - వాటిని త్రివేణీ సంగమ స్థానముగా ఒక చోటకు చేర్చుచున్నావు.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి మూడు కన్నుల పావిత్ర్యమును గుఱించి చెప్ప బడుచున్నది.

అమ్మవారిని 'పశుపతి పరాధీన హృదయే!' అని సంబోధించి శ్లోకమును ప్రారంభించిరి. 'పశువు' అనగా ఒక గుంజకు కట్టబడి, పూర్తి స్వేచ్ఛ లేని జీవి. పూర్తి స్వేచ్ఛ లేకపోయినను ఏదో కొంత వున్నట్లు భావించుటకు వీలగు జీవులే ఈ పశువులు. వీటిని పాలించువాడే 'పశుపతి' అనగా - తనను పూర్తిగా నమ్మిన వారు - పాపకార్యముల వలన అజ్ఞానములో పడకుండా రక్షించు బాధ్యత వహించువాడు ఈ 'పశుపతి'. ఇట్టి పశుపతి యందు తన చిత్తమును లగ్నము చేసిన అమ్మవారు - ఆశ్రిత రక్షణము కొఱకై వహించు ఒక బాధ్యత గుఱించి ఈ శ్లోకము చెప్పుచున్నది.

**పవిత్రమైన పరిష్కారము**

అజ్ఞానము వలన ఇబ్బందులుపడువారు, తెలిసియో తెలియకయో పాపకార్యములు చేయువారు - ఈ ప్రపంచములో చాలా మంది వుందురు. అట్టి వారికి కూడా సద్గతి కలుగుటకు అమ్మవారు ఒక పరిష్కార మార్గము ఆలోచించినది. కారుణ్య రాశియైన అమ్మవారి కన్నులు కరుణాపూరిత ఆర్ద్రములై, అతి మృదులముగా నుండును. అవి - ఎఱుపు, తెలుపు, నలుపు రంగులలో నుండును. తన ముఖములోని మువ్వన్నెల ఆ నేత్రముల చేరికవలెనే - ఎఱ్ఱని నీటితో ప్రవహించు శోణానదిని, తెల్లని నీటితో ప్రవహించు గంగానదిని, నల్లని నీటితో ప్రవహించు యమునానదిని గూడా భారతదేశము నందలి 'ప్రయాగ' అను ప్రదేశము వద్ద ఒక దానితో ఒకటి దరిచేర్చి సంగమించునట్లుగా అనుగ్రహించెను. ఈ ప్రయాగయే నేటి అలహాబాదు నగరము. ఇది పూర్వము మహర్షులు, మహానుభావులు పెక్కుమంది యజ్ఞయాగములు, తపస్సులు చేసిన చోటు. ఈ కారణముల వలననే ఈ ప్రదేశము అంతటి పుణ్యక్షేత్రమై, ఇక్కడ వున్న ఈ త్రివేణీ సంగమ స్థానములో స్నానము చేసిన వారి పాపములను పోగొట్టి, పవిత్రులను చేయును.

**నదులు - నేత్రములు**

అమ్మవారి ముఖము నందలి రెండు కన్నులవలె - గంగా యమునా నదులు ఇరువైపుల నుండి ప్రవహించును. రెండు కన్నులకు నడుమనున్న భ్రూమధ్య భాగము కాశీ పుణ్యక్షేత్రమును తెలియ జేయును. ఫాలభాగమునందలి నేత్రము శోణానదిని తెలియ జేయును. ఈ ఫాలనేత్ర ప్రాంతమునందే ఈ మూడు నదుల సంగమ స్థానము ఉండును. శోణానది కాశీ పట్టణమునకు కొంచెము ముందుగా ప్రవహించుచు గంగానదిలో కలియును.

**రహస్యార్థము**

ప్రళయము వచ్చినపుడు అన్నియు నాశమొందినను, విశాలాక్షీ విశ్వేశ్వరుల అనుగ్రహము వలన ఈ కాశీ పుణ్యక్షేత్రము మాత్రము మార్పు చెందక వుండునని మన పురాణములు చెప్పును. ఇది ఇంటికి శంకు స్థాపన జరిగిన చోటు వంటిది. జీవికి - తైత్తిరీయోపనిషత్తులో చెప్పినట్లు 'సేంద్రయోనిః' అనగా - 'ఇంద్ర యోనిస్థానము'. బ్రహ్మరంధ్రము నుండి నిలువుగా క్రిందకు భ్రూమధ్యము నుండి

తిన్నగా అడ్డముగా వెనుకకు గీసిన రెండు గీతలు కలిసిన చోటు ఇది. ఈ స్థానమును నిరంతరము గుర్తు పెట్టుకొనునట్లు చేయుటకై - భ్రూమధ్యములో బొట్టు పెట్టుకొనమని మన భారతీయులు చెప్పుదురు. ఈ భ్రూమధ్య స్థానమును ఏకాగ్రబుద్ధితో ధారణ చేసి, ధ్యానమగ్నుడైనవాడు త్రివేణీ సంగమ స్నాన ఫలమును పొందునని గూడా ఈ శ్లోకమునందలి సూచనగా గ్రహించవచ్చును.



## సంస్కృత శ్లోకము - 55

**శ్లో. నిమేషోన్మేషాభ్యాం ప్రళయ ముదయం యాతి జగతీ**
**తవే త్యాహు స్సన్తో ధరణి ధరరాజన్య తనయే**
**తదున్మేషా జ్జాతం జగదిద మశేషం ప్రళయతః**
**పరిత్రాతుం శంకే పరిహృతనిమేషా స్తవ దృశః**

## అనువాద పద్యము

***ఉ. నీ కనుఱెప్పపాటునకు నింకును లోకములన్ని లీనమై,***
***నీ కనువిప్పకున్ తిరిగి నిర్మితమౌనని యోగులంద్రు, నీ***
***యా కనుమూతనాపితివి యాభువనమ్ముల క్షేమమున్ సదా***
***సాకగ గోరి, నీ యనిమిషత్వమ! యట్టిదె! పర్వతాత్మజా!***

## టీక

ధరణి ధర రాజన్యతనయే! = ఓ పర్వతరాజపుత్రీ! ఓ పార్వతీ! తవ = నీ యొక్క, నిమేష + ఉన్మేషాభ్యాం = కనుఱెప్పలు మూసుకొనుట చేతను, తెఱుచుకొనుట చేతను, జగతీ = జగత్తు, ప్రళయం = ప్రళయమును, ఉదయం = ఉద్భవమును, యాతి = పొందును, అని ఈ ప్రకారము, సంతః = సత్పురుషులు, ఆహుః = చెప్పుదురు, అతః = ఇందువలన, త్వత్ = ఆ, ఉన్మేషాత్ = నీ కంటి ఱెప్పలు తెరుచుట వలన, జాతం = ఉద్భవించిన, అశేషం = సమస్తమైన, ఇదంజగత్ = ఈ జగత్తును, ప్రళయతః = ప్రళయము నుండి, పరిత్రాతుం = రక్షించుట కొఱకు, తవ = నీ యొక్క, దృశః = కన్నులు, పరిహృతనిమేషాః = తిరస్కరించిన ఱెప్పపాటులు గలవి, ఇతి = అని, శంకే = శంకింతును, లేదా - తలంచుదును.

## తాత్పర్యము

పర్వతరాజపుత్రికా, ఓ పార్వతీ ! నీ కనుఱెప్పలు మూసుకొనుట చేత జగత్తుకు ప్రళయమును, ఱెప్పలు తెఱుచుకొనుట చేత జగత్తుకు సృష్టియు ఉద్భవించునని (వ్యాసమహర్షి వంటి) సత్పురుషులు చెప్పుదురు. అందువలన నీ కనుఱెప్పలు తెఱుచుట వలన ఉద్భవించిన యావజ్జగత్తును ప్రళయము నుండి రక్షించుట కొఱకు – నీ కన్నులు ఈ ఱెప్ప పాటులను తిరస్కరించుట వలన – నీ కన్నులు ఱెప్పపాటు లేక ఎప్పుడునూ తెఱుచుకుని ఉన్న స్థితిలోనే వున్నవని తలంచుచున్నాను.

## వివరణము

మానవులకు ఱెప్పపాటు – అనగా, కనుఱెప్పలు మూతబడుట, తెఱువబడుట ఉండును. కాని, దేవతలకు ఈ విధమైన ఱెప్పపాటు వుండదు. ఎప్పుడును వారి కళ్లు తెఱుచుకునే ఉండును. అట్లే, అమ్మవారికి కూడానుండు ఈ లక్షణమునకు గల కారణమును శంకరులు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

**అమ్మవారి అవ్యాజకరుణ**

శ్రీ లలితాసహస్రనామ స్తోత్రములో వ్యాసభగవానుడు అమ్మవారికి 'ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః' – అని ఒక నామము చెప్పినారు. 'అమ్మవారి కనుఱెప్పలు మూయబడినపుడు సకల లోకములకు ప్రళయము, అమ్మవారి కనుఱెప్పలు తెఱువబడినపుడు సకల లోకములకు ఉద్భవము జరుగునని ఈ నామ తాత్పర్యము. వ్యాస భగవానుని వంటి మహాత్ములు చెప్పిన ఈ విషయముననుసరించి అమ్మవారు గూడా మానవుల వలెనే కనుఱెప్పలు మూయుచు, తెఱుచుచూ ఱెప్పపాటును కలిగి యున్నచో – లోకములకు వినాశము, ఉద్భవము తారుమారుగా కలుగుచుండును. 'తన కనుఱెప్పలు తెరువబడినపుడు ఉద్భవమైన సమస్త జగత్తుకు, తనకనుఱెప్పలు మూయబడినచో వినాశము కలుగునేమోయని, అందుకు తానే కారణమగుదునని తలంచి లోకములపైనను, లోకులపైనను అపారమైన, అవ్యాజమైన కరుణతో తెఱచిన కనుఱెప్పల నా విధముగానే ఉంచి, ఱెప్పపాటు లక్షణము లేకుండా ఉన్నదేమో'' – అని శంకరులు జగజ్జననీ అయిన దేవతామతల్లికి ఱెప్పపాటు లేని

లక్షణమునకు ఇది ఒక కారణము కావచ్చునని ఊహించి చెప్పిరి. జగత్తుపై జగన్మాత యొక్క అపారమైన, అవాజ్యమైన అనురాగ లక్షణముగా ఈ ఱెప్పపాటు లేని లక్షణమును సమన్వయించి చెప్పుట ఈ శ్లోకము నందలి విశేషము.



## సంస్కృత శ్లోకము - 56

**శ్లో. తవాపర్ణే కర్ణే జపనయన పైశున్య చకితాః**
**నిలీయంతే తోయే నియత మనిమేషా శ్శఫరికాః**
**ఇయంచ శ్రీ ర్బద్ధచ్ఛదపుట కవాటం కువలయం**
**జహాతి ప్రత్యూషే నిశిచ విఘటయ్య ప్రవిశతి.**

## అనువాద పద్యము

***మ. అనిమేషత్వపు మీనముల్ చెవుల చెంతన్ జేరు నీ నేత్రముల్***
***కనగా దాగును నీటిలో భయము కల్గన్ గుట్టురట్టౌగవ***
***చ్చునుచున్, లక్ష్మియు రాత్రికిన్ కువలయమ్మందుండి, సూర్యోదయ***
***మ్మున యా రేకులు మూసి నీదు నయనమ్ముల్ జేర హస్సంతయున్.***

## టీక

(హే) అపర్ణే = ఓ పార్వతీ ! తవ = నీ యొక్క, కర్ణేజప = చెవుల సామీప్యమును నిరంతరము పొందుచున్న, నయన = కన్నులచేత అయిన, పైశున్య = రహస్యమును వెల్లడి చేయుటవలన, చకితాః = భయపడినదై, శఫరికాః = ఆడుచేపలు, అనిమేషా = ఱెప్పపాటు లేనివియై, తోయే = నీటియందు, నిలీయంతే = దాగుకొనుచున్నవి. నియతం = ఇది నిశ్చయము, మరియును – ఇయం = ఈ, శ్రీః చ= నీ నేత్రములను పొందిన లక్ష్మియు, బద్ధ = మూయబడిన, ఛదపుట = రేకు దొప్పలను, కవాటం = తలుపుగలదైన, కువలయం = కలువను, ప్రత్యూషే= ఉషః కాలమందు, జహాతి = త్యజించుచున్నది, నిశిచ = రాత్రియందు, తత్ విఘటయ్య = ఆ కలువను తెఱుచుకొని, ప్రవిశతి = లోపల ప్రవేశించుచున్నది.

## తాత్పర్యము

ఓ తల్లీ అపర్ణాదేవీ ! తాము చూసిన ఏదో రహస్యమును చెప్పుటకై

ఎప్పుడును నీ చెవుల వద్దనే వసించు అందమైన నీ రెండు కన్నుల తీరును చూచి భయపడిన ఆడు చేపలు కంటికి ఱెప్పపాటు లేక నీటిలో దాగుకొనుచున్నవి. మరియు, నీ నేత్ర సౌభాగ్య సౌందర్యలక్ష్మిని చూచిన నల్ల కలువలు పగలు బిడియముతో తమ అందమును రేకులలో ముకుళింప చేసుకుని దాచుచు, నీవు నిద్రపోవు రాత్రివరకు అట్లేవేచి యుండి, అటుపైన మాత్రమే తన రేకుల తలుపులను తెఱచి తన అందమును బయట పెట్టుటకు సాహసించుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకములో గూడా అమ్మవారి రెండు కన్నుల అందమే వర్ణింపబడినది. వర్ణింపబడిన తీరులో ఒక ప్రత్యేకత కలదు. చేపలకు ఱెప్పపాటు లేకపోవుట, నీటిలోనే వుండుట అనునది సర్వసాధారణ లక్షణము. అట్లే, నల్లకలువలు పగలు ముకుళించుకుని రాత్రివేళ వికసించుట గూడా సర్వసాధారణ లక్షణమే ! కన్నుల అందమును ఆడు చేపలతోను, నల్లకలువలతోను పోల్చి చెప్పుట కూడా సర్వసామాన్య విషయమే ! కాని, ఆడు చేపలు, నల్లకలువలు అమ్మవారి కన్నుల సౌందర్యమును పోల్చుటకు సరిరావని శంకరుల అభిప్రాయము. ఈ అభిప్రాయము సరిఅయినదే నని ఒప్పుకొనునట్లు చతురముగా చెప్పుటలోనే శంకరుల మేధస్సు, ఊహాశక్తి, చాతుర్యము మనకు ద్యోతకమగును.

**చేపలు నీటిలోనే ఉండుటకు కారణము**

చెవుల వఱకు సాగి ఆ చెవులతో ఏదో రహస్యమును చెప్పుచున్నట్లున్న అమ్మవారి రెండు కళ్ళను ఆడు చేపలు మొదటిసారి చూచినపుడు, ''తమ అందము ముందు ఈ ఆడు చేపల అందము ఏ విధముగాను సాటిరాదు, పైగా తమ అనిమేషత్వ లక్షణము (ఱెప్పపాటు లేని లక్షణము) ఈ చేపలు దొంగిలించినట్లుగా గూడా ఉన్నది'' అని అమ్మవారి రెండు కన్నులు ఆమె చెవుల దగ్గఱకు వెళ్ళి, తమ రహస్యమును బట్టబయలు చేయుచున్నట్లుగా కనబడినవి. అప్పుడు – నిజమే ! ఇన్ని రోజుల నుండి మన అందమే అందము. ఎవరి కళ్ల అందమును కవులు పోల్చవలసి వచ్చినను తమతోనే పోల్చక తప్పదని గర్వపడితిమి. ఇక లాభము లేదు. కవులకు ఈ విషయము తెలిసినచో తమతో కళ్ళను పోల్చుటకూడ మాని వేయదురేమో ! తమ దొంగతనము గూడా బయట పడవచ్చును, నలుగురికీ

కనబడునట్లు తలయెత్తుకుని బయట తిరుగుట కూడా అంత మంచిది కాదు. ఏ నీటిలోనో కనబడకుండా దాగుకొని శేషజీవితమును గడుపుట ఉత్తమము'' – అని ఒక నిర్ణయమున వచ్చి, ఆనాటి నుండి ఇప్పటివరకు ఱెప్పపాటు లేకుండా నీటిలోనే జీవనము సాగించుచున్నవట !

చేపలు నీటిలోనే వుండుటకును, వాటికి ఱెప్పపాటు లేక పోవుటకును - అనగా నిద్రపోనట్లు కనబడు లక్షణమునకు – శంకరులు చెప్పిన చిత్రమైన కారణమిది.

**నల్లకలువలు రాత్రివేళలోనే నివసించుటకు కారణము**

నల్లగా, విశాలముగా, అందముగానున్న కళ్ళను తమతోనే పోల్చవలెనను కొనిన నల్లకలువ పువ్వులు - అమ్మవారి రెండుకళ్ళను మొదటిసారిగా చూచిన తరువాత – 'అమ్మవారి రెండు కళ్ళ తీరు, అందము ముందు మనము సాటి రాము. ఇన్ని రోజుల నుండి తమ అందము అందరికినీ తెలియునట్లు విప్పారిన ముఖముతో గొప్పగా తిరిగితిమి. ఈ నాటి నుండి అందరికినీ మన విషయము ఎక్కువగా తెలియుటకు అవకాశము గల పగటి భాగములో తమ ముఖము కనబడకుండా ముకుళింప చేసుకుని దాచుకొనుట ఉత్తమము' అని ఒక నిర్ణయమునకు వచ్చి, అమ్మవారు కళ్ళు మూసుకుని నిద్రించు రాత్రి సమయములో మాత్రము మెల్లమెల్లగా ముఖమును వికసింప చేసుకుని – సౌభాగ్య, సౌందర్య లక్ష్మి వికాసము రాత్రివేళ మాత్రమే తమలో ఉంచుకొనుటకు పరిమితము చేసుకుని, ఆనాటి నుండి బిడియముతో జీవితమును గడుపుచున్నవి – అని శంకర భగవత్పాదులు – రాత్రివేళ మాత్రమే నల్లకలువలు వికసించుటకు గల కారణమును చిత్రముగా చెప్పిరి.



## సంస్కృత శ్లోకము - 57

**శ్లో. దృశా ద్రాఘీ యస్యా దరదళితనీలోత్పల రుచా**
**దవీయాంసం దీనం స్నపయ కృపయా మా మపి శివే!**
**అనే నాయం ధన్యో భవతి నచతే హాని రియతా**
**వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః**

## అనువాద పద్యము

మ. *ఎటుకైనన్ తెగసాగగల్గు దరఫుల్లేందీవరాక్షి ప్రభా*
*పటిమన్నింపుము, దూరదీనుడగు నాపై నీ దయా పాంగమున్*
*అటుపై ధన్యుడనౌదు నేను, మరి నీకా నష్టము సున్నయౌ*
*నటవీ హర్మ్యములందునన్ విధుడు తుల్యాస్రమ్ములందీయడే!*

## టీక

(హే) శివే ! = ఓ పార్వతీ ! ద్రాఘీయస్యా = మిక్కిలి పొడవుగాను, విశాలముగాను ఉన్నదియు, దరదళిత = కొంచెముగా వికసించిన, నీలోత్పలరుచా = నల్లకలువల వంటి కాంతి కలదియునగు, దృశా = గడకంటి చూపుచే, దవీయాంసం = చాలా దూరముననున్న, దీనం = దీనావస్థలో నున్న, మాం = నన్ను, అపి = సైతము, కృపయా = దయతో, స్నపయ = తడుపుము, అనేన = ఈ మాత్రము సహాయము చేత, అయం = ఈ జడుడు (అనగా – నేను) ధన్యః = కృతార్థుడను, భవతి = అగుచున్నాడు. ఇయత = ఇంత మాత్రము చేత, తే = నీకు, హానిః = వచ్చిన నష్టము, ద్రవ్య నాశము, నచ = లేనే లేదు (తథాహి = అదియుక్తము) హిమకరః = చంద్రుడు, వనేవా = అరణ్యము నందైనను, హర్మ్యేవా = సౌధములందైనను, సమకర నిపాతః హిమకరః = సమానమగునట్టి కిరణములను ప్రసరించుచున్నాడు గదా!

## తాత్పర్యము

తల్లీ ! పార్వతీ ! బాగుగా పొడవుగా సాగినట్లును, విశాలముగాను, కొంచెముగా వికసించిన నల్లకలువ కాంతివంటి కాంతికలదియు అయిన నీ గడకంటి చూపుచే – చాలా దూరములో, దీనావస్థలోనున్నప్పటి నన్ను సైతము తడుపుము. ఈ మాత్రము సహాయముచేత ఈ దీనుడు ధన్యుడగును. నీకును వచ్చిన నష్టము గాని, ద్రవ్యనాశము గాని లేదు. ఇది (ఇట్లు నేను నిన్ను కోరుట – నీవు ఆ విధముగా చేయుట) విపరీతమేమీ కాదు, యుక్తమే ! ఎందువలన అనగా (నీ ఎడమ కన్నైన) చంద్రుడు అరణ్యములలోను, సౌధముల పైనను గూడా సమానముగానే తన కిరణములను ప్రసరింప చేయుచున్నాడు గదా !

## వివరణము

ఈ శ్లోకములో ఎంతో దూరముగా, దీనస్థితిలోనున్న వానిపైన గూడా అమ్మవారు తన కృపావీక్షణమును ప్రసరింప చేసి, ధన్యుని చేయగలుగుటకు తగినదని శంకరులు నిర్ధారించిరి.

భారతదేశమునకు పూర్తిగా ఉత్తర భాగములో, చాలా ఎత్తుగా నున్న హిమవత్పర్వత గౌరీ శంకర శిఖరముపై అమ్మవారు ఉన్నది. భారతదేశమునకు పూర్తిగా దక్షిణ భాగములోని 'కాలడి' గ్రామములో ఆదిశంకరులు ఉన్నారు. అయినను అమ్మవారి అనుగ్రహమును పొందుటకు ఈ దూరములు, ఎత్తులు అడ్డుకావని శంకరులు చెప్పుచున్నారు.

**అవధులు లేని అనుగ్రహము**

''అమ్మా! నీ కన్నులు చాలా పొడవుగా ఆకర్ణాంత విశాలముగా నుండును. అందుచే నీ దృక్పథము, దృష్టి పథము ఎంతటి ప్రదేశము మేరకైనను, ఎంత దూరమునకైనన, వ్యాపించుటకును, కొనసాగుటకును గూడా వీలుగానున్నవి. నీ వామ నేత్రము చంద్రాత్మకము కాబట్టి, నల్లకలువ వంటి ఆ కంటి కాంతిని ప్రస్ఫుటముగా వికిసింప చేసి, ప్రసరింప చేయుటకు గూడా వీలుగా నుండును. ఇట్టి అనుకూల లక్షణములు గలది కావుననే నీ కటాక్ష వీక్షణమును - ఎంతో దూరములోను, నీవు వున్న ప్రదేశము కంటె ఎంతో క్రిందుగాను, కడు దీనస్థితిలోను ఉన్న నాపై ప్రసరింప వలసినదిగా ప్రార్థించుచుంటిని. నీ కటాక్ష వీక్షణమునుతప్ప నేను పెద్ద పెద్ద భోగభాగ్యాదులను గూడా కోరినది లేదు. కావున, ఇది నీకు పెద్ద దుష్కర కార్యము కాదు. నీవు ఏ విధముగాను నష్టపోవునదియు లేదు. నేను ఇందువలన ధన్యుడనగుదును గూడా! నీవు దీనబాంధవివి - నేను దీనుడను. ఇంతకంటె మన ఇద్దరి మధ్య ఇచ్చి పుచ్చుకొనుటకు ఏమి కావలెను? ఇంత చెప్పినను మౌనముగా నున్న నిన్ను చూచుచున్నపుడు - నీవు అనుగ్రహించుటకు నేను తగనని, అర్హత లేనివాడినని ఏమైనా నీకు అభిప్రాయము గలదేమోనని అనుమానముగా నున్నది. అయినచో - అర్హత, అనర్హతల గూర్చి ఒక్క విషయము చెప్పమందువా తల్లీ! చంద్రుడు సుధాకిరణములను ప్రసరించువాడు గదా! వెన్నెలలను

విరజిమ్ముమవాడు గదా! రాజసౌధములు చంద్రకాంత శిలలతో కట్టినవి కాబట్టి - అవి వెన్నెలలను పొందుటకు ఎక్కువ అర్హత కలిగినవని వాటిపై ఎక్కువ వెన్నెలలను వర్షింప చేసి - కాకులు దూరని, చీకటితో నిండిన కారడవులు గదా అని, వాటిపై వెన్నెలగుమ్మరించి నందు వలన ఏమంత ప్రయోజనము కలుగునని - వాటిపై తక్కువ వెన్నెలలను ప్రసరింప చేయుచున్నాడా ? లేదే ! ఆ రెంటిపైకి గూడా - అర్హతలతో పని లేకుండానం, నిష్పక్షపాత బుద్ధితోనం, సమముగానే వెన్నెలనం ప్రసరింపచేయుచున్నాడు గదా! అట్టి చంద్రుని వామనేత్రముగా గలిగిన నీవు, ఆ చంద్రుని వలెనే వర్తించి, నన్ను నీ కరుణారసార్ద్ర దృష్టితో తడిపి, కనికరించవమ్మా'' అని శంకరులు ఈ శ్లోకములో అమ్మవారిని ప్రార్థించిరి. ఇన్ని విధములుగా అమ్మవారిని నొప్పించని విధములో మెప్పించి, ఏ విధమైన తిరుగు సమాధానము చెప్పుటకును కూడా వీలులేని పరిస్థితులలో నిర్బంధ పెట్టినపుడు - అమ్మవారు అనుగ్రహించుట కాక మరి ఏమి చేయగలదు ? శంకరుల విధానమే విధానము., వాదమే వాదము, లౌక్యమే లౌక్యము, భక్తియే భక్తి, జ్ఞానమే జ్ఞానము.



## సంస్కృత శ్లోకము - 58

**శ్లో. అరాళం తే పాళీయుగళ మగరాజన్యతన యే**
**న కేషా మాధత్తే కుసుమశర కోదండ కుతుకమ్**
**తిరశ్చీనో యత్ర శ్రవణపథ ముల్లంఘ్య విలసన్**
**అపాంగ వ్యాసంగో దిశతి శరసంధాన ధిషణామ్.**

## అనువాద పద్యము

***అమ్మా ! నీ చెవిమధ్యగానరుగు నీ యక్షి ప్రభాపాంగ మా***
***ర్గమ్మున్ మార్గణమట్లు గల్గిన భవత్కర్ణాక్షిమధ్యస్థ రూ***
***పమ్ముల్ జూడగ దోచదే సుకవి భావమ్మందు - శ్రీపుత్రచా***
***పమ్మున్ గూడు శరప్రయోగమును - శుభ్రాంశు ప్రభా ! గోత్రజా !***

## టీక

(హే) అగరాజన్యతనయే ! = ఓ పర్వతరాజపుత్రీ! పార్వతీ ! అరాళ =

వంకరగానున్న, తే = నీ యొక్క, పాళీయుగళం = కణతల జంట (కళ్ళకు చెవులకు మధ్య నుండు ప్రదేశము) కుసుమశరకోదండకుతుకమ్ = పువ్వులను బాణములుగా గల మన్మథుని వింటి యొక్క సౌభాగ్యముగా, 'కేషాం = ఎవరికి, నఆధత్తే = (సందేహము) కలిగించదు ? యత్ = ఏ కారణము వలన, యత్ర = ఏ కణతల జంట యందు, తిరశ్చీనః = అడ్డముగా ప్రసరించుచు, విలసన్ = ప్రకాశించుచున్నదై, అపాంగ వ్యాసంగః = కడగంటి యొక్క వ్యాపన విలాసము, శ్రవణపథం = చెవి సామీప్యమును, ఉల్లంఘ్య = దాటుచు, శరసంధానధిషణాం = అమ్మును గూర్చు బుద్ధిని, అనగా – భ్రాంతిని, దిశతి = ఇచ్చుచున్నదో.

## తాత్పర్యము

ఓ పర్వతరాజపుత్రీ ! పార్వతీ ! అందమైన వంపులతో సొంపుగానున్న నీ కణతల జంట ప్రదేశమును చూచుట తోడనే అది – 'పుష్పబాణమును ఎక్కు పెట్టిన మన్మథుని వింటి సొగసు అయి ఉండునేమో అని'' – అనిపించకుండా నుండునా ! (అనగా – అనిపించునని భావము) కారణమేమనగా – వంగినవిల్లు వలె నుండి, వంపుసొంపుల కణతల గుండా నీ కృపా వీక్షణ విలాస ప్రకాశము, బాణము వలె నీ చెవులను చేరుటయే గాక, వాటిని దాటుచూ గూడ నున్నది గదా!

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి కణతల భాగము వర్ణింపబడినది. కళ్ళకు చెవులకు మధ్య నుండు వదన ప్రదేశములను 'కణతలు' అందురు. ఈ కణతలు అందమైన రీతిలో మృదువుగా, వంపు తిరిగి వుండును. ఈ వంపు సొంపుల కణతల భాగపు తీరును, కన్నుల నుండి తిన్నగా అడ్డముగా చెవుల వరకు వ్యాపించి, అటుపైన ఆ చెవులను గూడా దాటిన కృపావీక్షణ ప్రసారపు తీరును – జాగ్రత్తగా పరిశీలించినచో – ఎక్కుపెట్టగా వలయాకారముగా వంగిన మన్మథుని ధనుస్సు యొక్క ఆకారములో ఆ వంపు సొంపుల కణతల తీరు కనబడుననియు, మరియు – అటువంటి తన ధనుస్సునకు మన్మథుడు ఎక్కు పెట్టిన బాణముగా – ఆ కృపావీక్షణ ప్రసారపు తీరు స్ఫురించి తీరుననియు శంకరులు చెప్పుచున్నారు. అమ్మవారి ముఖము నందలి– భ్రూ, నేత్ర, వీక్షణాదులతో పాటు కణతల భాగము కూడా మన్మథుని లక్ష్యసాధనకు ఉపకరణము గానే గోచరించునని ఈ శ్లోకము నిర్ధారించుచున్నది.



## సంస్కృత శ్లోకము - 59

శ్లో. స్ఫుర ద్గండాభోగ ప్రతిఫలిత తాటంకయుగళం
చతుశ్చక్రం మన్యే తవ ముఖమిదం మన్మథరథమ్
య మారుహ్య ద్రుహ్య త్యవనిరథ మర్కేందు చరణం
మహావీరో మారః ప్రమథపతయే సజ్జితవతే.

## అనువాద పద్యము

మ. *తళుకుల్ చిందుచునున్న గండములపై తాటంకబింబమ్ములన్*
*గల నీ మోమును - నాల్గు చక్రముల శృంగారేశ్వర స్యందన*
*మ్ములరందున్, మరి దాని నెక్కి తను చంద్రార్కుల్ రథాంగమ్ములై*
*యల భూమేరథమైన శంభు నెదిరంపన్‌గల్గె వీరాకృతిన్.*

## టీక

(హే భగవతీ) తవ = నీ యొక్క, ఇదం = ఈ, ముఖం = (నాకు ఊహలో గోచరించు) నీ ముఖము, స్ఫురత్ = స్వచ్ఛమైన ప్రకాశ లక్షణముతో అద్దమువలె మెఱయుచున్న, గండ = చెక్కిళ్ళ యొక్క, ఆ భోగ = విశదమైన తలము నందు, ప్రతిఫలిత = ప్రతిబింబించిన, తాటంక యుగళం = చెవి కమ్మల జతగలదై, చతుశ్చక్రం = నాలుగు చక్రములు గల, మన్మథ రథం = మన్మధుని రథముగా, మన్యే = ఊహించుచున్నాను. యం = ఏ నీ ముఖము అను అట్టి రథమును, ఆరుహ్య = ఎక్కి, మహావీరం = గొప్పవీరుడైన, మారః = మన్మధుడు, అర్కేందు చరణం = సూర్యచంద్రులను చక్రములుగా గలిగిన, అవని రథం = భూమి అనురథమును, సజ్జితవతే = యుద్ధమునకై సిద్ధపరచబడిన ఆ రథమును ఎక్కియున్న, ప్రమథపతయే = ప్రమథ గణములకు ప్రభువైన, త్రిపురహరుడైన శివుని కొఱకు, ద్రుహ్యతి = ద్రోహము చేయుచున్నాడు - అనగా ఎదుర్కొనుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! స్వచ్ఛమైన ప్రకాశ లక్షణముతో అద్దమువలె మెఱయుచున్న నీ చెక్కిళ్ళు, లేదా - కపోలముల తలములపై నీ చెవుల తాటంకముల జత యొక్క ప్రతిఫలించిన చక్రబింబములు కలిగి నీ ముఖము - నాలుగు చక్రముల రథము

వలె తోచుచున్నది. ఇట్టి నీ ముఖరథమును ఎక్కి మన్మథుడు మహావీరుని వలె - భూమిని రథముగాను, సూర్యచంద్రులను ధాని చక్రములు గాను - ఏర్పాటు చేసుకుని యుద్ధ సన్నద్ధుడై దాని నెక్కి వచ్చిన ప్రమథగణ ప్రభువు, త్రిపురహరుడు అయిన - శివుని - ఎదుర్కొన గలుగుచున్నాడు.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి చెక్కిళ్ళ చక్కదనము వర్ణింపబడినది. అద్దముల వంటి అందమైన చెక్కిళ్ళతో అమ్మవారి ముఖము మరింత అందముగా నున్నదని సామాన్య కవులు చెప్పుదురు. కాని, మహాకవులైన ఆదిశంకరులు అమ్మవారి చెక్కిళ్ళను వర్ణించిన తీరు అతి మనోహరము, అతి మనోజ్ఞము.

**మహేశ్వరునిపై మన్మథ లీల**

'మన్మథుడు గొప్పశక్తి ఉపాసకుడు. ఈ ఉపాసనా బలముతోనే శివుడంత వానిని గూడా మోహపరచుటకు ఉద్యుక్తుడగును. అందుకు అమ్మవారి ఆశీస్సులను మాత్రమే పొందుటతో సంతృప్తి పడడు. శివుని మోహపరచుటకు ప్రత్యక్షముగా కాకపోయినను పరోక్షముగా అమ్మవారినే చిత్రమైన రీతిలో ఉపయోగించు కొనును' అను విషయమును ఈ శ్లోకము ద్వారా శంకరులు తెలియ చేయుచున్నారు.

సామాన్యులను ఎదుర్కొని, వారిని కామవశులను చేయుట మన్మథునికి అత్యంత సులువైన పని. కాని - భూమిని రథముగా చేసుకుని, దానికి సూర్యచంద్రులను చక్రములుగా సంధించి, మంధర పర్వతమును విల్లుగాను, విష్ణుమూర్తిని దానికి తగ్గ బాణముగాను చేసుకొని - అమిత పరాక్రమవంతులు అయిన త్రిపురాసురులను సంహరించుటకు వెళ్ళిన - శివునంతటి వానితో ఒక పిల్లవాడైన మన్మథుడు తగుదునమ్మా అని సాహసము చేసి, ఎదుర్కొన బోవుట ఊహించలేనంత దుష్కరమైన పని. ఇటువంటి సందర్భములలో కావలసినది బుద్ధిబలము గాని - భుజబలము, అంగబలము, అర్థబలము కాదు. పిల్లవాడైనను మన్మథుడు చాలా బుద్ధి నైశిత్యము కలవాడు. లౌక్యము, సమయస్ఫూర్తి, నైపుణ్యము, అతని కీలక లక్షణములు. అవతల శత్రువు గట్టివాడే కాని, ఆ శత్రువుకు గూడా కొన్ని దుర్బల లక్షణములు, లౌల్యములు, లోటు గుణములు (Weak Points) వుండవచ్చును. వాటి ద్వారా వ్యవహారమును పరిష్కరించు కొనవచ్చునని మన్మథుని

వంటి వారికి తెలియును. శివునికి ఒకే ఒక దుర్బల లక్షణము కలదు. అందమైన అమ్మవారిని గాని, అమ్మవారికి సంబంధించిన వస్తుసామాగ్రి విశేషాదులేవైన గాని కనబడినచో శివుడు వివశుడై కర్తవ్యమును కూడా మరచి, ప్రమత్తుడగును. ఈ సంగతి తెలిసిన మన్మథుడు తానెక్కి వెళ్ళవలసిన రథమును క్రొత్త పద్ధతిలో రూపొందించెను.

అమ్మవారి అందమైన గుండ్రటి ముఖమును చూచి – అచ్చు గ్రుద్దినట్లు అమ్మవారి ముఖము వలెనే కనబడు విధములో ఒక రథమును రూపొందించెను. శుద్ధమైన నునుపుటద్దముల వలె మెరయుచుండు అమ్మవారి చెక్కిళ్ళ సోయగమును చూసి – ఆ రథము ఇరుపార్శ్వములు అదే విధముగా నునుపుగా మెరయునట్లు జాగ్రత్తపడెను. రథమును నడిపించుటకు చక్రములు నాలుగు ఉండవలెను గదా! అమ్మవారి రెండు చెవులకు చక్రముల వలె వుండు తాటంక యుగళమును చూసి, అదే విధముగా అగుపించునట్లు తన రథమునకు రెండు చక్రములను ఏర్పాటు చేసెను. అమ్మవారి నునుపైన అద్దపు చెక్కిళ్ళపై చక్కగా ప్రతిఫలించగా ఏర్పడిన రెండు తాటంక ప్రతిబింబములను చూసి – అదే విధముగా కనపడననట్లు మరి రెండు చక్రములను అమ్మవారి ముఖమువలె నుండు తన రథమునకు పూన్చి, ఆ రథముపై తానెక్కి శివుని ఎదుర్కొనుటకు వెళ్ళెను.

ఎదురుగా వచ్చుచున్న పిల్లవాడైన మన్మథుని రథమును శివుడు చూచి, ముందు విస్తుపోయెను. అందు రథికుడు లేడు ( మన్మథుడు శరీరము లేనివాడు గదా!) క్రమ క్రమముగా తన ముందుకు రథము వచ్చుచున్నది. కాని, అది రథము వలె లేదు. చక్కని ముఖము వలె ఉన్నది. అది మరికొంచెము తన ముందుకు రాగా – 'అది రథము కాదని, సాక్షాత్తు తన ప్రియురాలు, ఇల్లాలు గూడా అయిన శర్వాణి యొక్క ముఖమే – కానిచో – అద్దముల వంటి ఆ చెక్కిళ్ళు ఎట్లు కనబడును? చెవులకున్న తాటంకముల ప్రతి బింబములు గూడా కనబడుచున్నవి గదా! ఇక అనుమానించవలసిన పని లేదు. ఆ వచ్చునది తన ప్రియురాలే' – అని అనిపించి, వివశుడై, కామవశుడయ్యెను.

ఈ కథలో శంకరులు - అమ్మవారి చెక్కిళ్ళ చక్కదనమునే కాక - మన్మథుని లీలలను, శక్తి యుక్తులను, శక్తి ఉపాసనా మహిమను, గూడా మనకు తెలియునట్లు పరోక్షముగా చెప్పిరి. మరియు, విశ్వములోని ఎంతటి శక్తి అయినను అమ్మవారి సౌందర్యాకర్షణ శక్తిముందు దిగదుడుపేనని గూడా ఈ శ్లోకములో సూచించిరి.



## సంస్కృత శ్లోకము - 60

**శ్లో. సరస్వత్యాః సూక్తీ రమృతలహరీ కౌశలహరీః**
**పిబంత్యా శ్శర్వాణీ శ్రవణచులుకాభ్యా మవిరళమ్**
**చమత్కార శ్లాఘా చలితశిరసః కుండలగణో**
**ఝణత్కారై స్తారైః ప్రతివచన మాచష్ట ఇవ తే.**

## అనువాద పద్యము

***శా. వాణీదివ్య ముఖస్ఫుటామృతపరీవాహాంతరాలాపనల్***
***వీనుల్ జేరగ మెచ్చుచున్, నిరతమాపీయూషమున్ గ్రోలి, నీ***
***వానందమ్మున శీర్షమూప, నిజకర్ణాలంకృతా కుండల***
***క్వాణ ప్రాభవ తార ఝుంకృతులు దోపన్ జేయు మార్పల్కులన్.***

## టీక

(హే) శర్వాణీ ! ఓ ఈశ్వరపత్నీ, పార్వతీ !, సరస్వత్యాః = సరస్వతీ దేవి యొక్క, సూక్తీరమృతలహరీ = మధురగానామృత ప్రవాహపు పొంగు యొక్క, కౌశలహరీః = సౌభాగ్యమును, అవిరళమ్ = ఎడతెగని విధముగా, శ్రవణచులుకాభ్యాం = చెవులు అనుపుడిసిళ్ళ చేత, లేదా - దోసిళ్ళ చేత, పిబంత్యాః = గ్రోలుచుండుట యొక్క, చమత్కార శ్లాఘా = ఆశ్చర్యమును, ఆనందమును శ్లాఘించుటలో యందు, చలితశిరసః = కంపించు (ఆడించు) శిరస్సుగల, తే = నీ యొక్క, కుండలగణః = కర్ణాభరణములు అన్నియు, తారైః = ఎక్కువైన, ఝణత్కారైః = ఝణఝణ ధ్వనులచేత, ప్రతివచన = ఆమోదపు బదులు మాటలను, ఆచష్టఇవ = వచించునదివలె నున్నది.

## తాత్పర్యము

తల్లీ శర్వాణీ! సరస్వతీ దేవి చేయు మధురగానామృత ప్రవాహపు పొంగును ఎడతెగని విధముగా - చెవులు అను పుడిసిళ్ళ చేత గ్రోలుటలో పొందు ఆశ్చర్య ఆనందములను శ్లాఘించుటకు శిరస్సును చలింపచేయగా, నీ కర్ణాభరణములన్నియు ఒక్కసారిగా ఎక్కువ స్థాయిలో ఝణ ఝణత్కార ధ్వనుల చేత ఆమోదపు మాటలను, అనగా - 'బాగున్నది - బాగున్నది' అని చెప్పెడు బదులు మాటలను పలికించుచున్నట్లున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి కర్ణాభరణముల గూర్చి చెప్పబడుచున్నది.

**ఆభరణములతోనే అమోద వచనములు**

సరస్వతీ దేవి అమ్మవారి కొలువులో చక్కగా గానకచేరి చేయుచున్నది. అమ్మవారు కొలువు తీరి ఆ గాన కచేరీని అత్యంత ఆసక్తితో, ఆనందపరవశత్వముతో వినుచున్నది. సరస్వతీ దేవి చేయు మధురగానామృత ప్రవాహపు సౌభాగ్యమును తన చెవులు అను పుడిసిళ్ళతో అమ్మవారు ఎడతెరపి లేకుండా గ్రోలుచున్నదట! ఆ విధముగా గ్రోలుటలో కలిగిన ఆనందమును ప్రతివచన ప్రశంసలతో సరస్వతీ దేవికి తెలుపవలె ననుకొన్నది. ప్రశంసలను, ప్రతివచనములను, అనగా - ఆమోదపు మాటలను పలుకవలెనన్నచో - నాలుక ద్వారానే చేయవలెను గదా! ప్రస్తుతము సరస్వతీ దేవి యొక్క గానామృతమును గ్రహించుచున్నది చెవులు గాని నాలుక కాదు గదా! కావున, తానువిన్న గానమాధుర్యానుభూతిని విన్నదానిని విన్నట్లుగా తెలియ చేయవలెనన్నచో - విన్న చెవులకు మాత్రమే సాధ్యము కాని వినెడి అవకాశము లేని నాలుకకు వీలుకాదు గదా! అందువలన వాగ్రూపములో 'బాగు బాగు' అని తన అంగీకార ప్రకటనను చెవులతోనే పలికించుటకు అమ్మవారు చిత్రముగా తన తలను ఆనంద పారవశ్యముతో ఆడించినది. అప్పుడు, చెవులకున్న కుండలాది ఆభరణములన్నియు ఒక్కసారి శ్రవణపేయముగా 'ఝణ' 'ఝణ' మని మధురమైన ధ్వనులను చేసినది. ఆ ధ్వనులు వినునపుడు సరస్వతీ దేవికి - ''ఓం, ఓం అనుచు, అనగా - బాగున్నది బాగున్నది అనుచు అమ్మవారు ఆనందముతో తన

ఆమోదమును, ప్రశంసలను ప్రతివచనములను తెలిపినట్లుగా'' అనిపించి, ఆనందించినది. సరస్వతీ దేవి నోటితో మాత్రమే మధురముగా పలుకగలదు. పాటకచేరి చేయగలదు, కాని – అమ్మవారు తన నోటితోనే కాదు అవసరమైనచో తన ఆభరణములచేత గూడా అంతకన్నా మధురముగా పలికింప చేయకలదని కూడా తెలుసుకొనవలెనని ఈ శ్లోక భావము.



## సంస్కృత శ్లోకము - 61

**శ్లో. అసౌ నాసావంశ స్తుహినగిరివంశధ్వజపటి (టే)**
**త్వదీయో నేదీయః ఫలతు ఫలమస్మాక ముచితమ్**
**వహత్యం తర్ముక్తా శ్శిశిరకర నిశ్వాస గళితం**
**సమృద్ధ్యా య త్తాసాం బహిరపి స ముక్తామణిధరః.**

## అనువాద పద్యము

***ఉ. వంశము బోలు నాసికకు వన్నెల ముత్యము జూడ దోచు, శు***
***భ్రాంశుని నాడి గూడి మణిభావము నందిన విడ్చుశ్వాసతో***
***భ్రంశపు ముత్యమట్లు, నది పండగ జేయును మాదు కోర్కెలన్***
***సంశయమింతలేదు హిమశైలకులధ్వజ కేతన ప్రభా!***

## టీక

(హే) తుహినగిరివంశ ధ్వజ పటి = మంచుకొండవంశము అను ధ్వజమునకు పతాకమైన ఓ హైమవతీ!, త్వదీయః = నీ సంబంధమైన, అసౌ = ఈ, నాసావంశ = నాసిక అను వంశదండము, లేదా – వెదురు కఱ్ఱ, అస్మాకం = మాకు, ఉచితం = తగిన విధముగా, నేదీయః = బాగుగా, ఫలం = కోరినదానిని, ఫలతు = ప్రాపింప చేయు గాక! సః = ఆ, నాసావంశ దండము, లేదా- ముక్కుదూలము, అంతః = లోపల, ముక్తాః = ముత్యములను (ముక్తి ఫలమును) వహంతి = ధరించుచున్నది. యత్ = ఏ కారణము వలన, తాసాం = ఆ ముత్యముల యొక్క, సమృద్ధ్య = నిండుదనము చేత, లేదా – పెరుగుదల చేత, శిశిరకర = చంద్ర సంబంధమైన, నిశ్వాస = వామనాడి యగు ఇడానాడీ మార్గవాయువుచే,

అనగా – ఎడమ ముక్కు నుండి వచ్చు నిశ్వాసముచే, గళితం = వెడలిన దానిని, బహిః అపిచ = నాసికకు బయట గూడా, ముక్తామణిధరః = ముత్యమును ధరించునది అయ్యెను ( తుహినగిరి వంశధ్వజ పటే – అని కూడా ఈ శ్లోక ప్రథమ పాదమునకు పాఠాంతరము గలదు).

## తాత్పర్యము

హిమగిరి వంశధ్వజమునకు పతాకము వంటి ఓ హైమవతీ ! నీ నాసిక అను వెదురు దండము మాకు తగిన విధముగా కోరిన వాటిని ప్రాప్తింప చేయుగాక! ఆ నీ నాసావంశదండము లోపల ముత్యములను ధరించుచున్నదని చెప్పవచ్చును. కారణమేమనగా – నీ నాసాదండము ముత్యములతో సమృద్ధిగా నిండి వుండగా చంద్ర సంబంధమైన వామనిశ్వాస మార్గము ద్వారా ముత్యము బయటకు వెడలి నీ నాసికకు క్రింద కొన యందు ముత్యముతో కూడిన ఆభరణమగుచున్నది గదా!

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నాసిక( ముక్కు) వర్ణింపబడుచున్నది. వ్యాసుల వారు శ్రీ లలితా సహస్ర నామస్తోత్రములో అమ్మవారి నాసాదండమును అప్పుడే వికసించు సంపెంగ పుష్పముతో పోల్చుచూ, 'నవచంపకపుష్పాభనాసాదండ విరాజితా' అని వర్ణించిరి. సంపెంగ పువ్వు విశిష్టత శ్రీలలితా సహస్ర నామ వివరణలో తెలుపబడినది.

ఈ వంశవైశిష్ట్యము ఈ సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులు అమ్మవారి నాసాదండమును (ముక్కుదూలమును) ఒక వంశ దండముతో, అనగా–వెదురుగడతో పోల్చిరి. సంస్కృతములో 'వంశ' పదమునకు – 'కులము', 'వెదురు' – అని రెండు అర్థములు గలవు. ముత్యములు పుట్టుచోటులలో వెదురుగడ గూడా ఒకటి అని చెప్పుదురు. ఈ శ్లోకములో అమ్మవారిని 'తుహినగిరివంశధ్వజపటి' – అని సంబోధించునపుడు గూడా 'వంశ' శబ్దము వచ్చినది. ఈ సంబోధనలో గల 'వంశ' శబ్దమును బట్టి – హిమగిరి వంశము ముత్యముల వంటివారికి పుట్టినిల్లని, 'వంశధ్వజపటి' అను పద ప్రయోగమును బట్టి – అటువంటి ముత్యములనిచ్చు వంశములో అమ్మవారు 'ఆణిముత్యము' వంటిదని కూడా అర్థము చెప్పుకొనవచ్చును.

**ముక్తవైశిష్ట్యము**

నాసాదండమును వంశ దండముతో, అనగా – వెదురుగడతో పోల్చుటలో కొంత విశిష్టత ఉన్నది. మోక్షమును కోరువారిని 'ముముక్షువులు' అందురు. బ్రతికి యున్నపుడే మోక్ష స్థితిలో నున్నవారిని 'జీవన్ముక్తులు' అందురు. సంసార మలినములు కడుగబడి, తొలగబడి స్వచ్ఛముగా నుండు వారే ఈ జీవన్ముక్తులు కాగలరు. వీరిని – సంక్షిప్తముగా 'ముక్తులు' అని గూడా అందురు. ఈ ముక్తులనే సంస్కృతములో 'ముక్తాః' అను శబ్దముతో వ్యవహరింతురు. ఈ 'ముక్తాః' శబ్దమునకు 'ముత్యములు' అని కూడా అర్థము గలదు.

**యోగ సమన్వయము**

ముక్త స్థితిని పొందుటకు 'యోగము' కూడా ఉపకరించును. ఈ యోగమార్గములోని ప్రధాన అంశము 'ప్రాణాయామము'. ప్రాణాయామము నాసా పుటముల ద్వారా జరుపు 'ఉచ్ఛ్వాస నిశ్వాసల నియంత్రణపై ఆధారపడి వుండును. కావున, 'ముక్తుల నిచ్చుటకు నాసిక పరోక్షముగా ఉపయోగపడుచున్నది' – అని చెప్పుట సమంజసమే గదా! కాబట్టి, నాసిక సహకారముతో ముక్తస్థితిని పొంది, జీవులు ముక్తులగుటకు అవకాశము గలదను ఒక విషయము ప్రస్తుతము తెలిసినది.

ఇక ముత్యముల సంగతి. అమ్మవారి నాసావంశదండములో ముత్యములు వున్న వన్న విషయము గూడా ఈ శ్లోకములో చిత్రముగా చెప్పబడినది.

**'ఇడాచవామ నిశ్వాసా సోమ మండల గోచరా'**

**పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్యతిష్ఠతి.**

పై శ్లోకమును బట్టి – నిశ్వాసము చంద్ర సంబంధమైన ఇడానాడికి సంబంధించినది. వామనాసాపుటము ద్వారా నిశ్వాసము వ్యక్తమగునపుడు అది చంద్ర సంబంధమైన ఇడానాడికి సంబంధించిన దగుటచే – చంద్రుని శీతల స్పర్శ నిశ్వాసమునకు తోడగును. హిమగిరిసుతయైన అమ్మవారి నిశ్వాసము సహజముగానే శీతలముగా వుండును. ఈ సహజ శీతలము, చంద్రనాడీ సంబంధమైన శీతల స్పర్శ – ఈ రెంటి సంస్పర్శ సంయోగముల వలన అమ్మవారు నిశ్వసించునపుడు నిశ్వాస వాయువు అతి శీతలమై ద్రవీభవించి నీటి బిందువుగా మారును. ఈ నీటి బిందువు నిశ్వాస మార్గములో ఘనీభవించి వామనాసాపుటము ద్వారా బయటకు వెలువడి అమ్మవారి ముక్కు చివర ముత్యాభరణముగా

భాసించును. అమ్మవారి నాసాభరణముగా మనము చూచు ముత్యము ఇదియే! - అని శంకరులు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

ప్రకృతీ స్వరూపమైన అమ్మవారి నాసావంశము ద్వారా - ప్రాణాయామ ఉపాసకులు, శ్రీ విద్యోపాసాకులు, ముక్తులు, ముత్యములు పుట్టి అమ్మవారి కీర్తి ప్రతిష్ఠలను పెంపొందించుదురు. అందుకే - ఆమె హిమగిరి వంశధ్వజ పటి !

వెదురు, అరటి, తేలు మొదలగునవి ఫలించినచో నశించునని చెప్పుదురు. కాబట్టి అమ్మవారి నాసావంశమందు అట్టి ఫలోత్పత్తిని చెప్పక, లోపలి ముత్యముల గుఱించియే చెప్పి, ''ఈ వంశము వాటి వలన, అనగా - ముక్తులు, ముత్యముల పుట్టుక వలన సమృద్ధి అగు గాక'' అని శంకరులు చెప్పిరి.



## సంస్కృత శ్లోకము - 62

**శ్లో. ప్రకృత్యాఽఽరక్తయా స్తవ సుదతి దంతచ్ఛదరుచేః**
**ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా**
**న బింబం త్వద్బింబ ప్రతిఫలనరాగా దరుణితం**
**తులా మధ్యారోఢుం కథమివ న లజ్జేత కలయా.**

## అనువాద పద్యము

***మ. పరిపక్వమ్ము, స్వభావ రాగములతో వర్ధిల్లు నీ మోవితో***
***సరిదూగాడునె, శుష్కవిద్రుమలతా సౌభాగ్యమౌ పండుయున్ ?***
***మరి నీ దేహపు ఛాయనంది ప్రతిబింబమయ్యె నా బింబమున్***
***సరితూగన్ త్రపగాదె తావక కలాసారమ్ముకున్ నిల్చునే ?***

## టీక

(హే) సుదతి = మంచి పలువరసగల దేవీ !, ప్రకృత్యా = స్వభావ సిద్ధముగనే, ఆరక్తాయాః = అంతట కెంపువన్నెగలదైన, తవ = నీ యొక్క, దంతచ్ఛదరుచేః = రెండు పెదవుల యొక్క సౌందర్య సౌభాగ్యమునకు, సాదృశ్యం = సరియైన పోలికను, ప్రవక్ష్యే = చక్కగా చెప్పుచున్నాను. విద్రుమలతా = పగడపు తీగ, ఫలం = పండిన పండును, జనయతు = పుట్టించినదైనచో (అది పోలికకు సరిపోవును), బింబం = దొండ పండుతో పోల్చవలసి వచ్చినచో, తత్‌బింబ = ఆ నీ

రెండు పెదవుల యొక్క బింబములను తనపై ప్రతి ఫలించుట చేత అయిన, రాగాత్ = ఎఱుపురంగువలన, అరుణితం = ఎఱుపు వన్నె పొందినదై, కలయా - అపి = ఒక పదునాఱవ పాలుచే, లేదా - లేశ మాత్రము చేతను గూడా, తులాం = సామ్యమును, అధ్యారోఢుం = అధిష్ఠించుటకు, లేదా - పొందుటకు, కథం ఇవ = ఏల, నలజ్జేత = సిగ్గుపడకుండును ?

## తాత్పర్యము

సుందరమైన దంత పంక్తిగల దేవీ! సహజముగనే పూర్తిగా కెంపురంగులో నుండు నీ రెండు పెదవులకు చక్కని సామ్యమును, లేదా - పోలికను చెప్పెదను. పగడపు తీగ - పండును పండించగలిగినచో - అది నీ పెదవులను పోల్చుటకు సరిపోవచ్చును. దొండపండువలె నున్నవని చెప్పవచ్చును, గాని, అవి నీ సాన్నిధ్యములో నీ పెదవుల ఎఱుపురంగు వాటిపై ప్రతిఫలించగా అవి ఎఱుపు దనమును పొందినవని వాటి 'బింబము' అన్న పేరే చెప్పుచున్నది. మరి, నీ ఎట్టిని పెదవులతో - కనీసము పదునాఱవ వంతు సామ్యమును కలిగినవని చెప్పుకొనుటకైనను అవి సిగ్గుపడకుండునా ?

## వివరణము

ఈ శ్లోకములో కెంపురంగు గలిగి సొంపులొలుకు అమ్మవారి రెండు పెదవుల గురించి చెప్పబడుచున్నది. సాధారణముగా పెదవులను పగడపు తీగతోను, దొండ పండుతోను పోల్చుదురు.

**పగడపు తీగ పోలిక**

అమ్మవారి రెండు పెదవులు - ఏ ఎట్టిని లేపనములు (Lipsticics) పూయ నవసరము లేక - సహజముగనే నిండు ఎట్టిని వన్నెలు విరజిమ్ముచుండును. ఇట్టి పెదవులకు సామ్యమును, అనగా - పోలికను చెప్పుటకు శంకరులు ప్రయత్నించగా- శంకరులకు మొదట పగడ పూతీగ గుర్తుకు వచ్చినది. కాని, సాధారణముగా పగడపు తీగలు పసుపు వన్నె, లేదా - ఆకుపచ్చ వన్నెతో నుండును. ఆ తీగ ఎట్టిని పళ్ళను గనుక ఇవ్వగలిగినచో - దానితో అమ్మవారి పెదవులను పోల్చవచ్చును. సహజముగా కాక, ఎట్టిని పళ్ళను ఇవ్వగలిగినపుడు మాత్రమే పోలికకు నిలబడు పగడపు తీగ

– సహజముగానే నిండు ఎఱ్ఱదనము కలిగి యుండు అమ్మవారి పెదవులతో పోలికకు అవి ఎట్లు తగినవగును ?

**దొండపండు పోలిక**

ఇక దొండపండు విషయము. సాధారణముగా అధరములను (క్రింది పెదవులను) దొండపండుతో పోల్చుదురు. దొండపండును సంస్కృతములో 'బింబఫలము' అందురు. పోల్చవలసి వచ్చినపుడు ఉపమేయమును ఉపమానమును ఒక చోట చేర్చి, వాటి లక్షణములన్నియు లెక్కలోనికి తీసుకుని నిర్ణయించి పోల్చవలెను.

''అమ్మవారి చేరువకు వచ్చినపుడు అమ్మవారి ఎఱ్ఱని అధర బింబకాంతి తనపై ప్రతి ఫలించి' అది దాని ప్రతిబింబ రూపుతో తానును ఎఱ్ఱగా నున్నదేమో ! లేనిచో 'బింబఫలము' అను పేరుతో ఎందుకు పిలవబడును?'' అని అనుమానము కలుగు రీతిలో దొండపండు ఉండును. అట్టి దొండపండుతో అమ్మవారి అధరములను పోల్చవచ్చునా ? కనీసము అమ్మవారి అధరముల కెంపురంగు యొక్క పదునాఱవ పాలుతో అయినను అట్టి ఆ దొండపండు పోటీకి నిలబడగలదా ? అమ్మవారి అధరారుణ ప్రభకు ఎఱ్ఱపడిన తాను – ఆ అమ్మవారి అధరములతోనే సాటిగా పోటీకి నిలువగలుగుదునని ఆ దొండపండు సిగ్గుపడకుండా చెప్పుకోగలదా? – అని శంకరులు ప్రశ్నించుకుని చివఱకు పగడపు తీగ, దొండపండు ఈ రెండును అమ్మవారి పెదవులను పోల్చుటకు ఏ మాత్రము తగవని నిర్ధారించి చెప్పిరి. శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములో 'నవవిద్రుమబింబశ్రీన్యక్కారిరదనచ్ఛదా' అని వ్యాసులవారు గూడా ఇదే విధముగా నిర్ణయించిరి.



## సంస్కృత శ్లోకము - 63

**శ్లో. స్మితజ్యోత్స్నా జాలం తవ వదనచంద్రస్య పిబతాం**
**చకోరాణామాసీ దతిరసతయా చంచుజడిమా**
**అతస్తే శీతాంశో రమృతలహరీ రామ్లరుచయః**
**పిబంతి స్వచ్ఛందం నిశి నిశి భృశం కాంచిక ధియా.**

## అనువాద పద్యము

*మ. జననీ నీ ముఖబింబమందు దరహాసజ్యోత్స్న లందించు పె*
*న్టనమౌ కమ్మదనమ్ము ముక్కు చవి తొల్గన్ జేయగా పుల్లగా*
*తినుటన్ గోరు చకోరముల్ - విధునిలో దీపించు జ్యోత్స్నావళిన్*
*గని త్రాగున్ పులిగంజియందు నిశిభాగమ్మంత స్వేచ్ఛారతిన్.*

## టీక

(హే పార్వతీ!) తవ = నీ యొక్క, వదనచంద్రస్య = ముఖము అను చంద్రుని యొక్క, స్మితజ్యోత్స్నాజాలం = చిరునవ్వు అను వెన్నెల నంతను, పిబతాం = త్రాగుచున్న, చకోరాణాం = చకోరపక్షులకు, అతిరసతయా = మిక్కిలి తీపి దనము చేత, చంచుజడియా = నాలుకలకు రుచి తప్పి మొద్దుబాఱుట, ఆసీత్ = కలిగెను, అతః = ఇందువలన, తే = ఆ చకోర పక్షులు, ఆమ్లరుచయః = పుల్లగా నుండు వాటి యందు ఆసక్తి కలిగిన్నవై, శీతాంశోః = చంద్రుని యొక్క, అమృతలహరీః = సుధాప్రవాహములను, లేదా - వెన్నెల అను అమృతమును, కాంచికధియా = అన్నపు గంజి, లేదా - బియ్యపు కడుగు నీరు అను భ్రాంతితో, స్వచ్ఛందం = ఇష్టము వచ్చినట్లుగా, నిశినిశి = ప్రతి రాత్రి యందు, భృశం = మిక్కిలి, పిబంతి = త్రాగుచున్నవి.

## తాత్పర్యము

తల్లీ జగజ్జననీ ! నీ ముఖము అను చంద్రుని యొక్క చిరునవ్వు అను వెన్నెల నంతను అమితముగా గ్రోలిన చకోర పక్షులకు - ఆ వెన్నెల వెఱ్ఱి తీపిగా నుండుట చేత వాని నాలుకలు ఆ తీపితో చచ్చుబారి - రుచి గూడా పట్టనివయ్యెను. అందువలన ఆ చకోర పక్షులు ఏదైనా పుల్లగా నుండు వాటిని త్రాగి, తీపితో నాలుక మొద్దబారిన తనమును పోగొట్టుకొనదలచి - చంద్రుని వెన్నెల అను అమృతమును బియ్యపు కడుగునీరు, లేదా - అన్నపు గంజియను భ్రాంతితో ప్రతి రాత్రి మిక్కిలిగా త్రాగుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి మందహాస మాధుర్యము చెప్పబడుచున్నది.

'మందహాసము'ను, అనగా – చిరునవ్వును, సాధారణముగా వెన్నెలతోను, పాల సముద్రముతోను పోల్చుదురు. 'మూకుడు' అను మహాకవి అమ్మవారి మందస్మితముపై 'మందస్మితము' అను నూరు శ్లోకముల శతకమునే వ్రాసెను. ఆ శతకములో మూకుడు అమ్మవారి చిరునవ్వు ప్రవాహమును పాల సముద్రపు వెల్లువతో పోల్చెను. ప్రస్తుత శ్లోకములో శంకరులు అమ్మవారి నవ్వును వెన్నెలతో పోల్చి, ఆ వెన్నెల ఎంత మాధుర్యముగా నుండునో ఒక చిత్రమైన రీతిలో చెప్పిరి.

**'చకోర పక్షి - వెన్నెల'ల అనుబంధ రహస్యము**

అమ్మవారి ముఖము చంద్రుని వలె ఉండగా, ఆమె చిరునవ్వు ప్రవాహము ఆ చంద్రుని వెన్నెల ప్రవాహము వలె ఉన్నదట ! ఆ వెన్నెలలన్నచో అమితముగా ఇష్టపడి, వాటి కోసమై ఎన్ని రోజులైనను ఓపికతో నిరీక్షించు చకోర పక్షులు అమ్మవారి ముఖ చంద్ర స్మిత సుధా ప్రవాహమును అమితమైన ఆసక్తితో ఎడతెరిపి లేకుండా జుఱ్ఱుకొని త్రాగి త్రాగి చివరకు వాటి నాలుకలు ఆ వెగ్టి తీపికి చచ్చుబడి ఇక రుచిని గూడా గ్రహించ లేనంత మొద్దుబారినవట ! సాధారణముగా వెగ్టి తీపికి నాలుక రుచి తప్పి చప్పబడినపుడు వక్కపొడిని గాని లేదా వగరుగా, లేదా – పుల్లగా నాలుకకు తగులు ఏమైన ఇతర ద్రవ్యములు గాని మనము తిని నాలుక చప్పదనమును పోగొట్టు కుందుము గదా ! అదే విధముగా అమ్మవారి చిరునగవు వెన్నెలను అమితముగా త్రాగి నాలుకలు చప్పబడిన చకోర పక్షులు – ఎక్కడైనను పుల్లగా నుండు ద్రవ్యములు ఏమైనను దొరుకునేమో అని ప్రయత్నించగా – వాటికి ఆ రాత్రికి చంద్రుడు కనబడెను. ఒకసారి ఆ చంద్రుని వెన్నెలను చవి చూసి – 'ఆహా ! ఇది పుల్లగా అన్నపు గంజివలె వున్నది. ఫరవాలేదు దీనిని త్రాగినచో చప్పబడిన నాలుకలు మామూలు స్థితికి రాగలవ'ని నిర్ణయించుకొని, ప్రతిదినము రాత్రి వచ్చెడు వేళకు వేచి యుండి, స్వేచ్ఛగా ఆ చంద్రుని వెన్నెలను త్రాగుచున్నవట !

చంద్రుని వెన్నెలనే చకోర పక్షులు మనసు పడి త్రాగునను విషయము సామాన్యముగా చెప్పుకొనుచుందురు. కాని, ఆ విధముగా చకోర పక్షులు చంద్రుని వెన్నెలనే ఎందుకు ఇష్టపడవలసి వచ్చినదో, అంతకు పూర్వము ఏమి జరిగినందు వలన ఈ విధముగా ఇవి మనసుపడవలసి వచ్చినదో – అను విషయమును ఈ శ్లోకములో విప్పి చెప్పి, చకోర పక్షుల గుట్టు బట్ట బయలు చేసిరి. మనకు ప్రతిరోజూ

బాగా అలవాటు అయిన విషయముల వంటి ఉదాహరణలతో, ఉపమానములతోను క్రొత్త పద్ధతిలో చెప్పిరి.

అమ్మవారి లేత నవ్వుల తీపిదనముతో పోల్చినపుడు చంద్రుని వెన్నెల తీపి దనము అన్నపు గంజివలె పుల్లగా నుండునను విషయమును, - వెన్నెలలు, వెన్నెల వంటి వాటి రుచుల లోని గుణదోషములను, తారతమ్యములను, హెచ్చుతగ్గులను, నిర్ణయించి చెప్పుటలో ప్రామాణికమైన - చకోర పక్షుల చేతనే చెప్పించుట ఒక క్రొత్త ప్రక్రియగా శంకరులు ఈ శ్లోకములో ప్రయోగించిరి. ఇటువంటి కవితా ప్రయోగములను శంకరుల తరువాత కాలము నాటి కవుల అనుసరించిరి.



## సంస్కృత శ్లోకము - 64

**శ్లో. అవి శ్రాంతం పత్యు ర్గుణగణకథా మ్రేడనజపా**
**జపాపుష్పచ్ఛాయా తవ జనని జిహ్వా జయతి సా**
**యదగ్రాసీనాయాః స్ఫటికదృషదచ్ఛచ్ఛవిమయీ**
**సరస్వత్యా మూర్తిః పరిణమతి మాణిక్యవపుషా.**

## అనువాద పద్యము

*మ. పతియౌ భర్గుని గాథలన్ నిరతమున్ పల్కించుచున్నట్టిదై,*
*అతిరాగద్యుతినుండు మంకెనలఛాయన్ బోలుచున్నట్టిదై,*
*అతి శుక్లద్యుతులొల్కువాణి మరి యే యగ్రమ్మునందుండగా*
*నతిరాగమ్మునమారు నట్టిదగు నీ యానాల్కకున్ గెల్పగున్.*

## టీక

(హే) జననీ ! = ఓ జగన్మాతా ! తవ = నీ యొక్క, సా = ఆ, జిహ్వా = నాలుక, అవిశ్రాంతం = నిరంతరము, పత్యుః = పతియైన = సదాశివుని యొక్క, గుణ = గుణముల, గణ = సమూహ సంపద యొక్క, కథా = వృత్తాంతముల యొక్క, ఆమ్రేడన = మరల మరల వచించుటకు, జపా = జపము గలదై, జపాపుష్పచ్ఛాయా = మందార పువ్వు యొక్క రంగు వంటి ఎఱ్ఱని కాంతి గలదై, జయతి = ప్రకాశించుచున్నది. యత్ + అగ్రాసీనాయాః = ఏ జిహ్వాగ్రము నందు

ఆసీనురాలైన, సరస్వత్యాః = సరస్వతీ దేవి యొక్క, స్ఫటికదృషత్ = స్ఫటికమణివలె, అచ్ఛ = తెల్లనై, ఛవిమయీ = అధికమైన, మూర్తిః = స్వరూపము, మాణిక్యవపుషా = పద్మరాగము యొక్క స్వరూపరక్తిమతో, పరిణమతి = పరిణామము చెందుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నీ నాలుక నిరంతరము నీ పతియైన సదాశివుని విజయ గుణగణముల చరిత్రలను ఎడతెరిపి లేకుండా చెప్పుచుండుట వలన మందార పుష్పము యొక్క ఎఱ్ఱని కాంతులు గలదై ప్రకాశించు చుండుటయేగాక, తన నాలుక యందే ఎప్పుడునూ ఆసీనురాలై, పూర్తిగా స్ఫటికము వలె తెల్లగా నుండెడు సరస్వతీ దేవిని సైతము పద్మరాగమణి కాంతులతో ఎఱ్ఱని రూపముగల దానిగా మార్చుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నాలుక గుఱించి చెప్పబడుచున్నది. నాలుక సాధారణముగా ఎవరికైనను ఎఱ్ఱగా నుండును. నాలుక ఆ విధముగా నుండుటకు మనలను అడిగినచో కారణము చెప్పలేము. కాని, అత్యధికమైన ఎఱుపురంగులో నుండు అమ్మవారి నాలుక ఆ విధముగా ఉండుటకు శంకరులు తగిన కారణమును ఈ శ్లోకములో చెప్పుటయేగాక, ఆ నాలుక ఎఱ్ఱదనము వలన ప్రభావితమగు ఇతర అంశములను కూడా చెప్పుచున్నారు.

**కర్తపై కర్మ ప్రభావము**

ఒకరు ఒక వస్తువును లేదా వ్యక్తిని తదేకముగా చూచునపుడు, లేదా – ఒక విషయమును గురించి ఆలోచించునపుడు గాని, ఒక సన్నివేశమును తదేకముగా చూచుట, లేదా – గుర్తుకు తెచ్చుకొనుట గాని జరుగునపుడు ఆ వస్తు వ్యక్తి, విషయ, సన్నివేశములు అతనిపై ప్రభావము చూపును. ఎఱ్ఱని చింత నిప్పును చూచుచున్నపుడు మన ముఖము గూడా ఆ విధముగా ఎఱ్ఱబడినట్లుండును. చల్లని వెన్నెలలను అను భవించునపుడు ఆ అనుభూతి యొక్క ఆనందము ముఖములో కనబడును. జుగుప్స గొలుపు వాటిని చూచునపుడు, వర్ణించునపుడు మన ముఖములో గూడా జుగుప్స కనిపించును. ఇది సామాన్య విషయమే !

ఎఱ్ఱని వస్తువును, లేదా – వ్యక్తిని గుఱించి చెప్పుచున్నప్పుడు – ఆ చెప్పునట్టి

నాలుక, చెప్పగా ప్రసారమగు శబ్ద తరంగములు, ఆ తరంగముల స్పర్శ తగిలిన వారు, శబ్ద విషయమును విన్నవారు గూడా – ఎఱ్ఱబడుదురని శంకరులు ఈ శ్లోకములో చెప్పుచున్నారు. ఇది ప్రత్యేక విషయమే మరి! ముందు ముందు వైద్యులు, శాస్త్రజ్ఞులు ఆలోచించవలసిన విషయమే!

శివుడు సహజముగా ఎఱ్ఱగా నుండును. త్రిపురాసురాది రాక్షసులను సంహరించునపుడు శివుడు మరింత ఎఱ్ఱబడును. ఇటువంటి శివుని తలంచుచు; ఆయన విజయపరంపర చరిత్రను, గుణములనే అమ్మవారు నిరంతరము స్మరించుచు; భాషించుచు; సంభాషించుచు నుండుట వలన ఆమె నాలుక రంగుగూడా మందార పుష్పఛాయను మించినట్లయ్యెనట! అట్టి నాలుక చేసిన భాషణములు, ప్రసంగముల వలన – అమ్మవారి నాలుక యందే ఎల్లప్పుడును వసించు – స్వచ్ఛమైన శ్వేత వర్ణముతో నుండు సరస్వతీ దేవి గూడా – పూర్తిగా ఎఱ్ఱగా మారిపోయినదట! సారాంశమేమనగా – అమ్మవారికి శివునిపై గల ధ్యాస, శివుని చరిత్రపై గల ఆసక్తి. ఆ శివచరిత్రలను పలుకు నాలుక యొక్క ఎఱ్ఱదనము మరెవ్వరికినీ ఉండవని ఈ శ్లోకము చెప్పును. మరియు సమస్త విద్యలకు అధిదేవత అయిన సరస్వతీ దేవి ఎల్లపుడును అమ్మవారి జిహ్వాపైననే వసించునని గూడా ఈ శ్లోకము చెప్పును.



## సంస్కృత శ్లోకము - 65

**శ్లో. రణే జిత్వా దైత్యా నపహృతశిరస్త్రైః కవచిభి**
**ర్నివృత్తై శ్చండాంశ త్రిపురహర నిర్మాల్యవిముఖైః**
**విశాఖేంద్రో పేంద్రై శ్శశివిశదకర్పూరశకలాః**
**విలీయంతౌ మాత స్తవ వదన తాంబూల కబళాః.**

## అనువాద పద్యము

*మ. శరజేంద్రాదులు దైత్యులన్ గెలిచి శీర్షణ్యాదులన్ వీడి, నిన్*
*దరిగా మ్రొక్కగ వచ్చుచుండ నట చండగ్రాసభాగమ్ముగా*
*హరనిర్మాల్యము నక్కడే వదలి, చంద్రాంశు ప్రభన్ వెల్గు, క*
*ప్పురపుం బల్కులుగల్గు నీ వదన తాంబూలమ్ము సేవింతురే.*

## టీక

(హే) మాత ! = ఓ జగజ్జననీ ! రణే = యుద్ధమునందు, దైత్యాన్ = రాక్షసులను, జిత్వా = జయించి, అపహృత శిరస్త్రైః = తీసివేయబడిన శిరస్త్రాణములు, అనగా – తలపాగలు, కిరీటముల వంటి వాటిని గల వారును, కవచిభిః = కవచములు గల వారును, నివృత్తైః = యుద్ధరంగము నుండి మరలి వచ్చిన వారును, చండాంశ = చండుడను ప్రమథుని భాగము అగు, త్రిపురహర = త్రిపురాసురులను సంహరించిన, శివుని యొక్క, నిర్మాల్య = నిర్మాల్యమునందు, విముఖైః = గ్రహింపని వారును ఐన – విశాఖ = కుమారస్వామి, ఇంద్ర = ఇంద్రుడు, ఉపేంద్ర = విష్ణువు, అను ముగ్గురి చేత, శశివిశద = చంద్రుని వలె స్వచ్ఛముగా నున్న, కర్పూర శకలాః = పచ్చకర్పూరపు తునకలుకలవైన, తవ = నీ యొక్క, వదన = ముఖము (నోరు) నుండి వెలువడి వచ్చిన, తాంబూల కబళాః = తాంబూలపు ముద్దలు, విలీయంతే = నమిలి మ్రింగబడి, జీర్ణమై, లీనమై పోవుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! యుద్ధము నందు రాక్షసులను జయించి తమ శిరస్త్రాణములను (తలపాగలను) తీసివైచి, కవచములు మాత్రము ధరించిన వారై, యుద్ధరంగము నుండి మరలి వచ్చుచు, ప్రమథగణములలో ఒకడైన చండునికి చెందు – త్రిపురహరుని నిర్మాల్యమును, అనగా – శివుడు స్వీకరించి విడిచిన గంధ తాంబూలాదికములను (చండునికే) వదలి, జగదంబనివాసమునకు వచ్చిన కుమారస్వామి, ఇంద్రుడు, విష్ణువులు – తల్లీ ! నీ నోటినుండి వెలువడి వచ్చిన తాంబూలపు ముద్దలను గ్రహించగా – అందలి, అనగా – ఆ తాంబూలపు ముద్దలలో చంద్రుని వలె స్వచ్ఛముగాను, నిర్మలముగాను ఉండు పచ్చ కర్పూరపు తునకలు గూడా పూర్తిగా నమలబడి, మ్రింగబడి ఆ తాంబూలకబళములు పూర్తిగా జీర్ణమై లీనమై పోవుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి తాంబూల విశేషము గూర్చి చెప్ప బడుచున్నది. సాధారణముగా తల్లితండ్రులు ఆహార ఉపాహారాదులను

స్వీకరించునపుడు - తమ పిల్లలు గూడా తేలికగా తినుటకు వీలుగానుండు నంతవఱకు ఆ ఆహారాదులను నమిలి, నమలబడిన ఆ ఆహార భాగమును చిన్న చిన్న ముద్దలుగా తమ సంతానములోని చిన్న పిల్లలకు ముద్దుగా ప్రేమతో ఇచ్చుదురు. తన పుత్రులకు పుత్ర సమానులకు అమ్మవారు తన తాంబూల భాగములను ఇదే విధముగా ఇచ్చు విషయము ఈ శ్లోకములో చెప్పబడుచున్నది.

**అమ్మవారి వాత్సల్యము**

కుమారస్వామి, ఇంద్రుడు, విష్ణువు ఈ ముగ్గురు యుద్ధరంగములో రాక్షసులను సంహరించిన తరువాత తిరిగి నివాసమునకు వచ్చుచుండగా ముందు శివనివాసము వద్ద శివ నిర్మాల్యమును చూచిరి. (శివనిర్మాల్యమనగా శివుడు స్వీకరించి విడచిన గంధ తాంబూలాదికములు ! ప్రమథ గణములలో ఒకడగు 'చండుడు' అను వానికి శివనిర్మాల్యము చెందునట్లుగా అక్కడ ఒక పద్ధతి, లేదా - నియమము పాటింపబడును. ఆ పద్ధతిని పాటించుచు, వారు ఆ శివనిర్మాల్యమును చండునికే వదిలి జగదంబ నివాసమునకు వచ్చి ఆమె సన్నిధానములో గౌరవ సూచకముగా తమ తలపాగాలను తీసివైచి, ఆమెకు పాదాభివందనము చేసిరి. అప్పుడు ఆ జగజ్జనని వారి యందు ప్రసన్నురాలై, తాను కొంచెము నమిలిన తాంబూల భాగమును చిన్న చిన్న ముద్దలుగా వారికి ముద్దుగా ప్రేమతో పెట్టెను. ఆ తాంబూల భాగము నందు స్వచ్ఛముగాను, నిర్మలముగాను నుండు పచ్చకప్పురపు ముక్కలు కూడా పూర్తిగా చూర్ణమగువరకు వాటిని వారు నమిలి మ్రింగిరి.

అమ్మవారి తాంబూల విషయముతో పాటు ఈ శ్లోకములో పెద్ద రాక్షసులను జయించగలిగిన వీరులు సైతము అమ్మవారి యెడల చూపించు వినయ, విధేయతలు, భక్తి, స్వంతకుమారునే గాక - ఇతరులను కూడా తన స్వంత బిడ్డల వలెనే చూచునట్టి అమ్మవారి మాతృవాత్సల్యము, పూర్తిగా జీర్ణించుకొని పోవు వరకు దక్కెడు అమ్మవారి అనుగ్రహ విషయము; శివలోకములో పాటింపబడు కొన్ని నియమ నిబంధనలు గూడా చెప్పబడినవి. (మూకుడను కవికి ఈ విధముగానే అమ్మవారు తన తాంబూల భాగమును ఇచ్చి మహాకవిని చేసెను.)



## సంస్కృత శ్లోకము - 66

శ్లో. విపంచ్యా గాయన్తీ వివిధమపదానం పశుపతే
స్త్వయారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే
తదీయై ర్మాధుర్యై రపలపిత తంత్రీకలరవాం
నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్.

## అనువాద పద్యము

*ఉ. వాణి విపంచితో శివుని పావన గాథలు పాడుచుండగా -
వానిని మెచ్చుచున్, సరస వాక్కులు పల్కుచు శీర్షమూపగా -
వీణియ పల్కు మించెననిపించెడు నీ మధురైక వాక్కులన్
తాను వినంగ, వీణియనుదాచగ, చాటుగ గప్పె వస్త్రమున్.*

## టీక

(హే జగజ్జనని !) పశుపతేః = ఈశ్వరుని యొక్క, వివిధం = అనేక విధములైన, అపదానం = సాహస కృత్యములు మొదలగు వాటిని, విపంచ్యా = వీణచేత, గాయంత్యా = గానము చేయుచున్న, వాణీ = సరస్వతి, వక్తుం = వచించుటకు, చలితశిరసా = మనస్సు నందు కలిగిన సంతోష వశమున స్వయముగా గలిగిన శిరః కంపము చేత, తవయా = నీచేత, సాధువచనే = మధుర వచనము, ఆరచ్ఛేతి = ప్రారంభించినదగుచుండగా, తదీయై = ఆవచన సంబంధులైన, మాధుర్యైః = మాధుర్య గుణముల చేత, అపలపిత = అపహసింపబడిన, తంత్రీకలరవాం = తంత్రుల యొక్క అవ్యక్త మధురములైన ధ్వనులు గలదైన, నిజాం = తన యొక్క, వీణాం = వీణను, చోలేన = వీణను ఉంచు పై ముసుగుచేత (Convering Cloth), నిభృతం = కనబడకుండా నుండునట్లు, నిచులయతి = బాగుగా కప్పుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! ఈశ్వరుని యొక్క వివిధ సాహస కృత్యములు చరిత్రలు మొదలగు వాటిని సరస్వతీ దేవి తన వీణతో గానము చేయుచుండగా = నీవు ఆనందముతో శిరః కంపము చేయుచు ప్రశంసా వాక్యములు పలుకు నంతలో – ఆ

ప్రశంసావచనములు తన వీణానాదము కన్న మధురముగా నున్నవని తలచి సరస్వతీ దేవి తన వీణాగానము నాపి, తన వీణను పైముసుగు చేత కనబడకుండా బాగుగా కప్పుచున్నది.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి వాఙ్మాధుర్యము గూర్చి చెప్పబడుచున్నది. అమ్మవారు కొలువు తీరి వుండగా - శివుని యొక్క వివిధ సాహస కృత్యముల చరితలను తెలుపునట్లు సరస్వతీ దేవి వీణాగానము చేయుచున్నది. అమ్మవారు విని ఆనందముతో తలను ఆడించుచు ప్రశంసావచనములు పలుకుట ఆరంభించెను. అమ్మవారి ఆ ప్రశంసా వాక్యములు శ్రవణ పేయముగా, హృదయానందకరముగా, మధుర మనోజ్ఞముగా నున్నట్లు అనిపించి - సరస్వతీ దేవికి కొంచెము బిడియము కలిగినది. తన వీణానాదము కంటె అమ్మవారి ప్రశంసా వచనములే మధురముగా నున్నవని, ఇంక తాను వీణా వాదమును కొనసాగించుట ఎంత మాత్రము మంచిది కాదని, తంత్రులు మీటుట ఆపి, వీణను ఉంచు ముసుగు చేత - ఎవరికీ కనబడకుండా సరస్వతీదేవి తన వీణను పూర్తిగా కప్పివేసినది.

సంగీత సాహిత్యములకు అధిదేవత అయిన సరస్వతీదేవి - అన్ని సంగీత వాయిద్యములలోను ఉత్తమ మైనది అయిన తన వీణను ( కచ్ఛపి) తానే స్వయముగా శ్రుతిచేసి, తంత్రులను మీటి, గానము చేసినను - ఆ గానమాధుర్యము కన్న అమ్మవారి ప్రతివచన ప్రశంసా వాక్యములే ( బాగు ! బాగు ! సెబాష్ అను మాటలు) ఎక్కువ మధురముగా నున్నవని - (సాక్షాత్తు ఆ సరస్వతీ దేవియే) నిర్ణయించు కొని, తన వీణాగానమును మధ్యలోనే ముగించినది. దీనిని బట్టి అమ్మవారి పాడిపాడి మాటలే అంత మాధుర్యముగా నుండగా ఆమె పూర్తిగా మాట్లాడినను, సిద్ధపడి గానమే చేసినను ఇంకెంత బాగుండునో అను విషయమును మనమే ఊహించుకొనవలెను.

శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రములో గూడా వ్యాసుల వారు ''నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ'' అని ఇదే విధముగా నిర్ణయించిరి.



## సంస్కృత శ్లోకము - 67

శ్లో. కరాగ్రేణ స్పృష్టం తుహినగిరిణా వత్సలతయా
గిరీశే నోదస్తం ముహు రధర పానాకులతయా
కరగ్రాహ్యం శంభో ర్ముఖముకురవృంతం గిరిసుతే
కథంకారం బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్.

## అనువాద పద్యము

*మ. హిమశైలేశ కరాగ్రముల్ ముదముతో నెద్దాని చూపట్టు, నా*
*ప్రమథాధీశుడు మోవినాన్భుతమితో పైకెత్తు దేనిన్ సదా,*
*అమలంబౌ శివహస్తముల్ కొనగ నర్హమ్మెద్ది ? నీ పోల్చలే*
*ని ముఖాదర్శపువృంత మా చిబుకనిర్ణిక్తమ్ము నెట్లెన్నుటల్ ?*

## టీక

(హే) గిరిసుతే = ఓ గిరిరాజపుత్రీ ! తుహినగిరిణా = పర్వత రాజైన నీ తండ్రి చేత, వత్సలతయా = వాత్సల్యము చేత, కరాగ్రేణ స్పృష్టం = మునివ్రేళ్ళతోపుడుక బడునదియు, గిరీశేన = శివుని చేత, అధరపాన + ఆకులతయా = అధర పానము నందలి తొట్రుపాటు చేత, ముహుః = మాటిమాటికి, ఉదస్తం = పైకెత్తబడినదియు, శంభోః= శివుని యొక్క, కరగ్రాహ్యం = చేతిని గైకొనదగినదియు, ముఖ ముకురవృంతం = ముఖము అను అద్దమునకు పిడి అయినదియు, ఔపమ్యరహితం = సరిపోల్చదగిన వస్తువు లేనిదియునగు (అనగా - సాటి లేనిదగు), - తవ = నీ యొక్క, చుబుకం = (క్రింది పెదవి కింద నుండు) గడ్డమునకు, కథంకారం = ఏ విధముగా (ఉపమానము చెప్పి) బ్రూమః = వర్ణించగలను ?

## తాత్పర్యము

ఓ గిరి రాజకుమారీ ! తండ్రి అయిన హిమవంతుని చేత అమితమైన వాత్సల్యముతో మునివ్రేళ్ళతో పుడుకబడినదియు, అధరామృతపానము నందలి అత్యుత తొట్రుపాటులతో శివునిచే మాటి మాటికీ పైకెత్తబడినదియు, శంభుని హస్తమును చేకొనతగినదియు, సరిపోల్చతగినది ఏమియు లేనిదియు అయిన - నీ



ముఖము అను అద్దమును పుచ్చుకొనుటకు అందమైన పిడివలె నున్న నీ ముద్దులొలుకు చుబుకమును (గడ్డము)ను – ఏ విధముగా వర్ణించగలను ?

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి చుబుకము (గడ్డము)ను గూర్చి చెప్పబడుచున్నది. సాధారణముగా అన్ని అవయవములకు చక్కగా సరిపోయెడి ఉపమానము చెప్పవచ్చును గాని, గడ్డమునకు ఉపమానము చెప్పుట కష్టము. ఎక్కువ మంది కవులు గడ్డమును 'అమలకము' (పెద్ద ఉసిరికాయతో పోల్చిరి. కాని, లలితాసహస్ర నామ స్తోత్రమును వ్రాసిన వ్యాసులవారు గాని, ఈ సౌందర్యలహరి వ్రాసిన ఆది శంకరులు కాని అమలక ఉపమానమును స్వీకరించలేదు వ్యాసులవారు 'అనాకలిత సాదృశ్య చుబుక శ్రీవిరాజితా' అని అమ్మవారి గడ్డమును గుఱించి చెప్పిరి. (ఉపమానము దొఱకని చుబుక సౌందర్యముతో విరాజిల్లునది – అని ఈనామమునకు అర్థము – ఈ అర్థ వివరమును నేను వ్రాసిన లలితా సహస్ర నామ వివరణలో చదువుకొనవచ్చును) ప్రస్తుతము శంకరులు అమ్మవారి చుబుకము గుఱించి చెప్పిన విశేషములు ముచ్చటించు కొందుము.

**అమ్మవారి చుబుకమునకు ఎన్ని అర్హతలో !**

అందరి చుబుకము వంటిది కాదు అమ్మవారి చుబుకము. కొన్ని ప్రత్యేకమైన అర్హతలతో, అపూర్వమైన అవకాశములకు, అదృష్టములకు నోచుకొనిన చుబుకము ఇది. చిన్నతనము నందు – అల్లారుముద్దుగా, అమితమైన వాత్సల్యముతో పెంచిన తండ్రి హిమవంతుడు ఎన్నో సందర్భములలో బ్రతిమలాడి, నచ్చచెప్పి, ఆశలు పెట్టి, మా 'బంగారు తల్లిగదూ!' అనుచూ ఎన్నో పర్యాయములు తనగారాబు పట్టి గడ్డమును తన మునివ్రేళ్లతో పుణికి పుచ్చుకొనుటను శంకరులు ఈ శ్లోకములో గుర్తుకు తెచ్చిరి. ఆకాశమును చుంబించకలిగినంతటి శిఖరము గలిగిన, దృఢవంతుడైన, మహోన్నతుడైన, పర్వతరాజు హిమవంతుని చేత – అమితమైన వాత్సల్యముతో 'మృదువుగా' పట్టుకొనబడినది అని శంకరులు అమ్మవారి గడ్డమును గూర్చి చెప్పిరి.

కాముని దహించిన శివుడంతటివాడు గూడా – అమ్మవారి సౌందర్యమును

చూచి తట్టుకొనలేక – ఆమె అధరమును చుంబించుటకు ఉద్యుక్తుడైనపుడెల్ల – ఈ అవకాశము ఎక్కడ జారిపోవునో అను ఆతృత తొట్రుపాటులతో – తన విమల హస్తముతో మాటి మాటికి పైకెత్తి పట్టుకొనబడిన గడ్డము అది – ''ఎంతటి అర్హత, అదృష్టము, అందము కలిగి ఉండకపోయినచో కామదహనుని కూడా కామ వశుని చేసి – అమ్మవారికి దగ్గరగుటలో ఆయనకు ఆమె చుబుకముతోడ్పడును? నిరంతరము ధ్యాననిష్ఠలో నుండు నిర్మల చిత్తమును గలిగిన ఆ శివునికి వివాహ యోగ మోహమును తీర్చుకొనుటలో అంతటి వాని పాణిచే గ్రహించబడుటకు అర్హత బొందును?'' అని శంకరులు అనుచున్నారు.

పోలిక చెప్పుటకు ఏమి ఉపమానము తోచని ఆమె ముఖమును, చుబుకమును – చూసి, చిట్టచివరకు ఒక నిర్ణయమునకు వచ్చి, 'అమ్మా! నీముఖము – నునుపైన, నిర్మలమైన అద్దము వలె నుండగా – దానిని చూచుచు పుచ్చుకొనుటకు వీలుగా నుండు పిడివలె నీ గడ్డము ఉన్నదమ్మా! ఇంతకంటె నేను పోలిక చెప్పలేను' – అని శంరుల తన నిస్సహాయస్థితిని వెల్లడించిరి.

**దర్పణ ఉపమాన రహస్యము**

అమ్మవారి ముఖమును చూడగా చూడగా శంకరులకు తట్టిన ఉపమానమది. ఈ ఉపమానములో ప్రకృతీ పురుషులకు సంబంధించిన ఒక విషయము కలదు. ''అయ్యవారు, అనగా – పరమాత్మ ఒక్కడే! బింబము (object). ఆయన వివిధ రకముల ప్రతిబింబములే ఈ ప్రపంచములోని జీవాత్మలు! ఆ విధముగా ప్రతిబింబింప చేయు దర్పణమే అమ్మవారి ముఖము!'' అని దక్షిణా మూర్తి స్తవములో! ''విశ్వందర్పణ బిందుమాననగరీ.....'' అన్న శ్లోకములో ఆది శంకరులే చెప్పిరి'' !

(పైన చెప్పిన దానిని బట్టి ఈ ఉపమానములో ఒక చిత్రమైన సూచన ఉన్నది. 'అద్దములో ఏర్పడు అమ్మవారి గడ్డము యొక్క ప్రతిబింబముతోనే అమ్మవారి నిజమైన గడ్డమును పోల్చగలుగునది – మిగిలిన ఉపమానములు సాటిరావు' – అనునది కూడా ఈ శ్లోకములో సూత్రప్రాయముగా నున్నది).

ఈ చుబుక వర్ణనతో అమ్మవారి ముఖవర్ణన పూర్తగును.



## సంస్కృత శ్లోకము - 68

శ్లో. భుజాశ్లేషా న్నిత్యం పురదమయితుః కంటకవతీ
తవ గ్రీవాధత్తే ముఖకమలనాళశ్రియ మియమ్
స్వత శ్శ్వేతా కాలాగురు బహుళజంబాలి మలినా
మృణాళీలాలిత్యం వహతి యదధో హారలతికా.

## అనువాద పద్యము

శా. ***శైవాలింగితభావ కంటకముతో చర్మంబు పొంగారి, స్వా***
***భావశ్వేతము, నల్లనౌయగురు - జంబాలార్థపంకమ్ముగా***
***శైవాలమ్ముగ హారవల్లరమరన్ సంపూర్ణమై వెల్గు, నీ***
***గ్రీవ మ్మొప్పు భవన్ముఖాంబుజధర శ్రీనాళరూపమ్ముగా.***

## టీక

(హే జగజ్జననీ !) తవ = నీ యొక్క, ఇయంగ్రీవా = ఈ కంఠనాళము, పురదమయితుః = పురహరుడైన శివుని యొక్క, భుజ + ఆశ్లేషాత్ = బాహువులచే నైన కౌగిలింతల వలన, నిత్యం = ఎల్లప్పుడు, కంటకవతీ = (గగుర్పాటువలన) రోమాంచముగలదైన, ముఖ కమల = ముఖమనెడు తామరపూవు యొక్క, నాళశ్రియ = కాడ అందమును, ధత్తే = ధరించుచున్నది. యత్ = ఏ కారణము వలన అధః = (ఆ కంఠమునకు) క్రిందుగా నున్న ప్రదేశము నందు, స్వతః = స్వయముగనే, శ్వేతా = స్వచ్ఛమైనదై, కాల + అగురు = నల్లనైన అగురు, గంధపు చెక్క యొక్క, బహుళ = విస్తారముగా నున్న, జలజల = పంకముచేత, మలినా = నలుపు వన్నె చేత, హారలతికా = ముత్యాల హారము, మృణాళీలాలిత్యం = తామరతూడు సౌందర్యమును, వహతి = ధరించుచున్నదో.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! పురహరుని బాహువులతో అయిన, కౌగిలింతలచే నిత్యము గగుర్పాటుతో రోమాంచము గలదై, క్రింద భాగము సహజముగనే స్వచ్ఛముగా నుండి, నల్లగాను విస్తారముగా నున్న అగురు గంధపు పంకముతో, తామరుతూడు అందమును చూపట్టు ముత్యాల హారముతోను ఉండుటవలన – నీ

కంఠనాళము, - అనగా - మెడ - నీ ముఖమనెడు పద్మమునకు ఒక నాళము, అనగా - కాడవలెనున్నది.

## వివరణము

మెడను చూచునపుడు అది తలను మొండెమును కలుపు ఒక వంతెనవలె సాధారణముగా సామాన్యులకు అనిపించును. కాని, అమ్మవారిలో పుష్ప సౌందర్యమునే ఎక్కువగా చూచు శంకరులకు - అమ్మవారి మెడ కూడా పుష్పమునకు చెందిన ఒక భాగము వలెనే దర్శన మిచ్చినది. అమ్మవారి ముఖము తామర పద్మము వలె భాసించి, ఆ విషయమును నిర్ధారించుట కోసమా అనునట్లు - ''అమ్మవారి మెడ - అమ్మవారి ఆ ముఖము అనెడి తామర పద్మమునకు 'నాళము' వలె అనగా - 'కాడ' వలె ఉన్నది'' - అని శంకరులు తనకు దర్శనమైన రీతిని ఈ శ్లోకములో తెలియజేసిరి. ముఖము తామర పద్మమువలె నున్నది లేదా అంతకు మించిన అందముతో నున్నది, అని - చెప్పినపుడు ఆ సామ్యము ఎన్ని విధములుగా సరిపోవునో 'అరాళైః స్వాభావ్యాత్....' అన్న 45వ శ్లోకములో చెప్పిరి. ప్రస్తుతము అమ్మవారి మెడ - తామర పద్మము యొక్క నాళము వలె నున్నదని చెప్పునపుడు గూడా అదే విధముగా చెప్పి ఒప్పించిరి.

**అన్ని విధములుగాను సరిపోయిన పోలికలు**

'మెడ' అను నాళమునకు పైన తామర పద్మము వంటిది ఏదైనా ఉండవలెను. ఈ విషయమును సమర్థించుటకు - అమ్మవారి ముఖమే అమ్మవారి మెడ అను నాళమునకు తామర పద్మము అని సమర్థించిరి. ఈ ఒక్క విషయములోనే గాక మరి కొన్ని తగిన పోలికలను కూడా చెప్పిరి.

తామర పద్మనాళమును పరిశీలించినచో నాళము చుట్టును పొడవునా - చలి పొక్కుల వలె సన్నని ముళ్ళ వంటివి ఉండును గదా అన్నచో - పదే పదే అమ్మవారి మెడచుట్టును తన బాహువులు స్పృశించుచూ ప్రేమతో ఆమెను త్రిపుర హరుడైన శంకరుడు కౌగిలించు కొనునపుడెల్ల ఆ ప్రేమాతిశయమునకుకలుగు - గగుర్పాటు వలన రోమాంచమై - ఆమె మెడ గూడా తామరకాడవలెనే కంటకములతో నున్నట్లు భాసించును గదా? - అని శంకరులు తన ఉపమానమును సమర్థించుకొనిరి.

తామర పద్మనాళము నీటిలోని పంకముతో (బురద) కూడి వుండును గదా! అనినచో - 'అమ్మవారి మెడ క్రింద భాగము నిత్యము నల్లని అగురు గంధలేపనముతో పూయబడి వుండును. ఆ నల్లని తడి లేపనము నీటిలోని పంకమును స్ఫురింప చేయును గదా! - అని శంకరుల సమాధానము.

తామరకాడకు అతి సుకుమారముగా ప్రకాశవంతముగా నుండు తూడులుండవలెను గదా ! అనినచో - అమ్మవారి మెడలో ఇరువైపులా వ్రేలాడు సన్నని ముత్యాల హారపు వరసలు ఆ తామర తూడుల అందమును స్ఫురింప చేయును గదా! - అని శంకరుల సమాధానము.

ఈ విధముగా - అన్ని విధములుగాను అమ్మవారి మెడ తామర పద్మపు నాళమును పోలి వుండునని అందఱును ఒప్పుకొని తీరునట్లు శంకరులు ఈ శ్లోకములో వర్ణించిరి.

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రములో - 'అమ్మవారి ముఖమును - 'శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా' - అని వ్యాసులవారు అమ్మవారి పంచదశాక్షరీ మంత్రములోని ప్రథమ కూటమును 'వాగ్భవకూటము' గా సమన్వయ పరచి చెప్పిరి. ముఖము వాగ్భవ కూటమైనచో - ఆ ముఖమునకు వాక్సంపద ఎక్కడ నుండి ఉత్పన్నము కావలెను ? తప్పనిసరిగా క్రింద నున్న కంఠనాళము నుండియే గదా! కంఠము నందలి స్వరపేటికలు (Vocal Cords) ఈ వాక్కులను ఉత్పత్తి చేయగా, అవి ముఖము (నోరు) ద్వారా వ్యక్తమగును. 'వాగ్భవకూటమును' సూచించు అమ్మవారి కంఠము నాళము వలె భాసించుచున్నదనుట సమంజసము, సముచితమే గదా! అని శంకరులు అమ్మవారి కంఠమును తామర పద్మ నాళముతో పోల్చిరి.



## సంస్కృత శ్లోకము - 69

శ్లో. గళే రేఖా స్త్రిస్రో గతిగమక గీతైకనిపుణే
వివాహవ్యానద్ధప్రగుణ గుణ సంఖ్యా ప్రతిభువః
విరాజంతే నానావిధ మధుర రాగాకరభువాం
త్రయాణాం గ్రామాణాం స్థితినియమ సీమాన ఇవతే.

## అనువాద పద్యము

*మ. గమకాదుల్ నిపుణమ్ముగా పలుకు శ్రీగానప్రభా ! నీ వివా*
*హమునన్ కట్టిన సూత్రమందు గల సంఖ్యన్ దెల్పు నీ గ్రీవమం*
*ద మలంబైన త్రిరేఖలే మధురరాగాద్యర్థమౌ షడ్జ, మ*
*ధ్యమ, గాంధారములైన గ్రామముల హద్దౌచున్ విరాజిల్లుగా.*

## టీక

(హే జగజ్జననీ !) గతి = సంగీత మార్గముల యందును, గమకం = స్వరకంపన విశేషములందును, గీత = గానము నందును, ఏక = ముఖ్యమైన, నిపుణే = నేర్పరితనము గలదానా ! తే = నీ యొక్క, గళే = కంఠ ప్రదేశమునందు, తిస్రః రేఖాః = మూడు భాగ్య రేఖలు, లేదా - మూడు ముడుతల రేఖలు, వివాహ = పెళ్ళి సమయమందు, వ్యానద్ధ = (కంఠము చుట్టును వచ్చునట్లు) కట్టబడిన, ప్రగుణగుణ = పెక్కునూలు పోగులచే కూర్చబడిన దారముల యొక్క, సంఖ్యా = (మూడు) సంఖ్యకు', ప్రతిభువః = ప్రతినిధులైనవియు, అనగా - ప్రతీకలైనవియు, నానావిధ = అనేక విధములైన, మధుర మనోహరములైన, రాగ = కళ్యాణి మొదలగు రాగములకు, ఆకరభువాం = (స్వరస్థానములను) ఆశ్రమ స్థానములైనవియు, త్రయాణాం = మూడైన, గ్రామాణాం = షడ్జ, మధ్యమ, గాంధార గ్రామములకు, స్థితి = ఉనికి యొక్క, నియమ = నియమము కొఱకు ఏర్పరచిన, సీమానః ఇవ = సరిహద్దులవలె, విరాజంతే = మిక్కిలి శోభాయమానముగా ప్రకాశించుచున్నవి.

## తాత్పర్యము

సంగీత మార్గస్వరగాననిపుణీ, జగజ్జననీ ! నీ కంఠము నందు కనబడు మూడు భాగ్యరేఖలు - వివాహ సమయమునందు పెక్కు నూలు పోగులతో

ముప్పేటలుగా కూర్చబడి కట్టిన సూత్రమును గుర్తుతెచ్చుచు, నానా విధములైన మధుర రాగములకు ఆశ్రయ స్థానములైన (షడ్జ, మధ్యమ, గాంధార) గ్రామముల ఉనికి యొుక్క నియమము కొఱకు ఏర్పరచిన సరిహద్దులవలె నున్నట్లు శోభాయామానముగా ప్రకాశించుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి కంఠ ప్రదేశము నందు కనబడు మూడు ముడుతల భాగ్యరేఖలను గూర్చి చెప్పబడుచున్నది. అమ్మవారిని చూచునప్పుడు మూడు ముడుతలు ఆమె కంఠము చుట్టును గీసిన వృత్తాకార రేఖల వలె కనబడును. ఈ మూడు రేఖలను చూచుటతోడనే వివాహమునకు సంబంధించిన, సంగీతమునకు సంబంధించిన కొన్ని సమన్వయ విషయములు స్ఫురించునని శంకరులు ఈ శ్లోకములో ఆ విషయములను వివరించిరి.

**మంగళసూత్ర ఆచారము**

వివాహ సమయములో పెళ్ళికూతురు మెడకు మంగళ సూత్రమును కట్టు ఆచారము భారతదేశములోని చాలా ప్రాంతములలో కలదు. వ్యాసులవారు గూడా ఈ విషయమును ధ్రువపరచుచు శ్రీ లలితా సహస్రనామస్తోత్రములో 'కామేశ బద్ధమాంగల్య సూత్ర శోభితా కంధరా' (కామేశుని చేత కట్టబడిన మంగళసూత్రముతో శోభిల్లు చుండు కంఠము కలది' – అని ఈ నామమునకు అర్థము). అని ఒక నామము వ్రాసిరి. ఈ మంగళసూత్రము కొన్ని దారపు పోగుల కూర్పుతో వుండును. సాధారణముగా ఒక్కొక్క పేటలో తొమ్మిది పోగుల చొప్పున ముప్పేటలతో ఈ మంగళ సూత్రము ఉండును. వివాహ వేళలో అమ్మవారికి శివుడు కట్టిన మంగళసూత్రము నందలి ఈ మూడు పేటలను అమ్మవారి కంఠమునందు మూడు ముడుతల రేఖలను గుర్తుకు తెచ్చుచు, వాటికి ప్రతీకలుగా నున్నవని శంకరులు మొదట ఒక సమన్వయమును చెప్పిరి.

**సంగీత విషయములు**

మంచి కంఠము అన్నపుడు – కేవలము 'అందమైన మెడ' అని మాత్రమే అర్థము గాదు. 'శ్రావ్యమైన ధ్వనులతో శ్రవణ పేయముగా మాట్లాడగల, మంచి సంగీతమును పాడగల కంఠము' అని గూడా అర్థము. కంఠము నందలి స్వరపేటికల

(Vocal Cords) సహాయముతోనే శబ్దములను ఉత్పత్తి జేసి, నోటితో ఉచ్చరించ గలుగుచున్నాము. సంగీతము – 'మార్గము', 'దేశి' అను రెండు పద్ధతులలో నుండును. పక్షి, మృగముల అఱుపుల నుండి పుట్టిన ధ్వనులతో సరిపోవు సప్తస్వరముల సహాయముతో, సంప్రదాయ బద్ధమైన కొన్ని నియమ నిబంధనలతోనుండు సంగీతమును – 'మార్గ సంగీతము' (మృగధ్వనుల సంబంధమైన సంగీతము) అనియు, వివిధ జానపద సంగీతమును 'దేశిసంగీతమ' నియు అందురు. ఈ రెండు రకముల పద్ధతులు 'గతి' కి చెందినవి. ఈ రెంటిలోను అమ్మవారు నిపుణురాలు.

సంప్రదాయ బద్ధమైన 'మార్గ' సంగీతము నందు వివిధ రాగములలో పాటలు పాడుదురు. ఈ రాగముల రీతులకు గమకములు అని, 'గ్రామము' లని కొన్ని విశిష్టలక్షణములుండును. స్వర కంపనలోని ఒక విశిష్టలక్షణమును 'గమక' మందురు. ఈ గమకము సంగీతమునకు శోభనిచ్చును. శ్రుతిస్థాయిలను బట్టి – 'షడ్జ', 'మధ్యమ', 'గాంధార' ములను మూడు రకములైన గ్రామములుండును. అనగా – ఇవి సంగీత స్థాయిలకు సరిహద్దులవంటి వన్నమాట! ఏ గ్రామము నందు ఏ రాగము పాడబడునో దాని ఆరంభమును, అంతమును ఆ గ్రామస్వరమందే వుండవలెను. మూడు గ్రామముల లోను ఒక దానితో ఒకటి కలవని రీతిలో పాడగలుగువారు తక్కువ సంఖ్యలో నుందురు. అమ్మవారు ఈ మూడు గ్రామములందును పాడగల నైపుణ్యము, సామర్థ్యము, ప్రావీణ్యము గలది. ఒక దానితో ఒకటి సంకరముగాకుండా వేసిన సరిహద్దుల కట్టలవలె అమ్మవారి కంఠము నందలి వలిత్రయము (మూడు భాగ్యరేఖలు) సూచించుచున్నవని ఆ త్రిరేఖలకు సమన్వయమును శంకరులు ఈ శ్లోకములో చెప్పిరి. (వివిధ రాగములలో గానము చేయు ఒక జాతిపాటను 'గీత' మందురు.)

**మూడు ముడుతల ప్రాముఖ్యము**

స్త్రీలకు గాని, పురుషులకు గాని నుదురు, లేదా – లలాటము పైన, కంఠము వద్ద, పొట్ట వద్ద మూడు ముడుతలు ఉండుట ఉత్తమ సాముద్రిక లక్షణమని, మహాసౌభాగ్య లక్షణమని ఈ క్రింది శ్లోకము చెప్పును.

శ్లో. లలాటేచ గళేచ్చైవ మధ్యే చాపి వళిత్రయమ్
స్త్రీ పుంసయోరిదం జ్ఞేయం మహా సాభాగ్యలక్షణమ్.

ఆజ్ఞాచక్రము వుండు నుదురు మీద ముడుతలున్నచో – భూత, భవిష్యత్, వర్తమాన కాల జ్ఞానమును ఇచ్చును. విశుద్ధి చక్రము వుండు కంఠము వద్ద మూడు ముడుతలున్నచో – మంద్ర, మధ్యమ, తారస్థాయిలలో గూడా చక్కగా సంగీతము పాడగల సామర్థ్యము నిచ్చును. ఇక మణి పూర చక్రము వుండు నాభి వద్ద మూడు ముడుతలున్నచో – ఊర్ధ్వ, మధ్యమ, అధో లోకములకు – కారణ, సూక్ష్మ, స్థూల దేహములకు గల సమన్వయము సుబోధమగును.

ఈ విధముగా మూడు ప్రదేశముల వద్దను త్రివళులు. మహా వ్యక్తులైన కొందఱికి మాత్రమే ఉండును. అమ్మవారికి ఆ విధముగా మూడు ప్రదేశముల వద్దను గలవు. ప్రస్తుతము కంఠము వద్ద గల త్రివళుల గూర్చి ఈ శ్లోకములో చెప్పబడినది.



## సంస్కృత శ్లోకము - 70

శ్లో. మృణాళీ మృద్వీనాం తవ భుజలతానాం చతసృణాం
చతుర్భిస్సౌందర్యం సరసిజభవస్తౌతి వదనైః
నఖేభ్య స్సంత్రస్యన్ ప్రథమ మథనాదంధకరిపో
శ్చతుర్ణాం శీర్షాణాం సమ మభయ హస్తార్పణధియా.

## అనువాద పద్యము

మ. హరుడున్ మున్ను శిరమ్ము నొక్కటిని ద్రుంపన్ వానియం
దురు భీతిన్ పడి నాల్గు శీర్షముల కందున్ త్రాణమంచున్ భవ
చ్చరణ మ్మొంది, మృణాల శోభయు, లతాసౌభాగ్యమున్ తోచు నీ
కరసంపత్తి చతుష్కమున్ నలువ యుద్ఘాటించు నా మోములన్.

## టీక

(హే జగజ్జననీ!) మృణాలీమృద్వీనాం = తామరతూడువలె మెత్తదనము గలవియు, చతసృణాం = నాలుగుగా వున్నవియు, తవ = నీయొక్క, భుజలతానాం

= తీగల వంటి భుజముల యొక్క, సౌందర్యం = అందమును, సరసిజభవః = తామరపద్మము నందు జన్మించిన బ్రహ్మదేవుడు, చతుర్భిః = నాలుగుగా నున్న, ముఖైః = తన ముఖములచేత, ప్రథమమథనాత్ = మొట్టమొదటి తన శిరస్సును గిల్లి ఖండించుట గలవాడైన, అనగా – ఖండించిన వాడైన, అంధకరిపోః = అంధకుడును అసురుని సంహరించిన సదాశివుని యొక్క, నఖేభ్యః = గోళ్ళవలన, సంత్రస్యన్ = మిగులభయపడుచున్నవాడై, చతుర్ణాం = నాలుగుగా నున్న, శీర్షాణాం = తన శిరస్సులకు, సమం = సమానముగా, అభయహస్త + అర్పణధియా = అభయదానము చేయగలిగిన నీ హస్తముల యొక్క అభయమును గోరి, స్తౌతి = నిన్ను స్తుతించుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ జగజ్జననీ ! తామర తూడువలె మృదువుగా తీగలవలె నుండు నీ బాహువుల చక్కదనమును చూచి, బ్రహ్మ తన నాలుగు ముఖములతో – పూర్వము తన ఐదవ శిరస్సును గోటితో గిల్లి వేసిన శివుని గోళ్ళకు భయపడుచూ, ఒక్కసారిగా తన మిగిలిన నాలుగు శిరస్సులకు నీ నాలుగు హస్తముల నుండి అభయ దానము కోరుచూ, నిన్ను స్తుతించుచున్నాడు.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నాలుగు బాహువుల యొక్క – అందాన్ని, ఆశ్రితులను ఆదుకోగలుగు గుణమును గూర్చి – చెప్పబడుచున్నది. అమ్మవారు 'చతుర్బాహు సమన్విత'' గాబట్టి నాలుగు బాహువులుంటాయి. తామర పద్మంలో నుండి పుట్టి, ఆ పద్మమునే తన ఆసనంగా చేసుకుని కూర్చునే బ్రహ్మగారు అమ్మవారి ఆ నాలుగు బాహువులను చూశాడు. కష్టాలలో వున్నవారిని, నష్టాలలో వున్నవారిని– అమ్మవారి ఆ బాహువులు అభయమిచ్చి – ఆదుకోవడం విన్నాడు. బ్రహ్మకీ ఒక నష్టం జరిగింది. వాస్తవానికి బ్రహ్మకు ఐదు ముఖాలుండాలి. నాలుగు వైపులా నాలుగు, మధ్యలో ఊర్ధ్వంగా ఐదవదీ వుండేవి. కాని, ఒక నాడు అంధకాసురుని చెండాడిన శివుడు వచ్చి ఐదవ దైన బ్రహ్మ ఊర్ధ్వ శిరస్సును తన గోళ్ళతో – చెట్టునుండి పువ్వును వేరు చేసినట్లు – గిల్లి లాగేసుకున్నాడు. అప్పటి నుండి ఐదు ముఖాల

బదులు నాలుగు ముఖాలతోనే గడుపుతున్నాడు. ''ఇంక మిగిలిన నాలుగు ముఖాలనైనా దక్కించుకోవాలి. ఆ శివుడు ఎప్పుడు వచ్చి ఈ నాలుగింటిని గూడా ఒక దాని తరువాత ఒకటి కోసుకుని వెళ్ళిపోవచ్చు గూడా!'' అని ఎవరిని ప్రార్థించవలెనా అని సమయము కోసము ఎదురు చూచుచుండగా – అమ్మవారి బాహువులను చూడడం, ఆ బాహువుల అభయ గుణం వినడం జరిగింది. వెంటనే ఆలస్యం చేయకుండా, బాహువుకు ఒక ముఖం చొప్పున తన నాలుగు ముఖాలతోను ఒకేసారి అమ్మవారి నాలుగు బాహువులను తనను శివుని బారి నుండి రక్షించవలసినదిగా ప్రార్థించాడు. అమ్మవారికై బ్రహ్మతన నాలుగు ముఖాలతో చేసిన స్తుతులనే నాలుగు వేదాలలోని విషయాలుగా సమన్వయ పరచుకోవాలి. (వేదాలలో అమ్మవారి, అనగా – ప్రకృతికి చెందిన విషయము తప్ప మరొకటి వుండదు.)

**బ్రహ్మ తలల రహస్యము**

ఈ కథలో ఒక సృష్టి రహస్యము ఇమిడి ఉన్నది. సృష్టి క్రమము 'ఆకాశా ద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్య పృథివీ' – అని తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడినట్లు – ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథివీ తత్త్వము, అనగా – ఘనతత్త్వము ... ఈ వరుస క్రమములో నుండును. అనగా, ఈ క్రమమును బట్టి మొట్టమొదట ఆకాశము నుండి ప్రారంభింపబడి దాని నుండి మిగిలిన భూతములు, సృష్టి ఏర్పడినట్లు సూచింపబడినది. ప్రళయ మార్గము దీనికి వ్యతిరేకముగా నుండును.

పంచభూతాత్మకమైన సృష్టిని చేయువాడు బ్రహ్మ. బ్రహ్మ యొక్క ఐదు తలలు ఆ పంచభూతములకు ప్రతీకలు. ప్రళయము వచ్చినపుడు శివుడు ముందుగా ఆకాశమును తనలోనికి లీనము చేసుకొనును. దానితో వెంట వెంటనే వాయువు, అగ్ని, జలము, పృథివీ భూతములు ఇదే మార్గములో ఒక దాని వెంబడి ఒకటి లీనమగును. బ్రహ్మకు నాలుగు వైపులా నుండు ముఖములు – వాయు, అగ్ని, జల, పృథివీ తత్త్వములను – వాటి మధ్య ఊర్ధ్వముగా నుండు తల – ఆకాశ తత్త్వమును సూచించును. శివుడు బ్రహ్మ యొక్క ఈ ఐదవ తలను గిల్లి వైచుట అనగా 'ప్రళయము నందు ముందుగా పంచ భూతములలోని ఆకాశ తత్త్వమును తనలోనికి లీనము చేసుకొనుట' అని అర్థము.

బ్రహ్మ సూత్ర సమన్వయము

అమ్మవారి బాహువులను ప్రార్థించినచో – ఆ బాహువులతో అమ్మవారు శివుని వారించి – తిరిగి, పునః సృష్టికి తోడ్పడునని చేయు ప్రయత్నముగా – బ్రహ్మ చేయు స్తుతులను సమన్వయపరచు కొనవలెను. మృణాళ మృదుత్వము గల అమ్మవారి బాహువుల గూర్చి చేయుస్తుతులే బ్రహ్మ సూత్రములుగా రూపొందినవని గూడా చెప్పుకొనవచ్చును. బ్రహ్మనుండి భౌతిక సృష్టి జరుగు ప్రక్రియకు ముఖ్య సూత్రములుగా (Main Principles)ఈ బ్రహ్మ సూత్రములను సమన్వయ పరచుకొనవచ్చును.



## సంస్కృత శ్లోకము - 71

**శ్లో. నఖానా ముద్యోతై ర్నవనళినరాగం విహసతాం**
**కరాణాం తే కాంతిం కథయ కథయామః కథ ముమే**
**కయా చిద్వా సామ్యం భజతు కలయా హంత కమలం**
**యది క్రీడ ల్లక్ష్మీచరణ తలలాక్షారసచణమ్.**

## అనువాద పద్యము

***చం. కరరుహ కాంతితోడ నవకంజపు కాంతిని వెక్కిరించు నీ***
***కరముల కాంతికిన్ రచన కల్గుట యెట్లు ? సరోరుహమ్ముపై***
***చరణములుంచు శ్రీచరణ సంపదలత్తుకరంగు కూడినన్***
***సరియగునేమొ కానితటి సాటికి నిల్చునె యెంతకైన తాన్.***

## టీక

ఉమే ! = ఓ పార్వతీ, నఖానాం = గోళ్ళయొక్క, ఉద్యోతైః = ఉత్పన్నమగు కాంతుల చేత, నవనళినరాగం = అప్పుడే వికసించెడు తామరపూవు యొక్క ఎఱ్ఱని కాంతిని, విహసతాం = అపహసించుచున్న, తే = నీ యొక్క, కరాణాం = హస్తముల యొక్క, కాంతిం = శోభను, కథం = ఏ విధముగా, కథయామః = అలంకారయుతముగా వర్ణించగలమో, కథయ = చెప్పుము, హంత = మరి, కమల = పద్మము, కలయాఅపి = పదునాఱవ పాలుచేతనైనను, సామ్యం = పోలికను,

కయాచిత్‌వా = ఏ దేని ఒక విధము చేతనైనను, భజంతు = పొందును గాక ! ఆ విధము ఏదియన - క్రీడత్ = క్రీడించుచున్న, లక్ష్మి = లక్ష్మి దేవి యొక్క, చరణతల = పాదము యొక్క, లాక్షారసచణం = లత్తుకరసముతో గూడి సమర్థమైనది అయిన ఎడల పొందవచ్చునేమో!

## తాత్పర్యము

తల్లీ ! ఉమాదేవీ ! అప్పుడే వికసించు తామరపూవు యొక్క ఎఱ్ఱని కాంతులనుసైతము పరిహసించు గోళ్ళ కాంతులతో శోభిల్లు - నీ యొక్క హస్త ప్రభావైభవమును ఏ విధముగా వర్ణించగలము ? క్రీడించు లక్ష్మిదేవి పాద లాక్షారుణరసముతో కూడి సమర్థవంతమైనచో అప్పుడు నీ హస్తప్రభల పదునాఱవ పాలుతో పోల్చుటకు ఏమైనా అవి సరిపోవునేమో!

## వివరణము

అమ్మవారి రెండు హస్తములు, వాటి గోళ్ళు అరుణారుణ ప్రభలతో శోభాయమానముగా నున్నవి. వాటికి పోలిక చెప్పి వర్ణించుటకు ముందుగా శంకరులకు - అప్పుడే వికసించుచున్న ఎఱ్ఱని కాంతులతో నున్న తామర పద్మములు స్ఫురణకు వచ్చినవి. అమ్మవారి హస్తములు గాని, గోళ్ళుగాని ఇంకొకరి సహాయ, సహకార, దాక్షిణ్యములపై ఆధారపడకుండానే, స్వభావ సిద్ధముగా ఎఱ్ఱగా నుండి కాంతులు విరజిమ్ముచుండును. వీటి ప్రభలకు రాత్రి పగలు భేదము గూడా లేదు. కాని, తామర పద్మము ఎఱ్ఱని కాంతులు ప్రసరించవలెనన్నచో - ముందుగా తాను విచ్చుకొనవలెను. ఆ విధముగా విచ్చుకొనుటకు రాత్రిపూట కుదరదు. పగలైనను సూర్యకిరణముల స్పర్శ తగలవలెను, లేనిచో - ముకుళించుకొనియే వుండవలెను. ఇంకొకరి దయాదాక్షిణ్యములపై ఆధారపడి, వారి దయలేనిచో ముఖము ముడుచుకుని ఉండవలసిన వాటితో అమ్మవారి హస్తములను, గోళ్ళను పోల్చుట సరిగాదని శంకరులు నిర్ణయమునకు వచ్చిరి.

ఒక వేళ సూర్యరశ్మి స్పర్శకు వికసించినను ఆ తామర పద్మము యొక్క అరుణ వర్ణ వికాసము అమ్మవారి హస్త ప్రభల వైభవమునకు సాటిరాదట! తామర పద్మ అరుణ ప్రభలతోనే పోల్చవలెనన్నచో - లాక్షారుణ చరణములతో లక్ష్మిదేవి ఆ

తామర పద్మము నందు అడుగిడి వసించినచో అప్పుడు లక్షీదేవి పాదములకున్న ఎఱ్ఱని లత్తుక అంటిన మీదట, ఆ తామర పద్మము యొక్క అరుణప్రభ అమ్మవారి హస్తారుణ ప్రభలో పదునాఱవవంతుకేమైన సరిపోవునేమోగాని పూర్తిగా కాదు అని శంకరులు నిర్ణయించిరి.



## సంస్కృత శ్లోకము - 72

**శ్లో. సమం దేవి స్కంద ద్విపవదన పీతం స్తనయుగం**
**త వేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్**
**య దాలోక్యా శంకాకులిత హృదయో హాసజనకః**
**స్వకుంభే హేరంభః పరిమృశతి హస్తేన ఝటితి.**

## అనువాద పద్యము

*చం. ద్విరదముఖుండు దేనిగని వెంటనె కుంభయుగమ్ము దేవగాన్*
*చిరుదరహాస మొచ్చు మరినీకును, స్కందుడు తానుగూడ యే*
*సిరితమి గ్రోలుచుందురు ? విశృంఖల ధారలు వేని యందునన్*
*పరమగు - నట్టి నీ ప్రబల వక్షము దీర్చును మాదు ఖేదముల్.*

## టీక

హే దేవి = ఓ భగవతీ ! సమం = ఒకే సమయములో, స్కంద = కుమారస్వామి చేతను, ద్విపవదన = ఏనుగు ముఖము కల వినాయకుని చేతను, పీతం = పాలుత్రాగబడినదియు, ప్రస్నుత ముఖం = పాలను స్రవింప జేయు కుచాగ్రముల గలదియునగు, తవ = నీ యొక్క, స్తనయుగం = వక్షోజముల జంట, నః = మా యొక్క, ఖేదం = దుఃఖమును, హరతు = తొలగించు గాక! యత్ = ఏ స్తనయుగమును, ఆలోక్య = చూచి, ఆశంకా = (నా యొక్క తలపై నుండు కుంభములు దొంగిలింపబడినవను) సంశయము చేత, ఆకులిత = అర్థముకాక ఆలోచనలో పడిన, హృదయః = మనస్సుగలవాడై, హేరంభః = వినాయకుడు, హాసజనకః = (పార్వతీ, కుమారులకు) నవ్వు పుట్టించుచున్నవాడై (వీడు అమాయకుడు అనుకొను విధముగా), స్వముఖే = తన శిరస్సుపై గల కుంభములు

రెంటిని, హస్తేన = తొండము చేత, ఝటితి = ఆ క్షణములోనే, పరామృశతి = తడవుకొనుచున్నాడు.

## తాత్పర్యము

ఓ త్రిపుర సుందరీ దేవీ ! ఒకే సమయములో కుమారస్వామి చేతను, వినాయకుని చేతనుగూడా పాలు త్రాగబడినవియు, పాలు స్రవింపజేయు అగ్రభాగములు కలవియు, పాలు త్రాగునపుడు ఏ జంటను చూచి వినాయకుడు - 'తన తలపై నుండు కుంభములు దొంగిలింపబడి ఇక్కడ చాటుగా నున్నవా ?' అన్న శంకతో వెంటనే తన కుంభస్థలములను తొండము చేత తడవుకొనగా, అది చూచిన పార్వతీ కుమారులకు నవ్వు వచ్చెనో - అట్టి నీ స్తన యుగము మా దుఃఖములను తొలగించు గాక!

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి స్తనయుగము - గూర్చి చెప్పబడుచున్నది. అమ్మవారి స్తనములు ఏనుగు కుంభముల వలె నున్నవని సూటిగా చెప్పుటలో కవితా చమత్కృతి ఏమియు లేదు. కాని, శంకరులు ఇదే విషయమును చమత్కారముగా వర్ణించిరి.

**శంకర చమత్కృతి**

బాలకుమారస్వామి పాలకై మారాము చేసినపుడు అమ్మవారు పాలను ఇచ్చుచుండెను. ఆ సమయములోనే బాల గణేశుడు గూడా వచ్చి, తనకు పాలు కావలెననెను. అప్పుడు ఆ జగజ్జనని తన ముద్దు కుమారులిద్దరికీ ఒకే సమయములో - తన రెండు స్తనములతోను పాలను ఇచ్చుచుండెను. కుమారస్వామి ఆతృతగా, ఆసక్తిగా త్రాగుచుండగా - గణేశుడు నెమ్మదిగానే త్రాగుచూ, మధ్యలో ఏదో అనుమానము వచ్చి పాలు త్రాగుట ఆపి, అమ్మవారి స్తనములను ఒకసారి పరికించి చూసి, ''తన తలపై నుండవలసిన కుంభములు ఇక్కడికేల వచ్చినవి ? నా కుంభములను అమ్మ దొంగిలించలేదు గదా ?'' - అని తన తలపై నుండు రెండు కుంభములను ఉన్నవో లేవో అని అమాయకముగా - తడవుకొనెనట! 'వినాయకుడు ఆ విధముగా చేయుట చూచిన పార్వతీ స్కందులకు నవ్వు ఆగలేదుట' ఈ కథకంతకూ కారణమై, తన ముద్దు బిడ్డలైన గణేశ, కుమారులిద్దరికినీ ఒకేసారి

పాలనిచ్చుటకును, నవ్వు కలిగించుటకును గూడా కారణమైన, – ఏనుగు కుంభముల వంటి అమ్మవారి స్తనములు – మా దుఃఖములను పోగొట్టి ఎప్పుడును సంతోషముగా నుండునట్లు చేయుగాక !'' అని శంకరులు చమత్కారముగా ఈ శ్లోకములో స్తుతించి, ప్రార్థించిరి.



## సంస్కృత శ్లోకము - 73

**శ్లో. అమూ తే వక్షోజా వమృతరస మాణిక్య కుతుపౌ**
**న సందేహ స్పందో నగపతిపతాకే మనసి నః**
**పిబంతౌ తౌ యస్మా దవిదితవధూ సంగరసికౌ**
**కుమారా వద్యాపి ద్విరవదన క్రౌంచదళనౌ.**

## అనువాద పద్యము

**ఉ. నీ కుచయుగ్మమున్, సుధలు నిండిన కెంపుల సిద్దులే యనన్**
**మాకెటువంటి సందియము మానసమందున లేదు, కానిచో**
**యా కుచపానమున్ గలిగి యా ద్విరదానన బాహులేయులున్**
**సోకని యోషి సంగమున సూనులె నేటికి నౌదురేవిధిన్ ?**

## టీక

నగపతి పతాకే ! కొండరాజు కులమునకు వన్నె తెచ్చిన గిరిజాదేవీ ! అమూ = ఈ కన్పట్టుచున్న, తే = నీ యొక్క, వక్షోజౌ = స్తనములు, అమృతరస మాణిక్యకుతుపే = అమృతముతో నిండిన మాణిక్యములతో నిర్మింపబడిన సిద్దెలు, లేదా – కుప్పెలు, నః = మా యొక్క, మనసి = మనస్సునందు, సందేహస్పందః = లేశమాత్రమైన సందేహమును, న = లేదు, యస్మాత్ = ఏ కారణము వలన, తే = ఆ కెంపు కుప్పెలైన నీ స్తనములను, పిబంతే = పాలుత్రాగుచున్నవారై, అవిదిత = తెలియని, వధూ = స్త్రీల యొక్క, సంగ = కూటిమి యందు, ద్విరవదన = క్రౌంచదళనే = గజముఖుడైన వినాయకుడు, క్రౌంచపర్వతమును కొట్టిన కుమారస్వామి ఈ ఇరువురును, అద్య + అపి = ఇప్పటికి గూడ, కుమారౌ = బాలురుగానే వున్నారో.

## తాత్పర్యము

పర్వతరాజ వంశమునకు వన్నెతెచ్చిన గిరిజాదేవీ! మాకు కనిపించు ఈ నీ స్తనములు అమృత రసముతో నిండినవై, పద్మరాగమణులచే చేయబడిన సిద్దెలు, లేదా - కుప్పెలుగా నున్నవి. ఈ విధముగా చెప్పుటలో మాకు మనస్సునందు కొంచెమైనను సందేహము లేదు. ఏలయనగా - ఆ నీ స్తన్యమును గ్రోలిన వారైన గజముఖుడైన గణపతి, క్రౌంచపర్వతమును కొట్టిన కుమారస్వామియు నేటి వరకు గూడ ఏ కాంతాసంగము వలనగూడా ఆనందమును పొందురసికులు కానివారై, బాలురుగానే వున్నారు గదా!

## వివరణము

ఈ శ్లోకములో గూడా అమ్మవారి స్తనముల గురించి, స్తన్యమును గురించి చెప్పబడుచున్నది.

స్తనములు జగన్మాతృకా చిహ్నములు. 'శ్రీమాతా' 'శ్రీమహారాజ్ఞీ', 'శ్రీమత్సింహాసనేశ్వరీ' ఇత్యాది బిరుదాంకితురాలైన అమ్మవారు జగత్తును సృజించి, పోషించి, చివరకు తనలోనే దానిని లీనము చేసుకొనును. అట్టి జగన్మాత పోషకత్వమునకు సంబంధించిన విషయము ఈ శ్లోకములో చెప్పబడుచున్నది. కుటుంబ బాధ్యతలను సక్రమముగా నిర్వహించలేని వారు సమాజమును ఉద్ధరించుటను కూడా సక్రమముగా చేయలేరు. జగత్తుకు పోషక కారిణి అయిన అమ్మవారు తన ఇంటిలోని వారి యెడల ఆ పోషక ధర్మమును గూడా చక్కగా నిర్వర్తించినది. తనకు ఇద్దరు కొడుకులు. ఒకడు గణేశుడు. రెండవ వాడు కుమారస్వామి. వీరిని గురించి తండ్రి కన్నా, తల్లైన అమ్మవారే ఎక్కువ పట్టించుకొనెను. ఆ ఇద్దరి పిల్లలకు తల్లి దగ్గతే ఎక్కువ చనవు. ఎంత వయసు వచ్చినను అమ్మను విడిచి వుండలేరు. అట్టి పిల్లలకు స్వయముగా తానే పాలిచ్చి పెంచినది. ఆ పాలను గలిగిన అమ్మవారి పాలిండ్లు ''అమృతముతో నింపబడిన మాణిక్యపు సిద్దెలు'' అని చెప్పుటకు ఏ మాత్రమును సంకోచము, సందేహము పడవలసిన పని లేదుట! ఆ పాలు త్రాగినచో మరి ఇతర వాంఛలేమియు కలగవుట! వయస్సు వచ్చిన తరువాత స్త్రీ సంగమ సుఖమును, ఆనందమును పొందవలెనని కోరిక కూడా వుండదుట! అసలు స్త్రీ సంగమ విషయమే వారికి తెలియదుట!

ఈ విషయమును శంకరులు గణేశుని, కుమారస్వాములను దృష్టిలో పెట్టుకుని చెప్పిరి. వారు పుట్టినప్పటి నుండి ఇప్పటి వఱకూ గూడా అమ్మవారి దగ్గఱ పాలు త్రాగుచు అమితమైన ఆనందామృతత్వ సిద్ధిని పొందుచున్నారట ! అందువలన వారికి స్త్రీ సంగమ సుఖము వంటి ఇతర విషయములు తెలియవలసిన అవసరము రాలేదుట !

గణేశునికి 'సిద్ధి', 'బుద్ధి' అని ఇద్దరు భార్యలు, కుమారస్వామికి 'వల్లి', 'దేవసేన' అని ఇద్దరు భార్యలు ఉండగా – వీరిరువురూ – స్త్రీ సంగమ విషయమే తెలియని వారనుట విచిత్రము, అతిశయోక్తి గాదా అని అనిపించక మానదు. కాని, ఈ 'సిద్ధి, బుద్ధి', 'వల్లీ, దేవసేన' లనగా నేమో తెలిసినపుడు ఈ మాటల వెనుక గల అంతరార్థము తెలియును.

**సిద్ధి గుఱించి**

భాద్రపద శుద్ధ చతుర్థినాడు చంద్రుడు కన్యారాశిలోని హస్తా నక్షత్రములో నుండును. ఆనాడు రాత్రిపూట ఆకాశములోని తారలను చూచినచో హస్తా నక్షత్రపు తారల కూటమి వద్ద జీడిపప్పు ఆకారములో చంద్రుడు కనబడును. చంద్రుడనగా మనస్సు (చంద్రమామనసో జాతః – పురుషసూక్తం), 'హస్త' మనగా చెయ్యి. అనగా గణేశ చతుర్థి రోజున చంద్రుడు అను మనస్సు 'హస్తా' నక్షత్రము అను చేతిలో నుండును. కార్యమును సంకల్పించునది మనస్సు కాగా, దానిని చేయునది చెయ్యి (కర్మేతి హస్తయోః – తైత్తిరీయం – భృగవల్లి) మనస్సు చేతిలో వుండుట అనగా– సంకల్పము చేతిలోనే వుండుట. సంకల్పించు మనస్సు – పనిని చేయు చేతిలోనే వున్నపుడు ఇక ఆ పని ఎంతో బాగుగా జరుగును కదా! ఇది 'కార్యసిద్ధి' ని సూచించు యోగము. ఇటువంటి – 'సిద్ధి' ని కలిగినవాడే గణేశుడు. అందుచేతనే వ్యాసులవారు చెప్పుచుండగా – భారతమును ఆలస్యము లేకుండా విన్నది విన్నట్లు, మనస్సు గ్రహించినది గ్రహించినట్లు అర్థభావములు చెడకుండా వ్రాయగలిగినాడు. అందుకు – విస్పష్టముగా వినుటకు పెద్ద పెద్ద చేటల వంటి, లేదా – (DISH ANTENA వంటి) చెవులు, చేతిలో వుండు మనస్సు దోహదపడినవని, ఇందువలననే ఆయన 'సిద్ధి' కలిగినవాడు అని, ఆ సిద్ధి ఆయనకు భార్యవంటిదని చెప్పిరి. దీనిని అర్థవాదకథగా పురాణములలో తెలిపిరి. 'సిద్ధి – గణేశుల భార్యాభర్తల సంబంధము' ఇంతమాత్రమేనని గ్రహించవలెను.

**బుద్ధి గురించి**

ఇక బుద్ధి సంగతి. గణేశ చతుర్థినాడు మనస్సు అను చంద్రుడు కన్యారాశిలోని హస్తానక్షత్రములో నుండునని చెప్పబడినదిగదా ! హస్తా నక్షత్రము కన్యారాశిలో $10^0$ నుండి $25^0$ వరకు వుండును. ఈ డిగ్రీలకు మధ్యలోనే $15^0$ గూడా వచ్చును. కన్యారాశిలోని $15^0$ బుధునకు ఉచ్చ. మనస్సు అను చంద్రుడు – పరిపుష్టమైన నైపుణ్యము గల బుద్ధిని సూచించు – బుధుని ఉచ్చ స్థితిని తెలియచేయు డిగ్రీవద్ద – వుండుటవలన. ఆ గణేశునికి అటువంటి వివేకము, నైపుణ్యము, నైశిత్యము గల బుద్ధి వుండును. (ఇంతటి వివేకము నైపుణ్యము కలవాడు కనుకనే ముమ్మారు తల్లిదండ్రులకు ప్రదక్షిణము చేసి సకలతీర్థయాత్రల దర్శన ఫలమును, పుణ్యతీర్థ స్నానఫలమును తమ్ముని కంటె ముందు పొంది గణేశాధిపత్యమును పొందెను). అందుకే – ఇట్టి 'బుద్ధి'ని కలిగినవాడు అని, ఆ బుద్ధి ఆయన భార్య వంటిదని చెప్పిరి. దీనిని అర్థవాద కథగా పురాణములలో తెలిపిరి. 'బుద్ధి – గణేశుల భార్యా భర్తల సంబంధము' ఇంతమాత్రమే అని గ్రహించవలెను.

**వల్లి గురించి**

శుక్రమును సూక్ష్మదర్శినితో జాగ్రత్తగా పరిశీలించినచో – చిన్న చిన్న సర్పాకృతులలో శుక్రకణములు (Spermtozova) కనిపించును. కుమారస్వామి సర్పదేవత. శుక్రము యొక్క సూక్ష్మస్థితులలోని ధాతువులలో చిట్ట చివరి దానికి సంబంధించినదే కుండలినీ శక్తి. కుమారస్వామినే 'సుబ్రహ్మణ్యస్వామి' అని కూడా అందురు. 'మంచి వర్చస్సు గలవాడు' అని సుబ్రహ్మణ్యపదమునకు అర్థము. ఈ వర్చస్సు కుండలినీ శక్తివల్లనే వచ్చును. అందువలన కుమారస్వామిని వ్యష్టి కుండలినీ శక్తికి అధిపతి అందురు. ఈ కుండలిని వలయాకారపు $3\frac{1}{2}$ చుట్లతో మూలాధారము వద్ద వుండునని చెప్పుదురు. ఇట్టి వలయాకారపు చుట్లు కుండలినిని 'వల్లీ' దేవిగాను, దాని అధిపతి గాబట్టి, కుమారస్వామిని వల్లీనాథునిగాను ఒక అర్థవాదకథగా పురాణములలో చెప్పిరి. 'వల్లీ – కుమారస్వాముల భార్యభర్తల సంబంధము' ఇంత మాత్రమే అని తెలుసుకొనవలెను.

దేవసేన

ఇక దేవసేన విషయము. తారకాసుర సంహారార్థమే కుమారస్వామి జననము జరిగినది. అందువలన పుట్టినప్పటి నుండి కుమారస్వామి దేవతల సేనకు నాయకుడై, ఎల్లప్పుడును దేవతల సేనతోనే వుండెడివాడు. ఇల్లు, ఇల్లాలు గూడా ఆ దేవతల సేనే అను విధముగా కుమారస్వామి వుండుట చేత 'దేవసేన' ను ఆయన భార్యగా సంకేతించి, అర్థవాదముగా పురాణకథ వ్రాసిరి. 'దేవసేన – కుమారస్వామి భార్యాభర్తల సంబంధము' ఇంతమాత్రమే అని అర్థము చేసుకొనవలెను.

పైన తెలిపిన విషయములనుబట్టి గణేశ, కుమారస్వాములు పూర్తిగా నైష్ఠిక బ్రహ్మచారులే! అందుచేతనే వారిరువరి అర్చనా విధమందు వటువులను పూజించుట విధిగా ఉండును. (ఈ గణేశ, కుమార స్వాముల గూర్చి పూర్తిగా తెలుసుకొనగోరు వారు నేను వ్రాసిన 'అక్షర గణపతి – కుండలినీ పతి' అను పుస్తకమును చదువుకొనవచ్చును).

గణేశ, కువూరస్వాములిరువురూ 'ఇప్పటివరకు' అమ్మవారి దగ్గఱ పాలుత్రాగుచు ఆనందమును పొందుచున్నారని ఈ శ్లోకములో చెప్పబడినది. ఇక్కడ 'స్తన్య' మనగా హృదయమందలి 'ప్రేమామృతము' అని అర్థము చెప్పుకొనుట యుక్తమగునేమో అని పెద్దలు ఆలోచించవలెను! ఏలననగా అమ్మవారి ప్రేమ వారి పట్ల అటువంటిది కాబట్టి!



## సంస్కృత శ్లోకము - 74

శ్లో. వహ త్యంబ స్తంబేరమదనుజ కుంభప్రకృతిభిః
సమారబ్ధాం ముక్తామణిభిరమలాం హారలతికామ్
కుచాభోగో బింబాధరరుచిభి రన్త శ్శబలతాం
ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివ తే.

## అనువాద పద్యము

శా. అమ్మా నీ కుచభాగమందు గజదైత్యాటోపకుంభోత్థము
ఖ్యమ్మౌ ముత్యము లుండి స్వచ్ఛమయి, బింబౌష్ఠ ప్రభాక్రాంతహా
రమ్మున్ చిత్రరుచి ప్రకీర్ణమయి భర్గ ప్రాభవాకీర్ణవా
సమ్మౌ యాతని కీర్తి నొప్పి ఘనమౌ సౌభాగ్యమున్ దెల్పుగా.

## టీక

(హే) అంబ ! = ఓ జగన్మాతా !, తే = నీ యొక్క, కుచ + ఆభోగః = స్తనములకు మెడకు మధ్యనున్న విశాల ప్రదేశము, స్తంబేరమదనుజ = గజాసురుని యొక్క, కుంభ = కుంభస్థలము నుండి, ప్రకృతిభిః = పుట్టిన, ముక్తామణిభిః = ముత్యముల చేత, సమారబ్ధాం = చేయబడినదియు, అమలాం = దోషరహితమైనదియు, స్వచ్ఛమైనదియు అయిన, హారలతికాం = తీగవంటి ముత్యాల హారమును, బింబాధర రుచిభిః = దొండపండు వంటి కెంపు రూపుగలదైన, క్రింది పెదవి కాంతుల చేత, అంతఃశబలతాం = లోన ప్రతి ఫలించిన చిత్రవర్ణములతో కూడినదియు అయి, ప్రతాపవ్యామిశ్రాం = రక్తవర్ణకాంతులతో, పురదమయితుః = త్రిపురహరుని యొక్క, కీర్తిం ఇవ = కీర్తిని వలె, వహతి = వహించుచున్నది.

## తాత్పర్యము

ఓ జగజ్జననీ ! విశాలముగను, పక్వముగను ఉండు నీ స్తనములకు మెడకు మధ్య నున్న ప్రదేశము - గజాసురుని కుంభస్థలము నుండి పుట్టినదియు , దోషరహితమును, స్వచ్ఛమైనదియు అయిన ముత్యముల చేత కూర్చబడిన తీగల వంటి ముత్యాల హారమును కలిగి, దొండపండు కెంపురూపు గలదైన నీ క్రింది పెదవి కాంతులచేత లోన ప్రతి ఫలించిన చిత్రవర్ణముతో గూడినదై - రక్త వర్ణకాంతులతో త్రిపుర హరుడైన శివుని కీర్తిని పొందిన దానివలె నున్నది.

## వివరణ

ఈ శ్లోకములో అమ్మవారి స్తనములకు మెడకు మధ్య నున్న ప్రదేశము వర్ణింపబడుచున్నది.

స్త్రీల మెడకు - స్తనములకు మధ్యనున్న ప్రదేశము ఒక విధమైన రాజసముతో కూడిన దర్పమును, ఆడంబరమును సూచించును. ఈ ప్రదేశము వద్ద మెడనుండి వ్రేలాడు విలువైన హారములు ఆ దర్పమును, ఆడంబరమును మరింత పెంచును. అమ్మవారి మెడనుండి దోషములేని స్వచ్ఛమైన ముత్యముల హారము ఈ ప్రదేశము పైకి వ్రేలాడుచున్నదట ! ఈ ముత్యములు జాతి ముత్యములుట ! లోపల నల్లని రేఖలు గాని, మచ్చలు గాని లేని స్వచ్ఛమైన ముత్యములుట ! ఇవి ఎక్కడనో కొని తీసుకుని రాబడినవు కావుట. త్రిపురములను సంహరించిన శివుడు

గజాసురుని గూడా సంహరించగా, ఆ గజాసురుని కుంభస్థలము లందు లభించిన స్వచ్ఛమైన ముత్యములుట ! (వెదురుచెట్లు, సర్పముల పడగలు, మేఘములు, ముత్యపు చిప్పలు, చెఱకు గడ, ఏనుగుల కుంభస్థలములు – ఈ ఆఱును ముత్యములు పుట్టు చోట్లుగా చెప్పుదురు). ఇట్టి ముత్యముల కూర్పుతో తయారు కాబడిన ముత్యాల హారముల నుండి వెదజల్లబడు కాంతితో – పైనుండి దొండపండుతో పోటీపడు అమ్మవారి క్రింది పెదవి నుండి వెలువడు ఎఱ్ఱని కాంతులు మిళితమై – ఆ ప్రదేశమంతయు ప్రకాశవంతమైన శ్వేతారుణ కాంతులతో నిండి చుట్టు ప్రక్కలకు వ్యాపించుచున్నవట ! నలు దిక్కులకు వ్యాపించు ఈ శ్వేతారుణ మిశ్రప్రకాశవము పురహరుడైన శివుని పరాక్రమాతిశయ కీర్తి ప్రతిష్ఠలను చాటుచున్నట్లుగా నున్నదట !

కీర్తిని – శ్వేత వర్ణ కాంతులతోను, పరాక్రమ ప్రతాపములను, – రక్తవర్ణ కాంతులతోను మహాకవులు పోల్చుదురు. ఈ సందర్భములో ముత్యాల హారము శ్వేతవర్ణకాంతులను, బింబాధర కాంతులు రక్తవర్ణ కాంతులను సమకూర్చు చున్నవైనను బింబాధర రక్తవర్ణ కాంతులు ముత్యాల హారము పైబడినపుడు ఆ ముత్యాల హారము గూడా అన్ని వైపులకు రక్తవర్ణకాంతులనే ప్రసరించుచున్నట్లగుపడునని శంకరులు సమన్వయ పరచి చెప్పిరి.



## సంస్కృత శ్లోకము - 75

శ్లో. తవస్తన్యం మన్యే ధరణిధరకన్యే హృదయతః
పయః పారావారః పరివహతి సారస్వతమివ
దయావత్యాదత్తం ద్రవిడశిశు రాస్వాద్య తవ యత్
కవీనాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా.

## అనువాద పద్యము

మ. భవదీయంబగు స్తన్యమున్ మిగుల నాస్వాదమ్ముగావించి - యీ
ద్రవిడ ప్రాంతపు బిడ్డ - ప్రౌఢ కవులన్ రంజింపగల్గెన్ గదా!
అవనీ ధర్తృసుపుత్రికా ! తలతునే నద్దాని నీ గుండెలో
ద్రవమౌ పాలసముద్రమే యుబుకు వాగ్ధారప్రపంచమ్ముగా.

## టీక

ధరణి ధరకన్యే = పర్వతరాజపుత్రికా ఓ పార్వతీ ! తవ = నీ యొక్క, స్తన్యం = చనుబాలను, హృదయతః = హృదయము నుండి పుట్టినదైన, పయః పారావారః = పాలసముద్రము, సారస్వతం ఇవ = సారస్వతము వలె, లేదా - వాఙ్మయము వలె, పరివహతి = ప్రవహించుచున్నది అని, మన్యే = తలచెదను. యత్ = ఏ కారణము వలన, దయావత్యా = దయతో కూడిననీ చేత, దత్తం = ఈయబడిన చనుబాలను, ద్రవిడ శిశుః = ద్రవిడ దేశమునందు పుట్టిన బాలుడు, (అనగా - ఈ స్తోత్ర కర్త అయిన శంకరులే!) ఆస్వాద్య = త్రాగి, హే ప్రౌఢానం = ప్రౌఢులు నిపుణులు అయిన, కవీనాం = కవీశ్వరులలో కవయితా = కవియై, అజని = పుట్టెనో (అందువలన).

## తాత్పర్యము

ఓ పార్వతీ ! నీ చనుబాలను - నీ హృదయము నుండి పుట్టి పొరలి వచ్చు పాలసముద్ర రూపమైన సారస్వతము వలె తలంచెదను. లేనిచో - అమిత ప్రేమతో నీవు ఇచ్చిన ఆ నీ చనుబాలను త్రాగి ద్రవిడ దేశములో (అనగా కేరళలోని క్రాడి గ్రామములో) పుట్టిన బాలుడు (అనగా ఈ స్తోత్ర కర్త అయిన శంకారాచార్యుల వారే!) ప్రౌఢులు, ఉద్దండులు అయిన కవీశ్వరులలో కెల్ల కమనీయమైన కవిత్వమును చెప్పగల వానిగా ప్రసిద్ధి చెందువాడగునా ?

## వివరణము

ఈ శ్లోకములో గూడ అమ్మవారి స్తన్యపాన మహిమ గూర్చియే చెప్పబడినది.

**స్తన్యవిస్తృతి**

అమ్మవారు సృష్టికారిణి మాత్రమే కాక పోషకకారిణి గూడ కాబట్టి - తన సృష్టిలోని జీవులను సృష్టించుటయే గాక వారిని పోషించవలసిన బాధ్యత గూడా ఆమె నిర్వహించినది. పోషణ ప్రధానముగా జీవులకు స్తన్య పానముతోనే ప్రారంభమగును. ఈ స్తన్యము ఆమె హృదయపు లోతులలో నుండి ప్రేమతో పెల్లుబుకి పొరలి వచ్చు ప్రవాహము. ఇది ప్రేమామృత ప్రవాహము. ఆనందమును

పొందుచు జీవన యాత్ర కొనసాగించుటకు జీవికి ఏవి కావలెనో అవి అన్నియు మిళితమై ఈ ప్రవాహములోనే వివిధ రూపములలో నుండును. ఈ స్తన్యమే విశ్వమంతయు పంచ భూతాత్మకముగా గూడా విస్తరిల్లి జగత్తుకు పోషక కారకమైనది.

ఈ స్తన్యమే పాల సముద్రమై అందుండి ఐరావతము, లక్ష్మీదేవి, చంద్రుడు, కల్పవృక్షము, కామధేనువు చివరకు అమృతమును గూడా ఇచ్చినది. ఈ స్తన్యమే సూర్యరశ్మిగా, చంద్రుని వెన్నెలగా, నదీజలములుగా – విస్తరించి, సకల జీవుల జీవనమునకు తోడ్పడినది. ఈ స్తన్య ప్రవాహమే సమస్త విజ్ఞానముగా, శాస్త్రములుగా, విద్యలుగా నవరసాత్మకమైన సారస్వతపు వెల్లువగా గూడా అయినది. సారస్వత ప్రవాహమైన అమ్మవారి ఇట్టి స్తన్యమును గూర్చి ప్రత్యేకముగా ఈ శ్లోకములో చెప్పబడుచున్నది.

**శంకరుల అదృష్టము**

సారస్వతపు ప్రవాహము వంటి తన స్తన్యమును ప్రేమతో, దయాచిత్తముతో – ఈ స్తోత్రకర్త అయిన తనకు ( శంకరులకు) అమ్మవారే స్వయముగా ఇచ్చినట్లును, దానిని గ్రోలి తాను ( శంకరులు) కమనీయమైన కవిత్వ రచనలు చేసి – ఉద్దండులు, ప్రౌఢులు అయిన కవిశ్రేష్ఠులలో ఒకనిగా రాణించ గలిగితిననియు ఈ శ్లోకములో ఆది శంకరులు చెప్పుచున్నారు. శంకరుల జీవితములో జరిగిన ఒక సంఘటన దీనికి సంబంధించిన గాథగా కూడా కొందఱు చెప్పుదురు.

**కమనీయ గాథ**

శంకరులు బాల్యదశలో ఉన్నపుడు తండ్రియగు శివ గురువు ప్రతి రోజు దేవ్యాలయమునకు పోయి, ఆరాధనానంతరము దేవికి పాలను నివేదించి, నివేదించిన పాలలో సగము ఇంటికి గొని వచ్చి శంకరునకు ఇచ్చుచుండెడివారు. ఒకనాడు కార్యాంతరమున గ్రామాంతరమునకు పోవుచు తన భార్యకు ఆ బాధ్యత అప్ప గించెను. కాని, మరునాడు స్త్రీలకు సహజముగా ప్రతి మాసమునకు కలుగు

ఇబ్బరదివలన తాను ఆ బాధ్యతను నిర్వహించలేక శంకరులకే ఆ భగవత్యారాధన బాధ్యతను అప్పగించినది. అట్టి అవకాశము దొరికిన బాల శంకరులు నిష్ఠగా ఆరాధనము గావించి, దేవికి పాలను నివేదించెను. ప్రతి రోజు తన తండ్రి నివేదనగావించిన పాలను భగవతి సగము త్రాగెడిదనియు, మిగిలిన సగభాగమును తనకు తండ్రి ఇచ్చెడి వాడనియు నమ్మిన శంకరులకు తాను నివేదించిన పాలను భగవతి త్రాగక పోవుటచే తన ఆరాధనలో ఏదైన లోపము జరిగినదేమోనని – శైశవ సహజ లక్షణముతో ఏడ్చి ప్రార్థించెనట. అప్పుడు బాలశంకరుల ప్రార్థనకు ప్రసన్నురాలైన దేవి – నివేదించిన ఆ పాలను త్రాగినదట ! అప్పుడు శంకరులు మరల ఏడ్చిరట ! దేవి ప్రత్యక్షమై – 'ఏమి ? పాలను త్రాగితిని కదా! మరల ఏడ్చెదవేల'? అని అడుగగా 'ప్రతిరోజూ మా తండ్రిగారు నివేదించగా మిగిలిన సగము పాలను నా కిచ్చెడివారు గదా! ఇప్పుడు నీవు నాకు మిగల్చక మొత్తము పాలను త్రాగినావు' – అని గారాముగా ఏడ్చినారట ! శంకరుల ముగ్ధ చేష్టలకు – భవగతి విస్తుపోయి – ఆనందించి, ప్రసన్నురాలై బాల శంకరుని తన యెడిలో పరుండ బెట్టుకుని, స్తన్యము నిచ్చి ఓదార్చెనట ! అది మొదలు దేవీ స్తుతులను అనర్గళముగా, ఆశువుగా, శంకరులు చెప్పుట చూచిన తల్లి దండ్రులకు అసలు విషయము తర్వాత తెలిసినదట ! నాటి రాత్రి శివగురువుకు కలలో అమ్మవారు కనిపించి ఈ నీ బిడ్డ మహాపురుషుడై రాణించును' – అని చెప్పినదట (కైవల్యాశ్రమి వ్యాఖ్యానములో ఈ కథకలదు).

శంకరులను మించిన మేధావి, కవి, యోగి, జ్ఞాని, మతోద్ధారకుడు ఇంతవరకు మరల జన్మించలేదు. ఇది అమ్మవారి స్తన్యపాన మహిమయే కదా!



## సంస్కృత శ్లోకము - 76

శ్లో. హరక్రోధజ్వాలావళిభి రవళీఢేన వపుషా
గభీరే తే నాభీసరసి కృతసంగో మనసిజః
సముత్తస్థౌ తస్మా దచల తనయే ధూమలతికా
జన స్తాం జానీతే తవ జనని రోమావళి రితి.

## అనువాద పద్యము

*మ. హరకోపాగ్నికి రేగు జ్వాలలకు చుట్టం జేయబడ్డట్టి యా*
*ష్మరుడున్ దేహముతోడ - లోతుగల నీ సౌభాగ్యలస*
*చ్ఛరసిన్ దూరగ - లేచు ధూమలతికా సౌందర్యమున్, లోకు లీ*
*తెఱగున్ జూచి భ్రమింతురమ్మ గిరిపుత్రీ! నీదు నూగారుగా.*

## టీక

అచలతనయే = ఓ పార్వతీ ! మనసిజ = మన్మథుడు, హర = శివుని యొక్క, క్రోధజ్వాలా + ఆవళిభిః = క్రోధము అను అగ్ని వలన జనించిన జ్వాలల యొక్క సమూహము చేత, అవలీఢేన = క్రమ్మబడిన, వపుషా = శరీరముతో, గభీరే = లోతైన, తే = నీ యొక్క, నాభీ సరసి = బొడ్డు అను సరస్సునందు, కృతసంగః = కూడిన వాడయ్యెను, అనగా – మునిగిన వాడయ్యెను, తస్మాత్ = అందువలన ఆ బొడ్డు అను కొలను నుండి, ధూమలతికా = పొగతీగె, సముత్తస్థౌ = పైకి ప్రాకెను, జనని = ఓ తల్లీ! తాం = ఆ ధూమలతికను, జనః = జనము, తవ = నీ యొక్క, రోమావళిః ఇతి = నూగారు అని, జానీతే = తెలుసుకొనుచున్నారు, లేదా – అనుకొనుచున్నారు.

## తాత్పర్యము

ఓ పార్వతీ ! శివుని క్రోధాగ్ని జ్వాలలు క్రమ్మబడిన తన శరీరముతో మన్మథుడు (ఉపశమనము కోసము) లోతైన నీ బొడ్డు అను కొలనులోనికి దూకి మునిగినపుడు, నిప్పు చల్లారి ఆ కొలను నుండి తీగవలె పొగపైకి ప్రాకినది. దానిని (ఆ పొగతీగను) చూచిన జనులు నీ నూగారుగా అనుకొనుచున్నారు.

## వివరణము

బొడ్డు వద్ద నుండి నిట్టనిలువుగా పైకి పోవు సన్నని వెంట్రుకల వరుసను 'నూగారు' లేదా 'రోమరాజి' అందురు. ప్రస్తుత శ్లోకములో అమ్మవారి ఈ నూగారు గుఱించి చెప్పబడుచున్నది. నూగారును సన్నని పొగతీగతో పోల్చుట కొంత సాధారణ విషయమే అయినను, ఆ పొగతీగవలె అమ్మవారి నూగారు ఉన్నదని చెప్పుటకు – శంకరులు ఊహించి, దర్శించిన విషయము మాత్రము అత్యంత రమణీయము.

అమ్మవారి నూగారు - బొడ్డు నుండి నిట్టనిలువుగా పైకి పోవు నల్లని సన్నని పొగతీగవలె నున్నట్లును, ఆ పొగతీగ బొడ్డులో నుండి ఉత్పన్నమై పైకి సాగినట్లును శంకరుల ఊహకు తోచినది. 'అసలు బొడ్డు నుండి పొగవచ్చునట్లు అనిపించుటకు కారణమేమి ?' - అని అడిగినచో - 'బొడ్డు లోతైన కొలనువలె కనిపించి - తను తాపమును తట్టుకొనలేక ఆ తాపమును తీర్చుకొనుటకు కొలను వలె కనిపించిన' ఆ బొడ్డు లోనికి ఎవరైన దూకి వుండవలెను' అని శంకరులు సమాధానము చెప్పుదురు. ''మరి ఆ విధముగా దూకవలసిన అవసరము ఎవరికి వచ్చి వుండవచ్చును ?' అని మరల ప్రశ్నించినచో - 'నాకు తెలిసినంతవరకు శివుని ఫాలనేత్రాగ్నికి గురి అయిన మన్మథునికి అట్టి అవసరము వచ్చి, తనకు ఆరాధ్యదేవత, తల్లివంటిది అయిన అమ్మవారి ఒడిని చేరుటతో - అక్కడ అమ్మవారి బొడ్డును చూచుట తటస్థించి, అది లోతైన కొలనువలె అనిపించి, తాపము తీరునని దానిలో మునిగి యుండవచ్చునని' శంకరులు సమాధానము చెప్పుదురు. 'మరి పొగతీగ ఎట్లు వచ్చినది?' అని మరల ప్రశ్నించినచో - 'మండుచున్న వస్తువు చల్లని నీటిలో మునిగి యున్నపుడు మంట చల్లారి, పొగరాదా ?' అని శంకరులు సమాధానము చెప్పుదురు.

''ఇంతకీ మంట చల్లారిన మన్మథుడు బ్రతికి బట్టకట్టెనా ?'' అని అడిగినచో - ఆ !! ఆ పొగ తీగను తన ఉదరముపైననే వుంచుకుని, అతని భార్య రతీదేవికి మాత్రము మన్మథుడు కనబడునట్లు అమ్మవారు రతీదేవిని అనుగ్రహించెను. ఆ పొగయే అమ్మవారు నూగారుగా నాకు అనిపించినది'' అని ముక్తాయింపుగా సమాధానము చెప్పుదురు. నూగారు వుండుట ఉత్తమ సాముద్రిక లక్షణమే !

**గూఢార్థము**

నాభి - మణి పూర చక్రస్థానమును, స్తనద్వయమధ్యము - అనాహత స్థానమును, స్తనములు - ఇడా, పింగళ నాడులను సూచించినచో - నాభి నుండి స్తన మధ్యముగా వైపు పోవు నూగారు సుషుమ్నా మార్గమును సూచించును. కామ ప్రేరణకు కలిగిన చిత్తక్షోభము - ఆజ్ఞా చక్ర స్థానస్థిత జ్ఞాననేత్ర వివేకము వలన తొలగి, కామతాపము నాభి చక్రమునకు దిగి శాంతించునను గూఢార్థము గూడా ఈ శ్లోకము నందు కలదు.



## సంస్కృత శ్లోకము - 77

శ్లో. యదే తత్కాళిందీతనుతర తరంగాకృతి శివే
కృశే మధ్యే కించి జ్జనని తవ య ద్భాతి సుధియామ్
విమర్దా దన్యోన్యం కుచకలశయో రన్తరగతం
తనూభూతం వ్యోమ ప్రవిశదివ నాభిం కుహరిణీమ్.

## అనువాద పద్యము

శా. *కాళిందీలఘువీచిరూపమువలెన్ కన్పించి నీ మధ్యమం*
*దాలీనమ్మగునట్టి చిన్నదది యే దంచున్ విమర్శించగా*
*నాలోకింతురు - నీదు పీనకుచమధ్యవ్యోమ మూరాపిడిన్*
*తాళం జాలక నీదు నాభిగుహలో నభ్రమించెనంచున్ విధుల్.*

## టీక

శివే ! = ఓ భగవతీ !, జనని = ఓ జగజ్జననీ!, కృశే = సన్ననైన, తవ = నీ యొక్క, మధ్యే = నడుము నందు, యత్ ఏతత్ = ఏ యది ముందు స్ఫురించుచున్నదో, అనగా – ఎట్ట యెదుట ఏది కనబడుచున్నదో, కాళిందీ = యమునా నదియొక్క, తనుతర = సూక్ష్మాతి సూక్ష్మమైన, తరంగ + ఆకృతి = అలవంటి రూపు గలదై, కించిత్ = కొంచెముగా కనబడు, రోమావళి (నూగారు) తీరు, సుధియాం = విద్వాంసులకు, యత్ = ఏది, భాతి = ప్రకాశించుచు కనబడుచున్నదో అది, తవ = నీ యొక్క, కుచకలశయోః = కుచ కుంభముల యొక్క, అంతరగతం = మధ్య భాగమున వర్తించునదై, తనూభూతం = సూక్ష్మరూపమైన, వ్యోమ = ఆకాశము – అన్యోన్యం = పరస్పరము, విమర్దాత్ = ఒరసి కొనునట్లు స్పృశించుకొనుట వలన, కుహరిణీం = గుహవంటిదైన, నాభిం = బొడ్డును, ప్రవిశత్ + ఇవ = ప్రవేశించుచున్నది వలె ఉన్నది.

## తాత్పర్యము

ఓ భగవతీ ! జగజ్జననీ ! యమునానదీ తరంగము వలె సన్నగా చిన్నగా నుండి, నీ నడుము మధ్యమునందు మెఱయుచూ కనబడెడు నూగారు అను చిన్న వస్తువును చూచు మేధావులకు, విద్వాంసులకు, అది – నీ స్తనముల మధ్యనున్న ఆకాశము – ఆ స్తనములు రెండును ఒరయుట వలన ఆ ఒరిపిడికి తాళలేక, చోటు

చాలక నలిగి, నల్లనై, సన్ననై, మెల్లగా అధోమార్గముగా నీ నాభిని ప్రవేశించు చున్నట్లనిపించును.

## వివరణము

ఈ శ్లోకములో గూడా నూగారు గూర్చియే చెప్పబడినది. క్రిందటి శ్లోకములో చెప్పిన విషయములు ఈ శ్లోకములో చెప్పిన విషయములు బాహ్య సౌందర్యమును తెలియ జేయు వర్ణనలేకాక, ఆధ్యాత్మిక యోగ మార్గ సమన్వయమును గూడా గలిగినవి.

అమ్మవారి సమపీనస్తనయుగమును, ఆ రెంటి మధ్య నుండి సన్నగా తీగవలె క్రిందికి జాఱుచూ బొడ్డును చేరినట్లగుపడునల్లని రోమావళిని (నూగారు) – చూచు మేధావులకు, విద్వాంసులకు మాత్రమే – ఈ క్రింది విషయములు స్ఫురించునని శంకరులు చెప్పిరి.

అమ్మవారి పీనస్తనములు ఒకదానితో ఒకటి ఒరుసుకొనునంతగా దగ్గఱపడి వుండుటవలన, ఆ స్తనముల మధ్య వుండు ఆకాశము ఆ ఒరిపిడికి తాళలేక, అక్కడ వున్న చోటు చాలక, నలిగి నల్లనై, సన్ననై, మెల్లగా, అక్కడ నుండి అధోమార్గము పట్టి నాభిలోనికి జాఱుచున్న విధముగా – అమ్మవారి నడుము మధ్యన యమునానదీ తరంగమువలె సన్నగా నున్న రోమావళి అగుపించునట !

ఒకదానితో ఒకటి స్పృశించు సమపీన ఘనస్తనములు, సన్నని నడుము, సన్నని తీగవంటి నల్లని నూగారు, లోతైన బొడ్డు – ఇవి స్త్రీలకు ఉత్తమ సాముద్రిక లక్షణములు – అని శ్లోకములోని వర్ణన సూచించును.

**అంతరార్థ విశేషములు**

విశుద్ధి చక్రము ఆకాశతత్త్వమును గలిగినది. అందువలన ఉపకంఠ స్థానమందలి విశుద్ధి ప్రాంతము పంచభూతములలో ఆకాశమున సూచించును. ఇక్కడ నుండి ఆకాశము స్తనముల మధ్య నున్న ప్రదేశ మార్గము ద్వారా హృదయమును చేరి, అక్కడ అనాహత చక్రము వద్ద వాయువుగాను, అక్కడ నుండి నాభివద్దకు చేరి అక్కడ వున్నమణిపూరక చక్రము వద్ద జలతత్త్వముగాను, అక్కడ నుండి జఠరాశయము వద్దకు చేరి అక్కడ వున్న స్వాధిష్ఠాన చక్రము వద్ద అగ్ని తత్త్వముగాను, అక్కడ నుండి గుద ప్రాంతము వద్దకు చేరి అక్కడ వున్న మూలాధార చక్రము వద్ద

పృథివీ తత్త్వముగను మారుచు భౌతిక పదార్థ సృష్టికి దోహదపడును. అమ్మవారి స్తనములు పోషక కారకత్వము గలవని 75వ శ్లోకములో చెప్పబడినది. ఒకదానితో ఒకటి ఒరుసు కొను స్తనములే సృష్టి జీవుల పోషణ నిమిత్తము ఆకాశమును ఈ విధముగా పృథివీ తత్త్వాదులుగా మార్చి భౌతిక సృష్టికి దోహదపడునట్లు చేసినవను విషయము గూడా ఇందు సూచితము.

క్రిందటి శ్లోకము నందలి విషయములలో నూగారు యొక్క ఊర్ధ్వ మార్గాను వర్తనము - సృష్టి క్రమమునకు వ్యతిరేక మార్గమును సూచించునని తెలియ చేయగా - ఈ శ్లోకము నందు నూగారు యొక్క అధోమార్గానువర్తనము సృష్టి క్రమానుసరణ మార్గమును సూచించునని చెప్పును. ఇందు మొదటిది బ్రహ్మచర్యమునకు, రెండవది గృహస్థాశ్రమమునకు చెందినవిగా సమన్వయ పరచుకొనవలెను.



## సంస్కృత శ్లోకము - 78

**శ్లో. స్థిరో గంగావర్తః స్తనముకుళ రోమావళిలతా**
**కలావాలం కుండం కుసుమశరతేజో హుతభుజః**
**రతేర్లీలాగారం కిమపి తవ నాభి ర్గిరిసుతే**
**బిలద్వారం సిద్ధే ర్గిరిశనయనానాం విజయతే.**

## అనువాద పద్యము

*మ. లలనారత్నమ! శైలాజా! తనుకృశాలంకారమే సొజమై*
*బలమౌ వృక్షపు బర్వుచే బడలుచున్ వంపైనదై, వీడగా*
*గలదన్పించుచు త్రుంగునేటి దరిగా కంపించు వృక్షభ్రమన్*
*తెలుపన్ తోచెడి నీదు కౌను కగుగా నిత్యమ్ము క్షేమాంశువుల్.*

## టీక

గిరిసుతే = ఓ హిమగిరిసుతా!, తవ = నీ యొక్క, నాభిః = బొడ్డు, స్థిరం = స్థిరముగా నున్న, గంగావర్తః = గంగానది యొక్క సుడిగను, స్తనముకుళ = స్తనములు అను పూల మొగ్గల యొక్క, రోమావళిలతా = నూగారు అను తీగకు,

ఆవాలం = పాదుగను, కుసుమశర = మన్మథుని యొక్క, తేజస్ హుతభుజః = అగ్నిహోత్రమునకు సంబంధించిన, కుండం = హోమకుండముగను, రతేః = రతీదేవికి, లీలాగారం = విలాసగృహముగను, గిరిశనయనానాం = సదాశివుని కన్నులకు, సిద్ధేః = తపస్సు సిద్ధించుటకు, బిలద్వారం = గుహద్వారముగను (కనబడుచు), కిమపి = వర్ణనాతీతమై, విజయతీ = సర్వోత్కృష్టముగా భాసిల్లుచున్నది

## తాత్పర్యము

ఓ గిరిరాజపుత్రికా! పార్వతీ! నీ యొక్క బొడ్డు స్థిరముగా నున్న గంగానది సుడిగాను, స్తనములు అను పూల మొగ్గలను దాల్చు నూగారు అను తీగకు పాదుగాను, మన్మథుని యొక్క తేజస్సుకు, లేదా – అగ్నికి హోమ గుండముగాను, రతీదేవికి శృంగార గృహముగాను, నీ పతి యగు సదాశివుని తపస్సిద్ధికి గుహద్వారముగాను అగుచు, వర్ణనాతీతమై, సర్వోత్కృష్టముగా ప్రకాశించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నాభి వర్ణింపబడినది. గంగానది ఎప్పుడునూ గంభీరముగా నుండి, ప్రవహించుచుండును. ఆ నదిలో ఏర్పడు సుడులు గూడా స్థిరముగా నుండుక కదలుచునే వుండును. కదలకుండా నిలకడగానుండు గంగానది యొక్క సుడి కనక ఉన్నచో – అమ్మవారి బొడ్డు ఆ స్థిరముగా నుండు సుడి వలె నుండునట. గంగానది గంభీరముగా లోతుగానుండును. ఆ నదినీటి ప్రతిబిందువు పరమ పవిత్రము. అమ్మవారి బొడ్డు గూడ లోతుగా నుండును. పావిత్ర్యము అమ్మవారి అణువణువులో నుండును. ఇద్దరును హిమవంతుని సంతానమే! (కాబట్టి, ఇద్దరికీ తల్లిపట్ల బొడ్డుతో భౌతికమైన బంధము వుండునని సూచన). ఈ సమాన లక్షణములన్నియు అమ్మవారి బొడ్డును గంగానది సుడితో పోల్చుటను సమర్థించును గదా!

**రహస్యార్థము**

అమ్మవారి స్తనయుగము ఫలములవలె, పూల మొగ్గల వలె కనిపించి అమ్మవారి నూగారు ఆ మొగ్గలకు తీగవలెను, అమ్మవారి బొడ్డు ఆ తీగకు పాదుగను

కనుపించునని చెప్పుటలో - ఒక సాధనా రహస్య విశేషము కలదు. నాభి - మణిపూర చక్రమును, హృదయ ప్రాంతమందలి స్తనములు అనాహత చక్రమును సూచించును. నూగారు - సుషుమ్న మార్గమును సూచించును. నాభి సూచించు మణిపూర చక్రము అను పాదు వద్ద - ఈర్ష్య, అసూయ, ద్వేషాదులు అను కలుపు మొక్కలను ఏరిపారవైచి, సరియైన సాధన అను నీరు పోసి కృషి చేసినచో - అనాహత హృదయమందలి ప్రేమ పుష్పించి, ఫలించి సాధనా లక్ష్యము నెరవేరునను సూచన ఇందలి ఉపమానములలో గలదు.

**మన్మథహోమ గుండ రహస్యము**

మన్మథుని అగ్నికి అమ్మవారి బొడ్డు హోమగుండమువలె నున్నదనుటలో గూడ ఒక రహస్యము గలదు. మన్మథుని అగ్ని అనగా కామాగ్ని. ఈ కామాగ్నిని రగుల్కొల్పి జీవులను సృష్టి కార్యమునకు తోడ్పడునట్లు పనిచేసి, అమ్మవారి సృష్టికారకత్వమును బలపరచి సహకరించుటయే మన్మథుని పని. తల్లికి - సంతానమునకు మధ్య భౌతిక బంధమును నాభి సూచించును. కాబట్టి, 'ఈ నాభివద్దనే' మన్మథుడు తన నిత్యాగ్ని హోత్ర కామ కార్యకలాపములను నిర్వహించుట' - అను సూచన ఈ ఉపమానములో గలదు.

**రతీదేవి విలాస గృహ రహస్యము**

రతీదేవికి అమ్మవారి బొడ్డు విలాస గృహము, లేదా - శృంగార గృహము అని చెప్పుటలో గూడ ఒక సూచనా విశేషము కలదు. రతీదేవి తన పతికి అన్ని విధములా సహకరించి తోడ్పడుటకు, ఆ మన్మథుని కామ కార్యకలాపముల నిర్వహణ సిద్ధికి జీవులలో రతిని, అనగా - ఆసక్తిని మరింత రేకెత్తించుటకు ఆ మన్మథాగ్నికి హోమగుండమైన అమ్మవారి బొడ్డు వద్దనే తాను విహరించుచు, కామలీలా విలాస విన్యాసములను చేయునని ఈ ఉపమానములోని సూచన.

**శివుని తపస్సిద్ధి రహస్యము**

శివుని తపస్సిద్ధికి అమ్మవారి బొడ్డు గుహాద్వారమని చెప్పుటలో గూడా ఒక సూచనా విశేషము గలదు. తల్లి నుండి దేని ద్వారా గర్భాశయములోని బిడ్డకు ఆహార పానీయాదులు అంది, ఆ బిడ్డ పెరుగుటకు సహకరించునో - అట్టి నాభి

గర్భములోపల సమాధిస్థితిలో జీవుల రూపములో నున్న శివుని యొక్క తపస్సిద్ధికి గుహాద్వారముగా వుండి సహకరించునని చెప్పుట కూడా సమంజసమే కదా !

ఇన్ని విధములుగా అమ్మవారి నాభికి ఉపమానములు చెప్పి వర్ణించినను, ఇంకను చెప్పవలసినది చాలా వుండవచ్చును. అందుకే అది 'వర్ణనాతీతము' అని చెప్పి శంకరులు నాభి వర్ణనము ముగించిరి.



## సంస్కృత శ్లోకము - 79

శ్లో. **నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో**
**నమన్మూర్తే ర్నారీతిలక శనకైస్త్రుట్యత ఇవ**
**చిరం తే మధ్యస్య త్రుటితతటినీ తీర తరుణా**
**సమావస్థా స్థేమ్నో భవతు కుశలం శైలతనయే.**

## అనువాద పద్యము

మ. ***స్థిరగంగావృతమై, కుచాగ్రముకుళాధిస్థాపనాధారమౌ***
***చిరునూగారను తీగకున్ కుదురై, శ్రీపుత్రతాపమ్ముకున్***
***నెరవై, మారసతీ విలాసగృహమై, నేత్రార్థమై శూలికిన్***
***తెరువై - రంజిలు నీదు నాభి - గిరిపుత్రీ ! మించు వర్ణస్తుతుల్.***

## టీక

శైలతనయే = ఓ పార్వతీ !, నారీ తిలక ! = ఓ స్త్రీ రత్నమా ! నిసర్గక్షీణస్య = స్వభావసిద్ధముగనే కృశించి సన్నగానున్నదైన, స్తనతట భరేణ = చనుగట్టుల బరువుచే, క్లమజుషః = అలసటను పొందినదైన, నమత్ + మూర్తేః = కొంచెముగా వంగుచున్న రూపు గలదై, శనకైః = కొంచెముగా, త్రుట్యతః ఇవ = తునిగిపోవుచున్నది వలె అయి, త్రుటిత్ = తెగగొట్టి బడినదైన, తటినీ = నది యొక్క, తీర = గట్టునందలి, తరుణా = వృక్షముతో, సమ + అవస్థాస్థేమ్నః = సమముగా పోలెడు అవస్థలో స్థిరముగా నున్న, తే = నీ యొక్క, మధ్యస్య = నడుమునకు, చిరం = కలకాలము, కుశలం = క్షేమము, భవతు = అగుగాక !

## తాత్పర్యము

ఓ నారీ తిలకమా! పార్వతీ! స్వభావసిద్ధముగనే మిక్కిలి సన్నగా నున్నదై, రెండు స్తనములు అను గట్టుల బరువుచే అలసట పొందుచు కొంచెము వంగిన రూపు గలదై, తునిగి పోవుచున్నట్లనిపించునదై, కట్ట తెగిపోయిన ఏటి గట్టు నందలి చెట్టుతో పోల్చదగిన స్థితిలో స్థిరముగా నున్న – నీ నడుమునకు కలకాలము క్షేమము, కలుగు గాక!

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి నడుము తీరు వర్ణింపబడుచున్నది. శంకరులు ఒక చిత్రమైన స్థితిలోనున్న ఒక చెట్టును చూచిరి. ఆ చెట్టు భూమిలో బాగుగా వేళ్లూని, భూమికి – లోపల బయట గూడా – బాగుగా వ్యాపించి అత్యంత స్థిరముగాను, నిలకడగాను ఉన్నది కాదు. ఈ చెట్టు – సన్నగా, పీలగా నుండి, పెద్ద కైవారము కల ధృడమైన మ్రాను గలది కాదు. ఈ చెట్టు నలచదరముగా నున్న భూతలముపై లేదు. ఏటి గట్టు తెగ గొట్టబడిన – నది యొక్క గట్టుపై నున్నది. అనగా నీటి ప్రవాహ వేగము పెరిగి – తెగిన గట్టుగుండా పోయినచో – ఆ గట్టు గూడా క్రమముగా తరిగి చివరకు పూర్తిగా కరిగి కొద్దికాలములోనే కనుమరుగై పోవచ్చును గూడా! 'అట్టి గట్టుపైన పీలగా వున్న ఆ చెట్టు పరిస్థితి ఎట్లుండునో! మున్ముందు ఏమగునో!' అని శంకరులు అనుకొనిరి.

శంకరులు అమ్మవారిని ధ్యానములో దర్శించినపుడు ఆమె నడుము – సహజముగానే మిక్కిలి సన్నగా నున్నట్లు, ఈ నడుముకు పైన బరువైన, ధృడమైన స్తనములు ఉండుటచే ఆ స్తనభారమును మోయవలసిన అవసరమేర్పడి కొద్దిగా వంగినట్లుగా గూడా నున్నదట! ఈ పరిస్థితులలో పీలగా నున్న అమ్మవారి ఆ నడుమునకు ఏ క్షణములో ఏమి జరుగునో స్తనభారమునకు విరిగినను విరగవచ్చునేమో అను భయము, బాధ కూడా కలిగినవట! 'నది యొక్క తెగిన గట్టు పైనున్న చెట్టు' 'అమ్మవారి నడుము' అన్ని విధములా ఒకే రకమైన స్థితిలో నున్నట్లు నిర్ధారణకు వచ్చి, ఆ చెట్టుకు, అమ్మవారి నడుమునకు కలకాలము క్షేమము కలుగవలెనని కోరుట కన్న తాను ఏమి చేయగలనని అమ్మవారినే ప్రార్థించిరి.

(అమ్మవారి నడుము – సహజముగానే సన్నగాను, పైన ఉన్న పీన ఘన స్తనముల భారమునకు కొంచెము వంగినట్లుగాను, 'స్తనభారమునకు విరిగి పోవునేమో' అని గూడా అనిపించునంతటి సుకుమారముగానున్నను స్థిరముగానే నున్నట్లును – కనబడునని శంకరులు ఈ శ్లోకములో చెప్పదలచిరి.)



## సంస్కృత శ్లోకము - 80

**శ్లో. కుచౌ సద్య స్స్విద్య త్తట ఘటితకూర్పాసభిదురౌ**
**కషంతౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతా**
**తవ త్రాతుం భఙ్గా దలమితి వలగ్నం తనుభువా**
**త్రిధా నద్ధం దేవి త్రివళిలవలీ వల్లిభిరివ.**

## అనువాద పద్యము

***ఉ. శైలజ ప్రక్కలన్ చెమట సత్వరమంటుచు రైకమించి దో***
***ర్మూలములంటుగాన్ - స్మరుడు - రొమ్ములు బంగరుకొండరూపులన్***
***బోలగజేసి పైబరువు మోయు నపాయముగ్రాన్ప - జంద్రికా***
***మాలలు మూటి గట్టిననుమాదిరి నీ కటియొప్ప చుట్లతో.***

## టీక

దేవి ! = ఓ దివ్యమంగళ స్వరూపిణీ ! సద్యః = అప్పుడే, స్విద్యత్ = చెమర్చుచున్న, తట = పార్శ్వము లందు, ఘటిత = కూర్చబడిన, కూర్పాస = అవిక, భిదురౌ = పిగిలిపోవునేమో అనుభావము కలుగు జేయుచు, దోర్మూలే = బాహువుల మూలములను, అనగా – కక్ష ప్రదేశములను, కర్షంతీ = ఒరయుచున్నట్లును, కనక + కలశ + ఆభౌ = బంగారు కడవల చక్కదనము ఒప్పారి గొప్పగా కనబడు, కుచౌ = స్తనములను, కలయతా = నిర్మించుచున్న వాడైన, తనుభువా = మన్మథుని చేత, భంగాత్ = పీన ఘనస్తనభారముచే నడుము తునిగెడు కీడు రాకుండు గాక అని, త్రాతుం = ముందు జాగ్రత్తగా రక్షణ కొఱకై, త్రివళి = మూడు వళులు (త్రివళులు, అనగా – మూడు ముడుతలు) గల, తవ = నీ యొక్క, వలగ్నం = మధ్యభాగము, లవలీవల్లిభిః = ఏలకి తీగల చేత, త్రిధా = ముప్పేటలుగా, నద్ధంఇవ = కట్టబడినదియా అన్నట్లున్నది.

## తాత్పర్యము

ఓ దేవీ ! అప్పటికప్పుడే చెమట పోయుచున్న పార్శ్యములను అంటుకొని వున్న రవికె పిగిలిపోవునేమో అనుభావమును కలుగచేయుచు, బాహుమూల ప్రదేశములను రాచుకొనుచు, బంగారు కడవల చక్కదనముతో ఒప్పారి గొప్పగా కనబడుచు నుండు స్తనములను నిర్మించుచున్న మన్మథుడు ఈ స్తనభారము వలన నడుము తునిగెడు కీడు రాకుండా ఆ నడుమును కాపాడుటకై, ఏలకి తీగెల (అడవిలోని ఒక మొక్క తీగలు) చేత ముప్పేటగా కట్టబడెనా అనునట్లు - త్రివళులతో గూడిన నీ నడుము తోచుచున్నది.

## వివరణము

ఈ శ్లోకమునందు త్రివళులతో నుండు అమ్మవారి నడుము వర్ణింపబడినది. సాధారణముగా పీన ఘనస్తనములు, మూడు ముడుతలతో నుండు క్షీణ మధ్యము (నడుము) స్త్రీలకు అందమును, ఉత్తమ సాముద్రిక లక్షణమును సూచించును. ఈ విషయమును తెలియ గోరువారి ఆసక్తికి తగిన విధముగా శంకరులు విస్పష్టముగా వివరించి ఈ శ్లోకములో చెప్పిరి.

**మన్మథ నిర్మాణ కౌశల్యము**

ముసలి బ్రహ్మ చేయు సృష్టిని మించునట్లు సృష్టించగలనన్న నమ్మకముతో ఉత్సాహవంతుడు, యువకుడు, శృంగారాధి దేవతామూర్తి అయిన మన్మథుడు మిగిలిన అవయవముల మాట ఎట్లున్నను స్తనముల నిర్మాణము మాత్రము తాను చేపట్టెదనని ఉబలాటపడి, తాను ఆరాధించు అమ్మవారి రూపము - మరింత ఆకర్షణీయముగా, లోపములు ఏ మాత్రము లేని విధముగా, ఉత్తమ సాముద్రిక లక్షణములు పూర్తిగా చెల్లునట్లుగా - నిర్మింపదలచెను.

అవికెను తొడగినపుడు - అప్పటికప్పుడే చెమటపోయుచు, బాహు మూల ప్రదేశములను అంటుచు, పార్శ్వములను బాగుగా ఒరయుచు, గట్టిగా పట్టినట్లు బిగుతుగా వుండుటచే పిగిలిపోవునేమో అను భావమును కలుగ చేయుచు - చూచుటతోడనే - 'ఇవి బంగారు కడవల వన్నెతోను, చక్కదనముతోను పోటీ పడునంతటి సుందర బంధరముగా నున్నవే' - అని అనిపించు విధముగాను -

మన్మథుడు సమపీన ఘనస్తనములను రెట్టించిన ఉత్సాహముతో నిర్మించెను. ఆ విధముగా నిర్మించుట పూర్తి అయిన తరువాత గాని తన తప్పు తెలియలేదు. ఈ ఘన స్తనముల బరువును క్రింద నాజూకుగా, సన్నగానున్న నడుము మోయగలదా? ఒకవేళ మోయలేక విరిగినచో 'అసలుకే ఎసరు పెట్టినవాడనై, లేనిపోని అప్రదిష్టపాలగుదును' - అని రాబోవు కీడును ఊహించెను. ఇట్టి కీడును ఊహించినాడు గదా, పోనీ భారము తగ్గునట్లు స్తనముల పరిమాణమును తగ్గించ వచ్చును గదా! మన్మథునికి అది మాత్రము ఇష్టము లేదు. ఆ విషయములో రాజీపడలేదు. ఆ స్తనముల నిర్మాణమును ఏమియు మార్చకుండా, విరిగిపోకుండా, ఆ భారమును తట్టుకొన గలుగునట్లు క్రింద నున్న నడుము చుట్టును లవలీలతలతో (అడవిలో నుండు ఏలకి మొక్క వంటి ఒక జాతికి సంబంధించిన మొక్క యొక్క తీగలు) మూడు చుట్లతో గట్టిగా కట్టి, 'ఇంక భంగము వాటిల్లదు' అని ధీమాగా నుండెనట ! నడుము చుట్టును ముప్పేటగా లవలీలతలను కట్టినప్పటికీ - అవి మనము చూచుచున్నపుడు నడుము చుట్టును సహజముగా వుండు త్రివళులే (మూడు ముడతలే) అనిపించునంత నైపుణ్యముగా వాటిని కట్టెనట ! ఇవి మన్మథుని మనోహర సౌందర్య నిర్మాణ కౌశలము.

ఈ శ్లోకములో ఆది శంకరులు మన్మథుని మనోహర సౌందర్య నిర్మాణ కౌశలమును మాత్రమే చెప్పుట కాక - బ్రహ్మ సృష్టితో పోటీపడి తాను బ్రహ్మకన్న ఎక్కువ నైపుణ్యము కలవాడినని నిరూపించదలచి, స్తన నిర్మాణమును చేపట్టిన మన్మథుని యొక్క అత్యాశను, తొందరపాటు తనమును, తప్పును చేసినను నొప్పెడు రీతిలో నష్టమును పూరించి కప్పి పుచ్చుకొను తెలివిని, సమయస్ఫూర్తిని గూడా పరోక్షముగా సూచించిరి.

భక్తులు, ఉపాసకులు సగుణమార్గములో అర్చించుటకు, ధారణ చేయుటకు, ఆకర్షణీయముగా నుండునట్లు, సాముద్రిక శాస్త్రమునకు సరిపోవునట్లు లోపములు లేని తమ ఇష్ట దైవముల రూపములను ఊహించు కొందురు. ఆ విధముగా ఊహించుట భక్తునికి ధర్మమే అగును కాని దోషము కాదు. మన్మథుడు గొప్ప శాక్తేయుడు - అనగా దేవీ ఉపాసకుడు. తన ఉపాసనా దేవతను ఈ విధముగా ఊహించి నిర్మించ ప్రయత్నించుట గూడా అధర్మము కాదు.

తాను దర్శించిన అమ్మవారిని మనకు గూడా కళ్ళకు కటిటనట్లు

సాక్షాత్కరింప చేయుట ఈ స్తోత్ర రచనలో శంకరుల ఒక లక్ష్యము అని గ్రహించుకొనవలెను గాని – శంకరులు పచ్చిగా శృంగారమును మాత్రమే ఈ స్తోత్రములో నింపిరని అపోహపడి, అపార్థము చేసుకొనరాదు.



## సంస్కృత శ్లోకము - 81

**శ్లో. గురుత్వం విస్తారం క్షితిధరపతిః పార్వతి నిజాత్**
**నితంబా దాచ్ఛిద్య త్వయి హరణ రూపేణ నిదధౌ**
**అత స్తే విస్తీర్ణో గురురయ మశేషాం వసుమతీం**
**నితంబ ప్రాగ్భార స్థగయతి లఘుత్వం నయతిచ.**

## అనువాద పద్యము

***చం. చఱియలనుండితీసి, సువిశాలము భారము రెండు నీకు తా***
***నరణముగాను నిచ్చె నచలాధిపు డింతకు, నందువల్లనే -***
***గురుతర విస్తరమ్ములను గూడిన నీ మొలవెన్కపట్టులున్***
***ధరణిని పట్టుచుండి, మరి దానిని చుల్కన జేయు పార్వతీ!***

## టీక

పార్వతీ ! = ఓ గిరిజా !, క్షితిధరపతిః = పర్వతరాజగు (నీ తండ్రి) హిమవంతుడు, గురుత్వం = బరువును, విస్తారం = విశాలత్వమును, నిజాత్ = తనకు చెందిన, నితంబాత్ = కొండనడుమ యందు గల చదునైన ప్రదేశము నుండి, ఆచ్ఛిద్య = వేరుచేసి తీసి, త్వయి = నీయందు, హరణ రూపేణ = కూతురునకు తండ్రి యిచ్చు స్త్రీ ధనము రూపముగా, నిదధే = సమర్పించెను, అతః = ఇందువలననే, తే = నీ యొక్క, అయం = కనబడుచున్న, నితంబప్రాగ్భారః = పిఱుదుల యొక్క అతిశయము, గురుః = గొప్పగా బరువు గలదియు, విస్తీర్ణస్సన్ = విశాలమైనదగుచు, అశేషాం = సమస్తమైన, వసుమతీం = భూమిని, స్థగయతి = ఆచ్ఛాదించుచున్నది. అనగా, కప్పుచున్నది. లఘుత్వం = చులకన చేయుచున్నది, అనగా – తన కంటె తక్కువ చేయుచున్నది, చ = కూడా.

## తాత్పర్యము

అమ్మా పార్వతీ ! పర్వతరాజగు నీ తండ్రి హిమవంతుడు బరువు విశాలత్వములను తన కొండ నడుమ యందు గల చదునైన ప్రదేశము నుండి వేరు చేసి, నీకు 'స్త్రీ ధనము' రూపముగా సమర్పించెను. అందువలననే – నీ పిఱుదుల యొక్క గొప్పదనము – బరువు గాను, విశాలముగాను, విరివిగాను వుండి, ఈ సమస్త భూభాగమును కప్పుచుండుటయే గాక, దానిని తక్కువ గూడా చేయుచున్నది.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి పిఱుదుల గూర్చి చెప్పబడుచున్నది. స్త్రీలకు పిఱుదులు – బరువుగాను, విశాలముగాను, నునుపుగాను, ఎత్తుగాను, అర్ధ గోళాకారములో నుండుట సౌభాగ్య లక్షణములను, ఉత్తమ సాముద్రిక లక్షణమును సూచించును. చాలా మంది స్త్రీలకు ఈ లక్షణములలో కొన్ని మాత్రమే వుండును. అమ్మవారి పిఱుదులకు ఈ లక్షణములన్నియు వుండును. ఇట్టి లక్షణములతో ఆమె పిఱుదులుండుటకు కారణమును శంకరులు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

పార్వతి హిమవంతుని కూతురు. హిమవంతుడు పర్వతములన్నిటి కంటె ఎత్తయినవాడు, విశాలమైనవాడు, బరువైనవాడు. భూమి – ఇతర గ్రహములతో కొట్టకొనకుండా కాపాడబడుటకు గాను సహజముగానే ఏర్పడిన మహా పర్వతము.

(ఆకాశములోని గ్రహములు ఒక దానితో ఒకటి కొట్టుకొనకుండా ఒక క్రమపద్ధతిలో ఇప్పటివరకు తిరుగుచుండుట మనము చూచుచుందుము. ఈవిధముగా, తిరుగుటకుగల కారణమును తెలుసుకున్నచో – పర్వతమునకు 'మహీధరము', 'క్షితిధరము' – వంటి నామములు గూడా ఎందుకు వచ్చినవో తెలియును. ఇది తెలియుటకు భౌతిక శాస్త్ర విజ్ఞానము అవసరము. ప్రస్తుతము దాని వివరణ ఇక్కడ ఇచ్చుట సముచితము కాదని తెలుపుట లేదు).

**విశాలౌన్నత్యములే స్త్రీ ధనము**

ఇట్టి మహోన్నత లక్షణములు గల హిమవంతుడు తన కూతురైన పార్వతికి వివాహ సమయములో స్త్రీ ధనముగా తన కొండల నడుమ చదునుగాను, నున్నగాను

ఉన్న కొంత ప్రదేశమును ఇచ్చెను. ఆ విధముగా ఇచ్చిన ప్రదేశమునకు గూడా - తన లక్షణములే అయిన, ఉన్న తత్త్వ, విశాలత్వ, గురుత్వ లక్షణములే ఉండుట వలన అమ్మవారి పిఱుదులకు గూడా ఆ లక్షణములే వచ్చినవట ! ఈ లక్షణములుండుట వలననే అమ్మవారి పిఱుదులు - ''గురుత్వ విస్తార లక్షణములు కేవలము తనకే గల'' వని గర్వపడు భువి యొక్క విశాలమైన భూభాగము నంతటిని గూడా పూర్తిగా కప్పి, భూమిపై గల తన ఆధిక్యతను, ఆధిపత్యమును చాటుకొన్నవట!

ఒక ప్రదేశమునకు శోభను - ఆ ప్రదేశమందలి విరులు, ఝరులు, తరులు, నదీనద ప్రవాహములే ఎక్కువగా చేకూర్చును. ఇవి అన్నియు పర్వతములమీద, పర్వతముల నుండి, పర్వతముల వలన ఉత్పన్నమై వర్ధిల్లినవే! ఇట్టి పర్వతములన్నిటికిని రాజైన హిమవంతుని కూతురే అమ్మవారు. అందుకే ఈ భూమియొక్క సంపద, సౌందర్యము, భూమిపై గల వివిధ జాతుల సంస్కృతీ సంస్కారములు - అమ్మవారి నుండి వచ్చిన వారసత్వమే !



## సంస్కృత శ్లోకము - 82

శ్లో. కరీంద్రాణాం శుండాన్ కనకకదళీ కాండపటలీం
ఉభాభ్యా మూరుభ్యా ముభయమపి నిర్జిత్య భవతి
సువృత్తాభ్యాం పత్యుః ప్రణతి కఠినాభ్యాం గిరిసుతే
విధిజ్ఞే జానుభ్యాం విబుధకరికుంభద్వయ మసి.

## అనువాద పద్యము

ఉ. వారణరాజు పాణులను, పైడి యనంటుల గ్రాన్నులన్ భవ
ద్వ్యూరువు గెల్చి గుండ్రమయి యోగ్యముగా పతికిన్ ప్రణామముల్
సారెకు జేయ గట్టివయి జానువులున్ సురహస్తికుంభసం
బారము గూడ గెల్చుగద పార్వతి! నీదగు కాళ్ళజంటయున్.

## టీక

గిరిసుతే ! = ఓ పార్వతీ ! విధిజ్ఞే = వేద ప్రతిపాదిత విధులను తెలిసి,



ఆచరించు దేవీ ! భవతి = నీవు, కరీంద్రాణాం = ఏనుగుల యొక్క, శుండాన్ = తొండములను, కనకకదళీ కాండపటలీం = బంగారు అరటి స్తంభముల యొక్క మొత్తమును, ఉభాభ్యాం ఊరుభ్యాం = నీ రెండు తొడలచే, ఉభయం అపి = ఏనుగు తొండములు, అరటి స్తంభములు అను రెంటిని గూడ, నిర్జిత్య = జయించి, సువృత్తాభ్యాం = అందముగాను, వర్తులాకారములోను వుండి, (మంచి ప్రవర్తనకు దోహదపడున వైనవని గూడా అర్థము చెప్పుకొనవచ్చును). పత్యుః = భర్తయగు పరమేశ్వరునికి, ప్రణతికఠినాభ్యాం = చేయు నమస్కారముల చేత కఠినములైన, జానుభ్యాం = మోకాళ్ళ చేత, విబుధ కుంభద్వయం = ఐరావత కుంభస్థలముల రెంటిని, అసి = (జయించిన దానవు) అగుచున్నావు.

## తాత్పర్యము

వేద ప్రతిపాదిత విధులను సక్రమముగా అనుష్ఠించు దేవీ ! పార్వతీ ! ఏనుగు తొండములను, బంగారు అరటి స్తంభములను – ఈ రెంటిని నీవు – నునుపుగాను, మెత్తగాను నున్న నీ రెండు తొడలచే జయించి; నునుపుగను, సొగసుగను, గుండ్రముగను వుండి – పతియైన పరమేశ్వరునికి నీవు సాగిలపడి మ్రొక్కునపుడు భూమిని తాకుట చేత గట్టిపడిన మోకాటి చిప్పల చేత – దేవలోకమునందలి ఐరావత కుంభస్థలములను గూడా జయించిన దానవగుచున్నావు.

## వివరణము

ఈ శ్లోకములో మోకాటి చిప్పలతో కూడిన అమ్మవారి తొడలను వర్ణించు చున్నారు.

**సాటిరాని పోలికలు**

సాధారణముగా స్త్రీల తొడలను ఏనుగు తొండములతోను, లేదా – అరటి స్తంభములతోను పోల్చుదురు. కాని, శంకరులకు ఈ రెండు ఉపమానములు అంతగా సరిపోవేమోనని అనిపించినది. ఏనుగు తొండములు పొడవుగా నుండుననుటలో సందేహము లేదు గాని – మీది చర్మము మాత్రము ముతకగాను, గరుకుగాను ఉండును గాని నునుపుగా నుండదు. మరియు, ఏనుగు తొండములు స్థిరత్వము లేక మాటి మాటికీ ముడుచుకొనుచు క్రిందకు పైకి కదులుచునే యుండును.

(విప్రహస్తం ఏనుగు తొండం స్థిరముగా వుండవు) చర్మము యొక్క ముతకతనము, గరుకుతనము ముడుచుకొనుచు అస్థిరముగానుండు అవలక్షణములు - అమ్మవారి తొడలకు లేవు. అదే విధముగా సహజమైన అరటిస్తంభములు కొన్ని దొప్పల సముదాయముచే ఏర్పడునుగాని, అమ్మవారి తొడలవలె ఒకే కండగా నుండునవికావు. అరటి స్తంభములు ఇవి పైకిపోవుకొలది సన్నముగా నుండును. అమ్మవారి తొడలు క్రిందికి పోవు కొలది సన్నముగా నుండును. సహజమైన అరటిస్తంభములకు పసిమిరంగు వుండదు. అందువలన - 'బంగారు అరటిస్తంభములైనచో మాత్రమే ' - అని అరటి స్తంభముల ఉపమానముతో చెప్పుకొనవలసి వుండును. ఈ కారణములచేత - అందమైన అమ్మవారి రెండు తొడలు - ఏనుగు తొండములను, బంగారు అరటి స్తంభములను తమకు సాటిరానివానిగా జయించుచున్నవని శంకరులు నిర్ధారించిరి.

**ఐరావత కుంభములుగూడా సాటిరానివే !**

తొడలకు చివర మోకాటి చిప్పలుండును. వాటిని కూడా చక్కని ఉపమానములతో శంకరులు వర్ణించిరి. తన భర్త పరమేశ్వరుడు వచ్చిన ప్రతిసారీ అమ్మవారు (సాష్టాంగపడి నమస్కరించు అలవాటు వున్న మంచి ప్రవర్తన కలది. (అమ్మవారు ఇట్టి సత్ప్రవర్తన గలదని సూచించుపదములు రెండు చోట్ల శంకరులు ఈ శ్లోకములో సూచించిరి. మొదటగా అమ్మవారిని 'విధిజ్ఞే ' అని సంబోధించి నపుడు, రెండవసారిగా 'సువృత్తాభ్యాం' అని తొడల లక్షణమును తెలుపు పదములోను - అమ్మవారి సత్ప్రవర్తన విషయము సూచన ప్రాయముగా గలదు) ఈ విధముగా నమస్కరించుట వలన అమ్మవారి మోకాటిచిప్పలు భూమిని త్రాకుట జరుగుచు రానురాను దృఢమగును. సహజముగానే - నునుపుగాను, తెల్లగాను, గుండ్రముగాను, అందముగాను ఉండు అమ్మవారి తొడలకు ఈ దృఢత్వముతోడై - కేవలము తెల్లదనము, దృఢత్వము, గుండ్రటితనము మాత్రమేగల దేవలోక గజమైన ఐరావతము (ఈ ఏనుగు తెల్లగా వుండును) యొక్క కుంభస్థలములను గూడా జయించినదని చెప్పుటలో పక్షపాతము లేదుగదా !



## సంస్కృత శ్లోకము - 83

శ్లో. పరాజేతుం రుద్రం ద్విగుణ శరగర్భౌ గిరిసుతే
నిషంగౌ జంఘే తే విషమ విశిఖో బాఢమకృత
యదగ్రే దృశ్యంతే దశ శరఫలాః పాదయుగళీ
నఖాగ్ర చ్ఛద్మాన స్సురమకుట శాణైక నిశితాః.

## అనువాద పద్యము

మ. *భవునిన్ గెల్చుటకోసమంచు పదిగా బాణమ్ములన్ కాముడున్*
*భవదీయంబగు జంఘ తూణములలో పట్టించె, కాకున్న, శాం*
*భవి! నీ పాదనఖమ్ములొప్పనె సుపర్వాణోర్ధ్వచూడామణీ*
*ఛవిమశ్శాణము లంటియంటి దశలక్ష్య ప్రాభవాగ్రమ్ములన్.*

## టీక

గిరిసుతే = ఓ గిరిపుత్రీ ! విషమశిఖః = బేసి సంఖ్య కల, అనగా – ఐదు బాణములు గలవాడైన మన్మథుడు, రుద్రం = శివుని, పరాజేతుం = పరాజయము పాలు చేయుటకు, ద్విగుణ = రెండురెట్లుగా చేయబడిన, శర = బాణములు (సహజముగా తనకు వున్న ఐదు బాణములు రెండు రెట్లు అయినపుడు పదిబాణములు అగును) గర్భౌ = లోపల నిక్షిప్తమైన, (లేదా – ఉంచబడిన) నిషంగౌ = తూణీరములనుగా, తౌ = నీ యొక్క, జంఘే = పిక్కలను (మోకాటి చిప్పలకు చీలమండలకు మధ్యభాగము) ఆకృత = చేసినాడు, బాఢం = (ఇది) నిజము. యత్ + అగ్రే = ఏ అమ్ముల పొదుల ముందు భాగములందు, పాదయుగళీ = అడుగుల జంటయొక్క, నఖ + అగ్ర = పదివ్రేళ్ళు గల గోళ్ళ చివరల యొక్క, ఛద్మానః = నెపము గలవైన, సుర = ఇంద్రాది దేవతల యొక్క, మకుట = కిరీటములనెడు, శాణ = సానపెట్టెడు రాళ్ళ యందు, ఏకనిశితాః = ముఖ్యముగా పదును పెట్టబడినవై, దశ = రెండింతలై పదియైన, శర = బాణముల యొక్క, ఫలాః = (ఉక్కు ముక్కల) బాణాగ్రములు – అనగా – బాణపు ములుకులు, లేదా – మొనలు, దృశ్యంతౌ = కనబడుచున్నవి.

## తాత్పర్యము

ఓ గిరి రాజపుత్రీ! పార్వతీ! పంచశరుడైన మన్మథుడు రుద్రుని గెల్చుట కోసము తనకున్న ఐదు బాణములు చాలవని రెండింతలుగా, అనగా - పదిబాణములుగా చేసుకొన నెంచి, నీ పిక్కలను అమ్ముల పొదులుగను, రెండు కాళ్ళ వ్రేళ్ళను పది బాణములు గాను, ఇంద్రాది దేవతలు నీ పాదములకు మ్రొక్కినపుడు వారి కిరీట (రత్న)ముల రాపిడిచే సానపెట్టబడిన నీ పాదముల వ్రేళ్ళ గోళ్ళను - ఆ బాణములకు (ఉక్కు ముక్కలు) ములుకులుగాను చేసుకొనెను. (లేదా - శివుని గెల్చుట కోసము వెళ్ళునపుడు తన ఐదు బాణములను రెండింతలుగా చేసుకొని ఆ బాణములు ఉంచిన అమ్ముల పొదులు నీ రెండు పిక్కలుగను, ఆ పది బాణములు నీ రెండు పాదముల వ్రేళ్ళుగను, బాణపు ములుకులు నీకు దేవేంద్రులు మ్రొక్కునపుడు వారి కిరీట (రత్న)ములచే సానబెట్టబడిన నీ పాద నఖములు (గోళ్ళు)గను, గోచరించునట్లుగా (నీవే స్ఫురణకు వచ్చునట్లు) చేసి (శివుని) ఓడించెను).

## వివరణము

ఈ శ్లోకమందు అమ్మవారి పిక్కలు, పాదముల వ్రేళ్ళు, ఆ వ్రేళ్ళ గోళ్ళు వర్ణింపబడిన తీరు అత్యద్భుతముగా నుండును. ఈ స్తోత్రములోని అత్యంత రమణీయమైన శ్లోకములలో ఇది ఒకటి.

**మన్మథుని ప్రతీకార ప్రత్యేకత**

మన్మథుడు శివునిపై పూర్వపు పగను తీర్చుకొనదలచెను. సామాన్యులకు చిత్తక్షోభమును కలుగచేసి వారిని గెల్చుట మన్మథునికి పెద్ద కష్టమైన పనికాదు. కాని, శివునంతవాని విషయములో అది అంత సుసాధ్యమైన పనికాదు. శివుని ముందు మన్మథుడు ఎంతటి వాడు ? సింధువు ముందు బిందువు అంతవాడు. కాని, మన్మథుడు - తెలివి, బుద్ధి, కౌశలము గలవాడు. శివునికి ఒక దుర్బల లక్షణము కలదు. అమ్మవారిని గాని, అమ్మవారికి సంబంధించిన వస్తు సామాగ్రిని కాని చూచుట తటస్థించినచో - తన వళ్ళు తానే మఱచిపోవును. మన్మథుడు గొప్ప శాక్తేయుడు, అనగా - దేవీ ఉపాసకుడు. అమ్మవారి స్థూలదేహము గుఱించి బాగుగా

అవగాహన కలవాడు. ఈ సందర్భములో అతనికి ఒక ఉపాయము తోచి, దానిని అమలు పరచి, బుద్ధి కుశలతతో శివుని ఎదిరించ గలిగెను.

సామాన్యముగా తాను ఉపయోగించు ఐదు బాణములు శివుని విషయములో చాలవని, కనీసము రెండింతల ప్రయత్నమైనను చేసిన గాని శివుని జయించుట కష్టమని, మన్మథుడు ఐదు బాణములకు రెండింతలుగా పది బాణములను ఉపయోగించ దలచెను. ఇందులకు మన్మథుడు అమ్మవారి రెండు పిక్కలను రెండు అమ్ముల పొదులుగా రూపొందించి, శివుని ఎదిరించ దలచెను. 'అమ్ముల పొదులున్నంత మాత్రమున సరిపోవునా – బాణములు అక్కరలేదా ? – అని అడిగినచో మన్మథుని దగ్గఱ చక్కని సమాధానము ఉన్నదట ! పిక్కలను అమ్ముల పొదులుగా చేయుటలోనే ఆ బాణముల బెడద కూడా తీరగలదట ! ఆ పిక్కల క్రింద నుండు రెండు పాదముల పదివ్రేళ్ళు – ఆ పిక్కలనెడి రెండు అమ్ముల పొదులలోని ఐదేసి బాణములుగా కనబడునట్లు చేయవచ్చును గదా! – అని సమాధానము చెప్పునట ! మరి, ''ఒట్టి బాణములున్నచో ఏమి ప్రయోజనము ? వాటికి చివరవాడియైన ములుకులు ఉండనక్కర లేదా''? అని అడిగినచో గూడా మన్మథునికి సమాధానము గలదట ! ''అమ్మవారి పాదములకు దేవేంద్రాదులు అందఱూ మాటి మాటికీ మోకరిల్లినపుడు – వారి రత్న ఖచితమైన కిరీటములు అమ్మవారి కాలిగ్రోళ్ళపై తాకినపుడు, ఆ రాపిడికి సానపెట్టబడినట్లై మెఱయుచు, ఆ గోళ్ళు నిశితమైన ములుకుల వలెనే కనబడును గదా !'' అని సమాధానము చెప్పునని గూడా శంకరులు చిత్రమైన ఉపమానములతో అమ్మవారి పిక్కలను, ఆ కాలివ్రేళ్ళను, వ్రేళ్ళ గోళ్ళను పోల్చి – హృదయ రంజకముగా ఈ శ్లోకములో చెప్పిరి. యుక్తితో కూడిన శంకరుల ఊహాశక్తికి, కవితాశక్తికి, ఈ శ్లోకము ఒక నిదర్శనము.



## సంస్కృత శ్లోకము - 84

**శ్లో. శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా**
**మమాప్యేతౌ మాత శ్శిరసి దయయా ధేహి చరణౌ**
**యయోః పాద్యం పాథః పశుపతి జటాజూటతటినీ**
**యయో ర్లాక్షాలక్ష్మీ రరుణ హరిచూడామణిరుచిః.**

## అనువాద పద్యము

*శా. ఏ పాదమ్ముల శుద్ధి నీ రమల భూతేశోర్ధ్వ గంగేయగున్*
*ఏ పాదమ్ముల లత్తుకెర్పు హరి వక్షైకైక రత్నారుణ*
*మ్మే పాదమ్ములు వేదశీర్షముల శీర్షైకైక - భూషార్థ మా*
*నీ పాదమ్ములు నా శిరమ్మున కృప న్నివుంచు మమ్మా శివా !*

## టీక

మాతః = ఓ తల్లీ !, తవ = నీ యొక్క, యౌ = ఏ, చరణౌ = పాదములను, శ్రుతీనాం = వేదముల యొక్క, మూర్ధానః = శీర్షములైన వేదాంతములు, లేదా ఉపనిషత్తులు, శేఖరతయా = తలపై పూవుగా, దధతి = ధరించుచున్నవో, (హే) మాతః = ఓ తల్లీ !, ఏతౌ = ఈ, చరణౌ = పాదములను, మమ = నా యొక్క, శిరసి = శిరస్సునందు, దయయా = దయతో, ధేహి = వుంచుము, యయౌః = ఏ నీ చరణములకు, పాద్యం = పాదములను కడుగు, పాథః = జలము, పశుపతి = శివుని యొక్క, జటాజూట = జడముడి యందలి, తటినీ = గంగయో, యయోః = ఏ చరణముల యొక్క, లాక్షాలక్ష్మీః = లత్తుకరసపుకాంతి, అరుణ = ఎఱ్ఱని, హరి = విష్ణువు యొక్క, చూడామణి = శిరోభూషణము యొక్క, రుచిః = కాంతియో.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! ఏ పాదముల జంటను – ఉపనిషత్తులు శిరస్సులందు ధరించునో, (లేదా – వేదవనితలు తమ శిరస్సులందు పూవులుగా ధరింతురో), ఏ పాదముల జంటకు శివుని జటాజూట గంగ పాద్యమగునో, (అనగా, పాదములు కడుగు నీరు), ఏ పాదముల జంట విష్ణుమూర్తి శిరోభూషణము యొక్క అరుణకాంతికి కారణమో అట్టి నీ చరణములను దయతో నా శిరస్సుపై ఉంచుము.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి చరణ యుగళ పవిత్రతను, ప్రాముఖ్యమును గూర్చి చెప్పబడుచున్నది. వేదములందు గాని, ఉపనిషత్తులందు గాని పూర్తిగా అమ్మవారి గురించి అమ్మవారి విశ్వ సామ్రాజ్య పరిపాలనా ప్రణాళికల గురించియే

ప్రతిపాదింపబడును. అనగా – వేదములకు గాని, ఉపనిషత్తులకు గాని అమ్మవారు 'ఆత్మ' వంటిది. అందువలననే అవి ఆమె పాదములను నెత్తిన పెట్టుకుని పూజించునని – ఆ పాదములకు అంతటి పావిత్ర్యము, అధిష్ఠాత్రిత్వము గలదని చెప్పబడినది.

**పార్వతి పాదములను కడిగిన సవతి గంగ**

భార్యాభర్తలనిన తరువాత ఎప్పుడో ఒకప్పుడైనను పొర పచ్ఛములు, ప్రణయ కోపములు, వచ్చుట సహజము. అటువంటి సమయములలో – అందటిముందు ప్రవర్తించెడి తీరు కన్న కొంత విపరీతమైన, ఆశ్చర్యకరములైన ప్రవర్తనలతో భార్యా భర్తలు వ్యవహరింతురు. ఇద్దరు భార్యలు గలిగిన శివుని విషయములో కూడా అమ్మవారికి అటువంటి ప్రణయ కోపములు వచ్చు అవకాశము గలదు. అట్టి సమయములలో భర్త అయిన శివుడు తన పొరపాటును క్షమించమని 'కాళ్ళావేళ్ళా'పడి ప్రాధేయపడుట గూడా జరగవచ్చును ! మరి అట్టి అరుదైన సంఘటన జరిగినపుడు శివుని జటాజూటము లోని గంగ అమ్మవారి పాదములపై బడి కడుగు అవకాశము వచ్చును గదా ! ఈ విధముగా సవతి అయిన గంగ చేత పార్వతి పాదములను కడుగనట్లు చేసి, శివుడు తన తప్పును దిద్దుకొనుట జరుగును కాబట్టి, అమ్మవారు భర్తను గూడా క్షమించుట జరిగి, ఆమెకు ప్రణయ కోపాగ్ని చల్లారును. మహనీయమైన దేవలోకములో పుట్టి, స్వచ్ఛమైన ఆకాశములో ప్రవహించి, పరమ మంగళకరుడైన శివుని జటాజూటములో వసించి – పవిత్రతను చేకూర్చుకొనిన గంగ – అమ్మవారి పాదములను కడుగుటకు 'పాద్య' మైనది. అందుచేతనే – అంతటి అర్హత, పావిత్ర్యము, అమ్మవారి పాదములకున్నవని ఈ శ్లోకములో ప్రతిపాదింపబడినది.

**విష్ణుమూర్తి శిరోభూషణమును ఎఱ్ఱపరచిన పార్వతి పాదము**

సాయంకాల, ప్రాతః కాల సంధ్యాసమయములలో నిత్యము జగత్పోషణ భారమును, వహించు స్థితికారుడైన విష్ణుమూర్తి అమ్మవారి పాదములపై – మ్రొకరిల్లి, ఆమె ఇచ్చు ఆజ్ఞలను, ఆ దేశములను అనుసరించి జగత్పోషణ విధిని నిర్వహించును. అమ్మవారి పాదములపై శిరస్సు నుంచి మ్రొకరిల్లు సమయములలో విష్ణుమూర్తి శిరోభూషణము అమ్మవారి పాదముల లత్తుకరసకాంతులను పొంది పొంది – పూర్తిగా ఎఱ్ఱగా అయిపోయినదని శంకరులు చెప్పుచున్నారు !

ఈ విధముగా వేదముల యొక్క, వేద శీర్షములైన ఉపనిషత్తుల యొక్క, ఆకాశ గంగ యొక్క, శివుని యొక్క, విష్ణుమూర్తి యొక్క, శిరస్సులందు సంచరించి వాటిని పవిత్రీకరించు నంతటి అర్హత, ఆధిపత్యము గల అమ్మవారు ఆ పాదములను దయగల చిత్తముతో తన తలపై వుంచి తనను కృతార్థుని చేయుమని శంకరులు ఈ శ్లోకములో ప్రార్థించిరి.



## సంస్కృత శ్లోకము - 85

**శ్లో. నమోవాకం బ్రూమో నయన రమణీయాయ పదయోః**
**త వాస్మై ద్వంద్వాయ స్ఫుటరుచిరసాలక్త కవతే**
**అసూయ త్య త్యంతం యదభిహననాయ స్పృహయతే**
**పశూనా మీశానః ప్రమదవన కంకేళితరవే.**

## అనువాద పద్యము

*ఉ. ఏ పదసీమలో కనుల కింపగు చల్లని లత్తుకుండునో*
*ఏ పద మంటుచున్ పెరుగు వృక్షమశోకము, దాని చూడగా*
*నా పరమేశు డీర్ష్యగొని అట్టిదినందగ కోరుచుండు, నా*
*నీ పదయుగ్మమందు నెదనిల్పి ప్రణామములందు నో శివా!*

## టీక

(ఓ జగజ్జననీ) నయనరమణీయాయ = కన్నులకు ఇంపు గొలువునదై, స్ఫుటరుచి = స్పష్టముగా ప్రకాశించు కాంతి గలదై, రస + అలక్తకవతే = లత్తుకరసముచే తడిసినదియు, పదయోః = నీ పాదముల యొక్క, అస్మై = ఈ కనబడు, ద్వంద్వాయ = జంటకు, నమోవాకం = నమస్కారవచనమును, బ్రూమః = వచించెదను, పశూనాం ఈశానః = పశుపతి అయిన శివుడు, యత్‌అభిహననాయ = ఏ పాద యుగ్మ తాడనమును, స్పృహయతే = కోరుచున్నాడో, ప్రమదవన = ఉద్యానము నందలి, కంకేళితరవే = అశోక వృక్షము కొఱకు, అనగా – అశోకమును గుఱించి, అత్యంతం = మిక్కిలి, అసూయతి = అసూయపడుచున్నాడో.

## తాత్పర్యము

అమ్మా భగవతీ! నీ పాదయుగళము చూచువారికి నయనానందకరముగా నున్నది. చక్కని స్పష్టమైన ప్రకాశముతో వెలుగులు విరజిమ్ముచున్నది. లత్తుక రసముచే తడిసి కెంపురంగుతో ఇంపుగా నున్నది. నీ పాద తాడనమును ఎప్పుడును పొందు అవకాశము గలిగిన అలరులతోటలోని అశోకవృక్షములను గాంచి, అసూయ కలిగి, శివుడు నీ పాదతాడనము తనకును చెందవలెనని తహ తహలాడుచున్నాడు. అట్టి నీపాద యుగళమునకు నమస్కార వచనములు పలుకుచున్నాను, అనగా - నమస్కరించు చున్నాను.

## వివరణము

ఈ శ్లోకములో గూడా అమ్మవారి పాదములు, వాటి తాడన అనుగ్రహము గూర్చి చెప్పబడుచున్నది.

**శివుని అసూయాపూర్వకమైన అభిలాష**

ఎవరు ఎప్పుడు చూచినను అమ్మవారి పాదములు నేత్ర పర్వముగా హృదయానందకరముగా, అనుగ్రహ ప్రదముగా నుండునట! సాధారణమైన ఎఱ్ఱ తామరలవలె గాక, దివారాత్ర భేదములేక – ఆ పాద పద్మములు ఒకే విధముగా– వికాస, ప్రకాశ, మనోహరత్వములు కలిగి, ఆహ్లాదకరమైన వెలుగులు విఱజిమ్ముచుండునట! దానికి తోడు లత్తుక రస లేపనము వలన ఆ పాద పద్మములు నిత్యము కెంపురంగుల కాంతులతో ఇంపు లొలుకుచుండునట! ఇట్టి పద్మినీ జాతి స్త్రీ అయిన అమ్మవారు – ఎప్పుడును అలరులతోటలోని అశోకవన విహారము చేయుచుండుట వలన ముఖ్యముగా ఆ వనము నందలి అశోక వృక్షములకు అమ్మవారి పాద ప్రహార భాగ్యము లభించుచు సౌభాగ్యవంతముగా వర్ధిల్లుచున్నవట! 'అమ్మవారి అట్టి పాద తాడనము కనీసము ప్రణయ కలహ పరిష్కార సమయములోనైనను పొందగలుగుదునా' అని ఎదురు చూచు శివునికి అశోక వృక్షము నిత్యము అనుభవించు అపూర్వమైన అమ్మవారి పాద తాడన అనుగ్రహమునకు అసూయ గూడా కలుగుచుండునట! అట్టి అపురూపమైన, అపూర్వమైన, అనుగ్రహ పూర్వమైన అమ్మవారి పాదములకు నమస్సుమనస్సులు – అని శంకరులు మ్రొక్కుచున్నారు.

❁ ❁ ❁

## సంస్కృత శ్లోకము - 86

**శ్లో. మృషా కృత్వా గోత్రస్ఖలనమథ వైలక్ష్యనమితం**
**లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే**
**చిరా దంతశ్శల్యం దహనకృత మున్మూలితవతా**
**తులాకోటిక్వాణైః కిలికిలిత మీశానరిపుణా.**

## అనువాద పద్యము

***చం. త్వరపడి మారుపేర నిను పల్కిన వెంటనె వెల్లబాఱు నీ***
***హరుని లలాటమున్ తగులనంటగ నీ పదపుండరీక మా***
***ష్మరుడలికాక్షిచేబడిన మంటలు నేటికి తీరెనంచు సం***
***బరపడి హంసకధ్వనుల మాటున గసిదీర నవ్వుగా.***

## టీక

(ఓ జగజ్జననీ!) మృషా = పొరబాటున, గోత్రస్ఖలనం = (భార్యవద్ద) సవతి పేరును ఉచ్ఛరించుట, కృత్వా = చేసి, అథ = ఆ విధముగా పలికిన తర్వాత, వైలక్ష్యనమితం = ఏమి చేయుటకు తోచక పోవుటచే, నమితం = పాదప్రణామము చేసిన వాడును, భర్తారం పతియును అగుశివుని, తే = నీయొక్క, చరణ కమలే = పాదపద్మము నందు, లలాటే = లలాట ప్రదేశమునందు, అనగా – ఫాల భాగము నందు, తాడయతిసతి = తన్నినదగుచుండగా, ఈశానరిపుణా = శివుని శత్రువైన మన్మథుని చేత, చిరాత్ = చాలా కాలము నుండి (బాధించు చున్న) దహనకృతం = (శివుని మూడవకంటి) చిచ్చుచేత, కాల్చబడినదై చేయబడిన, అంతశ్శల్యం = హృదయమునందు బాణమువలె బాధించుచున్న దైన వైరమును, ఉన్మూలితవతా = పెళ్లగించి వేయుట గలవాని చేత, తులాకోటి = కాలిఅందెల యొక్క, క్వాణైః = మ్రోతల చేత, కిలికిలితం = కిలకిలా రావానుకరణముతో (మన్మథునికి) విజయసూచకమగుచున్నది.

## తాత్పర్యము

తల్లీ! జగజ్జననీ! త్వరపడి పొరపాటున నీ దగ్గఱ నీ సవతి పేరునుపలికి,

తరువాత ఏమి చేయుటకును తోచక పోవుటచే నీకు పాద ప్రణామము చేసి లొంగిపోయిన నీ భర్తను నీ పాద పద్మముతో నుదుట తాడనము జరుపగా - దానిని గమనించిన శివుని శత్రువైన మన్మథుడు - హృదయశల్యమైన తన చిరకాల బాధ తీరి, శివునికి తగిన శాస్తి జరిగినదని కిలకిలానవ్వినట్లు నీ కాలిగజ్జెల చిరు సవ్వడులు తోచుచున్నవి.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి చరణములు, వాటి అందెల చిరు సవ్వడుల గుఱించి అత్యంత శోభాయమానముగా చిలిపిగా, చమత్కారముగా, శృంగార రసోపేతముగా చెప్పబడినది. ముక్కంటి మూడవ కంటి మంట అంటి అనంగుడైన నాటి నుండి మన్మథునికి శివునిపై ప్రతీకార వాంఛ ప్రబలెను. ఎప్పటికైనను ఆ శివుడు పరాభవము పాలగుటను కసిగా తాను చూచి ఆనందించ వలెననుకొనెను. ఇందులకై తగిన సమయము, సందర్భముల కొఱకు ఎదురు చూచుచుండెను.

**గుట్టురట్టైన శివుని సంసారము**

ఒకనాడు అంతవరకు గంగవద్ద గడిపి, అటుపైన పార్వతి కడకు వచ్చిన శివుడు తొందరలో అనుకోకుండా గంగపేరును ఉచ్చరించి, తన పొరపాటును గ్రహించి నిరుత్తరుడై, నాలుక కరచుకొని, ఇక లాభము లేదని - పార్వతికి లొంగిపోయి - పాద ప్రణామము చేసెను. అయినను పార్వతి కోపమాపుకొనలేక, వెంటనే శివుని ఫాలభాగముపై తన పాదముతో తాడించెను. అంతలోనే ఆ పడక గదిలో ఎక్కడ నుండియో కిల కిలమని నవ్వులు వినబడెను. 'తన పడక గదిలోనే వుండి, ఈ జరిగిన వ్యవహారమంతయు జూచి ఎవరైన నవ్వలేదు గదా !' అని అనుమానము కలిగి శివుడు గది యంతయు వెదుకగా - ఎక్కడును ఎవరును కనబడలేదు. అయినచో ఆ నవ్వుల కిలకిలలు ఎవరివై యుండునా అని ఆలోచించులోపల అమ్మవారు తన కాలును ముడుచుకొనుటలో మరల కిల కిలమని సవ్వడులు వినబడెను. ఈ సవ్వడులు పూర్వము నవ్వినట్లు వినబడిన సవ్వడుల వలెనే వినిపించి - ఓహో ! అవి పార్వతి కాలి అందెల రవళులేనా! అని సమాధానపడి, ఎవరునూ చూడనందుకు సంతృప్తిగా నిట్టూర్చెను. కాని, ఆ గదిలోనే వున్న అనంగుడు ( శరీరము లేనివాడైన మన్మథుడు) సంతసించెను.

పైన తెల్పిన వ్యవహారమంతయు లిప్తకాలములోనే జరిగెను. పూర్వము -మన్మథుడు శివునిపై పుష్పబాణమును ప్రయోగించుట, శివుడు తన మూడవ కంటిని తెరచుట, మన్మథుడు భస్మమగుట, ఇవి అన్నియు లిప్తకాలములోనే జరిగినట్లు - ఈనాడు కూడా లిప్తకాలము లోనే శివునికి పరాభవము జరిగి, మన్మథుని ప్రతీకార వాంఛ తీరెను. శివుని వలన పొందిన తన అనంగత్వమే - (శరీరము లేకపోవుట) మరల ఆ శివునినే పరాభవింప చేయుటలో - ముందు తానే నవ్వినను, శివుడు అది పార్వతి అందెల రవళులను కొనుటలో - దోహదపడినందుకు మురిసిపోయి, విజయగర్వముతో పడకగది నుండి నిష్క్రమించెను.

పైన తెల్పిన కథ అంతయు జరిగనట్లుగానే సూచన ప్రాయముగా శంకర భగవత్పాదులు ఈ శ్లోకములో తెలిపిరి. వాస్తవమునకు లఘువుగా ''అమ్మవారి కాలి అందెల సవ్వడులు గూడా అతిరమ్యముగా, శ్రవణానందకరముగా నుండు'' నని చెప్పిన చాలును. అతి గోప్యముగా జరుగు శివుని సంసార విషయములను నలుగురికీ తెలియునట్లు బయట పెట్టి రట్టు చేయవలసిన పనిలేదు. కాని, సర్వజ్ఞులైన శంకరులు చిలిపిగా, చమత్కారముగా ఈ విషయమును శ్లోకబద్ధము చేయుటలో ఏమైన యోగపరమైన రహస్యములుండవచ్చునేమో అని ఆలోచించినచో కొన్ని విషయములు ద్యోతకమగును.

**శంకరుల వివేకము, గడుసుదనము**

ఈ శ్లోకములో అమ్మవారు శివుని లలాట భాగమును తన్నినట్లు చెప్పబడినది. ఇంతకు పూర్వపు శ్లోకమైన 'నమోవాకం.... తరవే' అన్న 85వ శ్లోకమునందు - అశోకవృక్షము అమ్మవారి అనుగ్రహము వలన ఆమె పాద తాడనమునకు నోచుకొనినదని, తనకు గూడా అదే విధమైన అనుగ్రహము కలుగవలెనని శివుడు కోరుకొనినట్లుగా చెప్పబడినది. అందుకు సద్యః ఫలితముగా, అనగా - కోరుకొనిన వెంటనే ఆలస్యము లేకుండా - అంతటి అదృష్టము శివునకు కలిగెనని తరువాత శ్లోకమైన ఈ ''మృషాకృత్వా....'' శ్లోకములోనే ఆదిశంకరులు తెలియపరచుట - వారి వివేకమును, గడుసుదనమును తెలుపును.

**అంతరార్థము**

ఈ శ్లోకములో - 'శివుని లలాట భాగమును అమ్మవారు తన పాదముతో

తన్నినదని' పైకి అర్థము - కాని, నిగూఢార్థము తెలియవలెనన్నచో ఈ శ్లోకములోని కొన్ని పదములు సూచించు సమన్వయార్థములు తెలియవలెను. అమ్మవారు అనగా - 'కుండలినీశక్తి' అని, 'లలాటభాగము' అనగా - 'ఆజ్ఞాచక్రస్థాన'మని, శివుడనగా - 'ఉపసాకుడైన జీవుడ'ని సమన్వయము చేసుకొనవలెను. ఈ సమన్వయమును బట్టి - అమ్మవారు అను కుండలినీ శక్తి - శివుడను ఉపాసక జీవుని యొక్క, లాలట స్థానము అను ఆజ్ఞా చక్ర స్థానము వద్ద పాదము మోపినట్లు, అనగా - ఉద్బుద్ధమై చేరినట్లు అర్థము గ్రహించవలెను.

ఆజ్ఞాచక్రము పంచభూతములలో దేని తత్త్వమునకు చెందినది కాదు. అందువలన - పంచభూతాత్మకమైన దేహసంబంధమైనది కాదు, దేహాతీతమైన మనస్తత్త్వమునకు సంబంధించినది. దేహ సంబంధమున్నపుడు స్త్రీ లింగ, పుంలింగ భేదము చెల్లును గాని - దేహాతీతమైనపుడు కాదు. కావున, దేహాతీతమైన విషయములకు 'భర్త', 'భార్య' అను పదములే అర్థరహితములగును. 'ఎవరు ఎవరిని ఎక్కడ తన్నిరి?' అను మాటలకు గూడా అర్థము ఉండదు. 'శివుడు తన వద్దకు వచ్చునపుడు, అమ్మవారు సాష్టాంగ నమస్కారము చేయుటలో దృఢపడిన మోకాటి చిప్పలు కలిగినది' అని అమ్మవారి పాతివ్రత్య ధర్మము పూర్వపు శ్లోకములో చెప్పబడగా - ఈ శ్లోకములో తన పతి లలాటమునే తన్నినదని చెప్పుట దానికి విరుద్ధమగును గదా! అందువలననే ఈ శ్లోకమునకు అంతరార్థమును గ్రహించుటయే యుక్తము.

శుక్రధాతువు తరువాత ఉండు అత్యంత శక్తివంతమైన 'ఓజస్సు', 'భ్రాజస్సు' మొదలైన ధాతువులకు పరాకాష్ఠ స్థితిలోని ధాతువే 'కుండలినీ శక్తి'. ఇంద్రియ పరితృప్తికి, అనగా - కామ పరితృప్తికి ఉపయోగించు స్థితిలోని శుక్రమును త్రేతాగ్నులలోని 'దక్షిణాగ్ని' తోను, గృహస్థాశ్రమ ధర్మములోని భాగమైన సంత్సంతానోత్పత్తికి ఉపయోగించు స్థితిలోని శుక్రమును 'గార్హపత్యాగ్ని' తోను, ఆధ్యాత్మికోన్నతికి, కుండలినీయోగ లక్ష్యమును సిద్ధింప జేసుకొనుటకు ఉపయోగించు స్థితిలోని శుక్రమును 'ఆహవనీయము' తోను పోల్చుదురు.

త్రేతాగ్నులైన వీనిలోని మొదటి రెండు - శుక్రము యొక్క అధోమార్గమును, మూడవది ఊర్ధ్వ మార్గమును, లేదా - సుషమ్నా మార్గమును

సూచించును. (ఈ మూడు స్థితులలోని శుక్రమునే వరుసగా - పాతాళ, మర్త్య, దేవలోకములలో ప్రవహించు గంగానది యైన - 'భోగవతి', 'మందాకిని', 'వియద్గంగ' లతో గూడా పోల్చుదురు.)

'గో' - ఇంద్రియము, 'త్ర' = 'రక్షణ', 'స్ఖలనము' = జాఱిపోవుట - అను అర్థములను బట్టి 'గోత్రస్ఖలన' మనగా 'ఇంద్రియనిగ్రహ శక్తి సడలుట' అను అర్థము వచ్చును. 'మృషా' = 'అసత్యము'; 'కృత్వా' = 'చేసి' అను అర్థములను బట్టి - 'మృషాకృత్వా' అనగా - 'అసత్యమును చేసి' అను అర్థము వచ్చును. అప్పుడు 'మృషాకృత్వాగోత్ర స్ఖలనము' అనగా 'ఇంద్రియ నిగ్రహ శక్తిని సడలుటను అసత్యము చేసి' అనగా 'ఇంద్రియ నిగ్రహ శక్తిని పెంపొందింప చేసి' అను అర్థమును గ్రహించవలెను.

ఈ ఇంద్రియ నిగ్రహ శక్తి పెరిగినపుడే ఉపాసకుడు కుండలినీ శక్తిని సుషుమ్నా మార్గము ద్వారా ఊర్ధ్వగతి పట్టించి, ఆజ్ఞా చక్రము మీదుగా సహస్రారమునకు చేర్చగలడు. ఈ మార్గ మధ్యములో ఆజ్ఞాచక్రస్థానమునకు కుండిలినీ శక్తి వచ్చు స్థితిని తెలుపుటయే ఈ ప్రస్తుత శ్లోక అంతరార్థము. 'మన్మథుడు నవ్వుట' అనగా - 'అనుభూతి వికసించుట' అని గ్రహించవలెను.

అధోమార్గ గామి అయిన శుక్రమనే గంగ - కుండలినీ శక్తిగా సుషుమ్న ద్వారా ఊర్ధ్వ గామినియై సహస్రారమును చేరి, అక్కడ ఒంటరిగా ఉన్న శివునితో చేరినపుడు అర్ధనారీశ్వరత్వమును చెందునని గూడా గ్రహించుట సందర్భశుద్ధిగా నుండును.



## సంస్కృత శ్లోకము - 87

శ్లో. హిమానీహంతవ్యం హిమగిరినివాసైక చతురౌ
నిశాయాం నిద్రాణాం నిశి చరమభాగే చ విశదౌ
పరం లక్ష్మీపాత్రం శ్రియమతిసృజంతౌ సమయినాం
సరోజం త్వత్పాదౌ జనని జయత శ్చిత్ర మిహ కిమ్.

## అనువాద పద్యము

చం. హిమగిరి నుండనొాచు, నిశి నే సమయంబున నైన స్వచ్ఛమై
సమయపు భక్తులందఱికి సంపదలిచ్చెడు నీదు పాదముల్
హిమమున మాడుచున్ నిశికి నీల్గుచు, లక్ష్మికి కొద్దివేళ వా
సమునగు - పద్మమున్ గెలుచు సొంతముగా నన యేమి చిత్రమౌ.

## టీక

(హే) జననీ ! = ఓ తల్లీ ! పార్వతీ ! హిమగిరినివాస + ఏకచతురౌ = మంచుకొండ యందు నివసించుటలో బాగుగా అలవాటు, నైపుణ్యము గలవియు, నిశి = రాత్రియందును, చరమభాగేచ = రాత్రి చివరి సమయములందు గూడ, విశదే = ప్రకాశ వికాసము గలవియు, సమయినాం = సమయాచారపరులైన భక్తులకు, లేదా సమయాదేవిగా అమ్మవారిని ఆరాధించు భక్తులకు, శ్రియం = సంపదను, అతిసృజంతౌ = మిక్కుటముగా కలుగ జేయునవియును, అయిన, త్వత్పాదౌ = నీ పాదములు – హిమానీ హంతవ్యం = మంచుచే నశింపచేయదగినవియు, నిశాయాం = రాత్రియందు, నిద్రాణాం = నిద్రించునదియు, వరం = ఇష్టమైన, లక్ష్మీపాత్రం = లక్ష్మీదేవి అధిష్టించుటకు పీఠమైన, సరోజం = తామరపద్మమును, జయతః = జయించుచున్నవి. ఇహ = ఈ విషయమునందు, కించిత్రం = ఏమి ఆశ్చర్యము ?

## తాత్పర్యము

తల్లీ జగజ్జననీ ! నిత్యము మంచుకొండ యందు నివసించుచు, సంచరింపగలవియు, రాత్రిపూట, రాత్రి చివరి భాగ సమయములలో గూడ ప్రకాశ వికాస అనుగ్రహము కలవి, సమయాచార పరులకు సిరిసంపదలను మిక్కుటముగా కలుగజేయునవియు, అయిన నీ అడుగులు (పాదములు) – మంచు మొత్తము చేత నశింప చేయతగినదియు, రాత్రివేళ ముడుచుకొని వుండునదియు, పగలు మాత్రమే లక్ష్మీదేవి అధిష్ఠించుటకు అనువైనదియు అగు – తామరపద్మమును జయించుచున్నవి. ఈ విషయములో ఆశ్చర్యపడవలసినది ఏమియు లేదు.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి పాదముల అడుగు భాగములు వర్ణింప

బడుచున్నవి. సాధారణముగా పాదములను తామర పద్మములతో పోల్చుదురు. కాని, శంకర భగవత్పాదులకు అమ్మవారి పాదములను తామర పద్మములతో పోల్చుట అంతసరిగాదని ఏ లక్షణమునకు ఆ లక్షణమును విడివిడిగా పోల్చి మరీ నిర్ణయించిరి.

అమ్మవారు పుట్టినది, తిరిగినది, పెరిగినది – హిమగిరి మీద. కనుక హిమగిరి మీద ఎంతగా మంచు ఉన్ననూ – బాగా అలవాటు పడిన అమ్మవారి పాదములను ఆ మంచు ఏమియు చేయలేదు. తామర పద్మములు మంచుకు ముఖము ముడుచుకుని వికాస ప్రకాశములను కోల్పోవును. కావున, ఈ సందర్భములో తామర పద్మముల కన్న అమ్మవారి పాదములే విశిష్టమైనవి.

**పక్షపాత రహితమైన పాదములు**

తన రెండు కన్నులలోనే సూర్యచంద్రులిరువురినీ గల అమ్మవారు సూర్యకిరణములకు చంద్ర కిరణములకు గల భేదమును పక్షపాత దృష్టితో గుర్తించి స్పందించదు. అందువలన రాత్రి పగలు అను భేదము లేక, సర్వకాల సర్వ అవస్థల యందును అమ్మవారి పాదములు ఒకే వికాసమును, ఒకే ప్రకాశమును కలిగి వుండును. కాని, తామర పద్మములకు సూర్యుడున్నపుడు, సూర్యరశ్మిలోను మాత్రమే ముఖము విప్పారి వికసించును. చంద్రుడున్నప్పుడు గాని, చంద్రుని వెన్నెలలో గాని ముఖమును ముకుళించుకుని వికాస ప్రకాశములను కోల్పోవును. లక్ష్మీదేవి వీటియందు పగలు మాత్రమే వసించుటకు నోచుకొనిన ఇవి – పగటి వేళ మాత్రమే ముఖమును పైకెత్తుకొనును గాని రాత్రివేళ కాదు. ఈ సందర్భములో గూడా అమ్మవారి పాదములతో తామర పద్మములు పోటీకి నిలువలేక, ఓడిపోయినవి.

అమ్మవారి పాదములు – బొమ్మల వంటివి, ఆకర్షణ కలిగిన అలంకారిక వస్తువుల వంటివి కావు. తన భక్తులకు, తనను నమ్ముకున్నవారికి అనుగ్రహముతో సిరిసంపదలను ప్రసాదించగలవి. కాని, ఈ అనుగ్రహ ప్రదాన గుణములు – త్వరలోనే వాడిపోవు తామర పద్మముల కెక్కడిది ? ఈ విషయములో గూడా అమ్మవారిదే గెలుపు అని మనకు ఏ మాత్రము శంక కలుగకుండా శంకరులు నిర్ధారించిరి.

అనగా – అమ్మవారి పాదయుగళము అన్ని విధములా కమలములను మించిన కమనీయమైన కాంతులు, రమణీయమైన సౌందర్యము గలవి అని ఈ శ్లోక సారాంశము.

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 88

శ్లో. పదం తే కీర్తీనాం ప్రపద మపదం దేవి విపదాం
కథం నీతం సద్భిః కఠినకమఠీ కర్పరతులాం
కథం వా పాణిభ్యా ముపయమనకాలే పురభిదా
యదాదాయ న్యస్తం దృషది దయమానేన మనసా.

## అనువాద పద్యము

*చం. యశమున కాలయమ్మగుచు, నా పదలంటని నీ పదమ్ములన్*
*పశుపతి పెండ్లివేళ దయవర్ధిలు చిత్తముతోడ నెట్లు తా*
*ను శుభకరమ్ములన్ గొనుచు నొక్కెదృషత్తున ? నెట్లు విజ్ఞు లా*
*కుసుమసుకోమలాంఘ్రులకు కూర్మపు కర్పర సామ్య మందురో ?*

## టీక

(హే) దేవి ! = ఓ దేవీ ! పార్వతీ ! కీర్తీనాం = యశస్సులకు, పదం = ఉనికిపట్టును, విపదాం = ఆపదలకు, అపదం = కానిచోటును, (అగు) తే = నీ యొక్క, ప్రపదం = పాదముపై భాగము, సద్భిః = సత్కవులచేత కఠిన = గట్టిదైన, కమఠీ = ఆడుతాబేలు యొక్క, కర్పర = వీపుపై డిప్పను, తులాం = పోలికను, కథం = ఏ విధముగా, నీతం = కొనిరాబడినది అనగా చెప్పబడినది ? దయామానేన = దయగల, మనసా = మనస్సు చేత, పురభిదా = త్రిపురహరుడైన శివునిచేత, ఉపయమనకాలే = వివాహ సమయమందు, పాణిభ్యాం = హస్తముల చేత, యత్ = ఏ నీ పాదము, ఆదాయ = పట్టుకోబడి, కథం వా = ఏ విధముగా, దృషది = సన్నికల్లునందు, న్యస్తం = వుంచ బడినదో!

## తాత్పర్యము

అమ్మా ! జగజ్జననీ ! ఎల్ల సత్కీర్తులకు ఆలవాలమై, అన్ని ఆపదలకు ఇరవుగానిదైన నీ పాదముల పై భాగమును సత్కవీంద్రులు - మిక్కిలి గట్టిగా నుండు ఆడు తాబేలు యొక్క వీపు పై డిప్పతో సరిపోల్చుటకు ఎట్లు ప్రయత్నించుచున్నారు? త్రిపుర హరుడైన శివుడు నిర్దయుడై వివాహ సమయమున సన్నికల్లు (పసుపు నూరుకొను పాత్రమునకు ఆధారము) మీద మెత్తని నీ పాదమును ఏ విధముగా ఉంచగలిగినాడు.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి ప్రపదములు అనగా ఉబ్బెత్తుగా నుండు పాదముల పై భాగములను గూర్చి చెప్పబడుచున్నది. సాధారణముగా ఎక్కువ మంది కవీశ్వరులు ఆడువారి ప్రపదములను ఆడు తాబేటి వీపుడిప్పతో పోల్చుదురు. చిప్పవలె వుండు తాబేలు వీపు చాలా గట్టిగా నుండును. ఆపద వచ్చు సమయములలో తాబేలు తన నాలుగు కాళ్ళను మెడతోడి ముఖమును ఆడిప్పలోనికి ముడుచుకుని దాచుకొనును. అప్పుడు ఆ తాబేలు చూచుటకు ఇనుముతో చేసిన ఒక అర్థగోళము వలె వుండును. గట్టి కడ్డీతో ఆ డిప్పను కొట్టినను పగులనంత గట్టిగా నుండును. ఆడువారి పాదములు - అందులోను అమ్మవారి పాదములు చిగురుటాకుల వలె పువ్వులవలె, మెత్తగా నుండును. అట్టి మెత్తని పాదములను కఠినమైన తాబేలు వీపు డిప్పలతో పోల్చుట శంకరులకు నచ్చలేదు. సత్కవీశ్వరులై గూడా నునుపుదనమును వర్తులతలమును చూచిరే గాని - దృఢమైన మొరటుదనము విషయమును పట్టించుకొనక పోవుట చిత్రమే అనిపించినది.

పసుపు నూరుకొను పాత్రమునకు ఆధారమైన సన్నికల్లు అతి దృఢముగాను, గగ్గులు గగ్గులు గాను వుండును. అట్టిదానిపై త్రిపురములను సంహరించిన పరాక్రమ పటిమ గల శివుడు తన వివాహ వేళలో అమ్మవారి సుతి మెత్తని పాదములను పట్టి, దయాదూరుడై ఏ విధముగా నుంచెనో గదా! - అని శంకరుల హృదయము ద్రవించినది.

అనగా, అమ్మవారి పాదములు - అంత సుతిమెత్తనివి, అంత సుకుమారమైనవి అని, వాటిని తాబేలు వీపుతో పోల్చుట సరిగాదని, శివుడు వాటిని సన్నికల్లుపై ఉంచుట గూడా మొరటుపనియే అని - శంకరులు ఈ శ్లోకములో చెప్పదలచిరి.

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 89

శ్లో. నఖై ర్నాక స్త్రీణాం కరకమల సంకోచశశిభిః
స్తరూణాం దివ్యానాం సహతఇవ తే చణ్డిచరణౌ
ఫలాని స్వస్థేభ్యః కిసలయ కరాగ్రేణ దదతాం
దరిద్రేభ్యో భద్రాం శ్రియ మనిశ మహ్నాయ దదతౌ.

## అనువాద పద్యము

*మ. సిరులన్ బీదల కిచ్చుచున్, సురపురస్త్రీ హస్త పద్మములన్*
*స్థిర సంకోచము జేయ జంద్రనఖముల్ దీపించు నీ పాదముల్*
*సురవాంఛల్ తనుదీర్చగా చిగురులే శుద్ధ ప్రహస్తమ్ములై*
*పరమౌ కల్పతరు ప్రభన్ గనుచు సుప్రత్యర్థిగా నవ్వుగా.*

## టీక

(హే) చండీ! = ఓ దుర్గాదేవీ! కిసలయ = చిగురుటాకులు అను, కరాగ్రేణ = హస్తముల యొక్క కొనలచేత, స్వస్థేభ్యః = స్వర్గలోకములో నుండు, దేవతల కొఱకు, ఫలాని = కోరిన వాటిని, దదతాం = ఇచ్చునట్టి, దివ్యానాం = స్వర్గ మందున్న, తరూణాం = కల్పవృక్షములను, దరిద్రేభ్యః = దీనజనుల కొఱకు, భద్రాం = మంగళకరమైన, శ్రియం = సంపదను, అనిశం = ఎల్లప్పుడు, అహ్నాయ = వెంట వెంటనే, దదతౌ = ఇచ్చుచున్నట్టి, తే = నీ యొక్క, చరణే = పాదములు, నాకస్త్రీణాం = స్వర్గలోకపు స్త్రీల యొక్క, కరకమల = హస్తము అను పద్మముల యొక్క, సంకోచ = ముకులించుట యందు, శశిభిః = చంద్రుని పోలినదైన, నఖైః = గోళ్ళ చేత, హసతః ఇవ = నవ్వుచున్నవి వలె ఉన్నవి.

## తాత్పర్యము

అమ్మా! చండీ! జగజ్జననీ! సకల సంపదలతో తులతూగుచూ నుండు దేవతల కోరికలను మాత్రమే కోరికలను తమ చిగురుటాకులు అను హస్తముల చేత తీర్చు కల్ప వృక్షములను చూచి – దీన దరిద్ర జనులకు శుభప్రదమైన అధిక సిరిసంపదలను ఎప్పటికప్పుడు, వెంట వెంటనే ఒనగూర్చుచుండు నీ పాదములు – శచీదేవి మొదలైన దేవతా స్త్రీల యొక్క చేతులనే పద్మములను ముకుళింప చేయు గోళ్ళు అను చంద్రుల చేత – పరిహసించుచున్నట్లున్నవి.

## వివరణము

ఈ శ్లోకములో అమ్మవారి పాదములు, వాటి నఖములను (గోళ్ళను) గూర్చి చెప్పబడుచున్నది. సాధారణముగా కల్పవృక్షము కోర్కెలను తీర్చునని అందురు. కాని, ఆ కల్పవృక్షము స్వర్గలోకములో నున్నది! కావున, దాని ఉపయోగము స్వర్గలోకవాసులకే! – కాని, స్వర్గలోక వాసులందఱూ సుసంపన్నులే! సంపదలతో తులతూగువారే! – అట్టివారికి ఇవ్వవలసినవి ఏముండును ? కాని, అమ్మవారి పాదములను నమ్ముకున్న దేవ, మానవాది ముల్లోకవాసులకు, దీన, దరిద్ర, భక్తజనులందఱికీ పక్షపాతము లేకుండా శుభప్రదమైన సిరిసంపదలను అమ్మవారు ప్రసాదించును. కాబట్టి – జరగవలసిన చోట అవసరమైన వారికి ఉపయోగము జరుగనది – అమ్మవారి పాదనుగ్రహము వలన కాని, కల్పవృక్షపు చిగురుటాకు హస్తముల వలన కాదు – అని శంకరుల విశ్లేషణ.

అమ్మవారి పాదములే అంతటి అనుగ్రహ గుణమును కలిగి, కల్పవృక్షపు చిగురుటాకుల మృదుత్వమును మించిన మృదుత్వము కలిగి, అందముగా అలరారు చుండగా – ఇక ఆ పాదముల గోళ్ళు ఎట్లుండునో గూడా ఈ శ్లోకములో శంకరులు చిత్రముగా తెలిపిరి.

దేవతా స్త్రీలు గూడా అమ్మవారి పాదవములను పూజించి తమ అభీష్టములను తీర్చుకొందురు. శచీ దేవి మొదలగు దేవతా స్త్రీలు ఆ విధముగా తమ హస్తములతో అమ్మవారి పాదములను పూజించునపుడు – తమ హస్తములు పద్మముల వలె సౌందర్య వికాసములను కలిగి వున్నవను భావన వారిలో కలిగి ఏదో కొంత మేరకు వారిలో గర్వము పొడసూపు నవకాశము కలదట! అట్టి గర్వ భావన కలిగిన మరుక్షణములోనే వారి హస్తములు ముకుళించుకుని, అటుపైన గర్వభంగమై – వారి ముఖములు గూడా ముడుచకు పోవునట! అప్పుడు – 'ఇట్లు జరుగుటకు కారణము ఏమై వుండునా' అని అమ్మవారి పాద పూజలో నున్న దేవతా స్త్రీలు ఆలోచనలో పడుదురుట! అప్పుడు – ఎదురుగా అమ్మవారి పాదనఖములు వారిని, వారి హస్తములను చూచి నవ్వులు వెదజల్లుచున్నట్లు కనబడునట! బహుశః చంద్రరేఖలను మించెడి అందచందములు గల ఈ అమ్మవారి పాదనఖములు – వెన్నెల

వికాసమును మించెడి వికాసము గల నవ్వులను వెదజల్లి ఉండవచ్చును. అప్పుడు ఆనవ్వుల వెన్నెల తమ హస్తములనెడి పద్మములను ముకుళింప చేసి వుండవచ్చునని సమాధానపడి, దర్పము వీడి - అమ్మవారి పాదములకు తమభక్తి ప్రపత్తులను సమర్పించుకొందురట !

పైన విపులముగా చెప్పిన విషయమును ఆది శంకరులు ఈ శ్లోకములో సూత్రప్రాయముగా తెలియపరచిరి. కోర్కెలను తీర్చుటలో కల్పవృక్షము కంటె మిన్నగా నుండు అమ్మవారి పాదములు - వికాస ప్రకాశములో దేవతా స్త్రీ హస్తములను మించు అందమైన గోళ్ళను కలిగి విరాజిల్లుచుండునని ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 90

**శ్లో. దదానే దీనేభ్యః శ్రియమనిశ మాశానుసదృశీ**
**మమందం సౌందర్య ప్రకర మకరందం వికిరతి**
**తవాస్మిన్ మందార స్తబక సుభగే యాతు చరణే**
**నిమజ్జ న్మజ్జీవః కరణ చరణై షట్చరణతామ్.**

## అనువాద పద్యము

***ఉ. దీనుల కోర్కెకున్ తగిన తీరున నిత్యము సంపదిచ్చుచున్,***
***సోనలు బిందు నందమగు సూనమరందము చిందుచుండి, సం***
***తానపు పుష్ప గుచ్ఛముకు తాదృశమౌ భవదీయ పాదమం***
***దేను షడింద్రియమ్ముల వసింతును షట్పదమౌచు బార్వతీ.***

## టీక

(హే జగజ్జననీ!) దీనేభ్యః = దరిద్రుల కొఱకు, శ్రియం = సిరిసంపదలను, అనిశం = ఎల్లప్పుడు, ఆశానుసదృశీం = కోర్కెలకు తగిన దానిని, దదానే = ఇచ్చుచున్నదియు, అమందం = అధికమైన, సౌందర్య = అందము యొక్క, ప్రకర = అన్ని గుణములు అను, మకరందం = తేనెను, వికిరతి = వెదజల్లునదియు, మందార స్తబకశుభగే = మందారము అను కల్పవృక్షము యొక్క పుష్పగుచ్ఛము వలె

శోభాయమాన మైనదియు అగు, అస్మిన్ = ఈ (కనబడు) తవ = నీ యొక్క, చరణే = పాదమునందు – కరణచరణః = మనస్సు, పంచేంద్రియములతో కూడి ఆరు పాదములు గలవాడైన, మత్‌జీవః = నేను అను జీవుడు, నిమజ్జన్ = మునుగుచున్నవాడై, షట్చరణతాం = ఆరు పాదములు గలదైన, భ్రమర భావమును, యాతు = పొందుగాక !

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! దీనజనులకు ఎల్లపుడు వారుకోర్కెలకు తగిన విధముగా సిరసింపదలను అనుగ్రహించునదియు, అధికమైన లావణ్య, సౌభాగ్యములు అను పూదేనియను చల్లుచున్నదియు, కల్పవృక్ష పుష్పగుచ్ఛము వలె అందమైనదియు, అగు నీ పాదపద్మమునందు – మనస్సుతో కూడిన పంచజ్ఞానేంద్రియములు ఆఱును పాదములుగా గలవాడనైన నేను మునుగుచు భ్రమర భావమున వసింతును గాక !

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి పాద పద్మము గురించి చెప్పబడుచున్నది. అమ్మవారి పాద పద్మము ఎన్నో విధములైన అపురూప లక్షణములు, గుణములు గలది అనియు, ఆ పాద పద్మము నందే భ్రమరముగా వసించుచు పొందు ఆనందము కన్న వేరుగా ఇక ఏమి కావలెను అనియు శంకరుల అభిప్రాయము. ఈ అభిప్రాయము తనకు కలుగుటకు గల కారణములు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

దీనస్థితిలో నున్న వారందరికీ పక్షపాతము లేకుండా వారి వారి అవసరములను బట్టి ఆవశ్యకతను బట్టి సిరిసంపదలను ఇచ్చి – వారి బాధలను, కష్టములను తీర్చు సల్లక్షణము గలది అమ్మవారి పాదపద్మము. శంకరులకు అమ్మవారి పాదమునకున్న ఈ గుణము మొట్ట మొదట నచ్చినది.

అతి మధురముగాను, ఆహ్లాదకరముగాను, ఆరోగ్యప్రదముగాను, పువ్వు – తొడిమల మధ్య తీపి అనుబంధమును చేకూర్చునది గాను వుండు పూదేనే వలెనే, లావణ్య గుణ విశేషములతో ఎంతో అందముగాను, దీనజన బాంధవ్యముతోను నుండు అమ్మవారి పాదమునకున్న గుణము శంకరులకు తరువాత నచ్చినది.

కోర్కెలను తీర్చుననెడి ప్రతిష్ఠ పొందిన కల్పవృక్షమును మించు అనుగ్రహ

బలమును, ఆ వృక్ష పుష్పగుచ్ఛముల సోయగమును మించు సౌజన్య, సౌందర్య లక్షణములను పొంది వుండు అమ్మవారి పాదము యొక్క మూడవ గుణము శంకరులకు నచ్చినది. ఇంక తనకు కావలసినది ఏదియు లేదని శంకరులు అనుకొనిరి. వెంటనే అమ్మవారి పాద పద్మమునందు వసించుటకు తగిన లక్షణములు తనకు ఏమైనా వున్నవా అని ప్రశ్నించుకొని – తాను గూడా దీనుడు, అమ్మవారి భక్తుడు, ఆమె అనుగ్రహము కోరువాడు, ఆమె పాద సాన్నిధ్యములో జీవితమును గడుపుటకు ఇష్టపడువాడు అయినందు వలన – 'తన మనస్సు, పంచజ్ఞానేంద్రియములు కలసి మొత్తము ఆఱింటితో ఆఱుకాళ్ళు గల తుమ్మెదగా తాను అమ్మవారి పాద పద్మము నందు వసించి ఆనంద యోగాను భూతిని పొందుదును గాక' అని నిశ్చయించు కొనిరి.

'ఎవరికైనను అమ్మవారి పాదములే పరమగతి అయి ముక్తిని ప్రసాదించును' అని ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 91

**శ్లో. పదన్యాసక్రీడా పరిచయమి వారబ్ధు మనసః**
**స్థలంత స్తే ఖేలం భవనకలహంసా న జహతి**
**అత స్తేషాం శిక్షాం సుభగమణిమంజీర రణిత**
**చ్ఛలా దాచక్షాణం చరణ కమలం చారుచరితే.**

## అనువాద పద్యము

***చం. అడుగులు వేయు క్రీడలను నా కలహంసలు నేర్వగోరి, తా***
***మడుగులు జాఱుచున్ పడుచు నా విధి నీ దరిరాగ, నీవు - నీ***
***మడమకు రమ్యరత్నమయ మండిత కింకిణులుండ - వాని స***
***వ్వడుల నెపమ్ముతో తెలుపు పాదపుతీరులు తోచుచుండుగా.***

## టీక

(హే) చారుచరితే = సుందరమైన చరిత, నడతగలదేవీ! పద = పాదముల యొక్క, న్యాస = ఉంచుట యందలి, క్రీడా = ఆటయందు, పరిచయం ఇవ =

శిక్షణవలె, ఆరబ్ధమనసః = పొందగోరు మనస్సుగలవైన, భవన కలహంసాః = రాజు భవనము నందు పోషింపబడిన రాజహంసలు, స్ఖలంతః = జాఱుచున్న నడక గలవై, తే = నీ యొక్క, ఖేలం = విలాసగమనమును, నజహతి = వదలుట లేదు, అతః = ఇందువలన, చరణకమలం = నీ పాదపద్మము, సుభగ = సుందరమైన, మణిమంజీర = మణులతో గూడిన అందియ యొక్క, రణిత + ఛలాత్ = సవ్వడుల యొక్క నెపము వలన, తేషాం = ఆ కలహంసలకు, శిక్షాం = నడకకు సంబంధించిన శిక్షణ గఱపుటకు, ఆచక్షాణం ఇవ = వచించుచున్నది, లేదా – నేర్పుచున్నది వలె వున్నది.

## తాత్పర్యము

ఓ చారుచరితా! అందమైన నీ పాద విన్యాస, క్రీడాభ్యాసమును, తామునూ పొందగోరినవైన నీ పెంపుడు రాజహంసలు తొట్రుపాటు చెందుచూ, నీ విలాస గమనమును వీడలేకున్నవి. అందువలన నీ పాదపద్మము – కెంపులు మొదలగు రత్నములు తాపిన అందియ చిరుసవ్వడులనెడి నెపముతో ఆ రాజహంసలకు విలాస గమనక్రీడా శిక్షణను నేర్పుచున్నట్లున్నది.

## వివరణము

ఈ శ్లోకమునందు అమ్మవారి గమన విలాసమును, పాద విన్యాసమును గూర్చి చెప్పబడుచున్నది. అమ్మవారి చరితమే కాదు నడత, అంటే – వర్తన, ప్రవర్తన గూడా సుందర బంధురముగా, మధుర మనోహరముగా నుండును. ముందు మన నడక సక్రమముగా ఉన్ననే గదా ఇతరులకు నేర్పగలుగునది. ముజ్జగములకు పరిపాలకురాలు, పతివ్రతా శిరోమణి అయిన అమ్మవారి చరిత, నడత, సుందరముగా నుండవా ? అమ్మవారు వేయు ప్రతి అడుగు అందమైనదే – అందఱికనీ ఆనందమును కలుగ జేయునదియే !

**హంసలకు నడక నేర్పించు అడుగులు**

నడుచుట ఎట్లో గూడ తెలియవలెను. అదియును ఒక కళయే! 'మరాళీమందగమనా' – అని వ్యాసులవారు అమ్మవారికి ఒక నామమును శ్రీ లలితా సహస్ర నామస్తోత్రములో చెప్పిరి. 'ఆడుహంస నడక వంటి నడక తీరు గలది' – అని ఈ నామమునకు అర్థము. ప్రస్తుతము ఈ సౌందర్యలహరీ స్తోత్రములో

శంకరులు అమ్మవారి నడకలను ఆడుహంసల నడకలతో పోల్చలేదు. అమ్మవారి పదన్యాస విలాసమును చూచుటకు అమ్మవారి అంతఃపురములోనే తిరుగు ఆడురాజహంసలకు ప్రతిదినము అవకాశము వచ్చుచుండును. ఆ అవకాశము వచ్చినపు డెల్ల అవి అమ్మవారు అడుగులు వేయు విధానమును - ముచ్చటపడి చూచుచుండునట! ఎంత చూచినను ఆమెనడకతీరు తమకు అభ్యాసమగుట లేదుట! నోరెత్తి ఆ పదన్యాస క్రీడను తమకూ నేర్పమని అడుగుటకు నోచని ఆ పెంపుడు రాయంచలు - ఆమెను విడువకుండా, ఆమె వెంటనే తిరుగుచూ, ఆమెనడకను అనుసరించుచున్నవట! అనుకరించిన ఆ క్రీడ అబ్బకపోగా తొట్రుపాటుతో మధ్య మధ్యలో తప్పటడుగులు వేయుట, పడుట కూడా జరుగుచున్నదట! వాటి నిస్సహాయతను, నిర్విరామ ఆసక్తిని చూచి అమ్మవారికి జాలి కలిగినదట! తాను వేరుగా శిక్షణా తరగతులు పెట్టి నేర్పుట పద్ధతి కాదని తన సహజమైన నడకలకే తన కాలి మణి మంజీరములు అందుకు అనుగుణమైన రవళులు చేయుచున్నవని పైకి అనిపించునట్లు నడిచి, ఆ రవళుల తీరుతోనే రాయంచలకు శిక్షణ ఇచ్చెనట! రాయంచలు గూడా మురిపెముగా నేర్చుకుని మురిసిపోయినవట. అప్పటి నుండియే మరాళములకు మనోహరమైన పదన్యాస క్రీడా విలాసము అబ్బినదట! అటుతర్వాతనే కవులందరు ఆడువారి నడకలను హంసనడకలతో పోల్చుచున్నారేమో - అన్నట్లుగా శంకరులు ఈ శ్లోకములో అమ్మవారి నడకలను వర్ణించిరి.

**గూఢార్థము**

ఉచ్ఛ్వాస నిశ్వాసలతో జరుగు శ్వాసప్రక్రియకు 'హంస' ఒక సంకేతము. ఈ శ్వాస గమనమును బట్టి జీవి ఆరోగ్యము గూడా మారుచుండునని చెప్పవచ్చును. శ్వాస నెమ్మదిగా జరుగుట ప్రాణాయామ ప్రక్రియకు ప్రధాన నియమము. ఈ విషయము తెలిసి ప్రాణాయామముతో పరమ లక్ష్యమును సాధించిన వారిని 'హంస' లందురు. నైపుణ్యముతో ఆ హంస స్థితికి చేరిన వారిలో ఉత్తములను 'పరమహంస' లందురు. శ్వాస నెమ్మదిగా ప్రశాంతముగా, నిలకడగా జరగవలెనను విషయము అమ్మవారికి తెలుసునని వ్యాసుల వారు 'మరాళీమందగమనా' అని శ్వాస పరముగా అమ్మవారికి ఆ నామమును చెప్పిరి. ఈ 'మరాళీమందగమనా' విషయమును

తెలుసుకొనగోరు వారు, నేర్చుకొనదలచిన వారే – శంకరులు ఈ శ్లోకములో తెలిపిన – పెంపుడు రాయంచలు. ఈ హంసలు అమ్మవారిని విడవకుండా (అనగా – అమ్మవారి ఉపసానను విడవకుండా) అమ్మవారి పథములోనే (అనగా – సుషుమ్నా మార్గములోనే) చరించుచూ (అనగా – అనుష్ఠానము కొనసాగించుచూ) పరమ లక్ష్యమును (అనగా – అమ్మవారితో సాయుజ్యస్థితిని) పొందుచున్నారను అంతరార్థము గూడా సూచన ప్రాయముగా ఈ శ్లోకములో గలదు.



## సంస్కృత శ్లోకము - 92

**శ్లో. గతా స్తే మంచత్వం ద్రుహిణహరిరుద్రేశ్వర భృతః**
**శివ స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా**
**శరీరీ శృంగారోరస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్.**

## అనువాద పద్యము

***మ. భవదీయంబగు ఖట్వ మా హరిహర బ్రహ్మేశ్వరుల్ కాగ, నీ***
***శివుడున్ స్వచ్ఛపుఛాయనన్ నెపముతో చిత్రించగా దుప్పటిన్,***
***భవదీయప్రభ వానిపైన ప్రతిబింబ భ్రాంతి తోచంగ, క***
***న్గవ కానందమొసంగు రాగమయి - శృంగారమ్ము తోపించుగా.***

## టీక

(హే జగజ్జననీ !) తే = నీ యొక్క, మంచత్వం = మంచము యొక్క, రూపముగా అగుటకు, ద్రుహిణ = బ్రహ్మ, హరి = విష్ణువు, రుద్ర = రుద్రుడు, ఈశ్వర = ఈశ్వరుడు, భృతః = భరించువారుగా ఈ నలుగురు, గతాః = పొందిన వారై, శివః = సదాశివతత్త్వము, స్వచ్ఛచ్ఛాయా = నిర్మలమైన కాంతి అను, ఘటిత = కూడబడిన, కపట = నెపము గల, ప్రచ్ఛద పటస్సన్ = కప్పుకొను దుప్పటియై, త్వదీయానాం = నీకు సంబంధించిన వారైన, భాసాం = కాంతుల యొక్క, ప్రతిఫలన = ప్రతిఫలించుటచే, రాగ = ఏ ఎఱ్ఱదనము సంక్రమించినదో దానిచే, అరుణతయా = రక్తవర్ణమగుటచే, శరీరీ = భౌతికమైన రూపు పొందినదై, శృంగార రస ఇవ = శృంగార రసము వలె, దృశాం = నీ యొక్క వీక్షణములకు, కుతుకం = ఆనందమును, దోగ్ధి= పిదుకుచున్నాడు, అనగా – కలిగించుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు నలుగురు నీవు అధిష్ఠించు మంచము యొక్క నాలుగు కోడుల రూపమున నున్నారు. సదాశివుడు తన స్వచ్ఛమైన తెల్లని కాంతిచే అను నెపముతో ఆ మంచముపై కప్పు దుప్పటి అగుచు, ఎఱ్ఱని నీ మేని కాంతులు తనపై ప్రతిఫలించుట వలన తానును పూర్తిగా ఎఱ్ఱగా మారి, మూర్తీ భవించిన శృంగార రసము వలె నయనములకు ఆనందమును ఇచ్చుచున్నాడు.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారు పడుకొను మంచమును గూర్చి చెప్పబడుచున్నది. ఈ శ్లోకములో శ్రీ విద్యకు కుండలినీ యోగమునకు సంబంధించిన విషయములు గలవు. ఈ విషయములలో కొన్ని ఇంతకు పూర్వము వచ్చిన 'సుధాసింధోర్మధ్యే.... శివాకారేమంచే.... చిదానందలహరీ' - అన్న 8వ శ్లోక వివరణలో వచ్చినవి. అమ్మవారు పడుకొను మంచమునకు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు నలుగురు నాలుగు కోళ్ళని, ఆ మంచముపై కప్పు దుప్పటి సదాశివుడని నీ ఎఱ్ఱని కాంతి ప్రతిఫలించి తానును ఎఱ్ఱబడి ఆ సదాశివుడు శృంగారరసము వలె నున్నాడని - ఈ శ్లోక బాహ్యార్థము. ఇక అంతరార్థము.

**మంచము సంగతి**

'నాలుగు కోళ్ళ మంచము' అనగానే మనము ఎఱుగున్న మంచము (Cot) వలె నుండు ననుకొనుట సహజము. ఇది సరిగాదు. ఇది సంకేత భాష. కుండలినీ శక్తి వెన్నెముకలోని సుషుమ్నద్వారా ఊర్ధ్వగతిని పొందుచున్నప్పుడు - మూలాధార, స్వాధిష్ఠానములకు సంబంధించిన బ్రహ్మ గ్రంథి (Brain of Instincts and desires), మణిపూర, అనాహత చక్రములకు సంబంధించిన విష్ణుగ్రంథి (Brain of emotions and affections), విశుద్ధి, ఆజ్ఞా చక్రములకు సంబంధించిన రుద్రగ్రంథి (Brain fo Intellect and wisdom), లలాటమునకు, శిరోమధ్య భాగమునకు సంబంధించిన ఈశ్వర స్థానమును - అధిగమించును. అనగా, సుషుమ్నా మార్గములో ఇవి మైలు రాళ్ళ వంటివి (Cardinal Points). (రైల్వే పరిభాషలో చెప్పుకొనవలెనన్నచో ఇవి ముఖ్య మైన స్టేషన్ల వంటివి) ఈ నాలుగింటిని నాలుగు మంచపు కోళ్ళుగా సూచించిరి.

ఇక మన శీర్షములోని సహస్రార మందుండు సదాశివుని - మంచము మీది తల్పము (లేదా - మంచముపై కప్పు దుప్పటి) గా సూచించిరి. పంచభూతములను - (పృథివి, ఆపస్సు, తేజస్సు, వాయువు, ఆకాశము), పంచకోశములను (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు) - ఈ మంచము నాలుగు కోళ్ళు, పైన గల తల్పములుగా సంకేతించినట్లుగా గూడా చెప్పుకొనవచ్చును.

అమ్మవారికి 'పంచకృత్యపరాయణా' అని ఒక నామము గలదు. సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములే ఈపంచకృత్యములు. అమ్మవారి అనుజ్ఞ మేరకు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు వరుసగా ఈ పంచకృత్యములను నిర్వహించుదురు. కావున వీరిని 'అధికార పురుషులు' అందురు. అమ్మవారు విశ్వసంస్థకు యజమానురాలు అయినచో ఆ సంస్థలో పనిచేయు ఒక్కొక్క విభాగపు అధ్యక్షులే బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులుగా సమన్వయపరచుకొని అర్థము చేసుకొనవలెను.

నాలుగు కోళ్ళవలె బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులుండగా, ఆ మంచముపై దుప్పటిగా సదాశివుడు స్వచ్ఛమైన తెల్లని కాంతి రూపములో ఉండును. అమ్మవారు తల్పముపై చేరుట తోడనే అమ్మవారి అరుణారుణ వర్ణకాంతులు ప్రతిఫలించి ఆ పానుపును సూచించు సదాశివుడు గూడా ఎఱ్ఱగా కనబడునట ! ఆ స్థితిలో అమ్మవారికి, అయ్యవారికి అభేదము. దీనినే 'సహస్రారేరమ్యే సహరహసి పత్యా విహరసే' అని శంకరులు 9వ శ్లోకములో చెప్పిరి. (9వ శ్లోక వివరణము చూడుడు). అరుణ వర్ణము శృంగార రసమునకు సంకేతము. అరుణ వర్ణ కాంతిలో కనబడు సదాశివుడు మూర్తీభవించిన శృంగార రసమువలె నున్నాడని ఈ శ్లోకము తెలుపుచున్నది.

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు సదాశివుని (పరమేశ్వరుని) యొక్క అనుగ్రహమును అనుసరించి తమ కార్యములను నిర్వర్తించుదురు. కాబట్టి, వారిని సదాశివుడు మంచము క్రిందుగా నుండు కోళ్ళతో పోల్చిరి. అమ్మవారు తల్పము పై పడుకొని యోగనిద్రలో అద్వైతానందానుభూతిని పొందునుగాబట్టి, భర్తయైన సదాశివుని ఆ మంచమునకు తల్పముతో పోల్చిరి. ప్రకృతీ పురుషులను సూచించు పార్వతీ పరమేశ్వరుల సంయోగ ఫలానంద సిద్ధిగా ఆ అనుభూతిని సూచించుటచే పరమేశ్వరుని మూర్తీభవించిన శృంగార రసముగా పోల్చిరి.

❀ ❀ ❀

## సంస్కృత శ్లోకము - 93

శ్లో. అరాళా కేశేషు ప్రకృత సరళా మందహసితే
శిరీషాభా చిత్తే దృషదుపలశోభా కుచతటే
భృశం తన్వీ మధ్యే పృథురురసిజారోహవిషయే
జగత్త్రాతుం శంభో ర్జయతి కరుణా కాచిదరుణా.

## అనువాద పద్యము

*చం. చికురములందు వంకరయి, చిర్నగవందున సౌకుమార్యమై,*
*సకరుణయై, శిరీషసుమసామ్యపు చిత్తమునై, దృషత్సమా*
*న కఠిన వక్షమై, నడుమునల్గినదై, పిఱుదుల్ విశాలమై,*
*సకలము రాగమై తనరు శాంభవరూపము బ్రోచు లోకముల్.*

## టీక

(హే జగజ్జననీ ) కేశేషు = కురులందు, అరాళా = వంకరయైనదియు, మందహసితే = మెల్లని నవ్వునందు, ప్రకృతి సరళా = స్వభావము చేతనే ఋజువర్తనము, సౌజన్యము గలదియు, చిత్తే = మనస్సునందు, శిరీష + ఆభా = దిరిసెన పూవు వంటి మెత్తని స్వభావము గలదియు, కుచతటే = వక్షస్థలము, దృషత్ + ఉపలశోభా = సన్నికల్లు పాత్రమువంటి బలువుగలదియు, ఉరసిజ = స్తనముల విషయమునందును, ఆరోహ = పిఱుదుల విషయమునందును, పృథుః = స్థూలమైనదియు, శంభోః = సదాశివుని యొక్క, కాచిత్ = వర్ణనాతీతమైన, అరుణా = 'అరుణ' అనుశక్తి, కరుణా = దయాస్వరూపము గలది, జగత్ = ప్రపంచమును, త్రాతుం = రక్షించుటకు, జయతి = సర్వోత్కర్షతో వర్తించుచున్నది.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! తలకురులయందు వంకరయైనది, లేత నవ్వునందు స్వభావము చేతనే చక్కనిదియు, మనస్సునందు దిరిసెన పువ్వువలె మెత్తదనము గలదియు, వక్షములు సన్నికల్లు పాత్రవము వలె బలుపుదనము గలదియు, నడుమునందు మిగుల సన్నదనము గలదియు, వక్షస్థలము వద్దను పిఱుదుల వద్దను విశాలత్వము గలదియు, ఈ విధముగా నుండునని చెప్పనలవి కానిదియు, శంభుని

కరుణారూపమైన 'అరుణ' అనుశక్తి – జగద్రక్ష నిపుణయై సర్వోత్కర్షతో విరాజిల్లుచున్నది.

## వివరణము

'గతైర్మాణిక్యత్వం...' అన్న 42వ శ్లోకము నుండి గత 91వ శ్లోకమైన 'పదన్యాసక్రీడా... చారుచరితే' వరకు కిరీటము మొదలు గమన, పదన్యాసముల వరకు వరుసలో అమ్మవారిని వర్ణించి, చివరకు అమ్మవారు శయనించు శయ్యను గూడా 92వ శ్లోకములో వర్ణించి, మరల ఒక్కసారి తాను దర్శించి వర్ణించిన అమ్మవారిని – ఆ శీర్ష పాదాంతము చూసి మొత్తము రూపమును మరల ఈ 93వ శ్లోకము నందు వర్ణించిరి.

'వంకరదనము' సాధారణముగా మంచిది కాదని, మంచి లక్షణము గాదని అనుకొందుము. కాని, అమ్మవారి కురులకు వంకరదనముండి అందమును పెంచినవి. అనగా, అమ్మవారి కురులు – వంకరదనమునకు మంచి ఉపయోగమును కలుగచేసిన వన్నమాట ! కురులలో వంకరదనమనుటలో ఇంక ఇతర విషయములలో ఆ వంకర దనము లేదను సూచనను గూడా గమనించవలెను. నల్లగాను, వత్తుగాను, వంకరగాను నుండు కురులు తలకట్టుకు శోభనిచ్చును.

**నవ్వు మెల్లన - మనసు చల్లన**

అందము ఒక శక్తి ఐనచో – ఆ శక్తికి నవ్వు ఖడ్గము వంటిది. (Beauty is a power and smile is its sword) అందువలన నవ్వని ముఖము కన్న నవ్వు చున్న ముఖము తప్పక అందముగా నుండును. కొన్ని క్లిష్టపరిస్థితులలోను, జరగవని అనుకొన్న పనులను జరుగునట్లు చేయుటలోను, తెలియని తనమును కప్పివుచ్చుటలోను, కలుపు గోలు దనమును, మంచిదనమును తెలియ పరచుటలోను – నవ్వు చాలా ఉపకరించును. కాని, ఆ నవ్వు వికృతముగాను, వికారముగాను, ఎబ్బెట్టుగాను, ఉద్ధృతముగాను ఉండరాదు. 'మందస్మితము' అనగా – మెల్లగా, పరిమితముగా నుండు చిరునవ్వు అన్ని విధములుగాను మంచిది. అట్టి నవ్వు – మనిషి యొక్క సహజమైన సాత్త్విక, సరళ స్వభావమును తెలియ జేయును. అమ్మవారి నవ్వు ఆ విధముగా నుండునట. !

మందస్మితమునకు మెత్తని మనసు నేపథ్యమువలె ఉండుట బంగారమునకు తావి అబ్బినట్లగును. మొరటు మనసున్నవారి మీద స్మితము కృత్రిమముగానే వుండును. వికృతమైన నవ్వునవ్వేడి వారి మనస్సు మెత్తగా నుండు ననుకొనలేము. అందువలన 'మందస్మితము – మెత్తని మనసే' – ఆదర్శవంతమైన దాంపత్యము. అమ్మవారి నవ్వు మెల్లన, మనసు చల్లన – అందువల్లనే ఆమె సన్నిధి తియ్యన. దిరిసెన పువ్వును మించిన విమలత్వము, కోమలత్వముతో అమ్మవారి మనస్సు ఉండునట!

**సమపీన ఘనస్తనములు**

ఆడువారికి సమపీన ఘనస్తనములు సౌష్ఠవమును సౌందర్యమును పెంపొందించును. స్తనముల యొక్క – ఈ 'సమ', 'పీన', 'ఘన' లక్షణములు ఏ మాత్రము వికటించినను సౌందర్యాకర్షణలు తగ్గును. అమ్మవారి స్తనములు ఈ మూడు లక్షణములను చక్కని అనుపాతములో కలిగి వుండునట! ఈ శ్లోకములో ఆ స్తన మండల – పీన ఘన లక్షణములను – సన్నికల్లు పాత్రముతో పోల్చి చెప్పిరి.

**నాజూకైన నడుము**

సన్నని తిన్నని నడుము శరీరాకృతికి శోభను సౌందర్యమును పెంచును. మిగిలిన శరీరావయవములన్నియు సాముద్రిక లక్షణములకు సరిపోవునట్లుండి, బాన పొట్టతో పెద్ద నడుమున్నచో వికృతముగానే వుండును. సరిపోయినట్లున్న వనుకొన్న మిగిలిన శరీరావయవముల అందము ఈ బానపొట్టతో దిగజారును. ఆడువారికి అన్ని విధములా సన్నని నడుమే సుకుమారత్వమును, సౌభాగ్యత్వమును చేకూర్చును. అమ్మవారి నడుము – పైన వుండు ఘనస్తనములకు క్రింద నుండు విశదమైన పిఱుదులకు; అట్లే, నాభి పైన ఊర్ధ్వలోకములకు – నాభిక్రింది అధోలోకములకు – చక్కని సంధానమును, సమతౌల్యమును సూచించు విధముగా నుండును.

ముందు వైపు నుండు స్తనములు వెనుక వైపు నుండు పిఱుదులు స్త్రీలకు స్థూలముగా నుండవలెను. ఇవి సూక్ష్మముగా నుండి, మిగిలిన అవయవములు స్థూలముగా నున్నచో అందము తగ్గును. తలకట్టు, చనుకట్టు, మొలకట్టు – ఈ మూడూ ఉన్న తీరును బట్టి ఆడువారికి అందము మారుచుండును. అమ్మవారి అవయవముల తీరు – ఉత్తమసాముద్రిక లక్షణములకు అనుగుణముగా నుండునని

చెప్పుకొనుట కన్న, ఉత్తమ సాముద్రిక లక్షణములు అమ్మవారి అవయవముల తీరును అనుసరించి చెప్పబడిన వనుట ఎక్కువ సత్యము.

పైన చెప్పిన ఉత్తమ సౌందర్య లక్షణములన్నియు నుండుట ఒక ఎత్తు, అంత చక్కని విగ్రహము (దేహము) నిండా కరుణ నిండి జగ్రద్రక్షణకు ఆ కరుణ ఉపయోగపడుట ఒక ఎత్తు. జీవులను, జీవుల నమూనాలను ప్రళయ సమయము నందు గూడా చెక్కు చెదరక వుండునట్లు తన కడుపులో దాచుకుని రక్షించు సదాశివుని (ఎప్పుడునూ మంగళకర లక్షణమున్నవాడు) యొక్క 'అరుణ' అను ఒక శక్తి యొక్క కరుణాస్వరూపమే అమ్మవారు. అనగా – నిండుగా కరుణ నిండిన దివ్య మంగళ విగ్రహమే అమ్మవారు. అందులకే ఆమెను 'అరుణాంకరుణా తరంగితాక్షీం...'' అని ధ్యానించుట.



## సంస్కృత శ్లోకము - 94

**శ్లో. కళంకః కస్తూరీ రజనికరబింబం జలమయం**
**కళాభిః కర్పూరై ర్మరకతకరండం నిబిడితమ్**
**అత స్త్వద్భోగేన ప్రతిదిన మిదం రిక్తకుహరం**
**విధి ర్భూయో భూయో నిబిడయతి నూనం తవ కృతే.**

## అనువాద పద్యము

**శా. అమ్మా మచ్చయు కస్తురై, జలమయంబైనట్టి యా చంద్రబిం**
**బమ్మే పచ్చలడబ్బి, యాతని కళావర్గమ్ము కర్పూర బా**
**గమ్ముల్, నిత్యము నీవు వాడుకొనగన్ కల్పింపగా దాని, సాం**
**తమ్మున్ బ్రహ్మయు నింపుగాదె ప్రలయాంతమ్మందునన్ పార్వతీ!**

## టీక

(హే జగజ్జననీ !) కలంకః = మచ్చ, కస్తూరీ = కస్తూరి అగును. రజనికరబింబం = చంద్రబింబము, జలమయం = జలస్వరూపమైనది, కళాభిః = కళా స్వరూపములైన, కర్పూరైః = పచ్చకర్పూరపు ముక్కలతో, నిబిడితం = నింపబడినది అగు, మరకతకరండం = గరుడ పచ్చలచే నిర్మింపబడిన బరణియగును,

అతః = ఇందువలన, ఇదం = ఈ కనబడు చంద్రమండలము, ప్రతిదినం = దినదినమునందు, త్వత్భోగేన = నీవు ఉపయోగించుట చేత, రిక్తకుహరం = ఖాళీ అయిన లోపలి భాగము కలది, విధిః = బ్రహ్మ, భూయః భూయః = మరల మరల, తవకృతౌ = నీ కొఱకు, నిబిడయత = ఆయా వస్తువుల చేత నిండించు చున్నాడు. నూనం = నిశ్చయము. ('భరణి' అను సంస్కృత పదమునకు 'బరణి' అనునది తెలుగు పదమగును. కాని, వాడుకలో దీనిని 'బరిణె' అనుచుందురు.)

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ఆకాశములో కనబడు చంద్రమండలము - మరకత మణులచే చేయబడి, నువ్వు - కస్తూరి, కాటుక, పన్నీరు మొదలైన వస్తువులను ఉంచుకొను బరణియే ! చంద్రునిలో మచ్చవలె నల్లగా కనబడునది - కస్తూరి. ఆ చంద్రునిలోని జలతత్త్వము - నువ్వు జలకమాడుటకు ఉపయోగించు పన్నీరు. చంద్రుని కళలుగా భావించబడునవి - పచ్చకర్పూరపు ఖండములు. ఈ వస్తువులు ఆ బరణి నుండి నువ్వు ప్రతిదినము వాడు కొనుచుండుట వలన తరిగి పోవుటచే - నీ ఆజ్ఞను అనుసరించి నీ పాలనలో సృష్టిపనిచేయు బ్రహ్మ మరల ఆ వస్తువులను పూరించుచున్నాడు. (అనగా - అయి పోయినవు డెల్ల నింపుచున్నాడని అర్థము).

## వివరణము

అమ్మవారి స్థూలవిగ్రహ వర్ణన, పదన్యాస క్రీడ, శయనించు శయ్యలను వేరు వేరు శ్లోకములలో వర్ణించుట అయిన తరువాత ఒక్కసారి ఆ శీర్షపాదాంతము అమ్మవారి స్థూల విగ్రహమునంతను ఒకే శ్లోకములో వర్ణించి ప్రస్తుత శ్లోకములో - అమ్మవారు నిత్యము వాడుకొను కస్తూరి, కాటుక, పచ్చకర్పూరపు ఖండములు గల బరణిగా చంద్రమండలమును సుందర బంధురముగా వేదార్థ సమన్వయముగా వర్ణించిరి.

''మనము ఆకాశము నందు చంద్రమండలమును చూచుచుందుము. అది చంద్రమండలమని భ్రమపడుచున్నాము గాని అది చంద్రమండలము కాదు. అమ్మవారు నిత్యము ఉపయోగించు కస్తూరి, కాటుక, పచ్చకర్పూరము మొదలగు ద్రవ్యములు ఉంచుకొను బరణి' అని శంకరులు కవితా పరముగా చెప్పుచున్నారు.

'చంద్రమండలములో నల్లని మచ్చను చూచుచున్నాము గదా అది నల్లని మచ్చకాదా'? అని అడిగినచో - కాదు. అది అమ్మవారు నుదుటిపై తిలకమును ఉంచుకొనుటకు ఉపయోగించు మృగనాభి, అనగా - కస్తూరి. (శ్రీ లలితాసహస్ర నామములలోని 'ముఖ చంద్రకళంకాభ మృగనాభివిశేషకా' నామ వివరణ చదవవలెను). కస్తూరి నల్లగా నుండును గదా దానిని చూచి చంద్రునిలో మచ్చగా మనము భ్రమపడుచున్నాము అంతే !' అని శంకరుల సమాధానము.

'జలతత్త్వముతో చంద్రుడు చల్లని మంచు కిరణములను వెదజల్లుచుండుట చూచుచున్నాము గదా!' - అని అడిగినచో - 'అది జలము కాదు - అమ్మవారు ప్రతి దినము జలకమాడుటకు ఉపయోగించు పన్నీరు. ఆ పన్నీరు వుంచబడిన బరణి కాబట్టి - మంచు కిరణములుగా చంద్రుడు ఆ పన్నీటిని వెదజల్లుచున్నట్లు మనకు కనబడుచున్నది. అంతే' ! అని శంకరుల సమాధానము.

'మరి చంద్రుని కళలు చూచుచున్నాము గదా !' అని అడిగినచో - 'ఛ ! అవి చంద్రకళలు కాదు. అమ్మవారు తాంబూల చర్వణములోను, కాటుకలోను ఉపయోగించు పచ్చ కర్పూరపు ఖండములు. అంతే !'- అని శంకరుల సమాధానము.

మరి ఆ కళలు పెరుగుచూ, తరుగుచూ వుండుట చంద్రకళలను సూచించు చున్నవి గదా' - అని అడిగినచో - అవి పెరుగుచూ తరుగుచుండుట వాస్తవమే కాని - అవి చంద్రకళలు మాత్రము గాదు. ఆ పచ్చకర్పూరపు ఖండములను అమ్మవారు నిత్యము వాడుకొనుచుండుట వలన తరిగి పోవుచుండును. మరల అమ్మవారి అనుజ్ఞ మేరకు సృష్టి పని చేయు బ్రహ్మ వాటిని ఎప్పటికప్పుడు పూరించుచుండును. ఈ పెరుగుదల తరుగుదలలు చూచి మనము చంద్రకళలుగా అపోహపడుచున్నాము అంతే ! - అని శంకరుల సమాధానము.

'బరణి అయినచో లోపల వస్తువులు బయటకు కనబడునా ? అని ప్రశ్నించినచో - 'అది చెక్కతో గాని వెండి బంగారముల వంటి లోహములతో గాని తయారు చేయబడిన బరణి కాదు. స్వచ్ఛమైన మణులచే, నిర్మింపబడిన బరిణె అందువలన లోని వస్తువులు గూడా బయటకు కనబడు నంతటి స్వచ్ఛత దానికి వుండును' - అని శంకరుల సమాధానము.

అడిగిన ప్రతిదానికి సమాధానము చెప్పు శంకరులను ఇంక మనము ఏమి అడుగగలము ? ఈ విధముగా ఖగోళ విజ్ఞాన సంబంధమైన సమన్వయముగా చెప్పిన దానిని 'వేదార్థ ప్రతి పాదనగా చెప్పుట' అందురు.



## సంస్కృత శ్లోకము - 95

**శ్లో. పురారాతే రంతః పురమసి తత స్త్వ చ్చరణయో**
**స్సపర్యా మర్యాదా తరళకరణానా మసులభా**
**తథా హ్యేతే నీతా శ్శతమఖముఖా స్సిద్ధి మతులాం**
**తవ ద్వారోపాంత స్థితిభి రణి మాద్యాభి రమరాః**

## అనువాద పద్యము

**శా. శైవాంతః పురమీవు నందువలనన్ శర్వాణి ! నీపాద సం**
**సేవల్ దుర్లభమౌనుగా చపలమౌ చిత్తమ్ములౌ వారికిన్**
**దేవ ప్రాభవ వాసవాదులును నీ దివ్యాణిమాద్యష్టచి**
**ద్భావమ్ముల్ కలుగంగ దృష్టిబడి నీ ద్వారమ్ములన్ దాటిరే.**

## టీక

(హే జగజ్జననీ !) పుర + ఆరాతౌ = త్రిపుర హరుడైన శివుని యొక్క, అతఃపురః = అంతఃపురము, అనగా – పట్టమహిషి, అసి = అగుచున్నావు, తతః = ఆ కారణము వలన, త్వత్ చరణయోః = నీ పాదముల యొక్క, సపర్యామర్యాదా = పూజాభాగ్యము, తరళకరణానాం = చపల చిత్తులకు, అసులభా = సులభమైనది కాదు, తథాహి = అది యుక్తమే అగును (ఎందువలన అనగా), ఏతే = ఈ, శత ముఖ ముఖాః = ఇంద్రాదులైన, అమరాః = దేవతలు, తవ = నీ యొక్క, ద్వార + ఉపాంతస్థితిభిః = అంతఃపుర ద్వార సమీపము నందుండు, అణిమాదిభిఃసహి = అణిమ, గరిమా మొదలగు అష్టసిద్ధుల చేత, అతులాం = సాటిలేని, సిద్ధిం = ఇష్టార్థ ఫలసిద్ధిని, నీతాః = పొందిరి.

## తాత్పర్యము



అమ్మా ! జగజ్జననీ ! నీవు త్రిపురహరుడైన శివుని పట్టమహిషివి. అందువలన

నీ పాద పద్మపూజ చేయగల భాగ్యము చపల చిత్తులైన వారికి లభించునది గాదు. అందువలననే ఈ ఇంద్రాది దేవత లందఱు తాము కోరుకున్న అల్పమైన అణిమాది అష్టసిద్ధుల గూడి, వారితో పాటు నీ ద్వార సమీపము నందే కావలి వారి వలె పడిగాపులు గాచుచున్నారు.

## వివరణము

ఈ శ్లోకమునందు దుర్లభమైన అమ్మవారి పాద సేవా భాగ్యము గుఱించి చెప్పబడుచున్నది. అమ్మవారు 'శ్రీ మహారాజ్ఞి', 'శ్రీమత్సింహాసనేశ్వరి' యేగాదు సాక్షాత్తు త్రిపురములను సంహరించిన మహాదేవుడైన శివునికి పట్టమహిషి ఈ స్థితిని, ఈ పదవిని, ఈ గొప్పదనమును మించినది మరియొకటి లేదు. ఆ పట్టమహిషి దర్శనము గూడా సర్వులకూ అందరానిది, అందుకోలేనిది. ఎంతో పుణ్యము చేసుకొని వైరాగ్య సంపన్నులైన ముక్తులకు, భక్తులకు, దక్కునేమో గాని – ఆ దర్శనము గొప్పదనము, ఆధికారిక దర్పము గల పదవీ వ్యామోహపీడితులకు ఎంత ప్రయత్నించినను లభించునది గాదు. ఇంద్రాది దేవతలందరూ నిర్జరులు (ముసలి తనము లేనివారు) అమరులు (మరణము లేనివారు) అమ్మవారి ఆదేశానుసారము విశ్వసామ్రాజ్య నిర్వహణా బాధ్యత గల ఉన్నతాధికారులు. అయినను వారు చపల చిత్తులు. ఎప్పుడనూ అధికారము పైన, పదవులపైననే వారికి వ్యామోహముండును. 'తమను మించువారు ఎవరూ ఉండకూడదు, తమ పదవులు పోకూడదు, సుస్థిరముగా తమ అధికారము చెల్లుచుండవలెను' అను భావములు వారి కుండును. అట్టివారు అమ్మవారి దర్శనమును కోరుకొన్ననూ అమ్మవారి అంతఃపుర ద్వారము వద్ద పడిగాపులు కాయవలసి వుండునట! అమ్మవారి అంతఃపుర ద్వార సమీపము నందే అణిమాది అష్టసిద్ధులకు సంబంధించిన అమ్మవారి పరివారము వుండును. ఈ దేవేంద్రాదులు వారి ప్రాపు సంపాదించి, అందుకు ప్రతిఫలముగా వారు ఇచ్చు అల్పమైన అష్ట విభూతులను పొంది, దానితోనే తామేదో అత్యున్నత మైన, అత్యుత్తమమైన ఫలమును, శక్తులను పొందినట్లు సంతృప్తులగుదురట! వచ్చినది అమ్మవారి దర్శనమునకైనను ఆ విషయమును వారు చపలచిత్తులగుటచే మరచి – రాజకీయ నాయకుల వలె, బెల్లమునకు ఆశపడి తృప్తి చెందు శునకముల వలె, కోతికి

కొబ్బరికాయ దొరికిన చందముగా తాత్కాలికమైన ఆ సిద్ధులను, పదవులను పొందుటలోనే సంతృప్తులగుదురట !

అమ్మవారి దర్శన భాగ్యము, పాదపూజా అదృష్టము కడు దుర్లభము – అని ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 96

**శ్లో. కళత్రం వైధాత్రం కతికతి భజంతే న కవయః**
**శ్రియో దేవ్యాః కోవా న భవతి పతిః కై రపి ధనైః**
**మహాదేవం హిత్వా తవసతి సతీనామచరమే**
**కుచాభ్యా మాసంగః కురవకతరో ర ప్యసులభః**

## అనువాద పద్యము

***ఉ. శైలజ ! వాణిపై కవులు సన్నుతి జేయ బతీత్వమందరే ?***
***శ్రీలను కొద్దిగా కలిగి శ్రీపతు లౌదురుగా సతమణీ !***
***ఆ లయకారుడైన - శివుడౌ పతితప్ప - భవత్కుచద్వయ***
***శ్రీలను కౌగిలించగల చేరువ గోరటకైన నున్నదే ?***

## టీక

(హే) సతి = ఓ పతివ్రతా శిరోమణీ ! పార్వతీ !, వైధాత్రం = విధాతకు, అనగా – బ్రహ్మకు సంబంధించినదైన, కళత్రం = భార్య అయిన సరస్వతిని, కతికతి = ఎందఱెందఱు, కవయః = కవులు, నభజంతే = సేవించుట లేదు, శ్రియః దేవ్యా = లక్ష్మీదేవి యొక్క, కైః అపిధనైః = ఏదో కొంత ధనము చేత కాని, కోవా = ఏ పురుషుడు, పతిః = భర్త, నభవతి = కాకున్నాడు ? (హే) సతీనాంఅచరమే = పతివ్రతలలో అగ్రగణ్యమైన దేవీ ! మహాదేవం = సదాశివుని, హిత్వా = వీడి, తవ = నీ యొక్క, కుచాభ్యాం = స్తనయుగము చేతనైన, ఆసంగః = కౌగిలింత, కురవక = గోరంటచెట్టునకు సైతము, అసులభః = సులభము కాదు.

## తాత్పర్యము

ఓ పతివ్రతా శిరోమణీ ! పార్వతీ ! బ్రహ్మదేవుని భార్య అయిన సరస్వతిని

ఎందరెందఱు కవులు సేవింపకున్నారు. లక్ష్మీదేవి యొక్క ధన సంపదలను పొంది ఏ పురుషుడు ధనపతి కాకున్నాడు? కాని పతివ్రతలలో మొట్టమొదట లెక్కింపదగిన దేవీ! నీ స్తనయుగముతోడి కౌగిలింత ఆ సదాశివునికి ఒకనికే తప్ప గోరంట చెట్టునకు గూడా లభించునది లేదు గదా!

## వివరణము

ఈ శ్లోకమునందు అమ్మవారి పాతివ్రత్యమును గుఱించి చెప్పబడుచున్నది. పాతివ్రత్య ధర్మములో వర పురుషుల ప్రసక్తికే ఇష్టపడని స్వభావము కలది అమ్మవారు. ఈ విషయములో ప్రముఖులైన – సరస్వతీదేవి, లక్ష్మీదేవి – ఈ ఇద్దరు వరుసగా బ్రహ్మ భార్య, విష్ణుమూర్తి భార్య అని పిలిపించు కొనుటతో పాటు ఇతరులు గూడా వీరిని తమకు సతులుగా చెప్పుకొనుట, చెప్పుకొనబడుటలను మనము విను చుందుము. చూచుచుందుము.

కవీశ్వరులలో కొందఱు నాలుగు కావ్యములు వ్రాసి 'వాణినారాణి' అనిన వారిని గూడా మనము ఎఱుగుదము. (పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి మొదలగువారు) నాలుగు విద్వత్సభలలో పాల్గొని రాణించిన కవులు కొందఱు 'వాణినా చెప్పు చేతలలో నుండును – అని చెప్పుకొనుట కూడా వినుచుందుము. 'వాణీవల్లభ' అను బిరుదును గూడా వినుచుందుము.

అదే విధముగా అధిక ధనము గల వానిని, అధిక సంపద ఆస్తిపాస్తులు గల వానిని 'లక్ష్మీపతి' అని 'ధనపతి' అని 'శ్రీపతి' అని గూడా అనుట మనము వినుచుందుము. లక్ష్మి, సరస్వతి – ఈ ఇద్దరి విషయములోనే ఈ విధముగా అనుటకు అవకాశము వుండును. ఆ ఇద్దరి పాతివ్రత్య పరముగా ఆలోచించినచో ఇది ఒక విధముగా వారికి కలిసి రాని విషయమే! కాని, అమ్మవారి విషయములో ఆ విధముగా గూడ చెప్పుకొనుటకు అవకాశము లేదు.

గోరంట చెట్లు మూడు రకములుగా వుండును. ఎఱ్ఱని పూతగలది ఎఱ్ఱగోరంట – దీనిని మాత్రమే 'కురవక' మందురు. పచ్చగోరంటను 'కురంటకము' నియు, నీలి గోరంటను 'ఝంటి' అనియు అందురు. ఉత్తమ స్త్రీ కుచాలింగనము వలన గోరంట చెట్టు పూత పెరుగునను విశ్వాసము సమాజములో

గలదు. చేతులకు ఎట్టిగా పండించు నవకాశము గల కురవక వృక్షము పూత పెరుగుటకు సైతము అమ్మవారి ఆలింగనమునకు నోచుకొనదట! అనగా - ఆ విషయములో కూడా అమ్మవారు తన పాతివ్రత్య ధర్మమును దృష్టిలో వుంచుకొని వ్యవహరించునన్నమాట గదా! ఒక వేళ పొరపాటున తొట్రుపాటుతో అమ్మవారి స్పర్శ తగిలి, ఆ స్పర్శనే ఆలింగన భాగ్యముగా లెక్కకట్టుకొనుటకు కూడా ఆ స్పర్శ పూర్తిగా అమ్మవారిది అయి వుండదట! ఆమెలో సగము శివుడే కాబట్టి, గోరంటకు ఆ స్పర్శను గూడా శివునితో నున్న దేవి వలన కలుగును కాని, పూర్తిగా దేవి వలన ఎప్పుడును కానే కాదని అర్థము.

**అంతరార్థము**

''అమ్మవారిని ఆశ్రయించి సేవించు కొను సాధకునకు చిచ్ఛక్తి ఉదయించి, అందువలన కలుగు రసానందమును ఆ సాధకుడు తనలోనే అనుభవించుటకు అవకాశము కలదేమో! అంతేగాని - కురవకులకు (కు = కుత్సితమైన, రవ = ధ్వని లేదా వాక్కులు - అను అర్థములలో 'కురవక' అనగా 'కుతర్కవాదము చేయువాడని' అర్థము. అనగా - ఎట్టిగోరంటవలె కాషాయములు దాల్చి కుతర్క, కు వాదములు చేయువారలకు) ఆ చిచ్ఛక్తి జాగృతమగుట, అందువలన వారు రసానందమును పొందుట జరుగని పని'' అని గూడా ఈ శ్లోకమునందలి 'కురవక' పద ప్రయోగము సూచించును.

సులభముగానే - సరస్వతీ అనుగ్రహముచే కవీశ్వరుడు కావచ్చును. లక్ష్మి అనుగ్రహముచే ధనవంతుడు కావచ్చును - కాని, జగజ్జననీ కృపాపాత్రుడగుట అంత సులభమైన విషయముగాదని' ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 97

**శ్లో. గిరా మాహు ర్దేవీం ద్రుహిణ గృహిణి మాగమవిదో**
**హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్**
**తురీయా కాపి, త్వం దురధిగమనిస్సీమ మహిమా**
**మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి.**

## అనువాద పద్యము

ఉ. *అమ్మ సదాశివాత్మ ! నిను నాగమవేదులు బ్రహ్మ భార్య వా
ణమ్మగ, నా యుపేంద్రసతియౌ రమగన్, హరభార్య శైలసూ
నమ్మగ గూడ నిన్ననగ నా త్రయమందని మాయతో తురీ
యమ్మున విశ్వమున్ భ్రమల నందగ జేతువు పూర్ణమాయవై.*

## టీక

(హే) పరబ్రహ్మమహిషి = ఓ సదాశివుని పట్టమహిషీ ! ఆగమవిదః = వేదార్థ రహస్యార్థములు తెలిసిన వారు, త్వాం ఏవ = నిన్నే, ద్రుహిణ గృహిణీం = బ్రహ్మ ఇల్లాలైన, గిరాందేవి = వాగ్దేవి అయిన సరస్వతినిగా, ఆహుః = వచింతురు, త్వాంఏవ = నిన్నే, హరేః = విష్ణువు యొక్క, పత్నీ = భార్యఅయిన, పద్మాం = కమలవాసిని అయిన లక్ష్మీదేవినిగా, ఆహుః = చెప్పుదురు, త్వమేవ = నిన్నే, హరసహచరీం = శివుని సహధర్మచారిణి అయిన, అద్రితనయాం = పార్వతినిగా ఆహుః = చెప్పుదురు, త్వం = నీవు, తురీయా = ఆ ముగ్గురి కంటె నాల్గవ ఆమెవై, కాపి = ఇట్టిదని చెప్పనలవి కాని, దురధిగమ = మిక్కిలి కష్టసాధ్యమయిన, నిస్సీమ = హద్దులేని, మహిమా = ప్రభావము, లేదా – మహాత్మ్యము కలదైన, మహామాయా సతీ = మాయాతత్త్వముగుచు, విశ్వం = ఈ జగత్తును, భ్రమయసి = భ్రమింపచేయుచున్నావు.

## తాత్పర్యము

ఓ పరబ్రహ్మమైన సదాశివుని పట్టమహిషీ, ఆగమ రహస్యార్థములు తెలిసిన విద్వాంసులు నిన్ను – బ్రహ్మదేవుని ఇల్లాలు, వాగ్దేవి అయిన సరస్వతీదేవిగా – చెప్పుదురు. ఆ నిన్నే – శ్రీ మహావిష్ణుమూర్తి భార్య, కమలవాసిని అయిన మహాలక్ష్మీదేవిగా – చెప్పుదురు. మరియు ఆ నిన్నే – శివుని సహధర్మచారిణి అయిన పార్వతిగా గూడా చెప్పుదురు. కాని, నీవు ఈ ముగ్గురికంటె వేరుగా నాల్గవ దానివై, ఇట్టిదని చెప్పనలవికాని ఆమెవై, అనిర్వాచ్యమై, మహాకష్టసాధ్యమై, మహామాయా తత్త్వమై, ఈ సర్వజగత్తును నానా విధములుగా మోహపెట్టుచున్నావు.

## అనువాద పద్యము

ఉ. *అమ్మ సదాశివాత్మ ! నిను నాగమవేదులు బ్రహ్మ భార్య వా*
*ణమ్మగ, నా యుపేంద్రసతియౌ రమగన్, హరభార్య శైలసూ*
*నమ్మగ గూడ నిన్ననగ నా త్రయమందని మాయతో తురీ*
*యమ్మున విశ్వమున్ భ్రమల నందగ జేతువు పూర్ణమాయవై.*

## టీక

(హే) పరబ్రహ్మమహిషి = ఓ సదాశివుని పట్టమహిషీ ! ఆగమవిదః = వేదార్థ రహస్యార్థములు తెలిసిన వారు, త్వాం ఏవ = నిన్నే, ద్రుహిణ గృహిణీం = బ్రహ్మ ఇల్లాలైన, గిరాందేవి = వాగ్దేవి అయిన సరస్వతినిగా, ఆహుః = వచింతురు, త్వాంఏవ = నిన్నే, హరేః = విష్ణువు యొక్క, పత్నీ = భార్యఅయిన, పద్మాం = కమలవాసిని అయిన లక్ష్మీదేవినిగా, ఆహుః = చెప్పుదురు, త్వమేవ = నిన్నే, హరసహచరీం = శివుని సహధర్మచారిణి అయిన, అద్రితనయాం = పార్వతినిగా ఆహుః = చెప్పుదురు, త్వం = నీవు, తురీయా = ఆ ముువ్వురి కంటె నాల్గవ ఆమెవై, కాపి = ఇట్టిదని చెప్పనలవి కాని, దురధిగమ = మిక్కిలి కష్టసాధ్యమయిన, నిస్సీమ = హద్దులేని, మహిమా = ప్రభావము, లేదా – మహాత్మ్యము కలదైన, మహామాయా సతీ = మాయాతత్త్వమగుచు, విశ్వం = ఈ జగత్తును, భ్రమయసి = భ్రమింపచేయుచున్నావు.

## తాత్పర్యము

ఓ పరబ్రహ్మమైన సదాశివుని పట్టమహిషీ, ఆగమ రహస్యార్థములు తెలిసిన విద్వాంసులు నిన్ను – బ్రహ్మదేవుని ఇల్లాలు, వాగ్దేవి అయిన సరస్వతీదేవిగా – చెప్పుదురు. ఆ నిన్నే – శ్రీ మహావిష్ణుమూర్తి భార్య, కమలవాసిని అయిన మహాలక్ష్మీదేవిగా – చెప్పుదురు. మరియు ఆ నిన్నే – శివుని సహధర్మచారిణి అయిన పార్వతిగా గూడా చెప్పుదురు. కాని, నీవు ఈ ముువ్వురికంటె వేరుగా నాల్గవ దానివై, ఇట్టిదని చెప్పనలవికాని ఆమెవై, అనిర్వాచ్యమై, మహాకష్టసాధ్యమై, మహామాయా తత్త్వమై, ఈ సర్వజగత్తును నానా విధములుగా మోహపెట్టుచున్నావు.

## సంస్కృత శ్లోకము - 98

శ్లో. కదా కాలే మాతః కథయ కలితాలక్తకరసం
పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజన జలమ్
ప్రకృత్యా మూకానా మపి చ కవితాకారణతయా
కదా ధత్తే వాణీ ముఖ కమల తాంబూల రసతామ్.

## అనువాద పద్యము

ఉ. *భారతి నోటి తమ్ములపుపాకము బోలుచు, పుట్టు మూగ లౌ*
*వారును కావ్యమల్లగల ప్రజ్ఞనొసంగుచు, లక్కయెర్పు నిం*
*పారెడి నీ పదాబ్జముల పట్టిన తీర్థము బ్రహ్మవిద్యనే*
*కోరెడి నేను దాని దమి గ్రోలెడు భాగ్యము కల్గుటెప్పుడో ?*

## టీక

(హే) మాతః = ఓ తల్లీ, కలిత + అలక్తరసం = లత్తుకరసము గలదైన, తవ = నీయొక్క, చరణనిర్ణేజన జలం = అడుగులు కడిగిన ఉదకమును, విద్యార్థీ = (బ్రహ్మ) విద్యనర్థించువాడు (అయిన), అహం = నేను, కదాకాలే = ఎప్పుడు, పిబేయం = త్రాగుదునో, కథయ = చెప్పుము. తచ్చ = ఆ జలము, ప్రకృత్యా = స్వభావముచేతనే, మూకానాం అపి = మూగ, చెవిటి వారలకు సైతము, కవితాకారణతయా = కవిత్వ రచన గావించుటకు కారణమైనదగుటచేత, వాణీ = సరస్వతి యొక్క, ముఖకమలం = ముఖపద్మము నందలి, తాంబూలరసతామ్ = తాంబూలరసము అగుటకు, కదా = ఎప్పుడు ధరించుచున్నదో.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! స్వాభావికముగానే - చెవిటివారికి వినికిడి శక్తిని, మూగవారికి మాట్లాడుశక్తిని కలిగించునదై (పూర్వానుభవము, సామర్థ్యము లేకున్నను) కవిత్వరచనా సౌభాగ్యమును ప్రసాదించునదై, సరస్వతీదేవి తాంబూల రసము వంటిదగు లత్తుకరసముతో కలసిన నీ పాద ప్రక్షాళన జలమును - విద్యార్థినైన నేను ఎప్పుడు గ్రోలుదునో చెప్పుము.

## వివరణము

ఈ శ్లోకము నందు అమ్మవారి పాద ప్రక్షాళన జలమును గూర్చి చెప్పబడు చున్నది. స్వభావ సిద్ధముగానే అమ్మవారి పాదములు ఎఱ్ఱ తామర రంగులో నుండును. నిత్యము పసుపు, పారాణిలతో మంగళకరముగా నుండును. ఆ పారాణి లత్తుకరస సంబంధమైన దగుటవలన ఎఱ్ఱగా నుండును. అట్టి పాదమును కడిగిన నీరు (పాద ప్రక్షాళన జలము) మరింత ఎఱ్ఱగా నుండును. ఆ జలపానము – చెవిటి వారిని సైతము వినగల్గు వారిగను, పూర్వానుభవ, సామర్థ్య, గురుశిక్షణలకు ఏ మాత్రము అవకాశము లేని మూగవారిని సైతము సుకవిత్వ రచన చేయగలవారిగాను, ఆశుకవితను చెప్పగలుగు వారిగాను చేయగలదు.

(అమ్మవారు తన తాంబూల వీటికను ఇచ్చి అనుగ్రహించుట వలన – పుట్టు మూగవాడైన 'మూకుడు' అను కవి అమ్మవార్పై ఐదు శతకములను ఆశువుగా చెప్పెను. దీనినే 'మూకపంచశతి' అందురు). సరస్వతీ దేవి తాంబూల రసాస్వాదనము వంటిదైన – అమ్మవారి పాద ప్రక్షాళన జలపాన భాగ్యము – తన జీవిత కాలములో ఎప్పుడు కలుగునో అని శంకరులు అమ్మవారినే అభ్యర్థించుచున్నారు.

అమ్మవారి పాద ప్రక్షాళన జలపానము వలన జిహ్వాగ్రము (నాలుక) పూర్తిగా సారస్వతమై (అనగా – సరస్వతీ సంబంధమై) సారవంతమైన రసోత్పత్తితో మధుర, చతుర, కవితా ప్రసూన పరిమళములను అందించునని ఈ శ్లోక సారాంశము.



## సంస్కృత శ్లోకము - 99

**శ్లో. సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే**
**రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా**
**చిరం జీవన్నేవ క్షపితపశు పాశవ్యతికరః**
**పరానందాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్.**

## అనువాద పద్యము

శా. నిన్నున్ గొల్చెడు సాధకుం డవని వాణిశ్రీల సౌభాగ్యమున్
తానున్‌బొంది, విరించి విష్ణువుల ప్రత్యర్థౌను, రమ్యంబుగా
మేనున్ పొంది రతీసతీత్వమడచున్, మేలౌ చిరంజీవన
మ్మానందించుచు బంధముక్తుడయి తానందున్ రానందమున్.

## టీక

(హే) జగజ్జననీ ! త్వత్ + భజనవాన్ = నిన్నుసేవించు భక్తుడు, సరస్వత్యా = వాగ్దేవి తోడను, లక్ష్మ్యా = లక్ష్మీదేవితోడను గూడిన, విధి హరి = వరుసగా బ్రహ్మకు విష్ణువునకును, సపత్నఃసన్ = ప్రత్యర్థి, లేదా – పోటీదారుడగుచు, విహరతే = విహరించుచున్నవాడై, రమ్యేణ = అతిసుందరమైన, వపుషా = శరీరము చేత, రతేః = రతీదేవి యొక్క, పాతివ్రత్యం = పతివ్రతా ధర్మమును, శిధిలయతి = సడలింప జేయుచున్నాడు, క్షపిత = విదలింపబడిన, పశు = జీవుల యొక్కయు, అవిద్య యొక్కయు, వ్యతికరః = సంబంధము లేనివాడై, పరానంద + అభిఖ్యం = పరానంద స్వరూపము అను పేరు గల, రసం = సుఖమును, రసయతి = ఆస్వాదించుచున్నాడు.

## తాత్పర్యము

తల్లీ ! జగజ్జననీ ! నిన్ను సేవించు భక్తుడు సరస్వతీ కటాక్షము చేతను, లక్ష్మీ కటాక్షము చేతను వరుసగా బ్రహ్మ, విష్ణువులకు ప్రత్యర్థిగా మారి విహరించును. అత్యంత సుందరమైన రూపముతో మన్మథపత్ని అయిన రతీదేవి పాతివ్రత్యమును కూడా సడలింప చేయును. చివరకు జీవ సంబంధ, అవిద్యాసంబంధముల నుండి దూరుడై, జీవన్ముక్త స్థితిలో పరానంద సుఖమును, అనగా – మోక్షానందమును అనుభవించును.

## వివరణము

ఈ శ్లోకమును – ఈ సౌందర్యలహరి స్తోత్రమునకు ఫలశ్రుతిగా చెప్పుకొన వచ్చును. అమ్మవారిని సేవించు భక్తుడు ఏ విధముగా అనుగ్రహింపబడునో చాలా చిత్రముగా చమత్కారముగా చెప్పబడినది.

ఎవరినైనను కోరు కొమ్మనినచో ముందు ధనము గుర్తుకువచ్చును. ఇది

సర్వ సాధారణమైన విషయము. కాని, అమ్మవారు తన భక్తునికి ముందు సరస్వతీ కటాక్షమును - అనగా - తెలివి తేటలను అనుగ్రహించి, అటుపైన లక్ష్మీ కటాక్షమును, అనగా - ధనమును - సంపదను అనుగ్రహించునట !

**సరస్వతీ కటాక్షము**

బ్రహ్మగారు తన వృత్తిధర్మమైన సృష్టికార్యమును ఆనాటికి పూర్తి చేసి, ఇంటికి వచ్చిన ప్రతి సారి ఇంటిలో తన భార్య సరస్వతి లేకపోవుటను చూచి అడుగగా - ఇంటిలోని వారు 'ఆవిడగారు తన భక్తుని అనుగ్రహించుటకు వెళ్లినది'! అని ప్రతిదినము అదే సమాధానము, అదే భక్తుని పేరు చెప్పుచుండుటతో - ఆ బ్రహ్మగారికి విసుగు, కోపము, ఆ భక్తునిపై ద్వేషము గూడా కలిగి 'వీడెవడు నాకే ప్రత్యర్థిగా (పోటీదారునిగా) తయారైనాడు. సరస్వతికి నా కంటె ఆ భక్తుడే ఎక్కువ అయినాడే !' - అని అనిపించు నంతగా సరస్వతీ దేవి ఆ భక్తుని అనుగ్రహించునని శంకరులు చమత్కారముగా చెప్పిరి. అనగా - అమ్మవారిని సేవించు భక్తునికి సరస్వతీ కటాక్షము అంతగా కలిగి, మంచి ధీధారణాశక్తులు, పాండిత్య కవిత్వములు అబ్బునని అర్థము.

**లక్ష్మీ ప్రసన్నత**

అదే విధముగా విష్ణుమూర్తిగారికి కూడా ఎప్పుడునూ ఇంటి పట్టున వుండని తన భార్య లక్ష్మిపై విసుగు, కోపము వచ్చి - కారణమును తెలుసుకుని, 'ఈ భక్తుడెవరు తనకు ప్రత్యర్థిగా తయారైనాడు. తనకంటె ఆ భక్తుడే లక్ష్మికి ముఖ్యమైనాడు' - అని అనిపించునంతగా - లక్ష్మీదేవి ఆ భక్తుని అనుగ్రహించునని శంకరులు చెప్పిరి. అనగా - అమ్మవారిని సేవించు భక్తునికి లక్ష్మి కటాక్షము అంతగా నుండి, ధన ధాన్యాది సంపదలు అనుగ్రహింపబడునని అర్థము.

**ముందు సరస్వతి, తరువాత లక్ష్మీ**

ముందు సరస్వతీ కటాక్షము, తరువాత లక్ష్మి కటాక్షము - అంతే గాని ముందు లక్ష్మి కటాక్షమున్నచో యుక్తాయుక్త వివేకజ్ఞానము లేక, దురలవాట్లకు, దురభ్యాసములకు లోనై, అనుగ్రహింపబడిన ధనము నంతను దుర్వినియోగ పరచును. సరస్వతీ కటాక్షము ముందుగా నున్నచో తెలివితేటలు, యుక్తా యుక్త వివేక జ్ఞానము ముందు ఏర్పడుట వలన తరువాత ప్రసాదింపబడు ధనము దుర్వినియోగ పడదు. తన భక్తుడు చెడిపోవుట ఇష్టపడని అమ్మవారు అందువలన లక్ష్మి కటాక్షమునకు ముందుగా సరస్వతీ కటాక్షమును కలుగ జేయును.

తైత్తిరీయోపనిషత్తులో గూడా – 'సమేంద్రోమేధయాస్పృణోతు.... జిహ్వామే మధుమత్తయా, కర్ణాభ్యాం భూరి విశ్రువమ్... తతోమే శ్రియ మావహ' – అని ముందు మేధస్సును తరువాత మధుర భాషణము, విస్తృత శ్రవణము – ఇత్యాదులన్నింటిని కలుగజేసి చిట్టచివరకు 'శ్రియం' అనగా 'ధనమును సంపదను' కలుగ జేయునను విధానమే చెప్పబడినది. కావున, శంకరులు ఈ శ్లోకములో సూచించునది ఉపనిషన్మార్గమే గాని దానికి వ్యతిరేక మార్గము కాదు.

'అమ్మవారిని సేవించినచో సరస్వతి, లక్ష్మీదేవి ఎందుకు అనుగ్రహింతురు? – అని అనుమానము రావచ్చును. తమపై అధికారిని మంచి చేసుకొనుటకు ఆయన పిల్లలను, ఆయన ఇష్టపడెడు వారిని ముందు మంచి చేసుకుని, వారి ద్వారా ఆయన అనుగ్రహమును సంపాదించుట లోకములో నున్న విధానమే గదా ! లక్ష్మి సరస్వతు లిద్దరూ అమ్మవారి భక్తురాండ్రు. ఆమె కటాక్షమునకై ఇద్దరూ అమ్మవారికి ఇరువైపులా నిలబడి వింజామరలతో వీచుచుందురు. (సచామర రమావాణీ సవ్య దక్షిణ సేవితా – శ్రీ లలితా సహస్ర నామం) అమ్మవారికి అత్యంత ప్రీతి పాత్రుడని తెలిసిన తరువాత, వారిద్దరూ అమ్మవారి భక్తుని ముందు మంచి చేసుకొను ప్రయత్నములో అతనిని అనుగ్రహించుట తప్పుకాదు కదా!

**మన్మథుని మించిన అందము**

వ్యక్తికి తెలివితేటలు, ధనము ఈ రెండును ఉన్న సరిపోవునా ? 'అందముగూడా వున్నచో అందరికీ ఆకర్షణీయుడుగావచ్చును గదా !' – అను కోరిక కలుగక మానదు. తన భక్తునికి ఆ కోరిక కూడా అమ్మవారు తీర్చునట. అందరి కంటె ప్రపంచములో అందమైన వాడెవరు ? మన్మథుని మించిన అందగాడు ఉండడని గదా చెప్పుకొనునది. అందరి కంటె అందగాడైన మన్మథుని తన భర్తగా పొందిన రతీదేవికి గూడా అమ్మవారి భక్తుని చూచినపుడు 'ఈ అందగాడు ఎవరబ్బా! తన భర్త మన్మథుని కంటె అందముగా నున్నాడని' అనిపించునట ! లేదా, అంత అందము తన భర్తకే ఉండును గాబట్టి అతడు తన భర్తే అయి వుండునని అతనికి దగ్గఱ కూడా అగుటకు అవకాశము గలదుట ! ఈ విధముగా – అనిపించుట, దగ్గఱ గుటలు – రతీదేవి పాతివ్రత్య ధర్మమును సడలించినట్లే అగును గదా ! – అని శంకరుల కవితా వాదన. అనగా, అమ్మవారి భక్తుడు అంతటి త్రిలోక సుందరుడగునని అర్థము.

**చిరంజీవత్వము**

తెలివితేటలు, ధనము, అందము ఉన్నవి. ఇంకను కావలసినవి ఉన్నవా ? ఏది లేకపోయినచో ఇవి మూడును ఉన్నను నిరర్థకమో అది ఒకటున్నది - అది ఆయుర్దాయము. తెలివి, ధనము, అందము ఉన్నది కాని ఆయుర్దాయము అంతంత మాత్రమే, ఇరవై సంవత్సరములు దాటదు అన్నచో ఉపయోగమేమి ? అందువలన అమ్మవారు తన భక్తునికి తెలివి, ధనము, అందముతో పాటు చిరంజీవత్వమును గూడా ప్రసాదించునట ! అనగా - అమ్మవారి భక్తుడు సంపూర్ణ ఆయుర్దాయము గలవాడగును అని అర్థము.

**బంధరాహిత్యము**

తెలివి, ధనము, అందము, ఆయుర్దాయము వున్నవి. ఇంకను కావలసినవి ఏమైనా ఉన్నవా ? - ఇవి అన్నియు ఉన్నను, ప్రతి వ్యక్తికి కావలసినది, లేదా - జరగవలసిన మార్పులు ఏమైనా ఉండునా ? ఎన్ని వున్నను వ్యక్తికి జీవితములో వైరాగ్య భావన రానిదే సంతృప్తి వుండదు. సంతృప్తి లేనపుడు జీవితములో లోటు కనిపించి, జీవన మాధుర్యము తగ్గును. ఈ వైరాగ్య భావము రావలెనన్నచో జీవ సంబంధమైన బంధములు సడలవలెను. 'రాగము' అనెడి త్రాటితో సంసార మనెడు గుంజకు కట్టబడిన జీవుడే - పశువు. ఈ పశుపాశము సడలినపుడే సంసార లంపటము, అవిద్య మొదలగునవి దూరమై ముక్త సంగుడగుట జరుగును. ముక్త సంగస్థితికి వచ్చిన వానినే 'జీవన్ముక్తుడు' అందురు.

**మోక్షానందము**

చింతకాయ చింత గుల్లగా మారినపుడు పైన పెంకుతో - లోపల వున్న గుజ్జుకు సంబంధము ఉన్నదా లేదా అన్నట్లుండును. అంతకు పూర్వము కండకు ఉన్న వగరు, పులుపు తనములు తీపిగా మారును. అట్లే - జీవన్ముక్తుడైన వాడు గూడా దేహ సంబంధము ఉన్నదా ? లేదా ? - అన్నట్లుండును. పూర్వపు రాగ, ద్వేష, మద, మాత్సర్యాదులు పూర్తిగా మటుమాయమై, అవిద్య తొలగి, ప్రేమ తత్త్వము నిండును. ఇట్టి జీవన్ముక్త స్థితిలో నున్నవాడు నిత్యము ఆనంద స్థితిలోనే వుండును. ఆ స్థితిలోని అతని ఆనందమే పరానందము, లేదా - మోక్షము. అమ్మవారు తన భక్తునికి ఈ పరానంద స్థితిని గూడా ప్రసాదించునట.

కేవలము తాత్కాలికముగా కొంత కాలవ్యవధికే పరిమితమగు ప్రసూతి వైరాగ్యము, పురాణ వైరాగ్యము, పరీక్ష వైరాగ్యము, శ్మశాన వైరాగ్యము వంటివి

కాక – శాశ్వతానందస్థితిని అమ్మవారు భక్తునికి కలుగ జేయునని శంకరులు ఈ శ్లోకములో చివరగా చెప్పిరి.



## సంస్కృత శ్లోకము - 100

శ్లో. ప్రదీపజ్వాలాభి ర్దివసకర నీరాజనవిధిః
సుధాసూతే శ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా
స్వకీయై రంభోభి స్సలిలనిధి సౌహిత్య కరణం
త్వదీయాభి ర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతి రియమ్.

## అనువాద పద్యము

*చం. నిరతము నీదు పల్కులను నిన్నే స్తుతించుట యెట్టిదా ? దివా
కరునకు ముందు దివ్వెగల కాంతుల నారతిపట్టి, యా సుధా
కరునకు చంద్రకాంతి శిలగారెడు నీటిని నర్ఘ్యమిచ్చి, సా
గరునకు వానిలోని యుదకమ్మిడి తృప్తిని గూర్చునట్టిదౌన్.*

## టీక

(హే) వాచాంజనని = వాక్ప్రపంచమునకు తల్లీ!, యథా = ఏ విధముగా, స్వకీయాభిః = తనకు సంబంధించినవే అయిన, ప్రదీపజ్వాలాభిః = చేదివిటీల యొక్క జ్వాలలచే, దివసకర = సూర్యునికి, నీరాజనవిధిః = కర్పూరహారతి నిచ్చుటయో, యథా = ఏ విధముగా, స్వకీయైః = తనకు సంబంధించినవే అయిన, చంద్ర + ఉపజలలవైః = స్రవించు చంద్రకాంత శిలా జల బిందువులచేత, సుధాసూతేః = చంద్రునికి, అర్ఘ్యరచనా = అర్ఘ్యము సమర్పించుటయో, యథా = ఏ ప్రకారము, స్వకీయైః = తనకు సంబంధించినవే అయిన, అంభోభిః = జలముల చేత, సలిల నిధి = సముద్రునకు, సౌహిత్యకరణం = తృప్తికొఱకు తర్పణము చేయుటయో, తథా = ఆ ప్రకారము, త్వదీయాభిః = నీ వలన ఉత్పన్నములైన, వాగ్భిః = వాక్కుల చేత, తవ = నీకు, ఇయం = ఈ , స్తుతిః = స్తోత్రము ( అగుచున్నది).

**తాత్పర్యము**

వాక్ప్రపంచమున కెల్ల తల్లివగు ఓదేవీ! భగవతీ! తన సంబంధము వలననే జ్వలించు దివిటీ జ్వాలల చేత సూర్యునికి హారతి నిచ్చుట ఎట్లో, అట్లే తన సంబంధము

వలననే స్రవింపబడు చంద్రకాంతా శిలాజల బిందువుల చేత చంద్రునికి అర్ఘ్యము సమర్పించుట యెట్లో, అట్లే తనకు సంబంధించినవే అయిన సముద్రోదకముల చేతనే ఆ సముద్రుని తృప్తికి తర్పణము చేయుట ఎట్లో – అట్లే – నీ అనుగ్రహము వలన నీ స్వరూపములో నా నుండి వ్యక్తమగు వాక్కుల కూర్పులచే ఈ స్తుతి నీకు నా చేత చేయబడుచున్నది.

## వివరణము

ఈ చివరి శ్లోకములో ఈ స్తోత్రము యొక్క అంకిత విషయము చెప్పబడు చున్నది.

సూర్యునికి నీరాజనము ఇచ్చుటకు – సాధారణముగా సూర్యునికభి ముఖముగా నిలబడి, ఏ దివిటీ జ్వాలనో చూపించు చుందుము. దివిటీ యందలి జ్వాలల వెలుగులు ఎవరి వలన వచ్చినవి ? వెలుగులకు సంబంధించిన తపనుని (సూర్యుని) కృపవలననే గదా ! అనగా ఆ సూర్యునికి సంబంధించిన వెలుగులతోనే నీ రాజన మిచ్చుచున్నాము – అని అర్థము. అనగా – మనకు సంబంధించిన వస్తువును దేనినీ సూర్యునకు సమర్పించుట లేదు.

చంద్రుని వెన్నెలపడి ఆర్ద్రమగు చంద్రకాంత శిలనుండి స్రవింపబడు జలబిందువులచే ఆ చంద్రునికే అర్ఘ్యము ఇచ్చునపుడు కూడా మనము మనకు సంబంధించిన వస్తువులను వేరుగా చంద్రునికి సమర్పించుట లేదు గదా!

సముద్రములో స్నానము చేయుచు, సముద్రునికి అర్ఘ్యమును ఇచ్చునపుడు కూడా ఆ సముద్రములోని జలమునే దోసిళ్ళతో తీసుకుని ఆ సముద్రునికే సమర్పించుదుము. ఇప్పుడు కూడా మనకు సంబంధించినవి కాని, ఆ సముద్రునికే చెందిన నీటితో – ఆ సముద్రునికే సమర్పించు చున్నాము కదా !

అట్లే – ఈ స్తోత్రము నందలి పదములు, వాక్యములు, కూర్పులు అన్నియు వాగ్దేవి అయిన అమ్మవారికి చెందినవే ! అనగా – ఆమె అనుగ్రహము వలన పొందినవే! కనుక ఈ స్తోత్రము అమ్మవారిదే అగును కాని నాకు చెందినది కాదు. అనగా నాకర్తృత్వమునకు చెందినది కాదు. అనగా – ఈ స్తోత్రమునకు కర్తనీవే. ఈ స్తుతి సర్వము నీ కరుణయే ! అని నిరహంకారముగా అమ్మవారికి సమర్పణ బుద్ధితో శంకర భగవత్పాదులు ఈ స్తోత్రమును ముగించిరి.

❀ ❀ ❀

# అకారాది శ్లోక సంఖ్యాను క్రమణిక